# ఫ్రెంచి పాలనలో యానాం

బొల్లోజు బాబా

http://sahitheeyanam.blogspot.com/





**ఫ్రెంచి పాలనలో యానాం**

**బొల్లోజు బాబా**

నవంబర్ 2011

వెల **125/-**

కవర్ డిజైన్ - చిన్నారి, యానాం

కాపీల కొరకు

బొల్లోజు బాబా
30-7-31
గొల్లల వీధి
సూర్యనారాయణ పురం
కాకినాడ - తూర్పుగోదావరి జిల్లా

bollojubaba@gmail.com

సెల్ - 9849320443

ముద్రణ

## ముందుమాట

నా రచనలకు మొదటి పాఠకుడిగా ఉంటూ నన్ను ప్రోత్సహించే ఓ సాహితీ మిత్రుడు, ఈ పుస్తకం వ్రాతప్రతి రూపంలో ఉన్నపుడు చదివి "ప్రపంచం జెట్టుస్పీడులో ముందుకు పోతూంటే ఈ పాత విషయాలు ఎవరికి కావాలి?" అంటూ ఓ మౌలికమైన ప్రశ్నను సంధించి నన్ను అయోమయంలో పడేసాడు. ఇదే విషయాన్ని నేను నా బ్లాగులో (http://sahitheeyanam.blogspot.com/) ప్రస్తావించినపుడు ప్రముఖ కవి అఫ్సర్ "స్థానిక చరిత్రల మీద ఎంత వీలయితే అంత పని జరగాలి. ఆ దిశగా మీరు అడుగు వేసినందుకు సంతోషంగా ఉంది" అంటూ వ్యాఖ్యానించి నాలో ధైర్యం నింపారు. నా బాల్యమిత్రుడు డా.సలాది "Those who cannot remember the past are condemned to repeat it" అనే George Santayana కొటేషన్ మెయిల్ చేసి ఉత్సాహాన్ని కలిగించాడు. వారికి నా ధన్యవాదాలు.

భారతీయులలో కనిపించే భిన్న కులాలు, అస్పృశ్యత, సతి ఆచారం, మతపరమైన మూఢత్వం, స్త్రీల అణచివేత, బాల్యవివాహాలు వంటివి, వ్యాపారనిమిత్తం వచ్చిన యూరోపియన్లకు భారతీయులపై ఆధిపత్యం సాధించటానికి మంచి ముడిసరుకుగా మారాయి. తాము భారతీయులకన్నా నాగరీకులమని, ఈ దేశాన్ని పాలించటానికి తాము అర్హులమని వారు భావించుకొన్నారు. ఆ విధంగా బ్రిటిష్ వారు బ్రిటిష్ ఇండియా ఫ్రెంచి వారు ఫ్రెంచి ఇండియాను స్థాపించారు.

బ్రిటన్ పరోక్షపాలనను ప్రోత్సహించింది. తనకు అనుకూలంగా ఉండేవారిని ప్రోత్సహించి ప్రజలను నిర్లక్ష్యం చేసింది. తన కాలనీలలో జరిపే వ్యాపారాలకు బ్రిటన్ ప్రాధాన్యత నిచ్చింది తప్ప ఆయా ప్రాంతాలను తన దేశఅంతర్భాగాలుగా ఏనాడూ అనుకోలేదు.

ఇక ఫ్రాన్స్ విషయానికి వస్తే, 1784 లో జరిగిన ఫ్రెంచి విప్లవ ఫలితంగా స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం వంటి ఆలోచనలను ఫ్రెంచి వారు నరనరానా జీర్ణించుకొన్నారు. అంతేకాక డిస్కార్టెస్, రూసో, వోల్టెయిర్ వంటి మేధావుల తాత్విక చింతనలు ఫ్రాన్స్ విదేశాంగ విధానాన్ని ప్రభావితం చేసాయి. తదనుగుణంగా ఫ్రాన్స్ తనకాలనీల ప్రజలను పరిపాలనలో భాగస్వామ్యులను చేసి ప్రత్యక్షపాలన జరిపింది. ఈ కాలనీల ప్రజలు మున్సిపల్ కౌన్సిల్, స్థానికమండలి, ఆలయ కమిటీ, హెల్త్ కమిటీ, విద్యా కమిటీ, ప్రజా సంక్షేమ కమిటీ, జుడిషియల్ కమిటీ వంటి వివిధ మార్గాల ద్వారా పాలనలో పాలుపంచుకోవటం పంతొమ్మిదో శతాబ్దంనాటికే





మొదలైంది. అలా ఫ్రెంచి ప్రభుత్వం తన సంస్కృతి, భాష లను తన కాలనీల ప్రజలలో ఇంకేటట్లు చేసింది. ఇక్కడి ప్రజలకు ఫ్రాన్స్ లో ఉన్న ఫ్రెంచి పౌరులతో సమానంగా పౌర, రాజకీయ హక్కులను కల్పించింది. తన కాలనీల ప్రజలు ఏదో ఒకనాటికి ఫ్రాన్స్ లో నివసించే ఫ్రెంచి పౌరులలాగ జీవించాలని ఆశించింది. ఫ్రెంచి వారు భారతదేశాన్ని వీడి వెళిపోతూ ఈ కాలనీల ప్రజలకు ఫ్రెంచి పౌరసత్వాన్ని "నిలుపుకొనే" ఒక సౌహార్ద్రపూర్వక ఐచ్ఛికతను ఇవ్వటం, ఈ కాలనీలను (పాండిచేరీ, మాహే, కారైకాల్ మరియు యానాం) ప్రత్యేకంగా చూడమని, ఇక్కడి ఫ్రెంచి సంస్కృతిని కాపాడమని భారతదేశంతో ఒప్పందం చేసుకోవటం దీనికి పరాకాష్ఠ. అందుకనే ఫ్రెంచిపాలనకు వ్యతిరేకంగా 1954 లో పెద్దఎత్తున ఉద్యమం జరిగినప్పుడు యానాంలో కూడా కొంతమంది ఫ్రెంచి పాలన కొనసాగాలని విఫల ఉద్యమం చేసారు.

### కొద్దిగా చరిత్ర

1723 లో 'కుంపనీ దె ఇందీస్' అనే ఫ్రెంచి కంపెనీ ఒక వ్యాపార గిడ్డంగి ఏర్పాటు చేయటం ద్వారా ఫ్రెంచి వారు యానాంలో కాలుమోపారు. గోల్కొండ రాజముద్ర కలిగిన ఓ పత్రం ద్వారా 1747 లో గోల్కొండ నవాబు మహమ్మద్ అలీఖాన్ యానాం యొక్క సంపూర్ణ హక్కులను ఫ్రెంచివారికి ధారాదత్తం చేసాడు. ఆ తరువాత ఫ్రెంచి బ్రిటిష్ వారికి మధ్య జరిగిన యుద్ధాల కారణంగా యానాం మూడు సార్లు బ్రిటిష్ వారి పరమై చివరగా 1817 లో ఫ్రెంచి వారి చేతుల్లోకి వచ్చింది. అప్పటినుంచీ 13 జూన్, 1954 న ఫ్రెంచివారి నుంచి విమోచనం చెందే వరకూ యానాం ఫ్రెంచి పాలనలోనే ఉంది.

### ఈ పుస్తకం గురించి

చరిత్ర పుస్తకాలు వ్రాసేటపుడు "మనం ఎవరి పక్షాన ఉండి వ్రాస్తున్నామనేది అత్యంత కీలకం". ఈ ప్రశ్న నాకు నేను వేసుకొన్నపుడు సాధ్యమయినంత మేరకు నిష్పక్షపాతంగానే ఉన్నానని అనిపించింది.

ఈ పుస్తకాన్ని కేవలం ఫ్రెంచి రికార్డులపైనే ఆధారపడి వ్రాయలేదు. అప్పట్లో ఫ్రెంచి వారిచే "Jealous Nation" గా వర్ణింపబడిన బ్రిటిష్ వారి రికార్డుల నుంచి కూడా సమాచారాన్ని గ్రహించాను. ఆనందరంగ పిళ్ళై (పాండిచేరీ), శ్రీ సమతం కృష్ణయ్య, శ్రీ దడాల రఫేల్ రమణయ్య, చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి వంటి స్థానికులు లిఖించిన విషయాలను సందర్భోచితంగా వాడుకోవటం జరిగింది. యానాన్ని సందర్శించిన ప్రపంచ యాత్రికుల ట్రావెలాగ్స్ నుంచి, ఆనాటి మత ప్రచారకుల Memoirs నుండి యానానికి సంబంధించిన ఆశక్తికర అంశాల్ని తీసుకొన్నాను. అయినప్పటికీ నా దృష్టికి రాని, నేను స్పృశించని అంశాలెన్నో ఉండవచ్చు.

ఒక కాలాన్ని ప్రతిబింబించే నమూనా గా ఉంటుందని ఈ పుస్తకంలో కొన్నిచోట్ల ఓ సంవత్సరానికి సంబంధించిన సంపూర్ణ గణాంకాలను పొందుపరచటం జరిగింది. (ఉదా. 1883 నాటి యానాం బడ్జెట్, 1914 లో యానాం ప్రజలు కట్టిన పన్నులవివరాలు వంటివి).

ఇవి చూడటానికి మరీ స్థానీయ వివరాలుగా అనిపించినా ఆనాటి సమాజాన్ని అర్థం చేసుకోవటానికి ఉపకరిస్తుందని భావిస్తున్నాను. అంతే కాక వర్జీనియా వుల్ఫ్ చెప్పినట్లు – Nothing has really happened until it has been recorded అన్న ఆలోచనతో కూడా.

యానాం చరిత్రకు సంబంధించి ఈ పుస్తకంలో రెండు కొత్త విషయాలను ప్రతిపాదించటం జరిగింది.

1. 1723–1758 మధ్యకాలంలో యానాంలో ఫ్రెంచి వారు సాగించిన కార్యకలాపాలపై సరైన సమాచారం లభించదు. ఈ సమయంలో వ్యాపారాలు లాభసాటిగా లేవని ఫ్రెంచివారు యానాన్ని విడిచిపెట్టిపోయారని కొంతమంది చరిత్రకారులు అభిప్రాయపడ్డారు. కానీ ఫ్రెంచి వారు ఈ కాలంలో యానాన్ని విడిచిపెట్టి ఉన్నది రెండు సంవత్సరాలు మాత్రమేననీ– అదికూడా వ్యాపారాలు లాభసాటిగా లేకపోవటం వల్లకాక, స్థానిక రాజుల అలజడి కారణమని చూపుతూ, ఆ కాలంలో జరిగిన వ్యాపార లావాదేవీలు, పరిపాలించిన పెద్దొరల వివరాలు ఆధారాలతో ఇవ్వటం జరిగింది. (యానాన్ని పరిపాలించిన పెద్దొరల అనే చాప్టరులో).

2. యానాంకు ఫ్రెంచి వారు రాక పూర్వం ఈ ప్రాంతం ఒక డచ్ కాలనీగా ఉండేదన్న ఒక ఊహాగానం చలామణీలో ఉంది. ఫ్రెంచివారు రాకముందు ఈ ప్రాంతమంతా నివాసయోగ్యం కాని ఒక చిట్టడవిలా ఉండేదనటానికి ఆధారాలు కనిపిస్తున్నాయి కనుక నిస్సందేహంగా ఇది వదిలివేయబడిన డచ్ కాలనీ కాకపోవచ్చని చెప్పటం జరిగింది.

ఇవే కాక యానాం ఫ్రెంచి సమాధులలోని వ్యక్తుల వివరాలు, బానిస వ్యాపారం, సతీసహగమన దురంతం, ఆనందరంగ పిళ్ళై డైరీలలో యానాం ప్రస్తావన, వివిధ పెద్దొరలు, యానాం రినోన్సర్లు వంటివి యానాం చరిత్రకు సంబంధించి వర్జిన్ అంశాలు.

కృతజ్ఞతలు

ఈ పుస్తకానికి సందేశాన్ని వ్రాసి ఇచ్చిన యానాం శాసన సభ్యులు, గౌరవనీయులు శ్రీ మల్లాడి కృష్ణారావుగారికి,
ఈ రచనకు ఉపయోగపడే మంచి సమాచారాన్ని అందించిన హిస్టారికల్ సొసైటీ ఆఫ్ పాండిచేరీ అధ్యక్షులు షెవాలియర్ డా. నల్లం బాబు గారికి
ఈ వ్యాసపరంపరను తమ పత్రికలో ఆగస్టు 2010 నుండి మార్చ్ 2011 వరకు ధారావాహికంగా ప్రచురించి ప్రోత్సహించిన, జనమిత్ర ఎడిటర్, దళితమేధావి, అంబేద్కరిస్టు శ్రీ పొనుగుమట్ల విష్ణుమూర్తి గారికి
ఎప్పుడు కలిసినా ఎంతో ఆత్మీయంగా పలకరిస్తూ, ప్రోత్సహించే ప్రముఖ కవి 'యానాం చరిత్ర' పుస్తక రచయిత శ్రీ దాట్ల దేవదానం రాజు గారికి
యానాం గురించి మంచి విశేషాలు వ్రాస్తున్నావు అంటూ ఆప్యాయంగా వెన్నుతట్టిన నా సాహితీ





గురువు శ్రీ శిఖామణి గారికి
అలనాటి రాజకీయ వేత్తలు, సాహితీ వేత్తల గురించి మంచి సమాచారాన్ని అందించిన మా తెలుగు మాస్టారు, పూజ్యులు అయిన శ్రీ సలాది రామ వెంకట సుబ్బారావు గారికి
యానానికి సంబంధించిన అనేక డాక్యుమెంట్ల ను పరిశీలించే అవకాశం కల్పించిన పాండిచేరీ నేషనల్ ఆర్కైవ్స్ అధినేత శ్రీ ఎమ్.మురుగేశన్ గారికి
ఈ పుస్తకంలోని అచ్చుతప్పుల్ని ఎంతో ఓపికగా సరిచేసిన ప్రముఖ పద్యకవి శ్రీ గుర్రం ధర్మోజీ గారికి
ఈ పుస్తకం వ్రాయాలి అన్న నిప్పు నాలో రగిల్చిన మా తండ్రి గారు కీ.శే. శ్రీ బొల్లోజు బసవలింగం గారికి , ఈ ప్రయత్నంలో నన్ను ముందుకు నడిపించిన నా సోదరులు శ్రీ రవీంద్రనాథ్, దుర్గాప్రసాద్, వెంకటేశ్వర ప్రసాద్ లకు మరియు నా భార్య శ్రీమతి సూర్య పద్మ కు
ఈ పుస్తకానికి అందమైన కవర్ పేజీ డిజైన్ చేసి ఇచ్చిన బాల్యమిత్రుడు శ్రీ చిన్నారి కి

శ్రీ ఆకెళ్ళ రవిప్రకాష్, శ్రీ పి.ఎల్. ఆర్. స్వామి, శ్రీమతి విజయలక్ష్మి, చెల్లి రాం, మధునాపంతుల, ఫణి, సారధి, ప్రభాకర రావు లకు

ఇంకా అనేక ఫ్రెంచి డాక్యుమెంట్లను ఇంగ్లీషులోకి తర్జుమా చేసిపెట్టిన గూగుల్ ట్రాన్స్‌లేటర్ వెబ్ సైటు రూపకర్తలకు, ఈ రచన సీరియల్ గా వస్తున్న సమయంలో ఫోన్లు చేసి, ఉత్తరాలు వ్రాసి అభినందించిన వారందరకూ
సదా నమస్సులతో

భవదీయుడు

బొల్లోజు బాబా

## విషయసూచిక







ఫ్రెంచి పాలనలో యానాం



*It gives me immense pleasure to give the preface of this book on "Yanam during french regime" written by my good young friend, Mr Bolloju Baba.*

*Baba, himself is an excellent and accomplshed teacher, a writer, poet and now a talented historian. He is the son of an illustrious trilingual scholar, in Telugu, French and English Sri.Bolloju Basavalingam, His father has written many novels, plays and poems. He won the prestigious awards of ANR literary award and "Telugu Ratna" of Pondicherry government. I had the privilege of learning telugu in my younger days from him when he was a french student in Pondy.*

*I felicitate Baba for having taken the initiative to write history of Yanam, a dream of his late father, and particularely for the reason that not many historians showed much interest. Many historians have done lot of research on the other french territories, but very few have shown interest and that too in a particular aspect. I am happy that Baba has gone thruogh the whole scenario. He covered the origins, the political, social, commercial, the temples, the architecture, the various old stoneplates, the old church, the French cemetary. He narrated the merits and demerits of the french syseem of admnistration.*

*By going through the book, I could make out the amount of energy and hard work, he has put in the search of various precious documents, archives and also personal interviews. Of course all these efforts have culminated in the making of this wonderful book . I am sure this will remain as an important document of reference, useful for future generation about the history rather unknown, but very interesting.*

*I wish that this book is translated in english sothat a larger public be benefitted.*

***Dr Nallam.V,*** *Chevalier de la legion d''honneur*
*Presdent of Historical society of Pondicherry*
*Andra Maha Sabha, Pondicherry*
*Alliance Francaise, Pondicherry*

బొల్లోజు బాబా

# ఫ్రెంచి యానాంలో సాగిన వాణిజ్యం

1723 లో మచిలీపట్నానికి చెందిన ఓ ఫ్రెంచివ్యాపారి అయిన Courton గోదావరి తీర ప్రాంతంలో తమ వ్యాపార కార్యకలాపాలకు అనువైన స్థలం కోసం వెతుకుతున్న సమయంలో యానాం అతని కంటబడింది. ఇది ఎత్తయిన ప్రదేశంలో ఉండటంవల్ల వరదల తాకిడి తక్కువగా ఉంటుందనే అభిప్రాయంతో కుర్టన్ యానాన్ని ఎంచుకొని వెంటనే ఇక్కడ ఓ ఇంటిని కొనుగోలు చేసాడు. ఆ తరువాత రాజమండ్రి ఫౌజ్ దార్ (ఒక ప్రాంత సంరక్షణను చూడటానికి ముస్లిం పాలకులచే నియమింపబడిన అధికారి) అయిన Haji Hussain నుండి యానాంలో వ్యాపార కార్యకలాపాలు సాగించటానికి అనుమతి పొందాడు.

తన వ్యాపారనిమిత్తం ఎనిమిదివందల బంగారు నాణాలు (పగోడాలు) వెచ్చించి ఒక పెద్ద పడవను పదిహేనునెలల పాటు కుర్టన్ ఇక్కడే ఉండి నిర్మింపచేయించాడు. గౌరుశెట్టి అనే ఒక స్థానిక వ్యాపారితో ఒప్పందాలు చేసుకొన్నాడు. కానీ ఇతను కుర్టన్‌కు 300 పగోడాల బాకీపడి తీర్చలేదట. (రి.Correspondance du conseil supérieur de Pondichéry et de la Compagnie. vol I P.No: 85)

భారతదేశంలో తమ స్థావరాలను స్థాపించటంలో అనేక మంది ఫ్రెంచి వ్యక్తులు పాలుపంచుకొన్నప్పటికీ యానాం మాత్రం ఒకే ఒక్క కుర్టన్ స్వహస్తాలతో అలా నిర్మించబడింది. కుర్టన్ యానాన్ని మొదటిసారిగా సందర్శించినపుడు అక్కడ కొద్దిపాటి సంఖ్యలో రజకులు మాత్రమే ఉన్నట్లు గుర్తించటాన్ని బట్టి యానాం అనేది అప్పటికి ఈ సువిశాల భారత దేశంలో మనుగడ సాగిస్తున్న ఓ చిన్న తీరప్రాంత గ్రామంగా భావించవచ్చు.

పదకొండవ శతాబ్దంలో యానాం బర్మా, సిలోన్ లతో నౌకల ద్వారా వ్యాపార సంబంధాలను కలిగి ఉండేదనీ– పన్నెండు, పదమూడు శతాబ్దాలలో రెడ్డి రాజులు యానాంలో కోటను నిర్మించి ఈ పరిసర ప్రాంతాలను పాలించేవారనీ– ముమ్మడి రాయుడు అనే రాజు యానాంలో కోట నిర్మాణం కావించాడనీ–అది ప్రస్తుతం పాత సబ్ జైలు ఉన్న ప్రదేశంలో ఉండేదనీ– ఆ కాలంలోనే యానాం మీసాల వెంకన్న ఆలయ నిర్మాణం జరిగిందనీ– అంటూ యానానికి చెందిన పండితుడు, ఆయుర్వేద వైద్యుడు, రాజకీయ నాయకుడు, ఆలయ ధర్మకర్త





అయిన శ్రీ సమతం కృష్ణయ్య 1954 లో వ్రాసిన "History de l Divinite Sri Venkteswara Swamy, Yanaon అనే వ్యాసంలో తెలియచేసారు. (ఈ విషయాల ప్రమాణికత యానాంలో ఆర్కియాలజీ శోధనలు జరిగితే తప్ప నిర్ధారణ కావు –రచయిత)

ఫ్రెంచి వారికి ఈ ప్రాంతం ఈనాంగా ఇవ్వబడటం వల్ల ఈ ప్రాంత పేరు మొదట్లో ఈనాం అనీ, కాలక్రమేణా అది యానాం గా మారిందన్న వాదనను నిర్ద్వంద్వంగా తిరస్కరించవచ్చును. ఎందుకంటే 1723 జనవరి, 23 న కుర్టన్ వ్రాసిన ఓ లేఖలో తాను ఎంపిక చేసిన ప్రదేశాన్ని "యానాం" గా పేర్కొన్నాడు. ఈ ప్రాంతం 1757 లో బుస్సీకి ఈనాంగా ఇవ్వబడింది. అంతే కాక 1730–1750 మధ్య పాండిచేరీలోని ఫ్రెంచి ఈస్ట్ ఇండియా కంపనీ అధిపతులకు, యానాం లోని వారి ప్రతినిధులకు మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలలో యానాం ను యానాం అనే పేరుతోనే వ్యవహరించటం జరిగింది. 1845 నాటి బ్రౌన్ నిఘంటువులో యానము అనే పదానికి ఇచ్చిన అర్ధాలలో – The Sea Beach; also called యానాందరి. Hence the town name of Yanam in the Godavari District is so named అని ఉండటాన్ని బట్టి యానాం అనేది ఒక తీరప్రాంతంగా పరిగణించి అలా పిలవబడిందని అర్ధం చేసుకోవచ్చును. అంతే కాక యానాం లాంటి భౌగోళిక పరిస్థితులే ఉన్న "సూరసేన యానాం" అనే గ్రామం పేరులో కూడా యానాం అనే పదం ఉండటం గమనార్హం.

1723 లో ఫ్రెంచి వారు యానాంలో కొన్ని ఇళ్ళు, గిడ్డంగులు నిర్మించి తమ వ్యాపార కార్యక్రమాలు మొదలెట్టారు. ఈ కాలంలో యానాం నుండి ఉప్పు ఎగుమతి వ్యాపారం కొంత జరిగినప్పటికీ పెద్ద ఎత్తున వాణిజ్య కలాపాలు జరగలేదు. 1735 లో నవాబ్ రుస్తుం ఖాన్ (అప్పటి రాజమండ్రి ఫౌజ్ దార్) నుండి లిఖిత పూర్వక అనుమతి ద్వారా యానాం నుండి వ్యాపారలావాదేవీలు జరుపుకోవటానికి ఫ్రెంచి వారు సర్వాధికారాలు పొందారు. దీనివల్ల యానాంలో ఫ్రెంచివారి వాణిజ్యం ఊపందుకొంది. అప్పట్లో ఫ్రెంచి వారు యానాంను తమ వ్యాపార కార్యక్రమాలకు వాడుకొన్నందుకు అద్దె చెల్లించేవారు. ఈ విధానానికి 1743 లో ఒక ఉత్తర్వు ద్వారా మినహాయింపు లభించింది. గోల్కొండ రాజముద్ర కలిగిన ఓ పత్రం ద్వారా 1747 లో గోల్కొండ నవాబు మహమ్మద్ అలీఖాన్ యానాం యొక్క సంపూర్ణ హక్కులను ఫ్రెంచివారికి ధారాదత్తం చేసాడు. అక్కడినుంచి ఫ్రెంచివారు యానాం విషయంలో ఇక వెనుకకు తిరిగి చూడలేదు.

ఫ్రెంచి వారు యానాం నుండి ఉప్పు, చేనేత దుస్తులు, వంటనూనెల ఎగుమతి, ఒకానొక సమయంలో బానిసల ఎగుమతి, నౌకల తయారీ వంటి వ్యాపారాలనెన్నో చేసారు. పొరుగున ఉన్న బ్రిటిష్ వారికి వీరికి నడచిన కలోనియల్ రాజకీయాల వల్ల యానాంలోని ఫ్రెంచి వారి వ్యాపారాలు అనేక ఒడిదుడుకులను ఎదుర్కోవలసి వచ్చింది.

యానాంలో 1765 నుంచీ మొదలయిన మంగళవారం సంతలో భారీ ఎత్తున

వ్యాపార లావా దేవీలు జరిగేవి. షిప్పులలో దిగిన విదేశీవస్తువులు విరివిగా లభించేవి.ఇక్కడ కొనుగోళ్ళు జరిపేందుకు కాకినాడ, రాజమండ్రి వంటి ప్రాంతాలనుంచి ప్రజలు, చిరువ్యాపారులు వచ్చేవారు. 1840 నాటికి యానాం వ్యాపారులే కాక, చుట్టు పక్కల ప్రాంతాల పెద్ద వ్యాపారులు కూడా అధిక సంఖ్యలో పాల్గొని పెద్ద ఎత్తున వ్యాపారం సాగించేవారు. ఇదంతా ఓ కంట కనిపెట్టిన బ్రిటిష్ ప్రభుత్వం 1894 నుండి యానాం నుంచి బయటకు తీసుకువెళ్ళే వస్తువులపై 5 శాతం పన్ను విధించటం మొదలెట్టింది. దీనితో యానాం సంతలో కొనుగోళు ్ళ అమ్మకాలకై బయటివారు రావటం తగ్గిపోయింది. ఆ విధంగా యానాంలో జరిగే వారపు సంత క్రమంగా ప్రాముఖ్యతను కోల్పోయింది.

## చేనేత పరిశ్రమ ఉత్థాన పతనాలు

యానాంకు ఫ్రెంచి వ్యాపారుల రాకతో చుట్టు పక్కల ప్రాంతాలనుండి వర్తకులు, కూలీలు, చేనేత కార్మికులు, రైతులు మరియు ఇతర వర్గాలకు చెందిన వారు నెమ్మది నెమ్మదిగా రావటం మొదలైంది. 1740 నాటికి రెండుమూడు వేలుండే యానాం జనాభా క్రమేపీ పెరగసాగింది. 1741–1745 ల మధ్య యానాం నుంచి 87,880 బేళ్ల వస్త్రాలు ఎగుమతి అయ్యాయి. ఇదే సమయంలో మరో ఫ్రెంచి కాలనీ అయిన మచిలీపట్నం నుంచి 46,016 బేళ్ళు మాత్రమే ఎగుమతి కావటం గమనార్హం. (రి.Refutation des faits imputes au Seiur Godeheu parce sieur Dupleux అనే పుస్తకం)

యానాంలోని చేనేత పరిశ్రమ గురించి 1767 లో Lauriston అనే ఫ్రెంచి అధికారి వ్రాసుకొన్న ఓ నోట్ లో "యానాం నుంచి అత్యుత్తమ క్లాత్ (finest guinees) లభిస్తున్నది. పరిస్థితులు అనుకూలిస్తే ఏడాదికి పదిలక్షల మేర అక్కడనుంచి వ్యాపారం చేసే అవకాశం ఉంది.... కానీ బ్రిటిష్ వారు ఇబ్బంది పెడుతున్నారు. ...." అని వ్రాసుకోవటాన్ని బట్టి ఆనాటి యానాం వ్యాపార సామర్థ్యం పట్ల ఓ అంచనాకు రావొచ్చు.

యానాం పెద్దొరగా పనిచేసిన పియరీ సొన్నరెట్ 1789 సెప్టెంబరు, 30 న తన మిత్రునికి వ్రాసిన ఓ లేఖలో "...... భారతదేశంలోనే సుందరమైన ప్రదేశం యానాం... నా జీతం కూడా ఎక్కువే. ఇక్కడ అన్ని రకాల వస్త్రాలు తయారవుతున్నాయి. ఇక్కడి ప్రజలలో *క్రమశిక్షణ, విశ్వసనీయత, విధేయత ఎక్కువ*....అంటూ యానాంలో జరిగే వ్యాపారం మరియు ఇక్కడి ప్రజల గురించి ప్రస్తావించాడు. (సొన్నరెట్ ప్రపంచాన్ని చుట్టి వచ్చిన ప్రకృతి అధ్యయన కారుడు. అనేక పుస్తకాలను రచించిన ప్రావీణ్యుడు)

సొన్నరెట్ యానానికి పెద్దొరగా ఉంటూనే భారీ స్థాయిలో ఉప్పు, చేనేత వస్త్రాల వ్యాపారం కూడా సాగించాడు. అందుకనే తన ఆత్మకథ లో ఒకచోట "యానాం అభివృద్ధి అత్యుత్తమ క్లాత్ మరియు ఉప్పు ఎగుమతులపై ఆధారపడి ఉండేది" అని అన్నాడు. (రి.Letter from Pierre Sonnerat to De Jussieu, of 30 September, 1789, cited by Madeleine Ly-Tio-Fane in her book Pierre Sonnerat 1748-1814). యానాంలో చేనేత పరిశ్రమను నడిపించిన వ్యాపారుల్లో Faure, Bouchez, Rayneau, Dulaurens, Le Canne వంటివారు ప్రముఖులు.







ఇక రెండవ పద్దతిలో దిగుమతి చేసుకొన్న ముతక బట్టలకు బ్లీచింగ్ చేసి తిరిగి విదేశాలకు ఎగుమతి చేయటం జరిగేది. ఇలా బ్లీచింగ్ చేయటానికని యానాంలో ప్రత్యేకమైన చెరువులు ఉండేవి. వీటి పేర్లు Faure చెరువు Rayneau చెరువు అంటూ ఆయా ఫ్రెంచి వ్యాపారుల పేర్లతో వ్యవహరింపబడేవి. ఒక్కో చెరువు వద్ద ఇరవై నుంచి ముప్పైమంది కూలీలు ముతక బట్టలను నీలి మందులో నానబెట్టి ఉతికి ఆరవేసి మడతలు పెట్టి ప్యాకింగ్ చేసేవారు.

ఈ మొత్తం ప్రక్రియ అవసరమైన నీలిమందును తయారుచేయటానికి ఒక నీలిమందు ఫాక్టరీ కూడా యానాంలో కొంతకాలం నడపబడింది. దాని అవశేషాలను "నీలి మందు కుండీలు" అని స్థానికులు చెప్పుకొనేవారు.

ఈ వ్యాపారం చేసే ఫ్రెంచి వ్యాపారస్థులకు ముందుగా కొనుగోలుదారుల నుండి సగం డబ్బు అడ్వాన్సుగా ముట్టేది. నాలుగు నెలల తరువాత ఆ కొనుగోలు దారులు పంపించే ముతక దుస్తులు యానాం చేరేవి. వాటిని ఇక్కడ బ్లీచింగ్ చేసి తిరిగి పంపించాకా మిగిలిన సగం డబ్బు వచ్చేది. ఈ పద్దతిని బట్టి యానాంలో జరిగే బ్లీచింగ్ బట్టలకు విదేశీ మార్కెట్లో కల డిమాండ్ ను అర్థం చేసుకొనవచ్చును.

ఫ్రెంచి ప్రభుత్వం ఈ బ్లీచింగ్ చెరువులపై లైసెన్స్ ఫీజును వసూలు చేసేది. ఇది 1819 లో 1870 ఫ్రాంకులు, 1829 లో 1481 ఫ్రాంకులు, 1843 లో 847 ఫ్రాంకులు ఉన్నట్లు రికార్డులు చెపుతున్నాయి. ఈ మూడు దశకాలలో ఈ ఆదాయం తగ్గుతూ రావటం అనేది క్రమేపీ ఈ పరిశ్రమ క్షీణతకు సంకేతంగా చెప్పవచ్చు. (రి. Budget of Yanam for 1819, 1829, 1843 India card 490, D.837)

1831 లో De Kerusec అనే బ్లీచింగ్ చెరువు వ్యాపారి చెల్లించిన లైసెన్స్ ఫీజు 154 రూపాయిలు కాగా దానినుండి 40 రూపాయిల ఆదాయం మాత్రమే వచ్చిందట. ఈ వ్యాపారం లాభసాటిగా లేదంటూ అతను ఆ చెరువులను లీజు పీరియడ్ పూర్తవకుండానే ప్రభుత్వానికి అప్పగించేసాడు. 1845 నాటికి బ్లీచింగ్ వ్యాపారం పూర్తిగా క్షీణించటంతో యానాంలోని మొత్తం ఏడు బ్లీచింగ్ చెరువులను వ్యవసాయ భూములుగా మార్చి వాటిలో వరిసాగు చేయటం మొదలెట్టారు. ఆవిధంగా బ్లీచింగ్ దుస్తుల ఎగుమతి వ్యాపారానికి తెర పడింది.

**యానాం నేతకారుల పనితనం:** యానాంలో నేసిన దుస్తులకు యూరోపియన్ మార్కెట్టులలో మంచి డిమాండ్ ఉండేది. ఇవి అత్యున్నతమైన, విలాసవంతమైన ఉత్పత్తులుగా పేర్గాంచాయి.

ఒకనాడు బుస్సీ దొర యానాం చేనేత ఉత్పత్తుల సౌందర్యానికి ఆశ్చర్యపడి అప్పటి ఫ్రెంచిరాణి Madam Pompadour కు బహూకరించటానికి డజను దుస్తులను పంపించమని ఆదేశించాడట. యానాం చేనేతకారులు వాటిని ప్రత్యేకంగా బంగారు జరీ అంచుతో నేసి పంపించారట. 1786–1787 ల మధ్య కాలంలో సుమారు ఎనిమిది నౌకలలో యూరోపియన్

మార్కెట్‌కు ఎగుమతి చేయబడిన సుమారు ముప్పై లక్షల రూపాయిల విలువైన చేనేత దుస్తులలో 15 శాతం యానాం ఉత్పత్తులే. (రి.The textile sector of Coramandal and the French Trade, 1750-1800- Arvind Sinha, Delhi University)

**చేనేత పరిశ్రమ పతనావస్థ:** పంతొమ్మిదో శతాబ్దపు ఆరంభంలో యానాంలో సుమారు మూడువేలమంది చేనేత కార్మికులు పనిచేసేవారు. వేల సంఖ్యలో మగ్గాలు ఆడుతూండేవి. కానీ శతాబ్దం చివరకు వచ్చేసరికి వారి సంఖ్య పూర్తిగా తగ్గిపోయింది. దీనికి ప్రధానంగా రెండు కారణాలు కనపడతాయి. 1. బ్రిటిష్ జిల్లాల నుండి యానాం చేరే పత్తిపై బ్రిటిష్ ప్రభుత్వం 10–20 శాతం పన్ను విధించటం. 2. బోర్బన్ (మడగాస్కర్ వద్ద నుండే మరో ఫ్రెంచి కాలనీ. దీనికే రీ యూనియన్ అని పేరు కూడా ఉంది) కు ఎగుమతి చేసే యానాం వస్త్రాలపై 20 శాతం దిగుమతి సుంకం విధించటం.

మొదటి కారణంగా యానాంలోని చేనేత పరిశ్రమలకు అవసరమైన ముడిసరుకు కరువైంది. యానాంలో పత్తిపండని కారణంగా పొరుగునున్న బ్రిటిష్ ప్రాంతాలనుండి సేకరించవలసివచ్చేది. ఎప్పుడైతే బ్రిటిష్ ప్రభుత్వం దిగుమతి సుంకాన్ని విధించటం మొదలెట్టిందో యానాంలోని చేనేత పరిశ్రమ నష్టాలను ఎదుర్కొని క్రమక్రమంగా క్షీణించింది.

రెండవ కారణంగా యానాం ఉత్పత్తులకు అప్పటివరకూ ఉన్న మంచి మార్కెట్ కోల్పోవలసి వచ్చింది. (బోర్బన్ కూడా ఓ ఫ్రెంచి కాలనీ కావటం ఇక్కడి విశేషం). అంతే కాక బ్రిటిష్ వారు యంత్రాల ద్వారా నేసిన దుస్తులను మరింత చౌకగా అమ్మటం మొదలెట్టటంతో యానాంలో తయారయ్యే చేనేత దుస్తులకు గిరాకీ తగ్గిపోయింది.

| సంవత్సరం | యానాం నుంచి ఎగుమతి చేసిన వస్త్రాల విలువ ఫ్రాంకులలో |
|---|---|
| 1834 | 30,720 |
| 1846 | 3,82,970 |
| 1858 | 1,80,706 |
| 1864 | 16,232 |

1846 లో సుమారు నాలుగు లక్షల ఫ్రాంకుల విలువైన చేనేత ఉత్పత్తుల ఎగుమతి చేసిన యానాం, 1864 కి వచ్చేసరికి కేవలం పదహారువేల ఫ్రాంకుల ఉత్పత్తులను మాత్రమే ఎగుమతి చేయటం ఈ పరిశ్రమ యొక్క పతనావస్థను తెలియచెపుతుంది.

## ఇతర వ్యాపార కలాపాలు

**నూనెల ఎగుమతి:** 1863 లో యానాం, మెట్టకూరు నందు ఓ ఆయిల్ మిల్లు ఏర్పాటు చేయటానికి చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. అయినప్పటికీ ఈ మిల్లు పేరున 11,300






ఫ్రాంకుల విలువ చేసే నూనెలు ఎగుమతి చేసినట్లు రికార్డుల ద్వారా తెలుస్తున్నది. తరువాత కాలంలో ఆ మిల్లుకు కేటాయించిన స్థలాన్ని ప్రభుత్వం వెనక్కు తీసేసుకొంది.

**రాగి దిగుమతి:**1846–1861 ల మధ్య పెద్ద మొత్తంలో రాగిని దిగుమతి చేసుకొన్నట్లు రికార్డులలో కనిపిస్తుంది. 1846 లో 17 టన్నులు, 1847 లో 11 టన్నుల రాగిని దిగుమతి చేసుకొన్న యానాంకు 1862 లో రాగి దిగుమతి అసలు జరగలేదు. ఈ రాగిని ముడిసరుకుగా ఉపయోగించి ఏవైనా ఉత్పత్తులను తయారుచేసి వాటిని ఎగుమతి చేసేవారా అన్న విషయం ఎక్కడా కనిపించదు. యానాంలో ఆ కాలంలో పడవల నిర్మాణపనులు ముమ్మరంగా జరిగేవి. ఈ రాగిని బహుశా నౌకా నిర్మాణంలో ఉపయోగించి ఉండవచ్చు.

**కూలీల ఎగుమతి:**యానాంలో జరిగిన కూలీల ఎగుమతి వ్యాపారం గురించి ఫ్రెంచి యానాంలో జరిగిన బానిసల వ్యాపారం అనే చాప్టరులో విపులంగా చర్చించటం జరిగింది.

**నౌకా నిర్మాణం:** యానాం పరిసర ప్రాంతాలలో అప్పట్లో టేకు కలప విరివిగా దొరికేది. ఆ కారణంగా ఒరిస్సా వంటి ప్రాంతాల నుండే కాక అనేక విదేశీ నౌకలు ఇక్కడకు మరమ్మత్తుల నిమిత్తం వచ్చేవి. కొత్త నౌకల నిర్మాణం యానాంలో కంటే కూడా, యానాంకు ఉత్తరంలో కల మెట్టకూరు ఎదురుగా కోరంగి నది అవతలి ఒడ్డున కల సుంకటరేవు అనే బ్రిటిష్ తీరంలో ఎక్కువగా జరిగేవి. ఈ పనులు యానాం నుండి బ్రిటిష్ ప్రాంతానికి తరలిపోవటానికి ప్రధాన కారణం అప్పట్లో చేతివృత్తుల వారిపై ఫ్రెంచి ప్రభుత్వం వృత్తి పన్ను ముక్కు పిండి వసూలు చేసేది. దీని నుండి తప్పించుకోవటానికని యానాం వడ్రంగులు తమ నౌకానిర్మాణ పనులను బ్రిటిష్ ప్రాంతాలలో చేపట్టేవారు.

1845–1858 ల మధ్యకాలంలో పెద్ద పెద్ద ఫ్రెంచి షిప్పులను ఇక్కడికి తెచ్చి రిపేర్లు చేయించేవారు. నౌకా నిర్మాణపనులు బ్రిటిష్ టెరిటరీలో జరుగుతున్నప్పటికీ యానాం వడ్రంగులే ఆ వ్యాపారంలో ఉండేవారని తెలుస్తున్నది. ఉదాహరణకు, యానానికి చెందిన మాసరయ్య అనే వడ్రంగి 1854 లో Delacombe అనే వ్యాపారికి 20 మీటర్ల పొడవైన నౌకను నిర్మించి ఇవ్వటానికి 350 రూపాయిలు అడ్వాన్సుగా తీసుకొని ఎగ్రిమెంటు చేసుకొన్నట్లు రికార్డులలో ఉంది. (Deeds at Notary Office of Yanam 1840-1870- India 251)

**నువ్వుల ఫ్రెంచీకరణ వ్యాపారం:** 1856–1861 ల మధ్య కాలంలో యానాం నుంచి నువ్వుల ఎగుమతి భారీఎత్తున జరిగింది. ఇక్కడి వ్యాపారులు బ్రిటిష్ ప్రాంతాలనుండి నువ్వులను దిగుమతి చేసుకొని వాటిని "యానాం ఉత్పత్తులు" గా స్థానిక ప్రభుత్వంతో ఆమోదముద్ర వేయించుకొని తిరిగి యూరోపియన్ మార్కెట్లకు ఎగుమతి చేసేవారు. ఫ్రెంచి ఉత్పత్తులుగా ముద్రపడితే వాటికి ఇతర ఫ్రెంచి కాలనీలలో టాక్సు మినహాయింపు లభించేది. అలా యానాంలో "నువ్వుల ఫ్రెంచీకరణ" వ్యాపారం 1861 వరకూ నిరాటంకంగా జరిగి సిరులపంటలు పండించింది. 1861లో ఫ్రాన్స్ ప్రభుత్వం స్వేచ్ఛా వాణిజ్యానికి అనుమతినిస్తూ జారీ చేసిన ఉత్తర్వుల వల్ల యానాం ఉత్పత్తులకు లభించే టాక్సు మినహాయింపులు రద్దు చేయబడ్డాయి.

దీని వల్ల యానాంలో జరిగిన నువ్వుల వ్యాపారం అకస్మాత్తుగా ఆగిపోయింది.

దిగుమతి చేసుకొన్న నువ్వులకు “ఇవి ఫ్రెంచి యానాం ఉత్పత్తులు” అనే సర్టిఫికెట్ జారీచేయటం ద్వారా 1860 లో ఇక్కడి స్థానిక ప్రభుత్వానికి 10 వేల ఫ్రాంకుల ఆదాయం వచ్చిందంటే ఆ వ్యాపారం ఏ స్థాయిలో జరిగిందో అర్థమౌతుంది.
వివిధ సంవత్సరాలలో జరిగిన నువ్వుల వ్యాపార వివరాలు ఇలా ఉన్నాయి.

| సంవత్సరం | నువ్వుల విలువ ఫ్రాంకులలో |
|---|---|
| 1856 | 5,64,768 |
| 1857 | 14,99,424 |
| 1859 | 18,49,109 |
| 1860 | 21,15,379 |

1860 లో ఇరవై లక్షల ఫ్రాంకుల విలువచేసే నువ్వుల ఎగుమతి జరగటాన్ని బట్టి, అప్పట్లో రైతులు ఓ పక్క తీవ్రమైన కరువుతో బాధపడుతూ ఉన్నప్పటికీ వ్యాపారులు పడవలు నడిపేవారు గడౌవును నిర్వాహకులు, కూలీలు వంటివారికి మంచి ఉపాధి లభించి ఉండవచ్చు. యానాంలో అంతవరకూ ఫ్రెంచివారే వ్యాపారాలు చేసేవారు. కానీ నెమ్మది నెమ్మదిగా స్థానికులు కూడా పాలుపంచుకోవటం మొదలు పెట్టారు. ఈ నువ్వుల ఫ్రెంచీకరణ వ్యాపారంలో యానాం జమీందారైన మన్యం వెంకటరత్నం ప్రధాన పాత్ర వహించటం దీనికి ప్రారంభంగా చెప్పుకొనవచ్చును.

**తూనికల ద్వారా ఆదాయం:** తప్పుడు తూనికల వల్ల అమ్మేవారికి కొనేవారికి నష్టం వాటిల్లకూడదని సరుకుల బరువును తూకంవేసే పనిని ప్రభుత్వమే చేసేది. ప్రతి మంగళవారం సంతలో ఈ పని జరిగేది. అలా తూకం వేసినందుకు ఫ్రెంచి ప్రభుత్వం నామమాత్రపు ఫీజును వసూలు చేసేది. ధాన్యం తూకం ద్వారా ప్రభుత్వానికి వచ్చిన ఆదాయం ఇలా ఉంది.

| సంవత్సరం | తూనికల ద్వారా వచ్చిన ఆదాయం ఫ్రాంకులలో |
|---|---|
| 1819 | 2,107 |
| 1827 | 2,142 |
| 1858 | 2,000 |
| 1860 | 1,200 |
| 1878 | 300 |

పంతొమ్మిదవ శతాబ్దాంతం వచ్చేసరికి ఈ రకమైన ఆదాయం తగ్గిపోవటం యానాం వాణిజ్యపరంగా కోల్పోతున్న ప్రాభవాన్ని సూచిస్తుంది.

**బియ్యం పప్పు ధాన్యాల ఎగుమతులు:** యానాంలో పండించే వరి, పప్పుధాన్యాల మొత్తం ఉత్పత్తి స్థానిక అవసరాలకు మాత్రమే సరిపోయేవి. అయినప్పటికీ ఇక్కడినుంచి పెద్ద మొత్తాలలో బియ్యం, పప్పులు ఎగుమతి జరగటం ఆశ్చర్యం కలిగించక మానదు. ఇవన్నీ బ్రిటిష్ ప్రాంతాల




ఉత్పత్తులని ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. ఇక వివరాల్లోకి వెళితే 1835 లో 20 వేల ఫ్రాంకులు, 1856 లో 11 వేల ఫ్రాంకులు, 1862 లో 6,500 ఫ్రాంకుల విలువ కలిగిన బియ్యం పప్పు ధాన్యాల ఉత్పత్తులను యానాం నుండి విదేశాలకు ఎగుమతి జరిగింది.

యానాం నుంచి జరిగిన బియ్యం ఎగుమతుల యొక్క ఒప్పంద పత్రాల వివరాలు కొని ఆసక్తికరంగా ఉన్నాయి. (రి. Commercial Judgements, Notary Office, India, Yanam First Magistrate court, G2-21)

1. కెప్టెన్ Calixite కు కారుమూరి మామయ్య అనే వ్యాపారి 7244 ఫ్రాంకుల విలువచేసే బియ్యం సరఫరా చేయటానికి 1840 లో ఒక ఒప్పందం కుదిరింది.

2. Amalrik కంపనీకి ఆచంట సుందరరామయ్య అనే వ్యాపారికి ముప్పై వేల ఫ్రాంకులకు నాలుగువేల బస్తాల బియ్యం సరఫరా చేయటానికి 26 ఏప్రిల్ 1845 న ఒక అంగీకార పత్రం వ్రాసి ఇచ్చాడు.

3. Paul Bouchez 1852 లో శింగంశెట్టి సత్తిలింగం అనే వ్యాపారితో బియ్యం సరఫరా నిమిత్తం రెండు ఒప్పందాలు కుదుర్చుకొన్నాడు.

4. 9 మార్చి 1847 న Legros అనే ఫ్రెంచి వ్యాపారికి బస్తా ఒక్కింటికి 8 ఫ్రాంకుల చొప్పున రెండువేల బస్తాలు 45 రోజులలో సప్లయి చేస్తానని యానానికి చెందిన కారుమూరి మామయ్య ఒప్పంద పత్రం వ్రాసి ఇచ్చాడు. ఆ సంవత్సరం పంటలు సరిగా పండక దిగుబడి తగ్గిపోవటంతో రెండు వేల బస్తాలు సరఫరా చెయ్యలేనని వెయ్యి మాత్రమే చేయగలనని కారుమూరి మామయ్య తెలియచేసాడు. దీనితో Legros కాకినాడలో బస్తా ఒక్కింటికీ పది ఫ్రాంకుల చొప్పున వెయ్యి బస్తాల బియ్యం కొనుక్కొని యానాంలోని కారుమూరి మామయ్యకు మాత్రం బస్తాకు 8 ఫ్రాంకుల చొప్పున మాత్రమే చెల్లించటం జరిగింది. దీని వల్ల కారుమూరి మామయ్య 1200 ఫ్రాంకుల నష్టాన్ని భరించుకోవలసి వచ్చింది.

5. 1829 జనవరిలో పాండిచేరీలో తీవ్రమైన దుర్భిక్షం రాబోతున్నదన్న తప్పుడు అంచనాలతో అప్పటి గవర్నర్ De Melay యానాం నుంచి (అంటే యానాం ద్వారా అని అర్థం చేసుకోవాలి) 3650 టన్నుల బియ్యాన్ని పాండిచేరీకి తరలించాడు. కానీ వర్షాలు సకాలంలో కురవటంతో ఏ రకమైన కరువూ రాకపోవటంతో ఈ బియ్యాన్నంతా నష్టానికి తిరిగి మరో ఫ్రెంచి కాలనీ అయిన బోర్బన్ కు పంపించవలసి వచ్చిందట. ఈ మొత్తం ఉదంతంలో ఫ్రెంచి ప్రభుత్వం భారీ ఆర్థిక నష్టాన్ని పొందింది. (De Melay, relating to the purchase of rice of 1829 forming a supply of precaution, Confidential, India card 488, D.804). పై రిఫరెన్సులో కాన్ఫిడెన్షియల్ అనే మాటను బట్టి యానాం నుంచి బియ్యాన్ని తరలించటం అనే పనిని వీరు అత్యంత రహస్యంగా చేసినట్లు తెలుస్తుంది. ఎందుకంటే కరువురాబోతున్నదన్న విషయం బ్రిటిష్ వారికి కూడా తెలిసిపోతే బియ్యాన్ని తరలించటానికి ఒప్పుకోరాయె మరి!

**మద్యం వ్యాపారం:** మద్యానికి యానానికి ఉన్న లింకు ఈనాటిది కాదు. ఫ్రెంచి వారి కాలంలో యానాంకు షిప్పులలో విదేశీ మద్యం విరివిగా దిగుమతి అయ్యేది. దీని కోసమని చుట్టుపక్కల ప్రాంతాల ప్రజలే కాక బ్రిటిష్ దొరలు కూడా ఇక్కడకు వచ్చి మక్కువగా సేవించేవారు.

| సంవత్సరం | మద్యం అమ్మకాల ఆదాయం ఫ్రాంకులలో |
|---|---|
| 1819 | 5,376 |
| 1829 | 7,215 |
| 1845 | 9,864 |
| 1847 | 13,721 |
| 1860 | 13,044 |
| 1869 | 13,180 |

ఆయా కాలాలలో యానాం ప్రభుత్వాదాయంలో సింహభాగం మద్యం అమ్మకాల ద్వారానే వచ్చేది. ఇక ప్రభుత్వానికి వచ్చే వ్యవసాయ పన్నుతో పోలిస్తే ఈ అబ్కారీ ఆదాయం ఎప్పుడూ ఎక్కువే.

సెప్టెంబరు 1858 లో Eugene Lefaucheur అనే వ్యాపారికి యానాంలో రమ్ము మరియు సారాయి ఫాక్టరీని నెలకొల్పుకోవటానికి ఫ్రెంచి ప్రభుత్వం అనుమతినిచ్చింది. కానీ తరువాత ఈ ఫాక్టరీ గురించిన వివరాలు తెలియరావు.

అప్పట్లో వైను, బ్రాందీ, డచ్ దేశపు జిన్ను, వెర్మొత్ (ఒక రకమైన వైను), షాంపేన్ వంటి వివిధ రకాల విదేశీ మద్యాలు యానాం చేరేవి. యానానికి 1852 లో 16,072 ఫ్రాంకుల, 1863 లో 12,476 ఫ్రాంకుల, 1867 లో 16,716 ఫ్రాంకుల, 1869 లో 1,872 ఫ్రాంకుల మద్యం దిగుమతి అయినట్లు రికార్డులు చెపుతున్నాయి. 1869 వచ్చేసరికి కేవలం పద్దెనిమిది వందల ఫ్రాంకుల విలువైన మద్యం మాత్రమే దిగుమతి కావటానికి కారణం యానాం తన వాణిజ్య వైభవం కోల్పోవటమే.

మరో ఆశక్తికరమైన అంశమేమిటంటే యానాం వ్యాపారపరంగా ప్రాముఖ్యతను కోల్పోయిన తరువాత ఇక్కడకు దిగుమతి అయిన మొత్తం సరుకులలో మద్యం ఉత్పత్తులవిలువే సగానికి పైగా ఉండేది. ఉదాహరణకు, 1864 లో యానాం మొత్తం 10,461 ఫ్రాంకుల ఉత్పత్తులను దిగుమతి చేసుకోగా వీటిలో మద్యం ఉత్పత్తుల విలువ 8,782 ఫ్రాంకులు. అదే విధంగా 1869 నాటి మొత్తం రెండువేల ఫ్రాంకుల దిగుమతుల్లో మద్యం ఉత్పత్తుల విలువ 1,872 ఫ్రాంకులు.

**నల్లమందు అమ్మకాలు**: 1815 లో బ్రిటన్ ఫ్రాన్స్‌లు చేసుకొన్న ఒక ఒప్పందం ప్రకారం ఫ్రెంచి కాలనీలలో ఓపియం/నల్లమందు ఉత్పత్తిని నిషేధించారు. ఇలా ఓపియం ఉత్పత్తిని నిలుపుచేసినందుకు బ్రిటిష్ వారు ఫ్రెంచివారికి నష్టపరిహారాన్ని కూడా కొంతకాలం ఇచ్చింది. (ఓపియంపై మోనోపలీ సాధించటం కోసం బ్రిటిష్ ప్రభుత్వపు ఎత్తుగడ ఇది). నిషేధం ఉ





న్నప్పటికీ ఫ్రెంచి కాలనీలలో నల్లమందు రహస్యంగా దొరికేది. ఇక దానిని నిషేధించలేమని గ్రహించిన ఫ్రెంచి ప్రభుత్వం 1866 నుండి నల్లమందు అమ్మకాలపై పన్ను విధించటం మొదలెట్టింది. తద్వారా యానానికి సంబంధించి 1866 లో 300 ఫ్రాంకులు, 1867 లో 528 ఫ్రాంకుల ఆదాయం సమకూరినట్లు రికార్డులలో ఉంది. (రి. Figures drawn from Volumes of budgets of reciepts and expenditures of India, Pondy Govt. Printing 1857-1870)

**ఉప్పు కుంభకోణం:** 1792 నాటికి యానాంలో పెద్ద సంఖ్యలో ఉప్పుమడులుండేవి. సొన్నరెట్ యానాం పెద్దొరగా ఉన్నపుడు భారీ ఎత్తున ఉప్పువ్యాపారం చేసాడు. అప్పట్లో యానాంలో ఉత్పత్తి అయిన ఉప్పు బెంగాల్ ద్వారా విదేశాలకు ఎగుమతి అయ్యేది. తన ఆత్మ కథలో సొన్నరెట్ "యానాం ప్రగతి ఉప్పువ్యాపారంలోనే ఉన్నది" అని వాఖ్యానించాడు కూడా.

ఇండియాలో ఉప్పు వ్యాపారంపై గుత్తాధిపత్యం సాధించటం కోసం బ్రిటిష్‌వారు ఫ్రెంచి వారితో 1815 మార్చి, 7 న ఒక ఒప్పందం చేసుకొన్నారు. దీని ప్రకారం ఇండియాలోని ఫ్రెంచి కాలనీలలో ఉప్పు (ఓపియం కూడా) పండించకూడదు. అలా నిషేదం విధించినందుకు బ్రిటన్ ఏడాదికి నాలుగు లక్షల రూపాయిలు ఫ్రాన్స్‌కు నష్ట పరిహారంగా ఇవ్వటానికి అంగీకరించింది. ఆ విధంగా భారతదేశంలో ఉప్పు వ్యాపారంపై బ్రిటిష్‌వారు మోనోపలీ సాధించారు.

బ్రిటిష్ వారికి ఉప్పుపై ఒక రకమైన అబ్సెషన్ ఉందేమో అనిపిస్తుంది. (లాభసాటి వ్యాపారం కదా మరి!) బ్రిటిష్ వారు ఉప్పుపై సాగిస్తున్న మోనోపలీని ఛేధించటానికి మహాత్ముడు పెద్ద ఉద్యమమే చేయవలసి వచ్చింది.

ఫ్రెంచి కాలనీలన్నీ సముద్రతీరానికి చేరువగా ఉండటం వల్ల ఉప్పు ఉత్పత్తికి అనుకూలంగా ఉంటాయి. కానీ ఈ ఒప్పందం వల్ల ఫ్రెంచి ప్రభుత్వం అలాంటి మంచి అవకాశాన్ని కోల్పోయింది. అంతే కాక తన ప్రజల అవసరాల కోసం బ్రిటిష్ కంపెనీ అమ్మే ఉప్పును కొనుగోలు చేసుకోవలసి వచ్చింది. ఆ విధంగా బ్రిటిష్ వారు ఫ్రెంచి కాలనీలకున్న అద్భుతమైన ఆర్ధికవనరును దెబ్బతీయగలిగారు.

ఉప్పు పంట నిషేదానికి సంబంధించి 1816 మే, 13 న బ్రిటిష్ వారికి ఫ్రెంచి వారికి మధ్య స్థానికంగా జరిగిన మరో ఒప్పందంలో ఫ్రెంచికాలనీలలో అప్పటివరకూ ఉప్పును పండించే రైతులకు ఏడాదికి 36 వేల ఫ్రాంకుల నష్టపరిహారం 15 సంవత్సరాలవరకూ ఇవ్వటానికి బ్రిటిష్ వారు అంగీకరించారు. ఈ విధంగా ఫ్రెంచి ఇండియా ప్రభుత్వం పొందిన నష్టపరిహారం దుర్వినియోగం జరిగిన విధానం ఆశక్తికరంగా ఉంటుంది.

అప్పటి యానాం పెద్దొర కుర్సన్ అతి తెలివితో మొత్తం అన్ని కాలనీలలోని ఉప్పు రైతులను నయానా భయానా ఒప్పించి వారినుండి వారి ఉప్పుమడులను 15 సంవత్సరాలకు లీజుకు తీసేసుకొన్నాడు. అలా కుర్సన్ వివిధ బినామీ పేర్లతో ఉప్పురైతు అవతారమెత్తి బ్రిటిష్ ప్రభుత్వం ఇచ్చే "ఉప్పు పంట నిషేద పరిహారాన్ని" స్వాహా చేయటం మొదలెట్టాడు. ఉప్పు

రైతులకు కుర్సన్ కు మధ్య సంధానకర్తగా సేపు ముదలియార్ అనే ఓ దుబాసీ ప్రముఖ పాత్రవహించాడు. అప్పటి గవర్నరుకు సన్నిహితంగా ఉండే Dayot అనే ఓ వ్యాపారి మరియు కుర్సన్ లు కలిసి ఈ అవినీతి ఆదాయాన్ని పంచుకొనేవారు.

కుర్సన్ అవకతవకలపై వచ్చిన పిర్యాదులను ఆధారం చేసుకొని 1823 లో Pellissier అనే ఫ్రెంచి అధికారిని విచారణ చేయమని నియమించింది. కుర్సన్ చేసిన ఉప్పు కుంభకోణాన్ని పెల్లిసియర్ తన రిపోర్టులో మొత్తం బయటపెట్టాడు. (April 1823, letters from the Controller of India, Pellissier to the minister, India card 477). 1824 లో కుర్సన్ ను యానాం పెద్దొర పదవి నుంచి డిస్మిస్ చేయటానికి ఈ ఉప్పుకుంభకోణం కూడా ఒక కారణమే.

ఈ మొత్తం ఎపిసోడ్ కు విషాదకర ముగింపేమిటంటే – కుర్సన్ అత్యాశకు పోయి ఉప్పు రైతులకు ముందస్తు చెల్లింపులు చేసి, వారి భూములను 15 సంవత్సరాలకు లీజుకు తీసుకోవటం వల్ల ఆర్ధికంగా చాలా నష్టపోయాడట. ఇతను లాభపడింది మొదటి 5 సంవత్సరాలు మాత్రమే.

**ముగింపు**

కోస్తా ప్రాంతంలో ఒక వ్యాపార స్థావరం కోసమని వెతుకుతున్న ఫ్రెంచివారికి యానాం కంటబడింది. వీరి రాక ముందు యానాం ఒక వ్యాపార కేంద్రమా కాదా అనేది ఒక వివాదాస్పద అంశం. లోతైన పరిశోధన జరిగితే తప్ప తెలియదు. అంతక్రితం ఇక్కడ నుంచి డచ్చివారు వ్యాపార కలాపాలు నిర్వహించారని కొంతమంది ఊహాగానం. కానీ ఫ్రెంచి వారు కానీ డచ్చి వారు కానీ తమ రికార్డులలో ఎక్కడా ఈ ప్రస్తావన తీసుకురాలేదు.
ఫ్రెంచివారు యానాం నుంచి చేసిన వ్యాపారం గణనీయమైనదే. పొరుగునున్న బ్రిటిష్ పాలకులు ఈ వ్యాపారాలను నిలువరించటానికి శాయశక్తులా ప్రయత్నించారు. చాలా వరకూ కృతకృత్యులయ్యారు కూడా.

యానాం వ్యాపారపరంగా తన వైభవాన్ని కోల్పోయినా ఫ్రెంచి ప్రభుత్వం ఈ ప్రాంతాన్ని ఒక "గౌరవ చిహ్నం" గా భావించుకొని నిలుపుకొంది. అంతే కాక ఈ ప్రాంతాన్ని వదులుకోవటం అంటే భారతదేశంలో ఫ్రెంచి సామ్రాజ్య స్థాపన కొరకు అసువులు బాసిన వేల మంది ఫ్రెంచి సైనికుల ఆత్మ బలిదానానికి అర్ధం లేకుండా పోతుందని భావించింది. అందుకనే ఆర్ధిక భారమౌతున్నా చివరి వరకూ నిలుపుకొంది.







# ఆనాటి చట్ట వ్యవస్థ

ప్రాచీన భారతదేశంలో న్యాయాధికారం రాజుగారి వద్దే ఉండేది. మనుస్మృతి అర్ధశాస్త్రాలలో చెప్పిన పద్దతులకనుగుణంగా నేరాలకు శిక్షలు విధించబడేవి. ఇక గ్రామాలలో కుల పెద్దలతో కూడిన పంచాయితీలలో స్థానిక విచారణలు జరిగేవి. ఇక్కడకూడా పైన చెప్పబడిన శాస్త్రాలననుసరించే తీర్పులు చెప్పేవారు. బ్రిటిష్ వారి రాకతో ఈ పద్దతికి తెరపడి ఆధునిక న్యాయవ్యవస్థ అవతరించింది. 1661 లో ఈస్ట్ఇండియా కంపనీ తన ఉద్యోగులకొరకు కొన్ని చట్టాల్ని, శిక్షల్ని సొంతంగా ఏర్పాటుచేసుకొంది. కాల క్రమేణా ఈ చట్టాల పరిధిలోకి సామాన్య ప్రజలను కూడా తీసుకురావటం జరిగింది.

1701 లో ఫ్రాన్స్ జారీచేసిన ఒక రాజశాసనం ద్వారా పాండిచేరీలోని గవర్నర్ కౌన్సిల్ కు సంపూర్ణ జుడిషియల్ హక్కులు కల్పించబడ్డాయి. 1766 నుండి 1827 వరకూ పాండిచేరీలో "Chaudrie" అనే పేరుతో ఫ్రెంచి ఇండియా జుడిషియల్ వ్యవస్థ రూపుదిద్దుకొంది. చావ్రిలను నేటి కోర్టులతో పోల్చవచ్చును. (ఈ పదానికి క్రియాసారూప్యం కలిగిన చావడి, సత్రం అనే తెలుగు పదాలుండటం గమనార్హం) ఇక్కడ సివిలు, క్రిమినలు, శాంతిభద్రతలకు సంబంధించిన అనేక విషయాలపై ఫ్రెంచి జడ్జిలు విచారణలు జరిపి తీర్పులు ఇచ్చేవారు. ఈ తీర్పులు ఎక్కువగా భారతీయ ప్రాచీన శిక్షాస్మృతులను ఆధారంగానే చేసేవారు. (రి. ఆనందరంగ పిళ్ళై డైరీలు. పిళ్ళై కూడా ఒక చావ్రికి జడ్జిగా వ్యవహరించేవాడు) ఆ కాలంలో ఇవ్వబడిన తీర్పులను "Jugements du tribunal de la Chaudrie de Pondicherry - 1766 to 1817" అనే పేరుతో Jean Bonnan అనే ఆయన పుస్తకరూపంలోకి తీసుకొచ్చాడు. 1775 లో బ్రిటిష్ ఇండియాలో వార్న్ హేస్టింగ్స్ భారతీయ శిక్షాస్మృతులను అనుసరించి "హిందూ లా" ను తయారుచేయించి ప్రవేశపెట్టాడు. కాగా ఫ్రెంచి ప్రభుత్వం 1735 లోనే ఒక కమిటీ వేసి స్థానిక శిక్షాస్మృతులను అధ్యయనం చేయించింది. తదనుగుణంగానే చావ్రిలు తీర్పులు చెప్పేవి.

ఇక యానాం విషయానికి వస్తే ఇక్కడ అలాంటి చావ్రిలు పనిచేసినట్లు తెలియరాదు. (రి. జె.బి.పి. మోర్)

1819 జనవరి, 6 న Compte Dupoy (ఫ్రెంచి గవర్నరు) "క్రిష్టియన్లు, ముస్లిములు

లేక హిందువులు ఎవరైనప్పటికీ వారి వారి ఆచార వ్యవహారాలను బట్టి విచారణ జరపవలసి ఉంటుంది" అన్నాడు. ఇక్కడి ప్రజల బాల్యవివాహాలు, వారసత్వ వ్యవహారాలు వంటివి ఫ్రెంచి చట్టాలకు భిన్నగా ఉన్నప్పటికీ కూడా ఫ్రెంచి ప్రభుత్వం ఇక్కడి ప్రజల మనోభావాలకు వ్యతిరేకంగా వ్యవహరించలేదు. అలా చేస్తే వారి వ్యాపారమనుగడ దెబ్బతింటుందన్న ఆలోచనలు కూడా ఉండవచ్చు.

1819, నవంబరు 22 న జారీ చేసిన ఒక రాజ శాసనం ద్వారా ఫ్రెంచి ఇండియాలో "మాజిస్ట్రేట్ కోర్టులు" ప్రారంభించారు. వీటి ద్వారా ఫ్రెంచిప్రభుత్వం తన కాలనీలలోని ప్రజలకు సమర్ధవంతమైన న్యాయాన్ని అందించే వ్యవస్థకు శ్రీకారం చుట్టింది.

యానాం చాలా చిన్న ప్రాంతం కావటంచే సివిలు, క్రిమినల్, శాంతిభద్రత వ్యవహారాలన్నింటికీ కలిపి ఒకే జడ్జి ఉండేవారు. మొదట్లో యానాం పెద్దొరే (ఎడ్మినిస్ట్రేటర్) జడ్జిగా వ్యవహరించేవాడు. ఆయనకు నోటరీ మరియు దుబాసీలు సహాయపడేవారు. ఇక్కడ ఓడిపోయిన కేసులకు పాండిచేరీలో ఉన్న పెద్దకోర్టులో అప్పీలు చేసుకొనే అవకాసం మొదట్లో ఉండేది కాదు. ఈ లొసుగును ఉపయోగించుకొని Courson వంటి పెద్దొరలు నియంతలుగా వ్యవహరించి కొంతకాలం యానాన్ని గడగడలాడించారు.

1784 లో చేసిన ఒక ఫ్రెంచి చట్టం ప్రకారం క్రిమినల్ కేసుల్లో జడ్జిమెంటు ఇచ్చేముందు ముగ్గురు స్థానిక ఫ్రెంచి పౌరుల సహాయంతో విచారణ జరపవలసి ఉంటుంది. ఈ నిబంధన వలన యానాం కోర్టులో క్రిమినల్ కేసుల విచారణ నత్తనడకన సాగుతూండేది. ఎంపిక చేసిన స్థానిక న్యాయ సహాయకులలో ఒకరుంటే ఒకరుండని కారణంగా కేసులు పదేపదే వాయిదా పడేవి. ఈ ప్రతిబంధకం వలన చాలా కేసులు కోర్టు ఫైళ్ళలో మగ్గిపోతుండేవి.

1829 లో యానాంలో పెద్ద ఎత్తున అల్లర్లు జరిగాయి. వీటిని అదుపుచేయటంలో అప్పటి పెద్దొర Delarche విఫలం కావటంతో పాండిచేరీ నుంచి Lasparda ను యానాంకు పెద్దొరగా అత్యవసరంగా పంపించారు. లెస్పార్డా వచ్చీరాగానే "*తుదితీర్పులు ఇవ్వటానికి యానాం పెద్దొరకు సంపూర్ణ అధికారాలు పాండిచేరీలో ఇవ్వబడ్డాయి*" అన్న తీర్మానాన్ని స్థానిక కౌన్సిల్ లో ప్రవేశపెట్టి ఆమోదింపచేయించుకొన్నాడు. దీనితో సహాయకుల అవసరం లేకుండా జడ్జిహోదాలో పెద్దొర ఒక్కరే తీర్పులు ఇచ్చే అవకాశం ఏర్పడింది. అలా లెస్పార్డా తనకు కొన్ని విశిష్టాధికారాలను సృష్టించుకొని ఆనాటి యానాం అల్లర్లను అణచివేయగలిగాడు. (అది 1784 నాటి ఫ్రెంచి చట్ట వ్యతిరేకమైనప్పటికీ)

అప్పట్లో స్త్రీలు, పిల్లలు, ప్రభుత్వోద్యోగులు, చనిపోయినవారలకు చెందిన కేసులకు ప్రథమ ప్రాధాన్యత ఉండి వారికి సంబంధించిన కేసులకు త్వరితగతిన తీర్పులు చెప్పేవారు.

1833, ఫిబ్రవరి 4 న జారీ చేసిన ఒక డిక్రీ ద్వారా యానానికి ప్రత్యేక జడ్జి నియామకం జరగటం మొదలైంది. (రి. 18 February 1833 , Letter of De Melay to De Lesparda,







COR.GLE, India V.31). ప్రజలకు సరైన న్యాయం అందించటం కోసం 1833 లో సుమారు పదిరకాల వివిధ మాన్యుయల్స్ ను ఫ్రెంచి ప్రభుత్వం యానాం కోర్టుకు పంపించింది. (మాన్యుయల్ ఆఫ్ జస్టిస్, మాన్యుయల్ ఆఫ్ క్రిమినల్ లా, సివిల ప్రొసీజర్ వంటివి)

క్రిమినల్ కేసుల విచారణ ముగ్గురు లేదా నలుగురు ఫ్రెంచి దేశస్థుల సమక్షంలో జరగాలనే నిబంధనను సడలించి ముగ్గురు లేదా నలుగురు స్థానిక పెద్దలను భాగస్వాములను చెయ్యటం 1848 నుంచి మొదలయ్యింది. పెద్దొర సిఫార్సుల మేరకు ఈ స్థానిక జడ్జిల నియామకం జరిగేది. ఆ విధంగా కామిశెట్టి పేరమ, బళ్ల సుబ్బయ్య, బులుసు సుబ్రహ్మణ్య శాస్త్రులు, బెజవాడ బాపనయ్య,వర్ధినీడి అయ్యప్పనాయుడు, గిరి వెంకన్న, దరియాఖాన్ వంటి స్థానికులు సహాయక జడ్జిలుగా పనిచేసారు.

1850 నాటి యానాం జుడిషియల్ వ్యవస్థలో – ప్రధాన న్యాయమూర్తి, ప్రభుత్వ ప్రాసిక్యూటర్ (ఈయనే పోలీసు ఉన్నతాధికారి కూడా), నోటరీ వంటి ప్రధాన పదవులలో ఫ్రెంచి దేశస్థులు, వీరుకాక నలుగురు స్థానిక సహాయకులు, ఒక దుబాసీ, ప్రమాణములు చేయించటానికి బ్రాహ్మణుడు, బంట్రోతు మరియు జైలరు ఒక్కొక్కరు చొప్పున ఉండేవారు. సుమారు ఇరవైమంది పోలీసులతో కూడిన పోలీసు వ్యవస్థ కోర్టుకు అనుబంధంగా పనిచేసేది.

యానాం కోర్టులో 1833 లో పద్దెనిమిది కేసులు విచారణ జరగగా 1859 నాటికి వీటి సంఖ్య 118 కి పెరిగింది. ఇది ఆనాటి ప్రజలలో న్యాయవ్యవస్థపై పెరిగిన నమ్మకానికి నిదర్శనంగా చెప్పుకొనవచ్చును. కానీ 1833 లో ఒకే ఒక క్రిమినల్ కేసు నమోదు కాగా 1859 లో 83 క్రిమినల్ కేసులు నమోదు కావటం గమనార్హం.

## ప్రసిద్ధిగాంచిన కొన్ని కేసులు

యానాం కోర్టు ఏర్పడినపుడు దానికి ప్రథమ మాజిస్ట్రేట్ గా Emile Coet Morven నియమితుడయ్యాడు. ఇతని వ్యవహారశైలి తదనంతర కాలంలో వివాదాస్పదమైంది. అక్టోబర్ 1833 లో మోర్వెన్ తన ఇంట్లో పనిచేసే అడపా వెంకటరెడ్డి తనకు త్రాగటానికి మురికి నీరు ఇచ్చాడన్న కోపంతో అతను నాపై విషప్రయోగం చేసి చంపాలనుకొంటున్నాడు అని కేసు బనాయించి పోలీసులచే చితక బాదించాడు. ముద్దాయిని పరిశీలించిన డా.పిథోస్ అతని ఒంటిపై దారుణమైన దెబ్బలున్నాయని ధృవీకరించాడు కూడా.

ఈ కేసు విషయం అంతా ఫ్రెంచి గవర్నరు De malay కు తెలిసి అప్పటి పెద్దొర అయిన జోర్డైన్ కు ఈ విధంగా ఉత్తరం వ్రాయటం జరిగింది.

*……. నేరం ఋజువు కాలేదు. ఆ నీరు త్రాగి మోర్వెన్ అనారోగ్యం పాలయిన దాఖలాలూ లేవు. విషప్రయోగం అన్నది ఒట్టి ఊహాగానమే తప్ప మరేమీ కాదు. అడపా వెంకటరెడ్డిని తక్షణం విడుదల చెయ్యండి….. అందరికీ న్యాయాన్ని అందించాల్సిన న్యాయమూర్తే*

ఇలా అధికార దుర్వినియోగానికి పాల్పడటం శోచనీయం....... అంటూ అక్షింతలు పెట్టాడు.

ఆ తరువాత కూడా మోర్వెన్ వ్యవహార శైలి మారలేదు. మోర్వెన్ అనేక రకాలైన అవమానాలకు, వేధింపులకు గురిచేస్తున్నాడని ఈతని ప్రవర్తన కంటక ప్రాయంగా ఉందంటూ యానాం ప్రజలు 1834లో గవర్నరుకు పిర్యాదులు చేసారు. ఆర్ధిక అవకతవకలకు పాల్పడి యానాంపెద్దొర ఉద్యోగాన్ని పోగొట్టుకొన్న కుర్సన్‌కు ఈ మోర్వెన్ అల్లుడే కావటం ఇక్కడ విశేషం.

**మన్యవారి మేడలో మానవ బలి కేసు:** యానాం మన్యవారి మేడలో అభియోగింపబడిన మానవబలి పై పాండిచేరి కోర్టు ప్రధాన న్యాయమూర్తి Ristle Hueber 17 నవంబరు 1858 మరియు 25 మార్చి 1859 తారీఖులలో జరిపిన విచారణల అనంతరం సమర్పించిన రిపోర్టు సారాంశం ఈ విధంగా ఉంది (రి. ఇండియా కార్డు 463).

........ మన్యం వెంకటరత్నం యానాంలో పేరుమోసిన జమీందారు. ఇతనికి ఫ్రెంచి దొరలకూ మధ్య అనేక ఆర్ధిక వ్యాపారలావాదేవీలు ఉండేవి. 1856 ప్రాంతంలో ఈతనికి వచ్చిన జబ్బు ఎన్ని మందులు వాడినా తగ్గలేదు. దానితో వెంకటరత్నం, షేక్‌లాలా, ఆది నారాయణుడు మరియు బావాజి అనే ముగ్గురు మంత్రగాళ్ళను ఆశ్రయించాడు. వాళ్ళు ఇదంతా చేతబడి ప్రభావం అని జమిందారును నమ్మించారు. *మీకు చేతబడిచేసింది నిజమే అయితే మేం చదివే మంత్రం పూర్తికాగానే మీ ఇంటిపై రాళ్ళు వర్షిస్తాయి* అంటూ ఏవో మంత్రాలు జపించగా– వెంకటరత్నం ఇంటిపై రాళ్ళ వర్షం కురిసిందట. దానితో జమీందారు ఆ మంత్రగాళ్ళ మాటలకు లొంగిపోయాడు. వాళ్ళు అలా జమీందారు ఇంట్లో ఎనిమిదిరోజుల పాటు క్షుద్రపూజలు చేసారు. తోట గవన్న అనే ఆ ఇంటి పనివాడిపై దెయ్యాన్ని ఆవహింపచేస్తే *"నువ్వొక నెలరోజుల్లో చనిపోతావు ఇప్పటికే ఆలస్యమయ్యింది తొందరగా భూతశాంతి చేయించు"* అన్నడట. దీంతో బెంబేలెత్తిపోయిన జమీందారు మంత్రగాళ్ళు చెప్పినట్లు "మానవ కన్య" ను బలి ఇవ్వటానికి సిద్దపడ్డాడు. ఆ మంత్రగాళ్ళ కన్ను ఆ ఇంటిలోనే పనిచేస్తున్న తోట గవన్న కూతురైన పదేళ్ళ మంగ పై పడ్డాయి. తోట గవన్నకు తెలియకుండా బలి ఇవ్వటానికి ఆమెను ఎంచుకొన్నారు.

15 మే, 1856 న మంత్రగాళ్ళు ఆమెను పెరట్లోకి తీసుకు వెళ్ళి ఏవో పదార్ధాలను ఆమెచే తాగించారు. అవి తాగాకా ఆమె ఇంటికి వెళ్ళి అపస్మారక స్థితికి చేరి రెండురోజుల తరువాత మరణించింది. కూతురు మరణించటం పట్ల ఆగ్రహించిన తోట గవన్న కొంతమంది పెద్దల సహాయంతో, మన్యం వెంకటరత్నం మరియు ఆ ముగ్గురు మంత్రగాళ్ళపై యానాం కోర్టులో కేసువేసాడు..... అంటూ రిజెల్ హూబర్ రిపోర్టు మొత్తం జరిగిన ఉదంతాన్ని క్రోడీకరించింది.

అక్కడినుంచి మొదలైంది అసలు కథ. తోటగవన్న ఇచ్చిన కంప్లైంట్ ఆధారంగా ఈ బలి ఉదంతంపై విచారణ జరిగింది. ఆ అమ్మాయికి విషాన్ని పట్టించారన్న ఆరోపణ నిజానిజాలు నిర్ధారించటానికి వీలుపడలేదు, ఎందుకంటే అప్పటికే శవదహనం జరిగిపోయింది. అందుచేత అప్పటి యానాం కోర్టు జడ్జి De Saint Hilaire ఈ కేసును కొట్టివేసి ముగ్గురు మంత్రగాళ్ళు నిర్ధోషులని విడుదల చేసేసాడు. ఈ తీర్పు పట్ల యానాంలో పెద్ద ఎత్తున నిరసన వ్యక్తమయింది.







మన్యం వెంకటరత్నం తన పలుకుబడిని ఉపయోగించి కేసును కొట్టివేయించాడని యానాం నుంచి పిర్యాదులు అందటంతో – పాండిచేరీ కోర్టు ప్రధాన న్యాయమూర్తి రిజెల్ హ్యూబర్ మొత్తం కేసును పునర్విచారణ స్వయంగా చేపట్టి ఆ మంత్రగాళ్ళకు మూడునెలల జైలు శిక్ష మరియు మంగ తల్లికి వెయ్యిరూపాయిల పరిహారాన్ని ఇప్పిస్తూ తీర్పు చెప్పాడు.

ఈ మొత్తం ఉదంతంలో ఫ్రెంచి ప్రభుత్వం అప్పట్లో యానాంలో అన్ని రంగాలలో ఆధిక్యతలో ఉన్న ఓ ప్రధాన సామాజిక వర్గాన్ని సంతృప్తి పరచటానికే ఆ నిందితులకు నామ మాత్రపు శిక్షలు విధించినట్లు అనిపించక మానదు.

### చెళ్లపిళ్ల వారి కేసు

తొలితరం ప్రముఖ ఆధునిక తెలుగుకవి చెళ్లపిళ్ళ వెంకటశాస్త్రి యానాంలో 1880 లలో విద్యనభ్యసించారు. చెళ్లపిల్ల వారు అల్లే కవిత్వంలో తమను గరించి దూషణలు ఉన్నాయని కొంతమంది స్థానికులు కొంతమంది వీరిపై యానాం కోర్టులో కేసువేసారట. ఆ కేసు విచారణ చేసిన జడ్జిగారు నూనూగు మీసాలైనా లేని చెళ్లపిల్ల వారిని చూసి *"వీడు పొయెట్ అంటే నేను ఒప్పుకోను"* అని కేసు కొట్టివేసాట్ట. (రి. చెళ్లపిల్ల వారు రచించిన కథలు–గాథలు పుస్తకం). ఆ తరువాత కాలంలో శ్రీచెళ్లపిల్ల వారు ఆంధ్రదేశం గర్వించదగ్గ కవిగా పేర్గాంచారు. ఈ సందర్భంలో చెళ్లపిల్ల వారి తరపున వాదించిన లాయర్ యొక్క సామర్ధ్యం మెచ్చుకోదగ్గది ఎందుకంటే నిజంగానే నందిని పందిగా చేయగలిగాడీ కేసులో.

### ఎన్నికల కేసులు

యానాంలో ఎన్నికలు జరిగిన ప్రతీసారీ ఓడిపోయిన అభ్యర్ధులు విజేతలపై కేసులువేయటం పరిపాటిగా ఉండేది. 1880 మేలో జరిగిన ఎన్నికలలో బెజవాడ బాపనయ్య మేయరుగా ఎన్నికయ్యారు. ఈ ఎన్నిక చెల్లదంటూ ప్రత్యర్ధులు కేసు పెట్టారు. మేయర్ పదవి చేపట్టటానికి బెజవాడ బాపనయ్యకు 25 సంవత్సరముల వయసులేని కారణంగా ఆయన మేయర్ ఎన్నిక చెల్లదంటూ యానాం కోర్టు తీర్పుచెప్పింది.

1922లో కామిశెట్టి వేణుగోపాలరావు నాయుడు స్థానిక మండలి సభ్యునిగా ఎన్నికయినపుడు ఆయనకు ఫ్రెంచిరాదనీ, ఆ ఎన్నిక చెల్లదంటూ గిరి తాతయ్య కేసు వేసారు. కోర్టువారు విచారణ జరిపి కామిశెట్టికి తగినంత ఫ్రెంచి వచ్చు కనుక అతని ఎన్నిక చెల్లుతుందని తీర్పుచెప్పారు.

### గ్రామ బహిష్కరణ తీర్పు

ఫ్రెంచి కోర్టు తీర్పులలో గ్రామబహిష్కరణ కూడా ఒక శిక్షావిధానంగా ఉండేది. ఉదాహరణకు యానానికి చెందిన సత్తర్ సాహెబ్ అనే ఫ్రెంచి పౌరుడు దొంగతనం చేసినట్లు ఋజువు కావటంతో అతని కేసులో 1913, జూన 27 న ఇచ్చిన తీర్పులో– మూడునెలల

జైలు శిక్ష, 25 ఫ్రాంకుల జురిమానా మరియు ఒక సంవత్సరం పాటు గ్రామ బహిష్కరణ శిక్షలు విధించటం జరిగింది. ఈ గ్రామ బహిష్కరణ ఒక్క యానానికి మాత్రమే పరిమితం కాక మిగిలిన అన్ని ఫ్రెంచి కాలనీలకు కూడా వర్తిస్తుంది.

### యానాం విమోచనం లో జడ్జి పాత్ర

1954లో యానాంను ఫ్రెంచిపాలన నుండి విముక్తం చేయటానికి విమోచనోద్యమం ముమ్మరంగా జరిగింది. ఆ సందర్భంలో ఫ్రెంచిదేశస్థుడయిన జార్జిసాలా యానాం అడ్మినిస్ట్రేటరుగా కొనసాగటం మంచిదికాదన్న ఉద్దేశ్యంతో ఫ్రెంచి ప్రభుత్వం ఆయనను పాండిచేరీ పిలిపించివేసింది. అప్పటి యానాం కోర్టు న్యాయమూర్తి అయిన శ్రీ శివా గారికి యానాం అడ్మినిస్ట్రేటరు బాధ్యతలను అప్పచెప్పేరు. 1954 జూన్, 13న వేల సంఖ్యలో విమోచనోద్యమకారులు అడ్మినిస్ట్రేటరు బంగళాను చేరుకొని ఇంచార్జ్ అడ్మినిస్ట్రేటరు అయిన శ్రీ శివా నుండి అధికారాలను స్వాధీనపరచుకొని, యానాం రెండు శతాబ్దాల ఫ్రెంచిపాలన నుండి విముక్తమైందని ప్రకటించారు. శ్రీ శివా పరిస్థితిని సమీక్షించి ప్రతిఘటించినట్లయితే తలెత్తే శాంతిభద్రతల సమస్యను దూరాలోచనచేసి అధికారాలను ఉద్యమకారులకు బదలాయించారు. ఆ విధంగా యానాంలోని ఫ్రెంచిపాలనకు స్వస్థి వాక్యం పలకబడింది. వలసపాలకుల నుండి రాజ్యాధికారం స్థానికులకు అందించటంలో యానాంజడ్జి పాత్ర అలా చరిత్రలో నిలిచిపోయింది.

### ముగింపు

యానాం మేజిస్ట్రేట్ కోర్టువారి అధికారిక వెబ్‌సైటు లో యానాం కోర్టు 1725 కు పూర్వం డచ్చివారిచే నిర్మింపబడిందని, 1725 లో ఫ్రెంచివారి చేతుల్లోకి వెళ్ళిందని ఉంది. ఇది మొదట డచ్చి కోర్టు అనీ తరువాత ఫ్రెంచి కోర్టుగా రూపాంతరం చెందినట్లు వ్రాయబడింది. ఏ ఆధారాలతో ఒక ప్రభుత్వ వెబ్ సైటులో అలాంటి సమాచారాన్ని పొందుపరచారో ఆశ్చర్యం కలిగించక మానదు.

యానాన్ని డచ్చివారు పరిపాలించినట్లు కానీ ఇక్కడ తమస్థావరాల్ని ఏర్పాటుచేసుకొన్నట్లు కానీ ఎక్కడా చారిత్రిక ఆధారాలు కనిపించవు. డచ్చివారు పరిపాలించిన ప్రదేశాలైన పాలకొల్లు, జగన్నాధపురం వంటి ప్రాంతాలలో ఎక్కడా ఏ విధమైన కోర్టులు నిర్మించలేదు. పాపం వారికి పదిహేడవ శతాబ్దం అంతా స్థానికరాజుల నుండి వ్యాపారానుమతులు పొందటంతోనే సరిపోయింది. పద్దెనిమిదవ శతాబ్దంలో బ్రిటిష్ వారితో పోటీ పడలేక కనుమరుగయిపోయారు. ఇంగ్లీషు, ఫ్రెంచివారిలాగా డచ్చివారికి స్థానిక పరిపాలనలో పాలుపంచుకొనే అవకాశమే రాలేదు. కనుక ప్రస్తుతకోర్టు డచ్చివారిచే నిర్మించబడిందనటం సత్యదూరం.

యానాంలో చాద్రిలు లేవని జె.బి.పి. మోర్ అభిప్రాయపడినప్పటికీ పాండిచేరీలో వాటి నిర్వహణ 1717 నుంచీ సమర్ధవంతంగా ఉన్నది కనుక, యానాంలో కూడా 1723–1758 మధ్య కాలంలో పెద్దొరలుగా పనిచేసిన Guillard, Choisy, Saifray వంటి ప్రభృతులు వాటిని నిర్వహించి ఉండవచ్చుననే భావించవచ్చును. ఏది ఏమైనప్పటికీ 1833 నుంచి మాత్రం ఒక పూర్తిస్థాయి జడ్జితో యానాం కోర్టు నడిచిందన్నది ఒక చారిత్రక సత్యంగా గుర్తించాలి.





ఫ్రెంచి పాలనలో యానాం

# అతలాకుతలం చేసిన ప్రకృతి భీభత్సాలు

యానాం భౌగోళికంగా తీరప్రాంతమవటం వల్ల వరదలు, తుఫాన్లు వంటివి సహజంగానే ఈ ప్రాంతపు జన జీవనాన్ని అస్థవ్యస్థం చేస్తూంటాయి. అవి కాక కరువులు మహమ్మారులు అప్పుడపుడూ అనేక మంది ప్రాణల్ని బలితీసుకొనేవి. యానాంలో టైడల్ లాక్ నిర్మించకపూర్వం ఊర్లోకి వరదనీరు ప్రవేశించటం నిన్నమొన్నటి వరకూ జరిగిన విషయమే. తుఫాన్లు, వరదలు, కరువుల కారణంగా జరిగిన ఆస్తి, ప్రాణ నష్టాల వివరాలు ఫ్రెంచి రికార్డులలో మనకు లభిస్తాయి. ఆయా సమయాలలో ఆపత్కాలాలలో ఫ్రెంచి ప్రభుత్వం ఇక్కడి ప్రజలకు ఎలాంటి చేయూతని, పరిహారాల్ని అందించిందో వాటి ద్వారా తెలుస్తున్నాయి.

### వరదలు

1834 లో స్వల్పంగాను 1835 లో భారీగాను వరదలు యానాన్ని ముంచెత్తాయి. అప్పటి యానాం పెద్దొర జోర్డైన్ 1835 అక్టోబరు, 21 న పంపిన ఓ రిపోర్టులో వరద చేసిన భీభత్సం గురించి విపులంగా ఉంది.

*...... ఈ వరదలలో యానాం పొలాలు సర్వనాశనం అయ్యాయి. పంట దిగుబడికి పూర్తిగా నష్టం వాటిల్లింది. పంటభూముల మధ్య పారిన వరదనీటి కోత వల్ల ఓ పెద్ద కాలువ కొత్తగా ఏర్పడింది. కోరంగి నదికి ఇరువైపులా ఉన్న పొలాలకు జరిగిన నష్టం చెప్పనలవి కాదు. మొత్తం మీద యానాం పంటభూములలో మూడవ వంతు నదీ జలాల కోత వల్ల కనుమరుగైంది. యానాం ఊరిలోని 33 ఇళ్ళు కూలిపోయాయి. చాలా మంది ప్రజలు అక్కడికక్కడే మరణించారు. కొంతమంది కొట్టుకుపోయారు. Vanhacsten (ప్రముఖ వ్యాపారి) ఇంటి సరిహద్దుగోడలు వరద తాకిడికి ధ్వంసమైనాయి......... యానాం డాక్టరు పిథోస్ తో కలసి పెద్దొర వరద ముంపు ప్రాంతాలను సందర్శించి పరిస్థితులను చక్కదిద్దటానికి కృషిచేసినట్లు తన రిపోర్టులో జోర్డైన్ చెప్పుకొన్నాడు.* (Budget report of French India for 1837)

వరదలు కలిగించిన ధన ప్రాణ నష్టాలను శాశ్వత ప్రాతిపదికన నివారించటానికి

బొల్లోజు బాబా

ఫ్రెంచి ప్రభుత్వం ఒక ఎత్తయిన గట్టు నిర్మాణం చేపట్టింది. ఇది పెద్దొర బంగ్లాకు దక్షిణం వైపున సుమారు మూడువందల మీటర్ల పొడవుకలిగిన ఒక రక్షణ గోడ. దీనినే పాంచాల గట్టుగా స్థానికులు పిలుచుకొంటారు. దీనివల్ల వరదనీరు ఊరిలోకి ప్రవేశించకుండా ఊరు మరియు ఊరిలో పెద్ద ఎత్తున నిల్వలు కలిగిన వ్యాపార గొడౌన్లు సంరంక్షింపబడేవి. ఈ గట్టు నిర్మాణం 1834 లోనే ప్రారంభమైనా నిధుల కొరత వల్ల పనులు వేగవంతంగా జరగలేదు – మరో వైపరీత్యం వచ్చేదాకా.

ఆ తరువాత 1849 లో మరింత భయంకరమైన వరదలను యానాం ఎదుర్కొంది. అదే సమయంలో యానానికి వ్యాపార నిమిత్తమై వచ్చిన "Le Picard" అనే ఫ్రెంచి నౌక కెప్టెన్ "Pallier" ఈ వరదల వల్ల తాను పడిన ఇబ్బందులను తన రిపోర్టులో ఇలా పొందుపరచాడు. 1849 సెప్టెంబరు, 14 న ఉధృతమైన వరదనీటి వలన పాల్లియర్ యానాం చేరలేక జగన్నాయకపురం (కాకినాడ) లో తన సిబ్బందితో దిగిపోయాడట. అక్కడినుంచి యానాంకు చిన్నపడవలో బయలుదేరాడు. దారిలో మునిగిపోయిన ఊర్లలోని ఇండ్లపైనుంచి తన పడవను నడిపించటం జరిగిందని...... పాల్లియర్ పేర్కొన్నాడు.

వరదల కారణంగా యానాం ప్రజలు దాదాపు అందరూ ఊరు విడిచిపోయారు. యానాంలో పెద్దొర బంగళా, చర్చి మరియు పెద్దబజారు వీధి (నేటి త్యాగరాజ వీధి) లోని కొన్ని ఇళ్ళు తప్ప సర్వం నీటిలో మునిగిపోయాయి. చర్చి ఫాదరు చిన్నిబోటులో ముంపు ప్రాంతాలను సందర్శిస్తూ, ఇళ్లపైకూర్చొని సహాయాన్ని అర్థిస్తున్న వరద భాదితులను సురక్షిత ప్రాంతాలకు తరలించాడు. 29 సెప్టెంబరు 1849 కల్లా నెమ్మది నెమ్మదిగా వరదనీరు తొలగి ఇళ్ళు, రోడ్లు బయటపడ్డాయి. పంటలు ఇళ్ళు గొడౌన్లలోని నిల్వలు సర్వనాశనం అయ్యాయి.

యానాం పెద్దొర జోర్డెన్ ఆధ్వర్యంలో ఏర్పడిన కమిటీ వరదనష్టాన్ని 19 డిశంబరు నాటికి అంచనావేసి నివేదికను ప్రభుత్వానికి సమర్పించింది. *"యానాంలో 89 ఇళ్ళు వరదల వల్ల నాశనం అయ్యాయనీ, పశుసంపద మూడింట రెండువంతులు కొట్టుకుపోయిందని, పంటలయితే ఒక్క గింజకూడా చేతికి వచ్చే పరిస్థితిలేదని"* – ఆ నివేదిక తెలిపింది.

1848 పశుగణాంకాల ప్రకారం 1986 (ఆవులు 851, గేదెలు 1135) ఉండే పశువుల సంఖ్య ఈ వరదల వల్ల 1849 నాటికి 720 కి (ఆవులు 455, గేదెలు 265) పడిపోయింది.

ఆ తరువాత మరలా యానాన్ని అయిదురోజులపాటు జల దిగ్బంధనం చేసిన వరదలలో 1933 నాటివి చెప్పుకోతగ్గవి.

## సూపర్ సైక్లోనులు

1787 లో వచ్చిన తుఫాను వల్ల యానాంలో 600 మంది చనిపోయారు. డిశంబరు 1789 లో కోరంగి పరిసర ప్రాంతాలలో వచ్చిన భయంకరమైన తుఫాను వర్ణనల్లో యానాం







ప్రస్తావన ఉంది. Henry Piddington 1869 లో వ్రాసిన "The Sailor's Horn Book" అనే పుస్తకపు 195 వ పేజీలో..... *"కోరంగి రేవులో లంగరు వేయబడిన నౌకలు యానాం వరకూ కొట్టుకుపోయాయి. యానాం కూడా ఈ తుఫాను వల్ల భారీ ఎత్తున నష్టపోయింది. ఉప్పెన కెరటాల వల్ల పెద్ద ఎత్తున ఇసుక, బురద ఊరినిండా చేరటంతో మృతదేహాల వెలికితీత కష్టతరం అయ్యింది"* అంటూ యానాంలో అప్పుడు జరిగిన తుఫాను భీభత్సం గురించి ఉంది.

10 మే 1832 నాటి తుఫానులో ఉప్పునీరు యానాంలోకి ప్రవేశించటం వల్ల పంటభూములు పాడయి చాన్నాళ్లవరకూ పంటలు పండక తరువాత అది కరువుకు దారితీసింది.

1839 నవంబరు 16, 17 తారీఖులలో వచ్చిన భీకరమైన ఈదురుగాలులతో కూడిన సూపర్ సైక్లోను యానాం చుట్టూ సుమారు 50 కిలోమీటర్ల పరిధిలో తీవ్రమైన ఆస్థి, ప్రాణ నష్టాల్ని కలిగించింది. ఈ తీవ్రమైన ప్రకృతి విలయతాండవానికి యానాం అల్లాడిపోయింది. కోరంగి యానాం, రాజమండ్రి, కాకినాడ ప్రాంతాలలో సుమారు 130 నౌకలు గల్లంతయ్యాయి. పదివేల మంది చనిపోయారు. ఈ మొత్తం నష్టం అంతా సుమారు అయిదు గంటల సమయంలో జరిగిపోయింది. (రి. Hurricane of 1839, Year book of India, Pondy Govt. printing 1844) ఆనాటి యానాం పెద్దొర Collin de Bar 1839 నవంబరు, 18 న ఫ్రెంచి గవర్నరు Mr. De Saint Simon కు ఈ వరద భీభత్సం గురించి అందించిన సుదీర్ఘమైన రిపోర్టునుంచి ఈ క్రింది విషయాలు తెలుస్తున్నాయి.

*ఆ రాత్రి 11 గంటలకు తుఫాను గాలులు తీవ్రతరం కావటంతో ప్రజలు భయాందోళనలకు గురయి సురక్షిత ప్రాంతాలకు తరలిపోవటం మొదలెట్టారు. పెద్దొర బంగ్లా ఎత్తయిన ప్రాంతంలో ఉన్నప్పటికీ అది సురక్షితం కాదని తలచిన పెద్దొర మన్యవారి మేడలో తలదాచుకొన్నాడు. పెద్దొర తన బంగ్లాను ఖాళీ చేసిన గంటలోనే దానిలోపలకు పెద్దఎత్తున నీళ్ళు ప్రవేశించి చాలా రికార్డులు కొట్టుకుపోయాయి. ఫ్రెంచి జండాను ఎగరేసే జండా స్థంభం మొదలులోకి విరిగిపడింది. గొడౌన్లలో నిల్వచేసిన ఆహారధాన్యాలు నీళ్ళ పాలయ్యాయి. యానాంలో సుమారు 500 మంది మృత్యువాత పడ్డారు. అనేక వేల మంది ఆర్ధికంగా నష్టపోయారు. ఎనిమిది మంది ఫ్రెంచి నౌకాధికారులు గల్లంతయ్యారు. యానాం వీధులలో ఎక్కడచూసినా పశువులు, ఇతరజీవుల కళేబరాలు చెల్లాచెదురుగా పడి ఉన్నాయి.*

7 డిశంబరు 1839 న యానాం పెద్దొర ఫ్రెంచి గవర్నరుకు వ్రాసిన మరో లేఖలో మరిన్ని వివరాలు ఉన్నాయి.

*రేవు దాటుతున్న ఒక వ్యక్తి తుఫాను గాలల విసురుకు అలా గాలిలో తేలుకొని ఎగిరిపోయాడట. కొంతమంది వ్యక్తులు మరియు శవాలు తమ తమ ఇళ్ళకు కొన్ని కిలో మీటర్ల వరకూ విసిరివేయబడ్డారు. నాలుగొందల మంది తలదాచుకొన్న ఓ ఇల్లు కూలిపోవటంతో అందరూ అక్కడకు అక్కడే చనిపోయరట. కోరంగిలో డబ్బుతో కూడిన ఇనుపపెట్టిని తీసుకువెళు*

తున్న ఇద్దరు కానిస్టేబుళ్ళు *గాలికి కొట్టుకుపోయారు. డబ్బుపెట్టె దొరికింది కానీ కానిస్టేబుళ్ల శవాలు కూడా లభ్యం కాలేదు. యానాం సమీపంలో కల మల్లవరం గ్రామంలో మొత్తానికి తుఫాను తరువాత 19 మంది మాత్రమే మిగిలారు.....* అంటూ సాగిన రెండవ ఉత్తరంలోని విషయాలు కొంత అతిశయోక్తిగా అనిపించినా (లేదా అప్పుడు వచ్చింది సునామీ అయినా కావొచ్చు-రచయిత) ఫ్రెంచి ప్రభుత్వం యానానికి 1840 లో 45 వేల ఫ్రాంకులను ప్రత్యేకంగా మంజూరు చేయటానికి దోహదపడ్డాయనే చెప్పుకోవచ్చు. ఆనాటి యానాం 6829 మంది జనాభాతో 18,500 ఫ్రాంకుల వార్షికాదాయాన్ని కలిగిఉంది.

తుఫాను ముగిసిన వెంటనే పునర్నిర్మాణ పనులకు 4644 ఫ్రాంకులు, ఫస్ట్ ఎయిడ్ కొరకు 5000 ఫ్రాంకులు, ప్రజలకు తక్షణ ఆర్ధిక సహాయం క్రింద 7776 ఫ్రాంకులు మొత్తం 23,680 ఫ్రాంకులను ఫ్రెంచి ప్రభుత్వం ఖర్చుచేసింది. (రైతులు కట్టాల్సిన ఆరువేల ఫ్రాంకుల మేర శిస్తు బకాయిల రద్దు కూడా కలిపి).

తక్షణ సహాయం పొందిన ప్రభుత్వోద్యోగుల వివరాలు ఈ విధంగా ఉన్నాయి. పెద్దొర 4 వేల ఫ్రాంకులు, లేఖరి 250 ఫ్రాంకులు, చర్చి ఫాదరు 100 ఫ్రాంకులు, పోలీసులు 504 ఫ్రాంకులు చొప్పున సైక్లోన్ రిలీఫ్ సహాయాన్ని పొందారు. తుఫాను ముగిసిన మరునాడే స్థానిక యంత్రాంగం, 32 చర్మకార కుటుంబాలకు కుటుంబానికి మూడురూపాయిల రెండు అణాల చొప్పున వందరూపాయిలను (250 ఫ్రాంకులు) తక్షణ సహాయంగా అందించింది.

ఇది కాక ఇతర 384 కుటుంబాలకు కూడా మూడు రూపాయిల రెండు అణాల చొప్పున మొత్తం 2880 ఫ్రాంకులను అందచేయటం జరిగింది. ఈ మూడు రూపాయిల రెండు అణాలు అనేది (ఏడు ఫ్రాంకుల అరవైసెంట్లు) అప్పట్లో ఓ కూలివాని నెలసరి సంపాదనతో సమానం. (రి. Pondy, Sessions of CP, India V.70)

1839 నాటి తుఫాను యానాన్ని అతలాకుతలం చేయటమే కాక అప్పటివరకూ యానాంలో ఉన్న జనన మరణ రిజిస్టరులు, కోర్టు రికార్డులను, పాతఫైళ్ళను సర్వనాశనం చేసేసింది. 1839, డిశంబరు, 12 న జారీ చేసిన ఓ ఆర్డరు ప్రకారం సివిల్ రికార్డులను స్థానిక ఎంక్వయిరీల ఆధారంగా తిరిగివ్రాయటం జరిగింది.

మొత్తం మీద ఈ తుఫాను వల్ల యానానికి జరిగిన మేలొకటి ఏమిటంటే, 1834 లో మొదలై నిధుల కొరతతో నత్తనడకన సాగుతున్న యానాం పాంచాల గట్టు నిర్మాణం ఊపందుకొని 1842 కల్లా పూర్తయింది. దీని వల్లే ఆ తరువాత 1849, 1861 లలో వచ్చిన వరదలకు యానాం ఊరు మునగకుండా ఉంది.

ఆ తరువాత చెప్పుకోదగిన నష్టం కలిగించిన మరో తుఫాను 1946 లో వచ్చింది.



ఫ్రెంచి పాలనలో యానాం

## కరువు కాటకాలు

1832 మేలో వచ్చిన సైక్లోనుకు ఉప్పునీరు యానాం పంటభూములను ముంచెత్తటంతో అవి చాలా కాలం వరకూ సేద్యానికి పనికి రాకుండా అయ్యాయి. ఈ కారణంగా 1833 లో ఆహారధాన్యాలకు తీవ్రమైన కొరత ఏర్పడింది. అప్పటి యానాం పెద్దొర జోర్డైన్ యానాంలో నెలకొన్న దుర్భిక్ష పరిస్థితులపై పాండిచేరీకి నివేదించినా పెద్దగా ప్రతిస్పందన రాలేదు (అక్కడ కూడా దాదాపు ఇదే పరిస్థితి నెలకొని ఉండటం వలన).

యానాంలో పండే పంటలు ఇక్కడి అవసరాలకు సరిపోవు కనుక సమీప ప్రాంతాలనుంచి ఆహారధాన్యాలను దిగుమతి చేసుకోవలసి వచ్చేది. అప్పట్లో పొరుగున ఉన్న బ్రిటిష్ ప్రాంతం నుండి నిత్యావసర వస్తువులు యానాంలోకి రావాలంటే సుమారు 20 నుంచి 30 శాతం టాక్సును బ్రిటిష్ ప్రభుత్వం వసూలు చేసేది. యానాం పెద్దొర బ్రిటిష్ అధికారులతో సంప్రదించి స్థానిక పరిస్థితులను వివరించి ఈ టాక్సును నవంబరు 1833 వరకూ లేకుండా అనుమతులు పొందాడు. దరిమిలా చుట్టు పక్కల ప్రాంతాల నుండి ఆహారధాన్యాలను దిగుమతి చేసుకొని యానాం ఈ కరువునుండి గట్టెక్కగలిగింది. (రి. Pondy, 23 February, 1833, Letter of De Melay (ఫ్రెంచి గవర్నరు) to Jourdain COR.GLE, India V.31)

అయినప్పటికీ యానాంలో 1833 లో 520 చావులు నమోదయ్యాయి. (ఆ రోజుల్లో సహజ మరణాలు సగటున 100 లోపే, ఆ పైవన్నీ ఆకలి చావులే).

ఈ కరువు ఎంత తీవ్రంగా వచ్చిందంటే జనాలకు తినటానికి ఎక్కడా తిండి దొరక్క బాగా సన్నబడి శరీరంలో కండ మొత్తం పోయి డొక్కలు మాత్రమే కనబడేవట. ఇలా అందరికీ డొక్కలు (ఎముకలు) మాత్రమే కనపడటం వలన దీనిని "డొక్కల కరువు" అని చరిత్రకారులు వర్ణించారు. ఆ సమయంలో గోదావరి జిల్లాల నుంచి చెన్నై వెళ్ళే రహదారిపైన బోలెడన్ని శవాలు పడి ఉండేవట.(అప్పటికి కాటన్ మహాశయుడు ఆనకట్ట కట్టలేదు). అలాంటి పరిస్థితులలో యానాంలో సుమారు నాలుగువందలకు పైగా ఆకలి చావులు నమోదయ్యాయి.

ఫ్రెంచి గవర్నర్ దె మెలే, సెప్టెంబరు 1833 లో యానాం పెద్దొరకు వ్రాసిన ఓ లేఖలో *"పోయిన వేసవి గాడ్పులకు ఆ తరువాత తాండవించిన తీవ్ర కరువుకు పాడయిన మీ ఆరోగ్యం ప్రస్తుతం కుదుట పడుతున్నదని ఆశిస్తున్నాను"* అని పేర్కొన్నాడు. యానానికి అత్యంత ముఖ్యమైన వ్యక్తి అయిన పెద్దొరే కరువు బారిన పడ్డాడంటే కరువు తీవ్రతను అర్థం చేసుకొనవచ్చును.

మరలా అయిదేళ్ల తరువాత 1838 లో మరొక కరువు యానాన్ని తాకి తీవ్ర నష్టాన్ని కలిగించింది. 1838 నవంబరు, 17 న యానాం పెద్దొర Bernard, ఫ్రెంచి గవర్నరుకు వ్రాసిన ఓ లేఖలో *''ఎనిమిది నెలలుగా యానాంలో వానలు రాక పంటలు నాశనం అయ్యాయని, యానాం రైతులు శిస్తులు చెల్లించలేని పరిస్థితే కాక వారు తమను తాము పోషించుకోలేని దీన స్థితిలో ఉన్నారనీ, ఇప్పటికీ ప్రజలు అవసరార్థం బియ్యాన్ని దిగుమతి చేసుకోవలసి వస్తుందనీ, చాలామంది ఈ దుర్భిక్షం కారణంగా ఒక పూట మాత్రమే తింటున్నారనీ"* అంటూ ఇక్కడి పరిస్థితిని చాలా దయనీయంగా వర్ణించాడు.

1858, 1859, 1860 లలో అనావృష్టి వల్ల 1861 లో వరదల వల్లా వరుసగా నాలుగు సంవత్సరాలపాటు యానాం అతలాకుతలం అయ్యింది. ఈ కాలంలో వానలు పడక కాలువలు చెరువులు ఎండిపోయాయి. పశువులకు తాగటానికి నీరులేక ఉప్పునీటినే తాగవలసివచ్చేది. అంతే కాక పశువులలో దొమ్మరోగం ప్రబలటంతో అధిక సంఖ్యలో పశు సంపద నశించింది.

| సంవత్సరం | వరి దిగుబడి కేజీలలో | పప్పుధాన్యాలు కేజీలలో | పశువుల సంఖ్య |
|---|---|---|---|
| 1858 | 3,91,681 | 90,720 | 1.351 |
| 1859 | 2,700 | 24,100 | 1,499 |
| 1860 | 24,100 | 24,100 | 1,180 |
| 1861 | 14,200 | -- | 329 |

1858 లో సుమారు నాలుగువందల టన్నులున్న వరి పంట దిగుబడి రెండున్నర టన్నులకు పడిపోవటం, తొంభైటన్నులుండే పప్పుధాన్యాల దిగుబడి 1861 లో అసలు లేక పోవటం, 1859 లో సుమారు పదిహేను వందలున్న పశుసంపద 1861 నాటికి మూడువందలకు పడిపోవటం గమనించినట్లయితే ఆ కాలంలో యానాం అనుభవించిన కరువు తీవ్రత తెలుస్తుంది. 1866 లో బ్రిటిష్ టెరిటరీలో వచ్చిన "పెద్ద కరువు" ఒరిస్సా, బెంగాల్ ప్రాంతాలలో సుమారు 25 శాతం జనాభాను తుడిచిపెట్టేసింది. కానీ యానాంలో అంతటి తీవ్రత కనిపించదు. "బహుసా గోదావరి నదీ సమీపాన ఈ ప్రాంతం ఉండటం వలన తప్పించుకొని ఉండొచ్చు" అని ఫ్రెంచి గవర్నర్ 1866 ఆగస్టు 27 న వ్రాసిన ఓ లేఖలో ప్రస్తావించాడు. అంతే కాక అప్పటికి ధవళేశ్వరం ఆనకట్ట నిర్మాణం పూర్తయి గోదావరి జిల్లాల సస్యశ్యామలీకరణ ప్రారంభమైన రోజులవి.

ఆ తదుపరి కాలాలలో ప్రస్తావించ దగ్గ కరువులు యానాన్ని తాకినట్టు తెలియరాదు.

### అంటురోగాలు

మూఢనమ్మకాలు, అపరిశుభ్రతల కారణంగా అంటురోగాలు ప్రబలి అనేకమంది చని పోవటం అనాదిగా జరిగే విషయమే. ఫ్రెంచి పాలనలోని యానాం దీనికి మినహాయింపేమీ కాదు.

1824 ఆగస్టు, 17 న యానాం పెద్దొర అయిన Mr. De Courson (యానాంలోని కురసాంపేట గ్రామనామం ఈయనదే), ఫ్రెంచి గవర్నర్ డూపయ్ కు వ్రాసిన ఓ లేఖలో యానాంలో విజృంభించిన కలరా రోగం గురించిన ప్రస్తావన ఉంది. ఈ లేఖలో కలరా మరలా విజృంభించిందనటాన్ని బట్టి 1824 కు పూర్వమే యానాంలో కలరా వ్యాధి వచ్చిందనుకోవాలి. కలరా కారణంగా ప్రతీరోజూ అనేక మంది ప్రజలు చనిపోతున్నారని







కుర్సన్ పేర్కొన్నాడు. యానాంలోని బాధిత ప్రజలకు ఉచిత బియ్యం పంపిణీ కొరకు నెలకు వంద ఫ్రాంకుల ఆర్ధిక సహాయాన్ని కోరగా గవర్నరుగారు మంజూరు చేయటం జరిగింది. (Yanam, 17 August 1824, Letters of Mr. De Courson to Compte Dupuy, Civil Governor, mentioned in the Session of Colonial Asembly)

అలా గ్రాంటుచేయబడిన ధనంతో స్థానిక ప్రభుత్వం రోజుకు 150 నుంచి 200 మంది తిండిలేక అల్లాడుతున్న బాధిత ప్రజలకు ఉచిత బియ్యం పంపిణీ చేసేది. ఈ సహాయం 1826 లో నిలుపుచేయబడింది.

1820 లో గతించిన యానాం సర్జన్ చార్లెస్ పిథోస్ యొక్క కుమారుడు ఈ కలరా రోగులకు ఎంతో అంకిత భావంతో, నిస్వార్ధంగా వైద్యం చేసి పలువురి మన్ననలు పొందాడు. 1848 లో మళ్ళా కలరా చెలరేగింది. అప్పటి యానాం చర్చి ఫాదర్ డ్యూపాంట్ కలరా వ్యాధిగ్రస్తులకు ఎనలేని సేవలు చేసి ప్రజలలో మంచి పేరు తెచ్చుకొన్నాడు. ఆ తరువాత 1865 లో కూడా కొన్ని కలరా కేసులు నమోదయ్యాయి. ఆ తరువాత మరలా కలరా వచ్చినట్లు రికార్డులలో కనిపించదు.

ఇరవయ్య శతాబ్ద ప్రారంభంలో మశూచి, మలేరియాల కారణంగా మరణాలు ఎక్కువగా జరిగేవి. మశూచి కారణంగా ప్రతీ ఏటా అనేక మంది చనిపోతూండటంతో, ఫ్రెంచి ప్రభుత్వం 1903 లో యానాం ప్రజలందరికీ మశూచి టీకాలను వేయించింది.

### ముగింపు

ప్రకృతి భీభత్సాలకు రాజు పేద తేడా ఉండదు. అందుకనే ఓ పెద్దొర తన బంగ్లా వదిలి తలదాచుకోవటానికి మన్యవారి మేడలోకి వెళ్ళవలసి వచ్చింది. మరో పెద్దొర కరువు బారినపడి ఆరోగ్యాన్ని కోల్పోయాడు. ప్రకృతి వైపరీత్యాల సమయాలలో మానవత్వం పరిమళిస్తూంటుంది. పొరుగున ఉన్న బ్రిటిష్ యంత్రాంగం ఫ్రెంచి వారి పట్ల తమకున్న రాగ ద్వేషాలను పక్కనపెట్టి ఆయా సందర్భాలలో తక్షణ సహాయం చేయటానికి ముందుకొచ్చేది. ఆ తరువాత పాండిచేరీలో ఉండే ఫ్రెంచి ప్రభుత్వం రంగంలోకి దిగి ప్రజలకు అన్ని విధాల సహాయ, సహకారాలను అందించేది. పునర్నిర్మాణంలో పాలు పంచుకొనేది. నష్టపరిహారాల్ని ఇచ్చేది. ఏటిగట్లు పటిష్టపరచటం, పాడయిన రోడ్లు తిరిగివేయటం వంటి పనులను చేపట్టి నష్టాన్ని నివారించటానికి ఫ్రెంచిప్రభుత్వం తన వంతు పాత్రను సమర్ధవంతంగానే నిర్వహించిందని భావించాలి.

# సామాజిక సంస్థలు

వ్యవస్థీకృత సమాజంలో కొన్ని వర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తూ కొన్ని సంస్థలు ఏర్పడటం సమాజ మౌలిక లక్షణం. దీనికి యానాం మినహాయింపు కాలేదు. హిందూ సమాజంలో ప్రతీ కులానికి ఒక పెద్ద ఉంటూ ఆ కులాచారాలు అమలయ్యేలా చూడటం, ఆర్థికంగా చితికిపోయిన వాళ్ళవారికి చేయూత నివ్వటం అనేది అనాదిగా వస్తున్న ఆచారమే. ఆధునిక యుగంలో విద్యావంతులైన కొంతమంది మేధావుల చొరవతో స్వచ్ఛంద సేవా సంస్థలు ఏర్పడ్డాయి. ఇవి సమాజాన్నంతటినీ అక్కున చేర్చుకొని సేవలందించాయి. ఫ్రెంచిపాలనలో యానాంలో అలా కొన్ని సంస్థలు ఏర్పడి దీన జనోద్ధరణ, విద్యావ్యాప్తి, రాజకీయ చైతన్యాన్ని కలిగించటం వంటి వివిధ రకాల సేవలందించాయి.

## యాక్టివ్ సిటిజన్స్ అసెంబ్లీ

సొన్నరెట్ యానాం పెద్దొరగా ఉన్న సమయంలో యానాంలోని కొంతమంది ఫ్రెంచి దేశస్థులు 1791 ఆగస్టు, 15 న Active citizens Assembly పేరిట ఒక కూటమిని ఏర్పాటు చేసుకొన్నారు. దీనికి Mariette నాయకత్వం వహించగా Lacanne సెక్రటరీగాను, Sauvaget, Faure, Audet, Pithois వంటివారు మెంబర్లుగా ఉన్నారు. ఈ కూటమి ప్రధానోద్దేశం సొన్నరెట్ అధికారాలకు అడ్డుకట్టవేయటమే. ఈ కూటమి గవర్నరుకు చేసిన అనేక పిర్యాదుల ఫలితంగా సొన్నరెట్ వ్యవహార శైలిపై ఫ్రెంచి ప్రభుత్వం విచారణ జరపటాన్ని బట్టి ఈ కూటమి ఉద్దేశాలు నెరవేరాయనే భావించాలి. (ఈ సంస్థ గురించి మరింత సమాచారం ఇదే పుస్తకంలో మరో చాప్టరులో చదువగలరు-రచయిత)

దీని ఏర్పాటు వెనుక రాజకీయ కారణాలున్నప్పటికీ ఫ్రెంచియానాంలో ప్రజాస్వామికంగా ఏర్పాటయిన మొదటి అసోసియేషను మాత్రం ఇదే. ఈ సంస్థ ద్వారా సామాజిక కార్యక్రమాలు జరిపిన దాఖలాలు కనపడవు.





## కమిటీ ఆఫ్ చారిటీ

యానాం చర్చికి వచ్చే రాబడిని సమాజసేవకు వినియోగించటానికి 1850 ల ప్రాంతంలో Committee of Charity పేరుతో ఒక కమిటీ పనిచేసేది. దీనికి అధ్యక్షున్నిగా పెద్దొర, సభ్యులుగా చర్చి ఫాదరు, పోలీసు ఉన్నతాధికారి, వైద్యాధికారు లు వ్యవహరించేవారు. దీని ద్వారా చర్చి ఆదాయాన్ని సమాజంలో నిరుపేదలకు, వికలాంగులకు పంచేవారు.

## మిషనరీ స్కూళ్ళు

Sisters of Saint-Joseph of Lyon సంస్థ తరపున 1849 లో నలుగురు కన్యస్త్రీలు/సిస్టర్స్ యానాంలో నాలుగు స్కూళ్ళను నడిపి కుల మతాలకు అతీతంగా విద్యావ్యాప్తికి ఎంతో కృషిచేసారు.

## సర్కిల్ దె యానాం

ఫ్రెంచి భాషా సంస్కృతులను పెంపొందించటానికి ప్రభుత్వం 1894 లో పాండిచేరీలో Alliance Francaise అనే సంస్థను స్థాపించింది. కాల క్రమేణా తన ఇతర కాలనీలలో కూడా వివిధ సంస్థలను ఏర్పాటుచేసి ప్రజలకు సాంస్కృతికంగా చేరువవ్వటానికి ప్రయత్నించింది. దానిలో భాగంగా యానాంలో 1909 అక్టోబరు,11న Cercle Litteraire et Sportif de Yanaon ను స్థాపించింది. దీనిని స్థానికులు 'సర్కిల్ దె యానాం' అని పిలుచుకొంటారు. దీని ఆధ్వర్యంలో ఫ్రెంచి జాతీయ ఉత్సవాలు జరిగేవి. ఫ్రెంచి భాషాభివృద్ధికి ఈ సంస్థ కృషి చేసేది. ఈ సంస్థ భవనంలో కారమ్స్, చెస్, టేబుల్ టెన్నిస్ వంటి ఇండోర్ గేమ్స్ ఆడేవారు.

## దీనపోషక సమాజం

దళితుల అభ్యున్నతికొరకు 1931 లో దీనపోషక సమాజం స్థాపించబడింది. వాస్తవానికి దీనపోషక సమాజ ఆవిర్భావం రంగూన్ లో జరిగింది. బ్రతుకు తెరువుకోసం రంగూన్ వెళ్ళిన కొందరు యానాం వాసులు తెలుగు సంస్కృతిని పరిరక్షించు కొనేందుకు, ఐక్యంగా ఉండేందుకు 1908 డిశంబరు, 2న మొసలి వెంకటస్వామి ఆధ్వర్యంలో దీనపోషక సమాజాన్ని స్థాపించుకొన్నారు. వీరు యానాం వచ్చిన తరువాత కూడా ఈ సంస్థను అదే పేరుతో కొనసాగించారు. దీని ద్వారా యానాంలో మాత్రమే కాక చుట్టు పక్కల గ్రామాల్లో కూడా దళిత జనోద్ధరణ జరిపేవారు. ఈ సంఘసభ్యులు ప్రాత:కాలంలో గ్రామాలలో దళిత చైతన్యగీతాలను



శ్రీ మొసలి వెంకట స్వామి

ఆలపించే "భూపాలం" అనే కార్యక్రమాన్ని నిర్వహించి విశేషసేవలను అందించారు. కె. రామన్న, దున్నా వెంకటరత్నం, దున్నా నాగారావు, దడాల రఫేల్ రమణయ్య, పంతగడ భైరవమూర్తి, గుర్రపు వెంకటరత్నం వంటివారు ఈ సమాజంలో సభ్యులుగా పనిచేసారు. (రి. యానాం దీనజన సేవలో.... శిఖామణి 21-12-2008 ఆంధ్రజ్యోతి దినపత్రిక).

బెజవాడ బాపన్నాయుడు, సమతం కృష్ణయ్య వంటి అప్పటి ప్రముఖనాయకులు ఈ సమాజానికి తమ అండదండలు అందించేవారు. 1936 జనవరి, 26 న ఈ సమాజం నిర్వహించిన ఓ మీటింగులో 'దీన జనుల ఉద్ధరణకు, దళితుల విద్యాభివృద్ధికి దీనపోషక సమాజం చేస్తున్న సేవలు అనన్యమైనవని' వారు వేనోళ్ళ కొనియాడారు. దీన పోషక సమాజ ఆధ్వర్యంలో యానాం అంబేద్కర్ నగర్ లో ఒక పాఠశాల నడిచేది. కాశి రామన్న, మద్దాల వెంకటరెడ్డి, దున్నా కుటుంబీకులు తదితరులు దీని నిర్వహణను చూసేవారు.

1950లో దీనపోషక సమాజ నూతన భవన నిర్మాణం జరిగింది. అందుకొరకు ఫ్రెంచి ప్రభుత్వం రెండువేల రూపాయిలు ఇవ్వగా మిగిలిన సొమ్మును విరాళముల ద్వారా సమకూర్చుకోవటం జరిగింది. (రి. శ్రీ పొనుగుమట్ల విష్ణుమూర్తి గారు ప్రచురించిన "ప్రభోదిని" అనే పుస్తకం. ఈ పుస్తకంలో దీనపోషక సమాజ వందేళ్ల చరిత్ర దాని నిర్మాణానికి, నిర్వహణకు కృషిచేసిన వారి వివరాలు అనేకం ఉన్నాయి. -రచయిత)

**ఆంధ్రయువజన మండలి**

1944 సెప్టెంబరు, 8 న గిరి లక్ష్మినారాయణ అధ్యక్ష్యతన "ఆంధ్రయువజన మండలి" పేరుతో ఒక సంస్థ ప్రారంభించబడింది. ఈ సంస్థ యానాం ప్రజల సాంస్కృతిక వికాసం మరియు విద్యాభివృద్ధికి కృషిచేసేది. అప్పటి యానాం వాసులందరూ ఫ్రెంచి పౌరులైనప్పటికీ ఈ సంస్థ పేరులో ఆంధ్ర శబ్ధం ఉండటాన్ని బట్టి ఇక్కడి ప్రజలు పొరుగునున్న ఆంధ్రప్రాంతంలో తమ సాంస్కృతిక మూలాలున్నాయన్న విషయాన్ని విస్మరించలేదనే భావించాలి.

**యంగ్మెన్స్ లైబ్రేరీ**

1944 లో మహేంద్రవాడ వీర గణపతి శాస్త్రులు, యలమర్తి విశ్వనాథంల ఆధ్వర్యంలో యంగ్మెన్స్ లైబ్రేరీ ప్రారంభించబడింది. దీనిలో వివిధ రకాల పుస్తకాలు ఉండి నిత్యం పాఠకులను ఆకర్షిస్తూండేది. ఈ సంస్థ తరపున యానాం విద్యార్ధులకు వ్యాసరచన, వక్తృత్వ, పద్యరచన పోటీలను నిర్వహించేవారు. యానానికి చెందిన పండితుడు, ప్రజా నాయకుడు శ్రీ సమతం కృష్ణయ్య ఈ సంస్థకు వెన్నుదన్నుగా ఉండేవారు.

**ముగింపు:** సామాజిక స్పృహ విషయంలో యానాం ముందంజ లోనే ఉన్నట్లు అప్పటి సంస్థల వివరాలను బట్టి తెలుస్తుంది. ఆనాటి సంస్థలోని దీనపోషక సమాజం ఈ మధ్యే శతవత్సర వేడుకలను జరుపుకొంది. యంగ్మెన్స్ లైబ్రేరీ, సర్కిల్ దె యానాం లు నేటికీ నడుస్తూనే ఉన్నాయి.







# ఫ్రెంచి యానాంలో జరిగిన బానిస వ్యాపారం

పంతొమ్మిదవ శతాబ్దం చివరవరకూ జరిగిన బానిస వ్యాపారం మానవజాతి ఎన్నటికీ చెరుపుకోలేని మరక. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే అంశాల ఆవశ్యకతను ప్రపంచానికి తెలియచెప్పిన ఫ్రాన్స్ ఒకానొక సమయంలో బానిస వ్యాపారంలో ప్రధాన పాత్ర వహించటం అశ్చర్యం కలిగించే విషయం. 1794 లోనే ఫ్రెంచి రిపబ్లిక్ బానిసవ్యాపారాన్ని నిషేధించింది. కానీ 1802 లో నెపోలియన్ ఆ నిషేదాన్ని ఎత్తివేసాడు. ఈ వెసులుబాటు వల్ల 1830 లో లూయిస్ ఫిలిప్ బానిస వ్యాపారాన్ని నేరమని చట్టం తీసుకువచ్చే వరకూ అది చట్టబద్దంగానే కొనసాగింది. ఇక అనధికారంగా 1850 ల వరకూ కూడా అక్కడక్కడా నడిచింది. బానిస వ్యాపారాన్ని 1772 లోనే ఇంగ్లాండ్ నిషేదించి ఫ్రాన్స్ కంటే ముందుండటం గమనార్హం. ఈ విషయంలో ఫ్రెంచి వారిపై బ్రిటిష్ వారు ఆ కాలంలో ఒక విధమైన **మోరల్ పోలీసింగ్** పాత్రను పోషించారు.

ఫ్రాన్స్ కు స్థానికంగా ఈ అనాగరికమైన బానిస వ్యాపారం పట్ల ఎంతో వ్యతిరేకత ఉన్నప్పటికీ దానిని నిషేదించలేకపోవటానికి ఫ్రెంచి కాలనీయైన రీయూనియన్ లో (మడగాస్కర్ సమీపంలో ఫ్రెంచివారు ఆక్రమించుకొన్న ఒక ద్వీపం) మంచి లాభాల్నిచ్చే చెరకుతోటల సాగుకు వేల సంఖ్యలో కూలీలు అవసరం కావటం, ఆ తోటలు సమకూర్చే ఆర్ధికవనరులు ప్రత్యక్షంగానో పరోక్షంగానో సుమారు యాభైలక్షలమంది ఫ్రెంచి వారికి జీవనోపాధి కలిగించటం (1763 నాటికి) వంటివి ప్రధాన కారణాలు. అందుకనే ఫ్రెంచి ప్రభుత్వం బానిస వ్యాపారానికి సబ్సిడీలు ఇచ్చి మరీ ప్రోత్సహించవలసి వచ్చేది. ఈ కారణాల దృష్ట్యా, 1672 లో 10 లీవ్ర్ లు (లీవ్ర్ = ప్రాచీన ఫ్రెంచి కరెన్సీ. ఒక లీవ్ర్ సుమారు 450 గ్రాముల వెండి విలువతో సమానం) ఉండే ఒక బానిస వెల 1730 లో 100 లీవ్ర్‌లకు, 1787 నాటికి 160 లీవ్ర్‌లకు క్రమంగా చేరింది.

ఫ్రెంచి వారు తమ బానిసలను మొదట్లో ఆఫ్రికా నుంచి సేకరణ జరిపినా కాలక్రమేణా ఇండియాలోని తమ కాలనీలనుంచి కూడా తరలించటం మొదలెట్టారు. 1760 లో ఏడాదికి

సగటున 56 షిప్పులలో బానిసల ఎగుమతి జరిగేది. ఒక్కో షిప్పు మూడు నుంచి నాలుగొందల మంది బానిసలు పట్టే సామర్థ్యం కలిగుండేవి. 1767 లో చక్కెర ఉత్పత్తిలో ఫ్రెంచి వారు ప్రపంచంలో అగ్రగామిగా నిలిచారు. రీయూనియన్ లో చెరకు తోటల్లో పనిచేసే బానిసల జీవనం కడు దయనీయంగా ఉండేది. వారు రోజుకు దాదాపు ఇరవై గంటలు పనిచేసేవారు. స్త్రీలు కొద్ది సంఖ్యలో ఉండేవారు. కుటుంబాలు ఉండేవి కావు. ఆ కారణాల వల్ల మరణ రేటు అధికంగా ఉండటంతో బానిసల కొరత నిరంతరం ఉండేది. బానిసలను చేరవేసే నౌకలకు Amity, Liberte వంటి గొప్ప పేర్లు ఉండటం దురదృష్టకరం.

యానాంలో ఫ్రెంచి వారు జరిపిన బానిస వ్యాపారానికి ఆధారాలు 1792 లో యానాం సమీపంలో కల ఇంజరం అనే గ్రామంలో నివసించే Mr. Yates అనే ఓ బ్రిటిషర్ పాండిచేరీలోని ఫ్రెంచి గవర్నర్ జనరల్ కి (Colo De Fresne) వ్రాసిన ఓ లేఖలో దొరుకుతాయి. (Ref. Asiatic Journal Vol. 26 No. 156 - printed in 1828, Chapter Slavery in India, Pages from 665 to 670)

**యేట్స్ ఎపిసోడ్** (1792): బానిసలను ఎక్కించుకొనే ఫ్రెంచి నౌకలు కోరంగి నుంచి బయలు దేరే తారీఖు దగ్గర పడేకొద్దీ బానిసలను సరఫరా చేసే మధ్యవర్తులు రకరకాల పద్దతులకు పాల్పడేవారు. కొంతకాలం క్రితం ఈ ప్రాంతంలో విపరీతమైన కరువు విలయతాండవం చేయటం వల్ల తిండిలేక చచ్చిపోవటం కంటే బానిసగా బతకటమే మేలనే ఉద్దేశ్యంతో ప్రజలుండేవారు. కానీ ప్రస్తుతం కొద్దో గొప్పో తిండి గింజలు దొరికే పరిస్థితి ఉండటం చే బానిసల సేకరణ ఫ్రెంచి వారికి కష్టమై హింసాత్మక పద్దతులకు పాల్పడటం మొదలెట్టారు. యానాం వీధులలో తిరిగే యాచకులను యానాంలో సరుకులు కొనుగోలు కోసం వచ్చిన ఇతర గ్రామస్తులను పట్టి బంధించి, రహస్య ప్రదేశాలకు తరలించి అక్కడి నుంచి రాత్రివేళలలో ఫ్రెంచి నౌకలలోకి ఎక్కించేవారు. ఈ వ్యక్తులను వారి కుటుంబాలనుంచి అతి కిరాతకంగా విడదీయటం అనేది ఆయా ఫ్రెంచి నౌకల యజమానుల కనుసన్నల్లో జరిగేది ......... అంటూ యేట్స్ యానాంలో ఫ్రెంచి వ్యాపారులు జరుపుతున్న బానిస వ్యాపారం గురించి తన లేఖలో పేర్కొన్నాడు.

ఈ అభియోగాలను సమర్థిస్తూ అయిదుగురు ఇంజరం వాస్తవ్యులు లిఖిత పూర్వకంగా ధృవీకరించారు. వీరిలో బొండాడ వెంకటరాయలు అనే ఓ వైశ్యుడు వ్రాసిన మరో లేఖ ఈ ఉదంతం పై మరింత వెలుగును ప్రసరింపచేస్తుంది.

బొండాడ వెంకటరాయలు ఫ్రెంచి ఈస్ట్ ఇండియా కంపెనీచే గుర్తింపు పొందిన ఒక యానాం వ్యాపారి. ఈయన తన ఉత్తరంలో...... *M. de Mars, M. La Blanche* మరియు *M. Ellardine అనే ముగ్గురు ఫ్రెంచి నౌకయజమానులు బానిసలను కొనుగోలు చేయటానికి మధ్యవర్తులను ఏర్పాటుచేసుకొని వారి ద్వారా యానాంలోని ముష్టివారిని, పొరుగూరి వారిని బలవంతంగా నిర్బంధించి కోరంగి రేవులో నిలిపిన వారి నౌకలలోకి ఎగుమతి చేయిస్తున్నారని– అంతే కాక యానాం చుట్టుపక్కల గ్రామాలకు మనుషులను పంపించి అక్కడి కూలీలకు, దర్జీలకు పని ఇప్పిస్తామని నమ్మబలికి వారిని యానాం తీసుకువచ్చి బంధించి రాత్రివేళలలో ఎవరికీ తెలియకుండా నౌకలలోకి తరలిస్తున్నారనీ– ప్రతిఘటించేవారి నోటిలో గుడ్డలు కుక్కి లేదా సారాయిని బలవంతంగా తాగించి ఆ నిస్సహాయ స్థితిలో వారిని నౌకలోకి మోసుకుపోవటం జరుగుందనీ* .......అంటూ బొండాడ వెంకటరాయలు తన లేఖలో ఆనాటి సంఘటనలను వర్ణించాడు.

ఆతేరు గ్రామానికి చెందిన ఒక బ్రాహ్మల అబ్బాయిని, నీలపల్లి కి చెందిన ఒక భోగం పిల్లని ఏ ఊరో తెలియని ఓ బ్రాహ్మణ అమ్మాయిని కూడా ఈ విధంగానే కిడ్నాప్ చేసి నౌకలోకి తరలించారు. ఈ ముగ్గురి విషయం తన మిత్రుల ద్వారా తెలుసుకొన్న యానాం పెద్దొర (సొన్నరెట్) ఆ నౌక కెప్టెన్ కు ఆదేశాలు జారీ చేసి వారిని విడుదల చేయించాడు.
అలా ఆ ఫ్రెంచి నౌక ఎక్కి తిరిగొచ్చిన ఆ ముగ్గురూ, ఆ నౌకలో అనేక మంది కూలీలు, కుటుంబ స్త్రీలు, కొద్దిమంది బ్రాహ్మణులు ఉన్నారని చెప్పటంతో ఆగ్రహించిన స్థానికులు, ఆ మిగిలిన వారిని కూడా విడిపించమని సొన్నరెట్ ను అడిగారు. కానీ సొన్నరెట్ ఏ రకమైన హామీ ఇవ్వకపోవటం, నౌక బయలుదేరే తారీఖు దగ్గరపడుతూండటంతో వారంతా పొరుగునే ఉన్న బ్రిటిష్ అధికారులను ఆశ్రయించారు.

ప్రజల వద్దనుండి వచ్చిన విజ్ఞప్తులపై విచారణ నిమిత్తం యేట్స్ యానాం వెళ్లగా, చాలామంది యానాం ప్రజలు ఆయనను చుట్టు ముట్టి సుమారు మూడువందలకు పైగా వారి బంధువులను ఎత్తుకుపోయారని గగ్గోలు పెడుతూ తమ గోడును వెళ్ళబోసుకొన్నారు. చిన్న పిల్లలను కూడా విడిచిపెట్టలేదని కన్నీరు మున్నీరై వారు విలపించారు. ఈ మొత్తం ఉదంతంపై సొన్నరెట్ ను వివరణ కోరగా అలాంటిదేమీ లేదని మొదట్లో వాదించి, చివరకు కావాలంటే నౌకను తనిఖీ చేసుకోవచ్చునని అనుమతినిచ్చాడు. దరిమిలా ఒక ఫ్రెంచి అధికారి, స్కోబీ అనే ఒక ఇంగ్లీషు అధికారి పర్యవేక్షణలో ఒక కమిటీ ఏర్పడి నౌక తనిఖీ కి కోరంగి వెళ్ళారు. కానీ నౌక కెప్టెన్ వీరిని నౌక లోపలకు రాకుండా అడ్డుకొని ఏ విధమైన వివరణలు ఇవ్వకుండా కమిటీని వెనక్కు పంపించేసి కోరంగి రేవునుండి నౌకతో సహా జారుకొన్నాడు.

యానాం పెద్దొర తన విచక్షణాధికారాలను ఉపయోగించి నౌకను నిలుపు చేసి ఉన్నట్లయితే ఆ స్థానికుల తరలింపు నివారింపబడి ఉండేదని యేట్స్, Major Wynch అనే మరో బ్రిటిష్ అధికారికి వ్రాసిన ఒక లేఖలో పేర్కొన్నాడు.

పాండిచేరిలోని ఫ్రెంచి గవర్నరు (M.De Fresne) ఈ విషయాలనన్నీ బ్రిటిష్ గవర్నర్ జనరల్ Lord (Cornwallis) ద్వారా తెలుసుకొని ఇలాంటి వ్యవహారాలకు పాల్పడే వారిని అరెస్టు చేసి పాండిచేరీ పంపవలసినదిగా ఆదేశాలు జారీచేసాడు. అంతే కాక వీటిని నియంత్రించలేని తన నిస్సహాయతను కూడా తెలియచేసాడు. (సరైన పర్యవేక్షణా యంత్రాంగం లేకపోవటం

వల్ల) అలాంటి అనుమతుల కోసమే ఎదురుచూస్తున్న బ్రిటిష్ ప్రభుత్వం వెంటనే కోరంగి, భీమిలిపట్నం ల వద్ద సిపాయిలను నియమించి తీర ప్రాంతంలో ఫ్రెంచి వారు జరిపే దారుణ బానిస వ్యాపారం అరికట్టటానికి పూనుకొంది.

యానాం పెద్దొర సొన్నరెట్ మాత్రం ఒక లేఖలో “ఇంగ్లీషువారు కూడా ఈ బానిస వ్యాపారంలో ఉన్నారనీ, ఒకసారి ఇంగ్లీషునౌకలో బానిసలుగా తరలింపబడుతున్న 12 మంది యానాం వాసులను తాను విడిపించానని” చెప్పటం ఈ మొత్తం ఉదంతానికి కొసమెరుపు. 1793 నుండి 1816 వరకూ యానాం బ్రిటిష్ వారి ఆధీనంలో ఉండటం వల్ల ఆ కాలంలో యానాంలో జరిగిన విషయాలు తెలియరావు.

ఫ్రెంచి వారు చేసే ఈ బానిస వ్యాపారంపై బ్రిటిష్ వారి పహారా ఎంతెలా ఉండేదో 1820 లో జరిగిన ఒక సంఘటన తెలియచేస్తుంది.
La Jeune Estele అనే ఫ్రెంచి నౌకను బ్రిటిష్ పడవలు వెంబడించగా ఆ నౌక కెప్టెన్ కొన్ని పీపాలను సముద్రంలోకి విసిరేయటం మొదలెట్టాడు. అలా విసిరేసిన ఒక్కో పీపాలో 12 నుండి 14 సంవత్సరముల వయసు కలిగిన బానిసలు ఉండటం పట్ల యావత్ప్రపంచం నివ్వెరబోయింది. ఈ సంఘటన తరువాత ఫ్రెంచి నౌకలపై బ్రిటిష్ వారి కాపలా మరింత ఉధృతమైంది. అయినప్పటికీ ఈ కాలంలో 3211 మంది కూలీలను పంతొమ్మిది నౌకలలో యానాం నుంచి రీయూనియన్ కు పంపించటం జరిగింది. వీరిలో అధికశాతం ఇంగ్లీషు టెరిటరీనుంచి సమీకరించటం గమనార్హం. (Article of Mr. Jacques Weber - L'emigration Indeienne vers les colonies francaises)

ఇలాంటి ప్రతికూల పరిస్థితుల నడుమ ఫ్రెంచి ప్రభుత్వం పాత పద్దతులకు స్వస్థి పలికి కూలీల సేకరణ కొరకు కొత్త విధానాన్ని ప్రవేశపెట్టింది.

## యానాంలో కాంట్రాక్టు పద్దతిపై కూలీల ఎగుమతి

రీ యూనియన్ లోని చెరుకు తోటలలో పనిచేయటానికి కార్మికుల అవసరం రోజు రోజుకూ పెరగటం, ఇండియానుంచి కూలీలను తీసుకుపోవటానికి, పొరుగు రాజ్యాన్ని ఏలే బ్రిటిష్ వారు ఎక్కడికక్కడ అనేక ఆంక్షలు విధించటం వల్ల ఫ్రెంచి ప్రభుత్వం 1828 లో కాంట్రాక్టు పద్దతి ద్వారా కూలీలను రిక్రూట్ చేసుకోవటం మొదలెట్టింది. ఫ్రెంచి ప్రభుత్వం నియమించిన ఏజెంటుకు, పనిచేయటానికి ముందుకొచ్చిన కూలీకి మధ్య జరిగే కాంట్రాక్టులో ఈ క్రింది హామీలుండేవి.

1. కాంట్రాక్టు కాల పరిమితి మూడు సంవత్సరాలు
2. ప్రతి కూలీకి నెలకు 7 రూపాయిల జీతం ఇవ్వబడుతుంది.
3. తిండి, వసతి, ఆరోగ్య సదుపాయాలు కల్పించబడతాయి.







4. వారి వారి ఆచారాలను, మతపరమైన సాంప్రదాయాలను గౌరవించటం జరుగుతుంది.
5. రాను, పోను ఖర్చులను మరియు కాంట్రాక్టు ముగియక ముందే అనారోగ్య లేదా ఇతర కారణాల వల్ల స్వదేశానికి వెళ్లాలనుకొనేవారి తిరుగు ప్రయాణ ఖర్చులను కూడా యజమానే భరిస్తాడు.
6. ప్రతి కూలీకి ముందుగా మూడు నెలల జీతం అడ్వాన్సుగా ఇవ్వబడుతుంది.
7. పనిలో చేరాకా ఇచ్చే జీతంలో 3 రూపాయిలను కూలీ చేతికి, మిగిలిన 4 రూపాయిలు ఇక్కడ అతని కుటుంబ సభ్యులకు నెల నెలా అందించబడుతుంది.

కాంట్రాక్టు లోని చివరి రెండు హామీలకు యానాం వాసులే కాక పొరుగు ప్రాంతాల వారు కూడా ఆకర్షితులై అధిక సంఖ్యలో ముందుకొచ్చారు. ఆ విధంగా కాంట్రాక్టు కుదుర్చుకొన్న మొత్తం 268 మంది కార్మికులు 1829 ఆగస్టు, 7 న యానాం నుంచి రీయూనియన్ కు బయలు దేరారు. వారిలో 197 మంది దళితులు, 27 మంది ముస్లిములు, పదముగ్గురు చేనేత కార్మికులు, అయిదుగురు పల్లీయులు, ఇద్దరు అగ్రకులస్థులు (మిగిలిన వారి వివరాలు తెలియరావు) ఉన్నారు. (రి. Personal state of Indians embarking at Yanam for Bourbon from 16 March 1828 to 6 August 1829, COR.GLE, India V. 29).

అలా బోర్బన్ (రీయూనియన్) కు పంపించబడిన యానాం కూలీల కుటుంబాలకు నెల నెలా ఇచ్చే చెల్లింపులను రీయూనియన్ లోని వారి యజమాని అయిన Mr. Argand తరపున తాను చెల్లిస్తానని యానాంలో ఉండే ఫ్రెంచి ఏజన్సీ De Courson and Co వారు హామీ ఉన్నారు. మొదటి వాయిదా డిశంబరు 1829 నాటికి చెల్లించవలసి ఉంది. కానీ జనవరి వచ్చేసినా వారికి ఒక్క పైసా కూడా ముట్టలేదు. వారందరూ యానాం పెద్దొర అయిన Mr. De Lesparda వద్దకు వచ్చి విన్నవించుకొన్నారు. “అర్గాండ్ నుంచి మాకేమీ డబ్బులు ముట్టలేదు కనుక మేము వీరికి ఏ రకమైన చెల్లింపులు చేయలేము” అని కుర్సన్ అండ్ కో వారు చేతులెత్తేయటంతో– ఎనిమిదిరోజులుగా పస్తులతో పెద్దొర బంగ్లా వద్ద ఎదురుచూస్తున్న ఆ కూలీల కుటుంబాలకు యానాం పెద్దొరే, 1830 జనవరి, 17 నుంచి కొద్దిపాటి చెల్లింపు చేయటం మొదలెట్టాడు.

యానాంలో ఇలా ఉండగా, అక్కడ రీయూనియన్ లోని చెరుకు తోటలు ఆ సమయంలో భారీ నష్టాలను ఎదుర్కోవటంతో యానాం కూలీలు సంతృప్తికరంగా లేరనే సాకు చూపి తాము కుదుర్చుకొన్న ఆర్ధిక ఒప్పందాలు నెరవేర్చలేమని అక్కడి తోటల యజమానులు తెగేసి చెప్పి, వారిని తిరిగి ఇండియా పంపించివేసారు. ఆ విధంగా యానాంలో జరిగిన కాంట్రాక్టు కూలీల ఎగుమతి వ్యవహారం అర్ధాంతరంగా ముగిసిపోయింది. కాంట్రాక్టు పద్దతిలో కల ఆమోదయోగ్యమైన అంశాలకు ఆశ్చర్యపడిన బ్రిటిష్ వారు ఈ రకపు కూలీల తరలింపును ఏ విధంగానూ ఆటంక పరచలేకపోయారు. అయినప్పటికీ ఈ పద్దతి విజయం సాధించలేకపోవటం తో మరలా మరో ఇరవై ఏళ్ల వరకూ యానాం నుంచి ఏ విధమైన వలసలూ జరిగినట్లు తెలియరాదు.

## కూలీల సేకరణలో ఫ్రెంచి వారిపై బ్రిటిష్ వారి ఆంక్షలు

కాలక్రమేణా కూలీల సేకరణ, వారి తరలింపు అనేది అత్యంత లాభదాయకమైన వ్యాపారంగా మారటంతో పాండిచేరి, కారైకాల్ చాంబర్ ఆఫ్ కామర్స్ లలో ఇదొక ప్రధాన పాత్ర వహించటం మొదలైంది. ఫ్రెంచి ప్రభుత్వం కూడా "Society for Emigration" అనే సంస్థకు ఈ విషయంలో సర్వాధికారాలు కట్టబెట్టింది. ఈ సొసైటీ అధిపతి అయిన Jouls Bedier Priery ఈ వ్యాపారంలో విపరీతమైన లాభాలార్జించి అప్పటి ఫ్రెంచ్ ఇండియాలో అత్యంత ధనికుడిగా పేర్గాంచాడు. ఒకానొక దశలో పాండిచేరి, కారైకాల్ లలో కూలీలు ఇక దొరకని పరిస్థితి రావటంతో బెడియర్ కళ్లు యానాం పై పడ్డాయి. దరిమిలా బెడియర్ కోరిక మేరకు ఫ్రెంచి ప్రభుత్వం, యానాంలో కూలీల సేకరణ జరుపుకోవటానికి అనుమతినిస్తూ 1849 సెప్టెంబరు, 1న ఉత్తర్వులు జారీచేసి, అప్పటి యానాం పెద్దొర జోర్డైన్ కు రెండువేల పాస్‌పోర్టులను పంపించింది. (ఒక ఫ్రెంచి పౌరుడు విదేశాలకు వెళ్లటానికి పాస్‌పోర్టులు అవసరం) ( India card 464, D 591 and the article of Jaques Weber)

లె పికార్డ్ అనే ఫ్రెంచ్ నౌకలో బెడియర్ తన మందిమార్బలంతో 1849 సెప్టెంబరు, 11 న పాండిచేరీలో బయలుదేరి 14 సెప్టెంబరుకు యానాం చేరుకొన్నాడు. ఈ ప్రాంతమంతా ఘోరమైన వరదల వల్ల జనజీవనం అస్తవ్యస్థమై ఉండటం వల్ల వారికి కూలీల సేకరణ పెద్ద కష్టం కాలేదు. 30 సెప్టెంబరు కల్లా మొదటి దఫా కూలీల సేకరణ పూర్తయింది. వారికి (60 మంది) యానాం పెద్దొర జోర్డైన్ సంతకం చేసిన పాస్ పోర్టులు జారీ చేయబడ్డాయి. వీరందరినీ కోరింగి రేవులో ఫ్రాన్స్ జాతీయపతాకాన్ని అతిశయంతో రెపరెపలాడిస్తున్న తన నౌకలోకి చేరుస్తూండగా మొదలైంది అసలు కథ.

అక్టోబరు 1 న ఒక బ్రిటిష్ అధికారి ఓ కానిస్టేబుల్‌ని వెంటేసుకొని వచ్చి ఈ కూలీలు స్వచ్ఛందంగా వెళుతున్నారా లేక బలవంతంగా తరలించబడుతున్నారా అన్న విషయం తెలుసుకురమ్మని రాజమండ్రి కలక్టరు జారీ చేసిన ఒక ఉత్తర్వును చూపి, ఆ 60 మంది కూలీలను ఒక్కొక్కరినీ విచారించటం మొదలెట్టాడు. ఆ మరునాడు కలక్టరు ప్రెస్ డెర్గాస్ట్ గారే స్వయంగా వచ్చి కూలీలను ప్రశ్నించి వారందరూ "మేము ఇష్టపూర్వకంగానే వెళుతున్నామని" చెపుతున్నా సంతృప్తి చెందక, పౌరులకు కోరంగి రేవు నుండి విదేశాలకు వెళ్ళే అనుమతి లేదన్న కారణంచే బెడియర్ తో సహా అందరినీ జగన్నాయకపురం తరలించి అరెస్టు చేయించాడు. వీరందరూ 10 అక్టోబరు వరకూ కటకటాల వెనుకే ఉన్నారు.

అవమాన భారంతో పాండిచేరీకి వెనుదిరిగిన బెడియర్- ఫ్రెంచి ప్రభుత్వం కూలీలకు జారీచేసిన పాస్ పోర్టులను మరియు ఇతర చట్టపరమైన అనుమతులను బ్రిటిష్ కలక్టరు ఖాతరుచేయకపోవటం వల్ల తనకు జరిగిన ఆర్ధిక, పరువు నష్టాలకు 1,80,000 ఫ్రాంకుల







పరిహారాన్ని ఇప్పించమని ఫ్రెంచి ప్రభుత్వాన్ని కోరాడు. కోరంగి రేవును తటస్థ రేవుగా (బ్రిటిష్ మరియు ఫ్రెంచి నౌకల ప్రయాణానికి) ఉంచాలని పూర్వం ఫ్రెంచి మరియు బ్రిటిష్ వారు చేసుకొన్న ఒప్పందాలను బ్రిటిష్ వారు ఉల్లంఘించారని బెడియర్ ఆరోపించాడు. (దీనికి స్పందిస్తూ ఆ ఒప్పందాలేమిటి అని బ్రిటిష్ వారు అడిగినపుడు ఫ్రెంచి వారు ఏమీ చూపలేకపోవటం వల్ల కోరంగి రేవు పూర్తిగా బ్రిటిష్ వారి ఆధీనంలోకి పోవటం ఆ తరువాత జరిగిన ఒక దురదృష్టకర పరిణామం ఫ్రెంచివారికి సంబంధించి).

బెడియర్ వంటి పెద్ద వ్యాపారికే అంత అవమానం జరిగిన తరువాత పాండిచేరీలోని మరే ఇతర వర్తకులు యానాంలో కూలీల సేకరణ జరపటానికి మరో పదేళ్ల వరకూ సాహసించలేదు.

## బ్రిటిష్-ఫ్రెంచి ప్రభుత్వాల ఒప్పందం 1861

బెడియర్ అవమానోదంతం ఫ్రెంచి ప్రభుత్వాన్ని కుదిపివేసింది. ఫ్రెంచి రాజ్యానికి గౌరవభంగం జరిగినట్లు భావించింది. దీనితో ఫ్రెంచి వారు బ్రిటిష్ ప్రభుత్వంతో పై స్థాయిలో చర్చలు జరిపి 1861 జూలై, 1 న ఒక ఒప్పందాన్ని చేసుకొన్నారు. దీని ప్రకారం బ్రిటిష్ వారి అన్ని పోర్టుల నుంచీ ఫ్రెంచివారికి కూలీలను పంపించుకొనే అధికారం పొందింది. ఆ యా సెంటర్లలో ఒక బ్రిటిష్ అధికారి ఉండి కూలీలు స్వచ్ఛందంగా వెళుతున్నారా లేక బలవంతంగా తరలింపబడుతున్నారా అనే విషయాన్ని పర్యవేక్షిస్తూ ఉంటాడు. (రి. Year book of India 1866, Pondy, Govt.printing)

ఆ విధంగా 1861 నుంచి యానాంలో చట్టబద్దంగా కూలీల తరలింపుకు మరలా తెరలేచింది. 1861 నుండి 1870 మధ్య యానాం నుంచి సుమారు 3500 మంది కూలీలు రీయూనియన్ లోని చెరకు తోటలలో పనిచేయటానికి పంపించబడ్డారు. యానాం నుంచి బయలుదేరిన నౌకల కొన్నింటి వివరాలు ఇలా ఉన్నాయి.

| సంవత్సరం | నౌక పేరు | యానాం నుంచి బయలుదేరిన తేదీ | తీసుకెళ్లిన కూలీల సంఖ్య |
|---|---|---|---|
| 1862 | Jeanne Albert | డిసెంబర్ 1862 | 382 |
| 1863 | Suger | ఏప్రిల్ 1862 | 354 |
| ,, | Canova | ఆగస్టు 1863 | 421 |
| 1864 | Lourmel | 2, ఫిబ్రవరి 1864 | 255 |
| ,, | Lourmel | 6, జూన్ 1864 | 207 |
| 1865 | Suger | 20, జనవరి 1865 | 226 |
| 1866 | Daguerre | 8, జనవరి 1866 | 317 |
| ,, | Northumbrian | 5, నవంబరు 1866 | 418 |

యానాం నుంచి బయలుదేరిన నౌకల వివరాలలో పైన ఉదహరించినవి కొన్ని మాత్రమే. మొత్తం మీద ఇరవై సంవత్సరాల కాలంలో యానాం నుంచి బయలు దేరిన పద్నాలుగు నౌకలలో సుమారు 3500 మంది, పాండిచేరీ నుంచి 13,000 మంది కలకత్తా నుంచి 9,000 మంది కూలీలు రీయూనియన్‌కు ఎగుమతి అయినట్లు రికార్డుల ద్వారా తెలుస్తున్నది. (రి. Mme. Mazard in her memoire de Maitrise "L'emigration indienne vers les colonies francaises from 1860 to 1880).

ఈ కాలంలో కూలీల సేకరణ మేస్త్రీల ద్వారా జరిగేది. వీరు యానాం నుంచే కాక చుట్టుపక్కల ప్రాంతాలనుంచి కూడా కూలీలను తీసుకువచ్చి యానాంలో కల ఏజెంట్లకు అప్పచెప్పేవారు. ఆ కూలీలకు ముందుగా మెడికల్ చెకప్ జరిగేది. చిన్న చిన్న వ్యాధులకు మందులు ఇచ్చేవారు. వృద్ధులను, పిల్లలను తీసుకొనేవారు కాదు. ఈ ప్రక్రియ అంతా ఒక ఇంగ్లీషు అధికారి సమక్షంలో జరిగేది. ఇలా ఎంపిక చేయబడిన కూలీలందరూ తాము ఐచ్ఛికంగానే జీవనోపాధికొరకు రీయూనియన్‌కు వెళుతున్నట్లు ఆయనకు ఒక అంగీకార పత్రాన్ని వ్రాసి ఇచ్చేవారు. తదుపరి ఆ కూలీలకు రెండునెలల జీతం (నెలకు 5 రూపాయిల చొప్పున మొత్తం 10 రూపాయిలు) ముందుగా చెల్లించి, నౌక బయలుదేరే తారీఖు వరకూ వారికి తిండి వసతులు కల్పించటం జరిగేది. ఈ మొత్తం వ్యవహారంలో ఏ రకమైన నిర్బంధాలు లేవని నిర్ధారించే బ్రిటిష్ అధికారికి నెలకు 250 రూపాయిల జీతం, సరఫరా చేసిన ఒకొక్క కూలీకు 3 రూపాయిల చొప్పున మేస్త్రీలకు, 24 రూపాయిల చొప్పున ఫ్రెంచి ఏజెంటుకు ముట్టేవి.

1830 నాటి కాంట్రాక్టు పద్దతిలో ఒక్కొక్క కార్మికునకు నెలకు 7 రూపాయిల జీతం కాగా 1860 లో అది నెలకు 5 రూపాయిలు మాత్రమే కావటం గమనార్హం. ఏదైనా ఒక కుటుంబం అంతా ఈ విధమైన పద్దతిలో కూలీలుగా వెళ్ళేటపుడు, స్త్రీలకు పిల్లలకు నెలకు రెండు రూపాయిల యాభై పైసల చొప్పున జీతం ఉండేది. 1830 లో కూలి అడ్వాన్సుగా 21 రూపాయిలు ముందుగానే ఇచ్చేవారు, కానీ 1860 వచ్చేసరికి ఈ మొత్తం పదిరూపాయిలకు తగ్గిపోయింది. అయినప్పటికీ ఈ పద్దతిన వెళ్ళటానికి యానాంవాసులే కాక శ్రీకాకుళం, ఏలూరు, మచిలీపట్నం వంటి దూర ప్రాంతవాసులు కూడా వచ్చేవారు. 1862 లో యానాంలో Quillet Victor de Possel et Cie పేరుగల ఒక ఫ్రెంచి ఏజెన్సీ ద్వారా ఈ కూలీల లావాదేవీలు జరిగేవి.

ఇదే సమయంలో ఇంగ్లీషువారు చేపట్టిన రైలు మార్గాల ఏర్పాటు, సాగునీటి కాలువల తవ్వకం (ధవళేశ్వరం ఆనకట్ట నిర్మాణం చివరిదశకు చేరింది), బీడుభూముల్ని సాగులోకి తీసుకురావటం వంటి వివిధ పనులకు తీవ్రమైన కూలీల కొరత ఏర్పడటంతో, బ్రిటిష్ ప్రభుత్వం ఫ్రెంచివారు సాగిస్తున్న ఈ కూలీల ఎగుమతికి అనేక విధాలైన ఆటంకాలను కలిగించటం మొదలు పెట్టారు. మేస్త్రీలపై ఏడాదికి పదిరూపాయిల టాక్స్ విధించటం, మేస్త్రీలకు లైసెన్సులు జారీ చేసి వాటిని ప్రతీ సంవత్సరం మద్రాసులో ఉండే బ్రిటిష్ ఉన్నతాధికారిచే కౌంటర్‌సైన్





చేయించుకోవాలన్న నిబంధన విధించటం వంటివి వాటిలో ముఖ్యమైనవి.

1866 లో యానాం నుంచి ఆఖరు సారిగా కూలీలు పంపించబడ్డారు. తరువాత అలాంటి వ్యాపారం జరగలేదు. 1863 లో 775 మంది, 1864 లో 621 మంది, 1865 లో 184 మంది కూలీలను తరలించగా, 1865 లో మాత్రం సుమారు 1500 మంది యానాంనుంచి పంపించబడ్డారు. దీనికి కారణం అప్పట్లో ఒరిస్సాలో భయంకరమైన కరువు విలయతాండవం చేయటం వల్ల చాలా మంది ప్రజలు ఇలా వలస పోవటానికి సిద్ధపడినట్లు అనుకోవాలి.

**ముగింపు**

ఫ్రెంచి వారు తమ అవసరాల దృష్ట్యా కూలీలను తరలించటంలో మొదట కొన్ని అనాగరిక పద్దతులు పాటించినా (యేట్స్ ఉదంతం), కాలానుగుణంగా మానవీయ దృక్పధంతో వ్యవహరించినట్లే కనపడుతుంది. మరీ ముఖ్యంగా 1828 లో ప్రతిపాదించిన కాంట్రాక్టు పద్దతి ఈనాటికీ ఆదర్శప్రాయమే అనటం అతిశయోక్తి కాదు. షిప్పులో రవాణా సమయంలో ప్రతీ కూలీకి రోజుకు ఒక కేజీ బియ్యం తో వండిన అన్నం, 120 గ్రాముల పప్పులు, 200 గ్రాముల మాంసం లేక చేపలు మరియు మూడు లీటర్ల మంచినీరు ఇవ్వాలని నిబంధన ఉండేది. 1853లో కారైకాల్ కు చెందిన కూలీలు సేకరించే ఒక మేస్త్రీ మైనారిటీ తీరని పిల్లలను కూలీలుగా ఎగుమతి చేయటానికి ప్రయత్నించినందుకు ఫ్రెంచి కోర్టు ఒక సంవత్సరం జైలు శిక్ష విధించటాన్ని బట్టి ఈ కూలీల సేకరణ ఇష్టమొచ్చినట్లు కాక, నిబంధనలకు లోబడే జరిగేదని అర్ధంచేసుకొనవచ్చును. 1854లో పాండిచేరీ నుంచి బయలుదేరిన ఆగస్టస్ అనే షిప్పులో కూలీలు అనేక ఇబ్బందులకు గురయ్యారని పిర్యాదులు రావటంతో, ఫ్రెంచి ప్రభుత్వం రెజెల్ హ్యూబర్ అనే జడ్జితో విచారణ జరిపించి, షిప్పులో ప్రయాణించే కూలీలకు కనీస వసతి సౌకర్యాల కల్పనకు అనేక నిబంధనలను విధించింది. వీటి ఫలితంగా ఫ్రెంచి నౌకలలో తరలింపబడే కూలీలలో గమ్యస్థానాలకు చేరే లోపు జరిగే మరణాల శాతం 2.7 కు తగ్గింపబడింది. కాగా బ్రిటిష్ నౌకలలో ఇది 7.8 గా ఉండేది. (రి. TREATY BETWEEN TRADE AND COOLIE: THE CASE OF AUGUSTUS (1854) WEBER by Jacques WEBER--CIDIF). 1885 నాటికి ఫ్రాన్స్ కూలీల సేకరణను పూర్తిగా నిలిపివేసింది.

ఫ్రెంచి మరియు బ్రిటిష్ వారు భారతదేశంలో వ్యాపారం చేయటానికి వచ్చారు. ఇరువురికీ మధ్య జరిగిన అనేక కలోనియల్ రాజకీయాలలో భాగంగా ఈ కూలీల ఎగుమతి విషయంలో ఫ్రెంచి వారిని ఇంగ్లీషువారు సమర్ధవంతంగా ఇరుకున పెట్టగలిగారు. యానాం నుంచి ఫ్రెంచివారు కూలీలను తరలించిటం అనేది ఈ ప్రాంతపు ఒక చారిత్రక సత్యం. ఏ దేశచరిత్రను తీసుకొన్నా ఇలాంటి నీలినీడలు కనిపిస్తాయనటంలో సందేహం లేదు.

ఫ్రెంచి కరీబియన్ ద్వీపకల్పం లోని Sucre Island జనాభా ఏర్పడటంలో యానాం నుంచి 1849–1869 ల మధ్య ఎగుమతి చేయబడిన కూలీలు ప్రధాన పాత్ర వహించినట్లు ప్రొ. జాబ్స్ వీబర్ అభిప్రాయపడ్డాడు. (రి. GHC Bulliten, 16 May, 1990, page no. 134). అలా తరలించబడిన వారిలో ఎంత మంది తిరిగి వచ్చారో, ఎంత మంది అక్కడే స్థిరపడి పోయారో......

# యానాం లో జరిగిన బాల్య వివాహాలు

బాల్య వివాహాలు ప్రధానంగా రెండు రకాలు. ఒక పెద్దవయసు వ్యక్తి తనకంటా చాలా చిన్నదయిన రజస్వల కాని అమ్మాయిని వివాహం చేసుకోవటం లేదా ఇరు పక్షాల తల్లితండ్రుల సమ్మతితో చిన్నపిల్లలకు వివాహం చేయటం. మొదటిరకపు వివాహాలకు హిందూసమాజంలో అనాదిగా వ్యతిరేకత ఉంటూనే ఉంది. ఆస్థులు బయటకు పోకూడదని, పెళ్ళికాని అమ్మాయిలను మహమ్మదీయ పాలకులనుంచి కాపాడుకోవటం కోసమని, రజస్వల అయిన అమ్మాయి ఇంట్లో ఉంటే అరిష్టమని తలచటం (నెలసరి అనేది ఒకరకమైన అబార్షన్ అని) వంటి రకరకాల కారణాలవల్ల రెండవరకపు వివాహాలు మద్యయుగపు హిందూ సమాజంలో విస్తృతంగా జరిగేవి. అలా పెళ్ళి చేసిన అమ్మాయిని రజస్వల అనంతరం మాత్రమే కాపురానికి పంపేవారు. బ్రిటిష్ ప్రభుత్వం ఈ ఆచారాం వల్లకలిగే నష్టాలను గమనించి బాల్యవివాహాలను నిషేధిస్తూ సెప్టెంబరు 1929 లో శారదా చట్టాన్ని తీసుకొచ్చింది. దీనివల్ల బ్రిటిష్ పాలిత ప్రాంతాలలో 14 సంవత్సరాల లోపు అమ్మాయిల వివాహం చట్టవ్యతిరేకం అయింది.

ఫ్రెంచి పాలిత ప్రాంతాలలో దీనిపై పట్టింపు లేదు. కనుక యానాం కు సుదూరప్రాంతాలనుండి అనేకమంది తల్లితండ్రులు రహస్యంగా వచ్చి తమ పిల్లలకు వివాహాలు చేయించి, ఇక్కడి ఫ్రెంచి ప్రభుత్వం ఇచ్చిన 'మారేజ్ సర్టిఫికెట్' ను తీసుకొని 'దర్జాగా' వారి ప్రాంతాలకు వెళ్ళిపోయేవారు.

ఒక్క 1934 లోనే 500 పైబడి ఇలాంటి వివాహాలు జరిగినట్లు రికార్డులు చెపుతున్నాయి. అప్పట్లో యానాంకు చెందిన ఓ ప్రముఖనాయకుడు అలా జరిగే ప్రతీ వివాహానికీ 3 నుంచి 5 రూపాయిలు అనధికారికంగా వసూలు చేసేవాడని కొన్ని ఆరోపణలు వచ్చాయంటే పరిస్థితి ఏ విధంగా ఉండేదో అర్ధంచేసుకొనవచ్చును. మద్రాస్ మెయిల్ అనే పత్రిక 1934 జూలై సంచికలో యానాంలో జరుగుతున్న ఈ తతంగం గురించి ఇలా రాసింది – "శారదా చట్టం రాగానే దాన్నుంచి తప్పించుకోవటానికి చిన్నపిల్లలను తీసుకొని తల్లిదండ్రులు ఫ్రెంచి యానాం చేరి పెళ్ళిళ్ళు చేయటం మొదలెట్టారు. జూన్ నెలలో ఒకేరోజు ఏకంగా 90 బాల్యవివాహాలు జరిగాయి. వీరంతా బ్రిటిష్ పౌరులు" అంటూ ఆనాటి పరిస్థితి తీవ్రతను రికార్డు చేసింది. ఈ వివాహాలు ఎక్కువగా యానాం మీసాలవెంకన్న ఆలయంలో జరిగేవి. యానాంలో పెళ్ళిళ్ళు





జరిపించటానికి వచ్చే బ్రిటిష్ పౌరులు యానాన్ని 'కళ్యాణపురం' అని సంకేత నామం తో పిలుచుకొనేవారు. ఆ కాలంలో ఈ పెళ్ళిళ్ళ వలన వర్తకులు మరియు స్వర్ణకారులు అధికంగా లాభపడ్డారు. పెళ్ళి జరిపించాలనుకొనే వారు బ్రిటిష్ పోలీసులకు భయపడి ఉత్తచేతులతో వచ్చి ఇక్కడే పెళ్ళికి కావలసిన అన్నివస్తువులను కొనుక్కునేవారట. యానాం స్వర్ణకారులు అప్పట్లో రెడీమేడ్ తాళిబొట్లను పెద్దపెద్ద తాటాకు బుట్టలలో వేసి అమ్మేవారట. ఒక పెళ్లికి ఒక జత తాళిబొట్లచొప్పున లెక్కవేసుకొంటే ఆనాడు యానాంలో రికార్డులకెక్కని వివాహాల సంఖ్య ఊహింపశక్యం కాదు.

## స్థానికుల నిరసన

ఈ దురాచారం పట్ల ఆనాటి ప్రజల స్పందన ఎలా ఉండేదన్నది 1934 లో ఫ్రెంచి వారికి సమర్పించిన ఓ విన్నపంలో దొరుకుతుంది. దానివివరాలు ఈ విధంగా ఉన్నాయి – "యానాం కు చెందిన రిటైర్డ్ టీచర్ శ్రీ తోట నరసింహమూర్తి, ఈ అనాగరిక దురాచారాన్ని ఫ్రెంచి కాలనీలలో నిషేధించమని ఫ్రెంచి ప్రభుత్వానికి విన్నపం చేసారు. అంతే కాక ఆరు రోడ్లు మాత్రమే కలిగిన యానాం అనే చిన్నప్రాంతానికి, రోజూ వేల సంఖ్యలో బయటి వ్యక్తులు రావటం వల్ల పారిశుధ్యసమస్యలు తలెత్తుతున్నాయని, దీనివల్ల కలరా వంటి వ్యాధులు ప్రబలే అవకాశం ఉందనీ, వారి బాజాలు భజంత్రీలతో విపరీతమైన శబ్దకాలుష్యం కలుగుతున్నదనీ, సామాన్య జనాలు పనిపాటలు చేసుకోవటానికి తీవ్రవిఘాతం కలుగుతున్నదనీ" ఆయన తనవిన్నపంలో పేర్కొన్నారు.

పై విజ్ఞాపనను బట్టి యానాంలో జరిగే బాల్యవివాహాల పట్ల సామాన్యప్రజలు ఇబ్బందులు ఎదుర్కొన్నారని అర్ధమౌతుంది. సామాజిక స్పృహ కలిగిన కొంతమంది వ్యక్తులు చేసిన విజ్ఞాపనల వల్ల ఫ్రెంచి ప్రభుత్వం ఇలా జరిగే వివాహాలపై దృష్టి సారించింది.

## ప్రభుత్వ స్పందన

నిజానికి ఫ్రెంచి వారు 1892 లోనే పెళ్ళికుమార్తె వయసు కనీసం12 సంవత్సరములు ఉండాలని ఒక చట్టం తీసుకొచ్చారు. కానీ భారతదేశపు స్థానిక ఆచారాలను గౌరవిస్తూ, ఇరు తల్లిదండ్రుల అంగీకారంతో జరిగే వివాహాలను చూసీచూడనట్లు వదిలేసే వారు. బ్రిటిష్ ప్రభుత్వం శారదాబిల్లు ద్వారా బాల్యవివాహాలను నిషేదించటానికి పూనుకోవటంతో ఫ్రెంచికాలనీలలో బాల్యవివాహాలు విచ్చలవిడిగా జరుగుతున్న నేపధ్యంలో 1937లో ఫ్రెంచిప్రభుత్వం మరోచట్టం చేసింది. దీనిద్వారా పెళ్ళికూతురి వయసు కనీసం 14 సం.లు, పెళ్ళికొడుకుకి 16 సం.లు ఉండాలనీ – దీనిని అతిక్రమించి ఎవరయినా పెళ్ళిళ్ళు జరిపితే జరిమానా విధించటమే కాక తల్లిదండ్రులకు ఖైదు శిక్ష విధించవచ్చును కూడా. (రి: పేజీ నం–591, సోషియాలజీ ఆఫ్ కాలనీస్, రచయిత: రెని మానియర్)

పై చట్టం వలన యానాంలో బాల్యవివాహాలనే వికృతక్రీడకు తెరపడింది. ఎనిమిది సంవత్సరాలలో కొన్ని వేల బాల్యవివాహాలు యానాంలో జరిగాయన్న అపవాదుతోపాటు, ఈ దురాచారాన్ని సామాజిక స్పృహకలిగిన కొందరు స్థానికులు వ్యతిరేకించారన్న విషయం కూడా చరిత్రపుటలు తిరగేస్తే కనిపిస్తుంది.

# ఫ్రెంచి యానాంలో విద్యావ్యవస్థ

భారతదేశంలో విద్యావ్యవస్థ వర్ణవ్యవస్థను పటిష్టం చేసేదిగా ఉండేది. మహమ్మదీయ పాలకులకు రాజ్యకాంక్షే తప్ప విద్యాభివృద్ధి చేసిన దాఖలాలు కనపడవు. వర్ణవ్యవస్థకు అతీతమైన విద్యావ్యవస్థను భారతదేశంలో నెలకొల్పిన ఖ్యాతి బ్రిటిష్, ఫ్రెంచి పాలకులకు దక్కుతుంది. కారణాలేమైనప్పటికీ గుమస్తాలను తయారుచేయటానికే స్కూళ్ళను నెలకొల్పారు అన్న అపవాదును బ్రిటిష్‌వారు మూటకట్టుకొన్నారు. కానీ ఫ్రెంచి పాలకులు తమ స్థావరాలలో జరిపిన విద్యాసంస్కరణలు గమనిస్తే అటువంటి ఉద్దేశ్యాలు ఉన్నట్లు కనిపించవు. యానాం వంటి మారుమూల ప్రాంత ప్రజలు ఉన్నత విద్యనభ్యసించటానికి పాండిచేరి వెళ్లవలసివచ్చేది. వీరికి ఫ్రెంచి ప్రభుత్వం ప్రత్యేక స్కాలర్‌షిప్పులిచ్చేది. అలా యానాంనుంచి అనేకమంది విద్యార్ధులు పాండిచేరీ వెళ్ళి ఉన్నత విద్యను అభ్యసించేవారు. ఉదాహరణకు 1924 లో నల్లం సత్యనారాయణ (పాండిచేరీలోని నల్లం క్లినిక్ అధినేత శ్రీ నల్లం బాబు తండ్రి గారు) అలా పాండిచేరీలో వైద్య విద్యను పొందారు. అలాగే శ్రీదడాల రఫేల్, అబ్దుల్ రజాక్, మలిపెద్ది వీరన్న, తోట నరసింహమూర్తి, వంటి యానాం విద్యార్ధులు ఆ విధంగా స్కాలర్‌షిప్పుల సదుపాయాన్ని వినియోగించుకొన్నారు. 1905 లో యానానికి చెందిన దున్నా వెంకటరత్నంకు పాండిచేరీ వెళ్ళి చదువుకోవటానికి ఏడాదికి 72 రూపాయిలచొప్పున స్కాలర్ షిప్ మంజూరు అయ్యింది. దళిత వర్గానికి చెందిన ఒక వ్యక్తి స్కాలర్‌షిప్ పొందటం ఇదే ప్రథమం. అప్పట్లో పాండిచేరీలో ఉన్నతవిద్య ముగిసిన తరువాత యూనివర్సిటీ చదువు చదవాలనుకొనేవారిని ఫ్రెంచి ప్రభుత్వం స్వంత ఖర్చులతో ఫ్రాన్స్ పంపించేది. ఈవిధంగా ఎంతోమంది పాండిచేరీ, కారైకాల్ ల నుంచి ఫ్రాన్స్ వెళ్ళి పెద్దచదువులు చదువుకొన్నారు. యానాంనుంచి ఆ విధంగా ఫ్రాన్స్ వెళ్ళి చదువుకొన్న వారిలో శ్రీదున్నా వెంకటరత్నం గారు ప్రముఖులు. వీరు కాంబోడియా విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరుగా పనిచేసి రిటైర్ అయినతరువాత యానాంలో స్థిరపడ్డారు.

### తొలినాటి విద్యారంగం

1787 మే, 31న పాండిచేరీలో మొట్టమొదటి ఫ్రెంచి మిషనరీ స్కూలు స్థాపించబడినా, చాన్నాళ్ళకు కానీ దానిలో తెలుగుభోధన ఆరంభం కాలేదు. 1828 లో పాండిచేరీలో తెలుగును మాతృభాషగా కలిగిన వారి కోసం ఫ్రెంచిప్రభుత్వం పాఠశాల టైమ్‌టేబుల్ లో తెలుగుభాష పీరియడ్‌ను ప్రారంభించారు. 1840 నాటికి దీనిలో 26 మంది తెలుగు నేర్చుకొనే విద్యార్ధులుండేవారు. ఇక యానాం విషయానికి వస్తే, 1848 ఫిబ్రవరి, 17న అప్పటి ఫ్రెంచి గవర్నర్ శ్రీ పుజోల్ యానానికి 'ఉచిత' ప్రైమరీ పాఠశాల ఏర్పాటు ఉత్తర్వులు జారీచేసారు. కానీ ఎందుకో అది కార్యరూపం దాల్చలేదు. (రి: జె.బి.పి. మోర్)

ఇక్కడ ఉచిత అనే మాటనుబట్టి అప్పట్లో యానాంలో ప్రైవేటు స్కూళ్ళు ఉండేవని ఊహించుకొనవచ్చును. ఇదే విషయం యానాంలో 1880 ల ప్రాంతంలో విద్యనభ్యసించిన శ్రీ చెళ్ళపిల్ల వెంకటశాస్త్రి రచించిన 'కథలు–గాథలు' అనే పుస్తకం (పేజీ నం: 403) లో కనపడుతుంది. సనాతన కుటుంబానికి చెందిన శ్రీ చెళ్ళపిల్ల వారు యానాం ప్రభుత్వస్కూలులో మాలమాదిగల సరసన కూర్చోవలసి రావటం ఇష్టంలేక యానాం స్కూలును విడిచి కొంతకాలం నీలపల్లి స్కూలులో చదువు ముగించుకొని, తిరిగి మరలా యానాంలో శ్రీ చక్రవర్తుల బాపయ్య గారిచే నడపే ఓ ప్రైవేటుస్కూలులో చేరారట. అంతేకాక అప్పటి ఫ్రెంచిస్కూలును వర్ణిస్తూ "ఇక్కడ పిల్లలు జీతమివ్వక్కర లేదు. పయిగా ఎక్కువ తెలివితేటలుంటే ప్రైజెంట్లు కూడా ఇచ్చేవారని" చెప్పుకొచ్చారు. దీనినిబట్టి ఫ్రెంచివారు స్కూళ్ళు స్థాపించక మునుపు యానాంలో బ్రాహ్మలచే నడపబడే ప్రైవేటుస్కూళ్ళు ఉండేవని భావించుకోవచ్చు. కానీ వీటిలో లభించే విద్య సమాజంలోని అగ్రవర్ణాలకే దక్కేదనటంలో మాత్రం సందేహపడక్కరలేదు.

### యానానికి కన్యస్త్రీల సేవలు

యానాం విద్యారంగంలో స్వేచ్ఛా, సమానత్వం, సౌభ్రాతృత్వం వంటి విత్తనాలు నాటటానికి 1849 డిసంబరు, 5 న st. Joseph of Lyon కు చెందిన నలుగురు sisters యానాం వచ్చారు. (సెయింట్ జోసెఫ్ ఆఫ్ లియోన్ అనేది ఫ్రాన్స్ లోని లియోన్ అనే ప్రాంతానికి చెందిన ఒక క్రిష్టియన్ ధార్మిక సంస్థ. ఈ సంస్థ 1807 లో 'మదర్ సెయింట్ ఫాంట్‌బొన్నే' అనే ఆవిడ ఆధ్వర్యంలో నడిచేది. ఈ సంస్థ మెంబర్లుగా ఉండే సిస్టర్స్/కన్యస్త్రీలు ప్రపంచవ్యాప్తంగా స్కూళ్ళు, ఆసుపత్రులను నడుపుతూ మానవజాతికి మహోన్నతమైన సేవలు చేస్తున్నారు ఇప్పటికీ). అలా వచ్చిన వారి చేతిలో కులమతాలకతీతంగా యానాంలోని విద్యార్ధులకు విద్యను భోదించమని ఫ్రెంచిప్రభుత్వం 1849 నవంబరు,10న ఇచ్చిన ఉత్తర్వు మాత్రమే ఉంది. కానీ మనసులో వజ్రతుల్యమైన సేవాదృక్పధం, మానవజాతి పట్ల అచంచలమైన విశ్వాసం ఉన్నాయి. వీరికి యానాం ప్రజలు ఘనస్వాగతం పలికారు.

1850 లో వీరు రెండు స్కూళ్ళు ప్రారంభించారు. ఒకటి ఆడపిల్లల కొరకు మరొకటి చిన్నారి బాలికలు మరియు అనాధుల కొరకు. భారతదేశంలో మొదటి బాలికల స్కూలు 1848 జనవరి, 1 న సావిత్రిభాయి పూలే స్థాపించినట్లు చరిత్ర చెపుతుంది. కానీ దాదాపు అదే కాలంలో యానాంలో బాలికల కొరకు స్కూలు స్థాపించబడటం సామాన్యమైన విషయం కాదు.

st. Joseph of Lyon Sisters

1. Sister Saint Claire D'ugine - Superior
2. Sister Saint francois de Desingy
3. Sister Saint Justine de Thairy
4. Sister Marie Placide d'Annecy

వీరే కాక ఇతర సిస్టర్స్ కూడా యానాం విద్యారంగానికి తమసేవలందించారు. వారిలో Sister Lucile, Sister Denice ,Sister Marie Theophile, Sister Augustin వంటి వారు ఇక్కడే గతించిపోయారు.

Sister Casimir (Fillion Melanie) ఈమె ఫ్రాన్స్‌లోని Lyaud అనే ప్రాంతంలో జన్మించింది. 1890 లలో యానాంలో కొంతకాలం టీచర్ గా పనిచేసింది. ఇదే సమయంలో యానాం కోర్టు నోటరీ గా పనిచేసిన M. Casimir కు ఈమె బంధువు కావొచ్చు.

Sister Clotilda (Francoise Dunoyer) 1837 లో Nouglard అనే ప్రాంతంలో జన్మించిన ఈమె కొంతకాలం యానాంలో సేవలందించారు.

Sister Mary Amelia (1858-?) ఈమె 1890 లలో యానాంలో కొంతకాలం టీచర్ గా పనిచేసింది.

Sister Mary Eleonor (Deleaval Susan) ఈమె ఏప్రిల్ 13, 1861 న చదువు పూర్తి కాగానే యానానికి టీచరుగా నియామకం పొందింది.

Sister Rose Alexin 1871లో జన్మించిన ఈమె 1900లో యానాంలో టీచర్‌గా పనిచేసింది.

Sister Ursula (BOssom Eugenie) 1831లో పుట్టిన ఈమె 1851 జూలైలో టీచరుగా పనిచేయటానికి యానాం రావటం జరిగింది.

1850–1854 మధ్య అప్పటి చర్చిఫాదరయిన డ్యూపాంట్ బాలురకోసం ఒక స్కూలు నడిపేవారు. దీనిలో ఫ్రెంచి, తెలుగులను డ్యూపాంటే బోధించేవారు. (బోధించగలిగే స్థాయికి తెలుగును ఒక ఫ్రెంచి దేశస్థుడు నేర్చుకోవటం ఆశక్తికరం).

1866 వచ్చేసరికి యానాంలో మొత్తం 5 స్కూళ్ళు ఉండేవి. వీటిలో మూడు బాలికల కొరకు రెండు బాలుర కొరకు. బాలికల పాఠశాలలను సెయింట్ జోసెఫ్ సిస్టర్స్ నిర్వహించేవారు. ఈ స్కూళ్ళను స్థానికులు 'కన్యస్త్రీల బడి' లని పిలుచుకొనేవారు. ఈ మూడు బాలికల స్కూళ్ళలో ఒకటి ఫ్రెంచి, ఫ్రాంకో ఇండియన్ మరియు ఉన్నత వర్గాల పిల్లల కొరకు, రెండవది అన్ని కులాల పిల్లల కొరకు, మూడవది అనాధ బాలికల కొరకు ఉద్దేశింపబడినవి. మొదటి రెండు







స్కూళ్ళలో ఫ్రెంచి, తెలుగు, ఇంగ్లీషు, లెక్కలు, జాగ్రఫీ, డ్రాయింగు వంటివి బోధనాంశాలుగా ఉండేవి. మూడవ స్కూలులో కుట్లు అల్లికలు నేర్పేవారు.

**స్థానిక టీచర్ల ప్రవేశం**

అబ్బాయిలకొరకు ఉన్న రెండు ప్రభుత్వ పాఠశాలలో ఒకటి ఫ్రెంచిమిషనరీకి చెందిన ఒక బ్రదర్ ఆధ్వర్యంలోను రెండవది ఆనాటి యానాం సమాజంలోని కాపు కులపెద్ద అయిన శ్రీ బెజవాడ చినపేరయ్యచే నడపబడేది. యానాం ప్రభుత్వ స్కూలులో పనిచేసిన మొదటి తెలుగు టీచర్ ఈయనే. ఎందుకంటే అంతవరకూ యానాం స్కూళ్ళలో ఫ్రెంచి దేశస్థులే ఉపాధ్యాయులుగా ఉండేవారు. ఆఖరుకు తెలుగుభాషను భోదించాల్సివచ్చినా సరే.

యానాంలో ...ాయి.

| | 1866 | 1868 | 1870 | 1888 | 1898 |
|---|---|---|---|---|---|
| [illegible] | 55 | 66 | 53 | 184 | 360 |
| [illegible] | 40 | 39 | 36 | 96 | 30 |
| [illegible] | 95 | 05 | 89 | 283 | 390 |

1898 లెక్కల ప్రకారం కేవలం 30 మంది విద్యార్ధినులు మాత్రమే ఉండటం గమనార్హం. దీనికి ప్రధానకారణం 1849 లో యానాం స్కూలు స్థాపించటానికి వచ్చిన నలుగురు సిస్టర్స్ క్రమక్రమంగా గతించటమే కావొచ్చు. వీరిలో చివరగా డెనిస్ (1842–1899) మరణంతో యానాంలో బాలికల విద్యావ్యాప్తికి తీవ్రవిఘాతం ఏర్పడిఉంటుందని పై గణాంకాలను బట్టి భావించవచ్చును. అంతే కాక సాంప్రదాయ హిందూ కుటుంబాలలో స్త్రీవిద్య పట్ల ఉండే చులకన మరియు కన్యస్త్రీల బడి అనగానే తల్లిదండ్రులకు విద్యార్ధినులకు కొంత భద్రతాభావం ఉండటం వంటివి ఇతర కారణాలు కావొచ్చు. వారి తదనంతరం అంతే నమ్మకాన్ని యానాం విద్యార్ధినుల తల్లిదండ్రులలో కలిగించటానికి చాలాకాలం పట్టింది. ఈ విషయంలో 1930 లలో యానాం బాలికల స్కూలు టీచర్లయిన కంతేటి మంగమ్మ, చిక్కం మాతయ్య, పాలెపు వెంకట సుబ్బారావులు ముఖ్యులు. వీరి కృషి వలన 1933 లో విద్యార్ధినుల సంఖ్య 109 కి పెరిగింది. (యానానికి సంబంధించి శ్రీమతి కంతేటి మంగమ్మ మొదటి స్థానిక మహిళా టీచర్ కావొచ్చు)

1873 లో యానాం జమిందారు శ్రీ మన్యం కనకయ్య బాలికల స్కూలు నిర్మాణం కొరకు భారీ నిధులను సమకూర్చారు. కనకాల పేటలో 1880 లో ఒక బాయిస్ స్కూలు నెలకొల్పారు. దీనిలో కొమండూరి/సాతాను జియన్న, వర్ధినీడి అయ్యప్పనాయుడులు టీచర్లుగా పనిచేసారు. ఈ స్కూలు 1902 నుంచి కొంతకాలం మూసివేసి మరలా 1931 లో తిరిగి

తెరిచారు. పంపన వీరాస్వామి అప్పట్లో దీనిలో టీచర్ గా పనిచేసారు. కురసాం పేటలో 1892 లో ప్రారంభించిన స్కూలు కొంతకాలం మూతబడి తిరిగి తెరువబడింది.

1908లో అడివిపొలంలో చిక్కం మాతయ్య అనే టీచరు ఆధ్వర్యంలో ఒక ప్రైవేటు స్కూలు నడిచేది. ఈ స్కూలు దళిత విద్యార్ధుల కొరకు బాగా ఉపయోగపడుతున్నదన్న ఉద్దేశ్యంతో ప్రభుత్వం ఆర్ధిక సహాయాన్ని అందించి దానిని ప్రభుత్వస్కూలుగా మార్చివేసింది. ఈ స్కూలుకు హెడ్‌మాస్టర్లుగా 1932 లో ఎమ్.వి.వి. కొండయ్యనాయుడు, 1937లో గెల్లా శ్రీనివాసులు పనిచేసారు. ఈ స్కూలులో మధ్యాహ్నభోజన పథకం కూడా ఉండేది.

## ఆనాటి విద్యాకమిటీలు

యానాంలోని విద్యావ్యవస్థను నడిపించటానికి 7 గురు సభ్యులుకలిగిన ఒక కమిటీని ప్రభుత్వం నియమించేది. యానానికి సంబంధించి 1880 లో మొదటిసారిగా ఏర్పడిన విద్యాకమిటీకి పుణ్యమూర్తుల వెంకటసుబ్బారాయుడు బెజవాడ బాపనయ్య లు ప్రారంభ సభ్యులుగా వ్యవహరించారు. ఇరవయ్యవ శతాబ్ద ప్రారంభదశలో స్కూలు కమిటీకి సమతం వెంకటసుబ్బారాయుడు, గిరితాతయ్య, అబ్దుల్ రెహ్మాన్ , పుణ్యమూర్తుల వెంకటసుబ్బారాయుడు, సమతం కృష్ణయ్య, పుణ్యమూర్తుల నరసింహమూర్తి, గిరి మాధవరావు నాయుడు, శింగంశెట్టి వెంకటరత్నం వంటివారు సభ్యులుగా తమ సేవలందించారు.

## సెంట్రల్ బాయిస్ స్కూల్ ప్రాముఖ్యత

అప్పట్లో యానాం విద్యావ్యవస్థకు సెంట్రల్ బాయస్ స్కూల్ (CBS) కేంద్ర బిందువుగా ఉండేది. (ఈ స్కూలు పునర్నిర్మాణం జరిగినా ఆనాటి 'గేట్ ఆర్చ్' ను అలాగే ఉంచటం జరిగింది). యానాంలోని మిగిలిన స్కూళ్ళన్నీ దీనికి అనుబంధ సంస్థలుగా ఉండేవి. ఇక్కడి హెడ్ మాస్టర్ మిగిలిన స్కూళ్ళ పర్యవేక్షణ జరిపేవాడు. 1901 లెక్కల ప్రకారం నలుగురు టీచర్లు 177 మంది విద్యార్ధులతో ఈ స్కూలు నడిచింది. 1911-12 లలో CBS కు Daviot అనే ఫ్రెంచిదొర హెడ్మాష్టరుగాను, మద్దింశెట్టి బాపన్న, తోట నరసింహ స్వామి, మహేంద్రవాడ సూర్యనారాయణ మూర్తి లు టీచర్లు గాను ఉండేవారు. 1916-17 లలో De Cruz Thomas సి.బి.ఎస్ కు హెడ్‌మాష్టరుగా వ్యవహరించారు. ఈ స్కూలుకు మొదటసారిగా స్థానిక వ్యక్తి హెడ్‌మాష్టరు గా పనిచేయటం 1918 లో గిరి తాతయ్య తో మొదలైంది. ఆ తరువాత 1923 లో మలిపెద్ది వీరన్న సి.బి.ఎస్ కు సారధ్యం వహించారు.

1934 లో సి.బి.ఎస్ లో మలిపెద్ది అంకయ్య హెడ్‌మాస్టరుగాను, గిరిలక్ష్మినారాయణ, మహేంద్రవాడ వీర గణపతి శాస్త్రులు, మద్దింశెట్టి సత్యనారాయణ మూర్తి, నల్లం సుబ్బారాయుడులు టీచర్లుగా పనిచేసారు.





1938-39 లలో సి.బి.ఎస్ కు గిరి లక్ష్మీనారాయణ హెడ్‌మాస్టరుగాను, మద్దింశెట్టి సత్యనారాయణ మూర్తి ఫ్రెంచి టీచరుగా (తెలుగును కూడా ఫ్రెంచివారే బోధించే స్థితినుండి తెలుగువారే ఫ్రెంచిని బోధించే స్థాయికి యానాం విద్యావ్యవస్థ చేరుకోవటం గమనార్హం), మద్దింశెట్టి సత్తిరాజు, మహేంద్రవాడ వీర గణపతి శాస్త్రులు, నల్లం సుబ్బారాయుడు లు ఇతర టీచర్లుగాను పనిచేసేవారు.

విద్యారంగానికి విశిష్టసేవలందించినందుకు గాను మద్దింశెట్టి సత్యనారాయణ మూర్తికి ఫ్రెంచిప్రభుత్వం 1954లో 'షెవాలియర్' బిరుదు ప్రధానం చేసింది.

ఉన్నత చదువులకోసం ఎంతో మంది యానాం విద్యార్ధులు పాండిచేరీ వెళ్ళేవారు. వీరికి ఫ్రెంచి ప్రభుత్వం స్కాలర్‌షిప్పులు ఇచ్చేది. 19 శతాబ్దం చివరలో అలా వెళ్ళి 'లా' చదువుకొన్న గిరి వెంకన్న, పుణ్యమూర్తుల వెంకట సుబ్బారాయుడులు యానాం కోర్టులో సహాయజడ్జీ లు గా పనిచేసారు. అదే విధంగా నల్లం సత్యనారాయణ, ఆశెపు భైరవస్వామి లు వైద్యవిద్యనభ్యసించి స్థానిక ఆసుపత్రిలో డాక్టర్లుగా నియమితులయ్యారు.

## పరీక్షలు – సర్టిఫికేట్లు

యానాంలో ప్రాథమిక విద్య రెండు దశలలో జరిగేది. మొదటి దశను 'సత్వికా' అనేవారు. ఇది పూర్తిచేసిన వారికి "Certificate de etudes de Langue Indigene" అనే సర్టిఫికెట్ ఇచ్చేవారు. దీని తరువాత స్థాయిని 'బ్రెవే' అంటారు. ఇది పాస్ అయితే "Brevet de langue Indigene" అనే సర్టిఫికెట్ వచ్చేది. బ్రెవే పాస్ అయినవారు ఇంకా తమ విద్యను కొనసాగించాలంటే పాండిచేరీ వెళ్లవలసివచ్చేది. అమ్మాయిల చదువు సాధారణంగా సత్వికా కోర్సు తో ఆగిపోయేది. బ్రెవే చదువుకొన్నవారికి ప్రభుత్వ శాఖలలో టీచర్లు, టాక్స్ కలక్టర్లు వంటి ఉద్యోగాలు వచ్చేవి.

## విద్యా విధానం

1880 ప్రాంతంలో యానాం ఫ్రెంచి స్కూలులో చదివిన చెళ్ళపిళ్ళవెంకటశాస్త్రి వ్రాసిన 'నా గురు పరంపర' (కృష్ణా పత్రిక 1934) అనే వ్యాసంలో తన అనుభవాలను ఇలా వర్ణించారు.

పదేండ్ల వయసులో చెళ్ళపిళ్ళ వారి చదువు ఫ్రెంచి టవును యానాంకు మార్చబడింది. సాతాని జియ్యన్న గారు తెలుగు మాస్టారు. ఫర్మా, విజే అను ఇద్దరు ఫ్రెంచి దొరలు ఇతర టీచర్లుగా ఉండేవారు. వీరిలో ఫర్మా గారు హెడ్ మాష్టారు. ఆ మాష్టారు వీరిని 'సెలపిల ఎంకత సలం' అని పిలిచే వారట. మాల మాదిగలు స్కూలులో ఉన్నప్పటికీ ఎవరి బెంచీ వారిదే. గురువారం, ఆదివారం స్కూలుకు శలవుదినాలు.

పిల్లలు తప్పు చేస్తే వారానికొకమారు టేబుల్ పై పడుకోబెట్టి బెత్తంతో కొన్నిదెబ్బలు కొట్టేవారు. అలా చేయటాన్ని 'పటుసారి' అనేవారు. ఆల్ఫాబెత్తు అనే పుస్తకం పూర్తయిందో లేదో, మాల మాదిగలు అందరితో కలసి కూర్చోనివ్వాలి అనే రూలు వచ్చింది. దానితో చాలామంది పిల్లలు స్కూలు మానేసారు. వారిలో చెళ్ళపిళ్ళ వారు ఉన్నారు. పొరుగునున్న నీలపల్లి అనే బ్రిటిష్ గ్రామంలోని స్కూలులో వీరు తమ విద్యను కొనసాగించారు.

పై వివరాలను బట్టి యానాం స్కూలులో విద్యాబోధన ఏ విధంగా ఉండేదో అర్థం చేసుకొనవచ్చును. మరీ ముఖ్యంగా ఫ్రెంచివారు అన్ని వర్ణాలవారిని సమానంగా చూసేవారనే విషయం స్పష్టంగా తెలుస్తుంది. ఎందుకంటే సనాతన కుటుంబానికి చెందిన చెళ్ళపిల్ల వారు నీలపల్లిలో విద్యాభ్యాసం సాగించటాన్నిబట్టి అక్కడ అటువంటి పరిస్థితి లేదనే భావించాలి.

స్కూలు బోధనాంశాలలో మోరల్ ఎద్యుకేషను (నీతి విద్య) అన్నితరగతులకు తప్పనిసరిగా ఉండేది. దీనికొరకు టైమ్ టేబుల్ లో తప్పనిసరిగా ఒక పీరియడ్ ఉండేది.

పై వివరాలను బట్టి యానాం స్కూలులో విద్యాబోధన ఏ విధంగా ఉండేదో అర్థం చేసుకొనవచ్చును. మరీ ముఖ్యంగా ఫ్రెంచివారు అన్ని వర్ణాలవారిని సమానంగా చూసేవారనే విషయం స్పష్టంగా తెలుస్తుంది. ఎందుకంటే సనాతన కుటుంబానికి చెందిన చెళ్ళపిల్ల వారు నీలపల్లిలో విద్యాభ్యాసం సాగించటాన్నిబట్టి అక్కడ అటువంటి పరిస్థితి లేదనే భావించాలి.

స్కూలు బోధనాంశాలలో మోరల్ ఎద్యుకేషను (నీతి విద్య) అన్నితరగతులకు తప్పనిసరిగా ఉండేది. దీనికొరకు టైమ్ టేబుల్ లో తప్పనిసరిగా ఒక పీరియడ్ ఉండేది.

స్కూళ్ళ సెలవుల షెడ్యూల్‌కు కూడా గవర్నరు స్థాయిలో నిర్ణయాలు జరిగేవి. స్కూలు సెలవులు క్రిష్టమస్, సంక్రాంతికి కలిపి సుమారు నెలన్నర రోజులపాటు ఉండేవి. వేసవి సెలవులు మాత్రం తక్కువగా ఇరవైరోజుల ఉండేవి. వారానికి అయిదురోజులు మాత్రమే స్కూల్స్ ఉండేవి. ప్రతి గురువారం, ఆదివారం శలవులు. హిందువుల పండుగలకు మొత్తం స్కూలుకు సెలవు ఉండేది. అదే ముస్లిముల పండుగలకు ఒక్క ముస్లిము విద్యార్థులకు మాత్రమే సెలవు ఉండటం ఆశ్చర్యం కలిగించేవిషయం.

యానాంలోని స్కూళ్ళ నిర్వహణకు ఫ్రెంచి ప్రభుత్వం గణనీయమైన నిధులను వెచ్చించినట్లు రికార్డులు చెపుతున్నాయి.

| | సిస్టర్స్ జీతాలు ఫ్రాంకులలో | ఫ్రెంచ్ బ్రదర్ జీతం ఫ్రాంకులలో | తెలుగు టీచర్ జీతం ఫ్రాంకులలో | మొత్తం ఖర్చు |
|---|---|---|---|---|
| 1857-61 | 2x985 | 300 | 250 | 2530 |
| 1859-70 | 3x1200 | 1000 | 250 | 4850 |

పై మొత్తాలు ఆనాటి యానాం స్థూల ఆదాయంలో 12 నుంచి 27 శాతం వరకూ ఉండటం గొప్ప విషయమే. పై టేబుల్ ను గమనిస్తే ఫ్రెంచ్ టీచర్ల జీతాలు గణనీయంగా పెరిగాయి కానీ తెలుగు/స్థానిక టీచర్ జీతం మాత్రం పెరగలేదన్న విషయం తెలుస్తుంది. కన్యస్త్రీ టీచర్లలో మొదట్లో ఇద్దరికి మాత్రమే ప్రభుత్వం జీతం చెల్లించేది. మిగిలిన వారు వాలంటరీగా పనిచేసేవారు. 1862 నుంచి మరో కన్యస్త్రీ టీచరుకు కూడా ఫ్రెంచి ప్రభుత్వం జీతం ఇవ్వటం మొదలెట్టింది. యానాం పెద్దొర ప్రతీ స్కూలును నెలకు రెండుసార్లు చొప్పున తణిఖీలు నిర్వహించినట్లు 1864 నుంచీ ఉన్న రికార్డులు చెపుతున్నాయి. (Ref: India card 480 - D 715)

1920 లో Valmry అనే ఫ్రెంచి అధికారి ఆధ్వర్యంలో ఒక కమిషన్ యానాం విద్యా వ్యవస్థను అధ్యయనం చేసినపుడు అక్షరాస్యతా 28 శాతం ఉంది. అంటే అప్పటి మొత్తం 5823 మంది జనాభాలో 3949 మంది నిరక్షరాస్యులే. 1951 నాటికి యానాం అక్షరాస్యత 33 శాతానికి పెరిగింది.

## ముగింపు

ఆనాటి విద్యావిధానంలో ఫ్రెంచి మరియు తెలుగు మీడియం లలో బోధన జరిగేది. తెలుగు మీడియం విద్యార్థులకు ఫ్రెంచిభాష నేర్చుకోవటం తప్పనిసరి. ముస్లిం విద్యార్థులకొరకు ఉర్దూ ఉండేది.

1898 నాటి లెక్కల ప్రకారం మొత్తం టీచర్ల సంఖ్య 24 కాగా, వారిలో 8 మంది ఫ్రెంచి టీచర్లు, 13 మంది తెలుగు టీచర్లు, (అంటే తెలుగులో బోధించే టీచర్లు అని– కొంతమంది ఫ్రెంచి దేశస్థులు కూడా తెలుగును నేర్చుకొని బోధన జరిపేవారు), ఇద్దరు కన్య స్త్రీ/సిస్టర్ టీచర్లు, ఒక ఉర్దూ టీచరు (Mr. Fathidine) ఉన్నారు. అప్పట్లో మిషనరీ సిస్టర్‌లచే నడపబడిన కాన్వెంటు ప్రస్తుతం మిని సివిల్ స్టేషను ఉన్న ప్రాంతంలో ఉండేది.

ఏది ఏమైనప్పటికీ యానాంలోని ఆధునిక విద్యావ్యవస్థ ప్రారంభదశలలో ఫ్రెంచి మిషనరీలు చేసిన సేవలు గణనీయమైనవి. ఆనాటి కన్యస్త్రీల సమాధులు నేటికీ యానాంలోని ఫ్రెంచి సెమెటరీలో చూడవచ్చును. ఫ్రెంచి వారు యానాంలో మిగిలిన శాఖల కన్నా విద్యావ్యాప్తికే ఎక్కువ నిధులు కేటాయించారన్న విషయం కూడా గమనించదగ్గది.

కుల మతాలకు అతీతంగా విద్యనందించటంలో ఫ్రెంచి వారు పొరుగునున్న బ్రిటిష్ వారికన్నా ముందున్నారు. యానానికి చెందిన ప్రముఖ కవి శిఖామణి ఒక చోట "నేను యానాంలో పుట్టి పెరగటం వలన కులపరమైన వివక్షను పెద్దగా ఎదుర్కొన లేదు" అని అన్నారు. బహుసా ఆ వ్యాఖ్యకు మూలాలు పై వ్యాసంలో దొరుకుతాయి.

# ఆనాటి రాజకీయ చిత్రం

యూరోపియన్‌లు భారతదేశాన్ని తమ కాలనీలుగా చేసుకోవటానికి మొదట్లో వారిని ఆకర్షించింది 'పత్తి' అంటే ఆశ్చర్యం కలుగక మానదు. పత్తిపంట యూరప్‌దేశాలలో ఉండదు. వారి దుస్తులు ఊలుతో తయారయ్యేవి. కాటన్ దుస్తులలో వారికి **'ఉజ్వలమైన వ్యాపార భవిష్యత్తు'** కనిపించింది. ఇక్కడ తయారయ్యిన కాటన్ వస్త్రాలను యూరప్ మార్కెట్లకు తీసుకువెళ్ళి అధికధరలకు విక్రయించి విపరీతంగా లాభాలార్జించటం మొదలుపెట్టారు. తమ వ్యాపార స్థిరీకరణ కోసమని స్థానిక రాజులకు బహుమతులిచ్చి 'మంచి' చేసుకోవటం ద్వారా స్థానిక రాజకీయాలలో వేలు పెట్టటం మొదలెట్టారు. ఈ జోక్యం ఎంతవరకూ వెళ్ళిందంటే ఇంగ్లీషు వారు 'బ్రిటిష్ ఇండియా' ను ఫ్రెంచివారు 'ఫ్రెంచి ఇండియా' ను నిర్మించేటంత వరకూ సాగింది.

ఒక ఒరలో రెండు కత్తులు ఇమడవన్న రీతిలో ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు ఆధిపత్యం కోసం అనేక యుద్ధాలు చేసుకొన్నారు. డూప్లే కాలంలో ఫ్రెంచి వారిదే పైచేయి గా ఉన్నప్పటికీ, చివరకు ఇంగ్లీషువారు వివిధ ఒప్పందాల ద్వారా వీరిని భారతదేశంలో పాండిచేరీ, మాహే, కారైకాల్, చంద్రనాగూర్, మచిలీపట్నం యానాం వంటి ప్రాంతాలకు పరిమితం చేయగలిగారు. యానాం, మచిలీపట్నం వంటి ప్రాంతాల వల్ల ఫ్రెంచిఇండియా ప్రభుత్వానికి ఒకానొక దశలో ఏవిధమైన ఆర్థికలాభం లేకపోయినా వాటిని తమ 'గౌరవచిహ్నాలు' గా భావించుకొంది. వీటిని వదిలించుకోవటం అంటే ఫ్రెంచి ఇండియా నిర్మాణ సమయంలో వేల సంఖ్యలో అసువులు బాసిన ఫ్రెంచిసైనికుల బలిదానానికి అర్థం లేకుండా పోతుందని తలచింది.

1701 లో జారీ చేసిన ఒక రాజశాసనం ద్వారా పాండిచేరీలోని గవర్నరుకు పరిపాలన విషయంలో ఫ్రాన్స్ ప్రభుత్వం సర్వాధికారాలు కట్టపెట్టింది. చాలా కాలంవరకూ గవర్నరే పాలనా వ్యవహారాలు నడిపించేవారు. ఫ్రెంచి గవర్నరుకు పరిపాలనా వ్యవహారాలలో సూచనలు ఇవ్వటానికని, 1790 లో 27 మంది పౌరులతో కూడిన ఒక జనరల్ అసెంబ్లీ ఏర్పాటు చేసుకోవటం ద్వారా ఫ్రెంచి ఇండియాలో మొదటిసారిగా పరిపాలనలో పౌరుల భాగస్వామ్యం మొదలయ్యిందని చెప్పవచ్చును. 1791 జూలై 5 న పాండిచేరి ప్రజలు





సమావేశమయి, ఆ సంఖ్యను 21 కి కుదించి ఆ కూటమికి 'కలోనియల్ అసెంబ్లీ' అని పేరు పెట్టారు. వీరందరూ ఫ్రెంచి దేశస్థులే. ఈ 21 మందిలో 15 మంది పాండిచేరీ నుంచి, ముగ్గురు చంద్రనాగూరునుంచి, మాహే కారైకాల్ యానాంల నుంచి ఒక్కొక్కరు చొప్పున అభ్యర్థులుండాలని నిర్ణయించారు. ఇదే సమయంలో ఇతర ఫ్రెంచికాలనీలుగా ఉన్న సూరత్, కాలికట్, మచిలీపట్నం ల నుండి ప్రాతినిధ్యం లేకపోవటంతో వాటిని యానానికి అనుసంధానం చేసారు.

ఈ కలోనియల్ అసెంబ్లీకి యానాం నుంచి ఒక ప్రతినిధి ఉండేవాడు. పాండిచేరీలో జరుగుతున్న ఈ రాజకీయ ప్రక్రియలపట్ల ఉత్తేజితులైన కొంతమంది యానాం పౌరులు ఇక్కడ కూడా 'యానాం కలోనియల్ అసెంబ్లీ' ని ఏర్పాటు చేసుకొన్నారు. దీనికి Marietta ను ప్రెసిడెంటుగాను, Pithois ను వైస్ ప్రెసిడెంటుగాను ఎన్నుకొన్నారు. 1791లో యానాం కలోనియల్ అసెంబ్లీ కి 'యాక్టివ్ సిటిజెన్స్ అసెంబ్లీ' గా పేరు మార్చారు. ఈ అసెంబ్లీకి అప్పటి పెద్దొర సొన్నరెట్ కు మధ్య అనేక వివాదాలు నడిచాయి. 1793 లో ఫ్రెంచి కాలనీలను బ్రిటిష్ వారు ఆక్రమించుకోవటంతో ఈ మొత్తం వ్యవస్థ తుదిరూపు దిద్దుకోకముందే అదృశ్యమైపోయింది.

## స్థానికమండలి – మున్సిపల్ కౌన్సిల్ ఆవిర్భావాలు

ఆనాటి యానాం రాజకీయ చిత్రంలో రెండు వ్యవస్థలుండేవి. నలుగురు సభ్యులుతో ఉండే స్థానిక మండలి మరియు 12 మంది మెంబర్లతో ఉండే మున్సిపల్ కౌన్సిలు. ఇంతమంది ఉన్నా వీరి పాత్ర పర్యవేక్షణకే తప్ప నిర్ణయాధికారాలు ఏమీ లేవు. ట్రెజరీ, విద్యావ్యవస్థ, ప్రజాపనులు, పన్నులు, పోలీసు, వైద్యం, రవాణా వంటి వివిధ శాఖలకు సంబంధించిన విశిష్టాధికారాలు అన్నీ పెద్దొర చేతిలో ఉండేవి. ప్రజలచే ఎన్నుకొన్న ఈ మొత్తం 16 మంది ప్రతినిధుల పాత్ర సలహాలు, సంప్రదింపులకే పరిమితం.

25 జనవరి, 1871 న ఫ్రెంచి ప్రభుత్వం జారీ చేసిన ఒక డిక్రీ కి అనుగుణంగా యానాంలో స్థానిక మండలి (Local Council) ఏర్పాటు జరిగింది. దీనిలో నలుగురు మెంబర్లు మరియు వారినుంచి ఒక అధ్యక్ష్యుడు ఉంటారు. 21 సంవత్సరములు దాటిన పౌరులు ఈ మెంబర్లను ఎన్నుకొంటారు. ఈ నలుగురిలో ఒకరు పాండిచేరీలో కల జనరల్ కౌన్సిల్‌కు యానాం తరపు మెంబరుగా పంపబడేవాడు. 28 మంది సభ్యులుండే పాండిచేరీ జనరల్ కౌన్సిల్ తరపున ఫ్రాన్స్ లోని ఫ్రెంచి సెనేట్ కు ఒక ప్రతినిధిని పంపించేవారు. ఇదీ అప్పటి రాజకీయ వ్యవస్థ.

1880 లో ఫ్రెంచి ప్రభుత్వం మరో డిక్రీ ద్వారా స్థానిక పరిపాలన కొరకు మున్సిపాలిటీలను ఏర్పాటుచేసింది. ఆ విధంగా 1880 మార్చి, 12 న యానాం మున్సిపాలిటి పన్నెండు వార్డులతో ఏర్పడింది. ఈ పన్నెండు వార్డులకు సాధారణ ఎన్నికల ద్వారా 12

మంది మెంబర్లు ఎన్నికవుతారు. వీరిలో ఒకరు మేయర్ గా ఎన్నిక కాబడి స్థానిక పరిపాలనను పర్యవేక్షిస్తాడు.

**స్థానికమండలి మొదటి ఎలక్షన్లు**

భారతదేశానికి ప్రజాస్వామ్యపు తొలిరోజులవి. 1872 లో 21 సంవత్సరములు నిండిన అర్హత కలిగిన 1394 మందితో కూడిన యానాం ఓటర్ల లిస్టు తయారయ్యింది. ఫ్రెంచి దేశస్థులకు, భారతీయులకు విడివిడిగా ఓటరు లిస్టులుండేవి. ఆనాటి యానాంలో అతికొద్ది సంఖ్యలో ఫ్రెంచి దేశస్థులున్నప్పటికీ స్థానిక మండలిలో వారి ప్రాతినిధ్యానికేమీ లోటులేకుండా చూసుకొనేవారు.

1872 లో యానాంలో ప్రప్రథమంగా స్థానిక మండలి ఎలక్షన్లు జరిగాయి. ప్రజలకు ఎలక్షన్ల పట్ల ఏ మాత్రమూ అవగాహన లేని కారణంగా అభ్యర్థులను పోటీ చేయమని బ్రతిమాలవలసి వచ్చిందట. ఈ ఎన్నికలలో కవల వెంకట చలపతి, పైడికొండల కృష్ణయ్య నాయుడు, కంతేటి సత్యప్రసన్నం, దకోస్టా జార్జ్ అనే నలుగురు మెంబర్లతో అప్పటి పెద్దొర Bayot అధ్యక్షతన యానాంలో మొదటి స్థానిక మండలి ఏర్పడింది. 1878 లో కవల వెంకటసుబ్బారాయుడు, పైడికొండల కృష్ణయ్యనాయుడు, దకోస్టా జార్జ్ ల స్థానాలలో సమతం వెంకట సుబ్బారాయుడు, కొమండూరి జియన్న, పైడికొండల సుబ్బారాయుడులు ఎన్నికయ్యారు. ఆ తరువాత కొమండూరి జియన్న స్థానంలో బెజవాడ బాపనయ్య నాయుడు ఎన్నికయి కొంతకాలం స్థానిక మండలి అధ్యక్ష్యునిగా పనిచేసారు.

1879–1884 లలో యానాం నుంచి Le Faucheur మరియు పైడికొండల సుబ్బారాయుడులు పాండిచేరీలోని జనరల్ కౌన్సిల్ కు పంపించబడ్డారు. 1884 లో లె ఫాషర్ స్థానాన్ని బెజవాడ బాపనయ్య నాయుడు కైవసం చేసుకొన్నారు.

**మున్సిపల్ కౌన్సిల్ మొదటి ఎలక్షన్లు**

1880 మార్చి లో జరిగిన యానాం ప్రథమ మున్సిపల్ ఎన్నికలలో బెజవాడ బాపనయ్యనాయుడు విజయ ఢంకా మోగించారు. కంతేటి సత్యప్రసన్నం, పైడికొండల కృష్ణయ్య, కసిరెడ్డి బ్రహ్మానందం, కోన నరసయ్య, సిదరాల సన్యాసయ్య, అబ్దుల రెహ్మాన్, కసిరెడ్డి తిమ్మన్న, ఎర్రంశెట్టి వెంకట రామయ్య, Pharamond లు మెంబర్లుగా ఎన్నికయ్యారు.

**వివిధ సార్వత్రిక ఎన్నికలు – గెలుపోటములు**

బెజవాడ బాపనయ్యనాయుడు అశేషప్రజల అభిమానం చూరగొన్నప్పటికీ, ఆయనకు 25 సంవత్సరములు నిండని కారణంగా మేయర్ పదవికి అనర్హుడంటూ ప్రత్యర్థులైన పైడికొండల సుబ్బారాయుడు, కామిశెట్టి పేరమనాయుడులు చేసిన అభియోగాలు ఋజువు కావటంతో







ఆయన ఎన్నిక చెల్లదంటూ యానాం కోర్టు తీర్పుచెప్పింది. దరిమిలా యానాంలో మరలా మున్సిపల్ ఎన్నికలు జరిగాయి.

1883 ఎలక్షన్లలో పైడికొండల సుబ్బయ్య మేయర్ గా విజయం సాధించారు. Pharamond, బెజవాడ బాపనయ్యనాయుడు, సిదరాల సన్యాసయ్య, కసిరెడ్డి బ్రహ్మానందం, వర్ధినీడి కొండలనాయుడు, సమతం వెంకటసుబ్బారాయుడు, అబ్దుల్ రెహ్మాన్, Kerjean Theophile లు మెంబర్లు గా ఎన్నికయ్యారు. బెజవాడ బాపనయ్యనాయుడు 1885 లో మేయరు పదవిని తిరిగి దక్కించుకొన్నారు. పైడికొండల సుబ్బయ్య 1886 లో చనిపోవటాన్ని బట్టి ఆయన బహుసా అనారోగ్యకారణాల వల్ల 1885లోనే మేయరు పదవినుంచి వైదొలగి ఉండవచ్చు. బెజవాడ బాపనయ్యనాయుడు కౌన్సిల్ లో విజే (చెళ్ళపిల్ల వారు తాను యానాంలో చదువుకొనేటపుడు, విజే అనే ఒక టీచర్ ఉండేవారు అని చెప్పింది వీరి గురించే) కాళ్ళ రాయపురాజు అనే ఇద్దరు కొత్త మెంబర్లు చేరారు.

సమతం వెంకటసుబ్బారాయుడు 1886 లో కొంతకాలం మేయర్ పదవి అధిష్టించారు. వీరినుంచి మరలా బెజవాడ బాపనయ్యనాయుడు అదే సంవత్సరంలోనే మేయర్ పదవిని స్వీకరించి 1890 డిశంబరు 19 న జరిగిన స్థానిక కౌన్సిల్ కు మొదటి మెంబరుగా ఎన్నికయ్యేవరకూ కొనసాగారు. ఈ ఎన్నికలలో ఆనాటి యానాం మొత్తం ఓటర్లు 1103 లో 715 మంది తమ ఓటు హక్కును వినియోగించుకొన్నారు. బెజవాడ బాపనయ్య 429 ఓట్లను సంపాదించుకొని విజయం సాధించారు. ఇదే ఎలక్షన్లలో పుణ్యమూర్తుల వెంకటసుబ్బారాయుడు కూడా విజయం సాధించి రెండవమెంబరు స్థానాన్ని కైవశంచేసుకొన్నారు.

1891 లో జరిగిన ఎలక్షన్లలో కోన నరసయ్య మేయరు గా, పుణ్యమూర్తుల వెంకటసుబ్బారాయుడు, బెజవాడ బాపనయ్యనాయుడు, కాళ్ల రాయపురాజు, సమతం కృష్ణయ్య, వెలగలపూడి లింగయ్య, కాపగంటి చినసారయ్య, కూనపురెడ్డి కృష్ణ, గిరి సుబ్బారాయుడు, సాత్తార్ సాహెబ్, వంకాయల వీరన్న, వంటెద్దు వెంకటస్వామి లు మెంబర్లుగాను ఎన్నికయ్యారు.

వీరిలో కూనపురెడ్డి కృష్ణమ, సత్తర్ సాహెబ్ లు గతించటం వలన మరియు వంకాయల వీరన్న రాజీనామా చేయటంతో ఖాళీలను బర్తీచేయటానికి 1892, డిశంబరు 4 న మధ్యంతర ఎన్నికలు జరిగాయి. మొత్తం 1115 ఓటర్లకు గాను 382 మంది మాత్రమే ఓటుహక్కు వినియోగించుకోవటం గమనార్హం. కొల్లూరి భీమయ్య, కశిరెడ్డి వెంకయ్య, బళ్ళ లక్ష్మయ్య లు కొత్త మెంబర్లుగా ఎన్నికయ్యారు.

1894 లో బెజవాడ బాపనయ్య నాయుడు మేయర్ పదవి దక్కించుకొని చాలాకాలం కొనసాగారు. 1899 ఎలక్షన్లలో బెజవాడ బాపనయ్యనాయుడు తన మేయర్ పదవిని నిలబెట్టుకొన్నారు.

1903నాటి యానాం మున్సిపల్ కౌన్సిల్ కు మేయరుగా బెజవాడ బాపనయ్య నాయుడు, సమతం వెంకట సుబ్బారాయుడు, కోన సత్తియ్య, ఇబ్రహిం ఖాన్, కాపగంటి సత్తిరాజు, కూనపురెడ్డి సుబ్బారాయుడు, కోన కృష్ణ, బళ్ళా వెంకట రత్నం, పుణ్యమూర్తుల వెంకట సుబ్బారాయుడు, వంటెద్దు వెంకట స్వామి లు మెంబర్లుగాను ఉన్నారు.

1912 లో అప్పటి మేయరయిన సమతం వెంకటసుబ్బారాయుడు అనారోగ్యకారణాలతో పదవినుండి వైదొలగడంతో ఆయన కుమారుడు సమతం లక్ష్మీనర్సయ్య మేయర్ పదవిని పొందారు.

బెజవాడ బాపనయ్యనాయుడు 1914 లో తాను చనిపోయేవరకూ యానాం కౌన్సిల్ మెంబరుగా కొనసాగారు. ఆయన మరణంతో వారి కుమార్డు బెజవాడ వెంకటరెడ్డి రాజకీయాలలో ప్రవేశించారు. వీరు పిన్నవయసులో చనిపోవటంచే వీరి కుమారుడు బెజవాడ బాపన్నాయుడు (తాత గారి పేరు) ప్రవేశించి 1922 లో మున్సిపల్ మెంబరుగా ఎన్నికయ్యారు.

1922 లో కామిశెట్టి అయ్యప్పనాయుడు మేయరు పదవి దక్కించుకొన్నారు. 1881 నుంచి కామిశెట్టి పేరమనాయుడు రాజకీయాలకు దూరంగా ఉంటూ వచ్చారు. వీరి కుమార్డు కామిశెట్టి వేణుగోపాలరావునాయుడు 1922 ఎలక్షన్లలో స్థానిక మండలి మెంబరుగా ఎన్నికయ్యారు.

1925 లో కాపగంటి మంగయ్య, ఇబ్రహిం ఖాన్, కామిశెట్టి వేణుగోపాలరావు నాయుడు, కాళ్ళ వెంకటరత్నం లు స్థానికమండలి మెంబర్లుగా ఉన్నారు. ఇదే సమయంలో బెజవాడ బాపన్నాయుడు మున్సిపల్ మేయర్ గాను, కొత్త వెంకటరత్నం, మాజేటి సోమరాజు, కాపగంటి సత్తిరాజు, సమతం లక్ష్మీనరసయ్య, గిరిమాధవరావు, దవులూరి చినవీరాస్వామి, కనకాల బ్రాహ్మడు, కోన వెంకటరాజు, ఉడతా రెడ్డినాయుడు, సాదనాల వెంకన్నలు మెంబర్లుగాను ఉన్నారు.

1925 ఎన్నికలలో పరాజయం పాలయిన అభ్యర్ధులలో కామిశెట్టి వేణుగోపాలరావు నాయుడు, ఎర్రా జగన్నాథరావు, వెలగలపూడి వీరయ్య, మహమ్మద్ ఉస్మాన్, నాగసూరి కామరాజు, కనకాల చిన నరసయ్య, తిక్కిరెడ్డి సత్యానందం తదితరులు ఉన్నారు. 1930 లో మహమ్మద్ ఉస్మాన్ స్థానంలో బులుసు సుబ్రహ్మణ్య శాస్త్రులు వచ్చి చేరారు.

పాండిచేరి నాయకులకు యానాం నాయకులకు మధ్య సత్సంబంధాలు ఉండేవి. 1928 లో బెజవాడ బాపన్నాయుడు పాండిచేరి కి చెందిన సెల్వరాజు చెట్టియార్ ను యానాం నుంచి పోటీ చేయించి, గెలిపించి పాండిచేరి కౌన్సిల్ కు పంపించటం జరిగింది.

1931 లో జరిగిన మున్సిపల్ ఎన్నికలలో కామిశెట్టి వేణుగోపాలరావు నాయుడు మేయర్ పదవిని దక్కించుకొన్నారు. తోట రామన్న, నాగసూరి వెంకటరాజు, చిక్కాల సీతయ్య, తిక్కిరెడ్డి సత్యానందం, షేక్ అహ్మద్, కొమ్మిరెడ్డి రామన్న, కొత్త వెంకట రత్నం, బెజవాడ బాపన్నాయుడు, కనకాల బ్రాహ్మడు, కోన వెంకట రాజులు విజయం సాధించారు.





1934 లో మరలా జరిగిన ఎన్నికలలో కామిశెట్టి వేణుగోపాలరావునాయుడు బృందం ఘనవిజయం సాధించింది. బెజవాడ బాపన్నాయుడుకు కుడిభుజమైన సమతం లక్ష్మీనరసయ్య 1933 లో మరణించటంతో ఆయన ఒంటరిపోరు సలపవలసి వచ్చింది. ఈ ఎలక్షన్లలో తోట నరసింహస్వామి, కోన సుబ్బారావు, చింతా బ్రహ్మానందం, చిక్కాల సూర్యనారాయణ, కామిరెడ్డి వెంకటస్వామి, కుంచం రావి వంటి కొత్త నాయకులు మున్సిపల్ మెంబర్లుగా తెరపైకి వచ్చారు.

## ప్రతిపక్షాల ఐక్యత

1931 నుంచి కామిశెట్టి వేణుగోపాలరావునాయుడు వర్గం రాజకీయంగా రోజు రోజుకూ బలపడుతూండటంతో, ప్రతిపక్షాలు ఒకానొక దశలో ఏమీచేయలేక నిస్సహాయులైపోవలసి వచ్చింది. రాజకీయాలలో ఆరోపణలు, ప్రత్యారోపణలు సహజమే. అధికారాన్ని అనుభవిస్తున్న కామిశెట్టి ఈ సమయంలో అనేక ఆరోపణలను ఎదుర్కోవలసివచ్చింది. అంతవరకూ బెజవాడ వర్గంలో ప్రధాన పాత్రవహించిన తోట రామన్న వంటి వారు కామిశెట్టి పక్షాన చేరిపోయారు. 1935 లో జరిగిన కౌన్సిల్ ఎన్నికలలో బెజవాడ వర్గం తరపున పోటీ చేసిన మద్దింశెట్టి సత్యనారాయణ (ఫ్రెంచి టీచరు) అయిదు ఓట్లు మాత్రమే పొందగలిగారు. బెజవాడ బాపన్నాయుడు కూడా ఈ ఎన్నికలలో పోటీచేయగా ఆయనకు కూడా అయిదు ఓట్లు మాత్రమే రావటం, ఆయన ప్రత్యర్ధికి 587 ఓట్లు రావటం అనేది కామిశెట్టి వర్గం ఆధిపత్యాన్ని తెలియచేస్తుంది. ఈ ఎన్నికలలో భారీస్థాయిలో రిగ్గింగు జరిగిందని బెజవాడ బాపన్నాయుడు వేసిన కోర్టు కేసు కొట్టివేయబడింది.

ఈ సమయంలో కామిశెట్టి వ్యతిరేక వర్గం చేతులుముడుచుకొని కూర్చోక అధికార పక్షం కనుసన్నల్లో జరిగే అనేక అవకతవకలను ప్రభుత్వం దృష్టికి తీసుకువచ్చేది. అప్పటికి 17 నెలలుగా వెల్ఫేర్ కమిటీ నెల నెలా ఇచ్చే ప్రభుత్వ పించనులను పంపిణీ చేయటం లేదని ఆ సొమ్ము స్వాహా అయిపోతున్నదని, పించనులు అందక లబ్దిదారులు బిక్షాటన చేసుకొంటున్నారని, కొంతమంది ఆకలితో చచ్చిపోయారంటూ– ప్రతిపక్షం పాండిచేరీకి పిర్యాదులు చేసింది.

అప్పటి యానాం అడ్మినిస్ట్రేటరు అయిన జీవరత్నం, కామిశెట్టికి కొమ్ముకాస్తూ ప్రతిపక్షానికి చెందిన వారిపై అక్రమకేసులు బనాయించి వేధిస్తున్నారని బెజవాడ వర్గం ఆరోపించింది. బెజవాడ అనుచరుడైన దున్నా కమలనాభం ఇంటిపై కామిశెట్టి వర్గానికి చెందిన వారు దాడిచేసి ఆయనను, కుటుంబసభ్యులను గాయపరచారని తెలిపారు.

కామిశెట్టి వేణుగోపాలరావు నాయుడుకి ఫ్రెంచి రాదు కనుక ఆయన మేయర్ పదవికి అనర్హుడంటూ కోర్టులో కేసు వేయటం జరిగింది.

కామిశెట్టి ఆర్ధిక పరిస్థితి అంత బాగాలేని కారణంగా (453 రూపాయిల బాకీ చెల్లించని కారణంగా ఇంటిలోని వస్తువులను జప్తు చేయటం జరిగింది) పదివేల రూపాయిల మున్సిపల్ బడ్జెట్టును నిర్వహించే అర్హత అతనికి లేదని కూడా పిర్యాదు చేసారు.

యానాం నుంచి పదే పదే వస్తున్న పిర్యాదుల నేపధ్యంలో, విచారణ జరపమని పాండిచేరీ కోర్టు జడ్జి Mr. Philippon, ఇన్స్పెక్టర్ బసవా సుబ్బారాయుడు లను ఫ్రెంచి ప్రభుత్వం నియమించి డిశంబరు 1933 లో యానాం పంపించింది. వీరి విచారణలో ఈ అవకతవకలకు, ఘర్షణలకు కారణం అడ్మినిస్ట్రేటర్ జీవరత్నమని తేల్చటంతో, జీవరత్నాన్ని బదిలీచేసి కొమరన్ ను యానాం అడ్మినిస్ట్రేటర్ గా నియమించటం జరిగింది.

ఇలాంటి ఉద్రిక్త రాజకీయపరిస్థితుల నడుమ జనవరి 1935 లో ఫ్రెంచి గవర్నరు యానాం పర్యటనకు వచ్చారు. ఆయన గౌరవార్ధం మేయర్ హోదాలో కామిశెట్టి ఇచ్చిన విందుకు, బెజవాడ వర్గానికి చెందిన కౌన్సిల్ మెంబర్లను ఎవరినీ ఆహ్వానించలేదు. దీనికి ప్రతిచర్యగా బెజవాడ బాపన్నాయుడు తన ఇంటివద్ద ఒక రీడింగ్ రూమ్ శంఖుస్థాపన కొరకు గవర్నరుగారిని ఆహ్వానించి ఆయననే తన ఇంటికి రప్పించుకొన్నారు. కామిశెట్టితో విభేదించి బయటకు వచ్చేసిన యర్రా జగన్నాధరావు, గవర్నరుగారిని కలసి మేయరు పాలనలో జరుగుతున్న అవకతవకల గురించి పిర్యాదు చేసారు.

ఇదే సమయంలో యర్రా జగన్నాధరావు ఆధ్వర్యంలో ఒక గొప్ప విందు జరిగింది. కామిశెట్టి వ్యతిరేక వర్గం చేసిన ఒక రకమైన బలప్రదర్శన గా ఈ విందు నిలచింది. దీనికి యానానికి చెందిన అనేకమంది ఆనాటి ప్రముఖులు హాజరయ్యారు. అలా హాజరయిన వారిలో – బెజవాడ బాపనయ్య, ఇబ్రహిం ఖాన్, కాపగంటి సత్తిరాజు, నల్లం సుబ్బారావు, మహేంద్రవాడ వీరగణపతి శాస్త్రులు, కశిరెడ్డి వెంకటరామయ్య, దవులూరి చిన వీరాస్వామి, దున్నా కమలనాభం, సమతం గోపాలం, పంపన వీరాస్వామి, నల్లం సత్యానారాయణ, మద్దింశెట్టి సత్తిరాజు, దవులూరి రాజారావు, గల్లా శ్రీనివాసులు, మొహమ్మద్ ఉస్మాన్, తోట నరశింహస్వామి, గిరి మాధవరావునాయుడు, దవులూరి వెంకటరాజు, మొహమ్మద్ జిక్రియా, మలిపెద్ది అంకయ్య, గిరి లక్ష్మినారాయణ, మద్దింశెట్టి సత్యనారాయణ మూర్తి, మద్దింశెట్టి బాపన్న తదితరులు ఉన్నారు. (ఇరవయ్యవ శతాబ్దంలో ఫ్రెంచియానాంలో పేర్గాంచిన వ్యక్తులను గూర్చి తెలుసుకొటానికి ఉపయోగ పడుతుందని మొత్తం లిస్టు ఇవ్వటం జరిగింది-- రచయిత)

### యానాం రాజకీయచిత్రాన్ని మార్చివేసిన కలయిక

ఆనాటి యానాం నాయకులు పాండిచేరీలో ప్రధాన పాత్రవహించే కూటములకు మద్దతు పలికేవారు. ఆ విధంగా బెజవాడ బాపన్నాయుడు వర్గం పాండిచేరీలోని సెల్వరాజు చెట్టియార్ పక్షానికి మద్దతు ఇచ్చేది. ఒకానొక సందర్భంలో సెల్వరాజు ను యానాంనుంచి







గెలిపించటం కూడా జరిగింది. కామిశెట్టి వర్గం పాండిచేరీలోని జోసఫ్ దేవిడ్ పక్షాన నిలచేది. అలా యానాంలోని రెండు వర్గాలకు వారివారి గాడ్ఫాదర్ల ఆశీస్సులు, అండదండలు ఉండేవి. 1936 లో పాండిచేరిలో రాజకీయాలలో జరిగిన నాటకీయపరిణామాల వల్ల సెల్వరాజ చెట్టియార్, జోసఫ్ దేవిడ్ లు ఒకటైపోయారు. అందుచేత దాదాపు అరవై సంవత్సరాలుగా రెండు వర్గాలుగా విడిపోయి యానాం రాజకీయాల్ని నిర్ధేశిస్తూ ఉన్న బెజవాడ, కామిశెట్టి లు కలిసి పనిచేయవలసిన పరిస్థితి ఏర్పడింది.

ఆ విధంగా వీరిరువురూ కలిసి 1937 ఎలక్షన్లలో పోటీ చేసి విజయకేతనం ఎగరేసారు. వీరికి ప్రతిపక్షంగా ఎర్రా జగన్నాధరావు, తోట నరసింహమూర్తి, సమతం కృష్ణయ్య, నాగసూరి వెంకటరాజులు పనిచేసారు.

భిన్న పక్షాలు చేరి కూటమి కట్టినపుడు, ఒక దానిని మరొకటి మింగివేయటమనేది రాజకీయాలలో ఒక సహజపరిణామం. కామిశెట్టి వర్గం యానాం రాజకీయాలలో ఆ తరువాత కాలంలో మరో అర్ధశతాబ్దం పాటు ఏక ఛత్రాధిపత్యంగా కొనసాగటం ఆ మాటను నిజం చేసింది.

### మున్సిపల్ కమిషన్ పాలన

1937 ఎలక్షన్లలో అనేక అవకతవకలు జరిగాయన్న ఆరోపణలు రావటంతో, ఫ్రెంచి ప్రభుత్వం 1938 లో ఈ ఎన్నికలను రద్దు చేసి, మున్సిపల్ కౌన్సిల్ స్థానంలో మున్సిపల్ కమిషన్ ను ఏర్పాటు చేసింది. దీనికి అధ్యక్షునిగా మారిపళన్ ను, ఉపాధ్యక్షునిగా ఎర్రా జగన్నాథరావును నియమించింది. ఈ కమిషన్ మెంబర్లు గా కోన వెంకటరాజు, మలిపెద్ది అంకయ్య, కామిశెట్టి అయ్యప్పనాయుడు, శింగంశెట్టి కామరాజు లు వ్యవహరించారు. కొంత కాలానికి శింగంశెట్టి కామరాజు స్థానంలో ఉడతా సాంబశివరావు నియమితులయ్యారు. 1938 నుంచి 1946 లో మున్సిపల్ ఎన్నికలు జరిగే వరకూ యానాం మున్సిపల్ పరిపాలనా వ్యవహారాలను ఈ మున్సిపల్ కమిషనే చూసింది.

### మరలా ఎన్నికలు

ఫ్రెంచి ఇండియా ఎన్నికలకు రెండు రకాల వోటరు జాబితాలు ఉండేవి. ఒకటి ఫ్రెంచి దేశస్థులకొరకు మరొకటి భారతీయుల కొరకు. 1946 లో జరిగిన ఎన్నికలకు ఈ పద్దతికి స్వస్థి పలికి మొత్తం ఓటర్లందరినీ ఒకే జాబితా క్రిందకు తీసుకువచ్చారు. (యానాంలో ఫ్రెంచి దేశస్థుల సంఖ్య తక్కువగా ఉండటం వల్ల వారికోసం ప్రత్యేక జాబితా తయారుచేయటం 1899 లోనే నిలిపివేసారు). 1946 జూన్ 23 న జరిగిన మున్సిపల్ ఎలక్షన్లలో ఎర్రా జగన్నాధరావు మేయరుగా ఎన్నికయ్యారు. వీరి పానెల్లో గిరి మాధవరావు, అబ్దుల్ వహీద్

ఖాన్, దవులూరి వెంకటరాజు, తోట వెంకట వేణుగోపాలరావు, కాపగంటి సూర్యప్రకాశ రావు, నాటి చినవెంకన్న కామిశెట్టి భాష్యకారులు నాయుడు తదితరులు ఉన్నారు. వీరికి ప్రత్యర్థులుగా కసిరెడ్డి బ్రహ్మానందం, కామిశెట్టి పరశురామరావు నాయుడు, మద్దింశెట్టి సత్యానందం, కాపగంటి బులిమంగరాజు, గుర్రపు వెంకటరత్నం, రొక్కం వెంకటరెడ్డి వంటి ప్రముఖులు ఉండేవారు.

ఈ ఎలక్షన్లలో పోటీచేసి విజయం సాధించిన కామిశెట్టి పరశురాం కు 25 సంవత్సరములు నిండని కారణంగా ఆయన ఎన్నికను యానాం కోర్టు రద్దు చేసింది. అదే విధంగా మద్దింశెట్టి సత్యానందం పేరు ఓటర్ల లిస్టులో లేని కారణంగా ఆయన ఎన్నిక కూడా చెల్లదని తీర్పుచెప్పింది. ఇవే కాక ఈ ఎన్నికలలో అనేక అవకతవకలు జరిగినట్లు నిరూపణ కావటంతో, 1946 ఆగస్టు 12 నాటి ఈ ఎన్నికలను రద్దుపరుస్తూ యానాంకోర్టు తీర్పు చెప్పింది.

1948 లో జరిగిన మున్సిపల్ ఎలక్షన్లలో కామిశెట్టి పరశురాం బృందం విజయం సాధించి, ఆయన మేయర్ పదవి దక్కించుకొన్నారు. చింతా బ్రహ్మానందం, ఉడతా సాంబశివరావు, కాపగంటి బులిమంగరాజు, వెలగలపూడి వీరయ్య, అబ్దుల్ వహీద్ ఖాన్, కోటి సత్యం, మోకా మహలక్ష్మి, రొక్కం వెంకటరెడ్డి, కోన నరసయ్య, కనకాల తాతయ్య, యర్రా సత్యనారాయణమూర్తి లు (యర్రా జగన్నాథరావు కుమార్డు) మెంబర్లు గా నెగ్గారు. యానాం రాజకీయ చరిత్రలో ఈ ఎన్నికలు అత్యంత కీలకమైనవి, ఎందుకంటే, ఈ ఎన్నికలు ప్రధానంగా ఫ్రెంచి అనుకూల, వ్యతిరేక వర్గాల మధ్య జరిగాయి. కామిశెట్టి వర్గం ఫ్రెంచి అనుకూల ధోరణి కలిగిన రిపబ్లిక్ పార్టీ తరపున, యర్రా వర్గం ఫ్రెంచి వ్యతిరేక ధోరణి కలిగిన ప్రజా పార్టీ తరపున పోటీ చేసింది. వీటిలో కామిశెట్టి వర్గం అఖండ విజయం సాధించటంతో యానాం ప్రజలందరూ ఫ్రెంచి పాలనకు అనుకూలమని ఫ్రెంచి ప్రభుత్వం తలచింది. ఈ ఎలక్షన్లలో భారీఎత్తున రిగ్గింగు జరిగిందన్న ఆరోపణల కారణంగా ప్రభుత్వం ఈ ఎన్నికలను కూడా రద్దు చేసింది.

## అంతర్జాతీయ పరిశీలనా బృందం-యానాం పర్యటన

బ్రిటిష్ వారు భారతదేశం నుండి నిష్క్రమించటంతో ఫ్రెంచి వారిపై ఒత్తిడి పెరిగింది. వీరు కూడా భారతదేశాన్ని విడిచిపెట్టి వెళిపోవాలన్న డిమాండ్ ప్రాధాన్యత సంతరించుకొంది. మరో వర్గం ఫ్రెంచి వారికి అనుకూలంగా ఉంటూ వారు భారతదేశం నుండి వైదొలగరాదని కోరేది. ఇలాంటి పరిస్థితుల నడుమ 1947 లో ఫ్రెంచి ప్రభుత్వం తన కాలనీలకు, సముద్రానికి ఆవలనున్న ఫ్రాన్స్ యొక్క భూభాగం అనే అర్థం వచ్చేలా 'ఫ్రెంచి ఓవర్ సీస్ టెరిటరీస్' అని నామకరణం చేసింది. ఇలా చేయటం ద్వారా ఈ కాలనీలన్నీ ఫ్రాన్స్ అంతర్భాగాలని ప్రపంచానికి చెప్పటానికి ప్రయత్నించింది. ఫ్రెంచి కాలనీలు భారతదేశంలో విలీనం కావాలంటే 1948 లో చేసుకొన్న భారత్-ఫ్రెంచి ఒప్పందం ప్రకారం ప్రజలందరూ పాల్గొనే సాధారణ ఎన్నికల ద్వారా 'రిఫరెండం' జరగాలి. ఇట్టి రిఫరెండపు ఎన్నికలలో ఎప్పటిలానే రిగ్గింగులు, బెదిరింపులు ఉన్నట్లయితే ఆ విధంగా వచ్చే ఫలితం ఫ్రెంచివారికి అనుకూలంగా ఉండవచ్చుననే అనుమానాలు







తలెత్తాయి. అందువల్ల రిఫరెండం జరపటానికి తగిన పరిస్థితులు ఈ ఫ్రెంచికాలనీలలో లేవని భారత్ అంతర్జాతీయంగా తన నిరసనను తెలియచేసింది.

భారతదేశంలో ఫ్రెంచికాలనీలలో రిఫరెండం జరపటానికి తగిన పరిస్థితులు ఉన్నాయా లేవా అనే విషయాన్ని అధ్యయనం చేయటానికి 5 సభ్యులున్న అంతర్జాతీయ బృందం మార్చి 1951 లో పాండిచేరీలో అడుగు పెట్టింది. భారతదేశం ఈ బృందానికి అభ్యంతరం చెప్పకపోయినా ఈ బృందం ఇచ్చే రిపోర్టుకు కట్టుబడనని ముందే చెప్పేసింది. ఈ బృందంలో ఒకరైన ఆండ్రసన్ ఏప్రిల్ లో రెండురోజులపాటు యానాంలో బసచేసి విచారణ చేపట్టాడు. ఈయన కామిశెట్టి, మద్దింశెట్టి, గిరి మాధవరావునాయుడు, దవులూరి వెంకటరాజు, మహమ్మద్ జిక్రియా వంటి వారితో భేటీ అయి యానాం ఆర్థిక రాజకీయ పరిస్థితులను అడిగి తెలుసుకొన్నాడు. 1948 ఎన్నికల సమయంలో జరిగిన అవకతవకల గురించి సమాచారం అడిగి తెలుసుకొన్నాడు. యానాన్ని భారతావనిలో విలీనం చేయాలని పోరాడుతున్న దడాల రఫేల్ రమణయ్య ఆండ్రసన్ ను కలిసి మెమొరాండం సమర్పించారు.

యానాం చాలా ప్రశాంతంగా ఉందనీ, ఇక్కడి ప్రజలలో, అణగారిన వర్గాలకు చెందిన కొంతమంది వ్యక్తులు తప్ప మిగిలిన పురప్రముఖులందరూ ఫ్రెంచి పాలన ఉండాలని కోరుకొంటున్నారని ఆండ్రసన్ తన తన రిపోర్టులో పేర్కొన్నాడు. భారతదేశంలో రిఫరెండం జరిపే పరిస్థితులు లేవని ఈ బృందం రిపోర్టు ఇచ్చింది.

## యానాం మొదటి దళిత మేయరు

శ్రీ పాము రామమూర్తి గారు రచించిన 'తూర్పుగోదావరి జిల్లా ఆది ఆంధ్రప్రముఖుల జీవితచరిత్రలు' అనే పుస్తకములో శ్రీ గుర్రపు వెంకటరత్నం గురించి ఈ క్రింది విధంగా ఉంది.

""""శ్రీ గుర్రపు వెంకటరత్నం గారు శ్రీ గుర్రపు సత్తెయ్యగారి కనిష్టపుత్రులు. యానాం పురపాలక సంఘ ఎన్నికలలో వీరు తొమ్మిది సంవత్సరములు జయము పొందినారు. ఒక ఎన్నికలో పాల్గొన్న ఇరుపార్టీలందును సమానముగా సభ్యులు ఎన్నికైరి. ప్రభుత్వ పద్ధతి ప్రకారము అత్యధిక వోట్లు సంపాదించిన సభ్యుని మేయరుగా నిర్ణయించవలసి యున్నది. అట్టి నిబంధనల ననుసరించి వెంకటరత్నం గారు యానాం మేయరు పదవిని నలంకరించినారు. """

పై వివరణలో ఏ సంవత్సరములో ఆ సంఘటన జరిగిందో, ఎంతకాలం వారు మేయరుగా పనిచేసారో వంటి వివరాలు తెలియరావు. Journal officiel de l'Inde française అనే పేరుగల ఆనాటి ఫ్రెంచి ప్రభుత్వ పత్రిక యొక్క 1881 నుంచి 1943 వరకూ లభ్యంలోఉన్న కాపీలలో ఈ సంఘటన ప్రస్తావన లేకపోవటాన్ని బట్టి ఇది బహుశా ఆ తరువాత కాలంలో జరిగి ఉండొచ్చుని భావించాలి. (పై పత్రికలను http://gallica.bnf.fr/ అనే వెబ్ సైటులో చదువుకొనవచ్చును) 1930 లలో యానాంకు చెందిన శ్రీ దున్నా

వెంకటరత్నం గారు ఫ్రెంచి ప్రభుత్వంచే మేయరుగా కొంతకాలం నియమించబడ్డట్లు స్థానికులు చెపుతారు.

### కొన్ని విచిత్రమైన ఎన్నికలు

1900 సెప్టెంబరులో జరిగిన స్థానిక కౌన్సిల్ కు ఇద్దరు సభ్యులకొరకు ఎన్నికలు జరిగాయి. ఓటరు లిస్టులో ఓటర్ల సంఖ్య 859. వారిలో 288 మంది ఓట్ చేసారు. అలా బెజవాడ బాపనయ్య 288 ఓట్లతోను, సమతం కృష్ణమనాయుడు కూడా 288 ఓట్లను పొంది విజేతలుగా నిలిచారు. ఓటు హక్కును వినియోగించుకొన్నవారు 288 మంది. నెగ్గినవారికి సరిగ్గా 288 ఓట్లు మాత్రమే రావటం వైష్ణవమాయగా అనిపించకమానదు. ఒక వేళ ఇద్దరు అభ్యర్థులు మాత్రమే పోటీ చేసారనుకొన్నా ఇద్దరికీ సమానంగా ఓట్లు రావటం కూడా విడ్డూరమే!

1901 మే లో స్థానిక మండలికి ఒక అభ్యర్ధి ఎన్నిక జరిగింది. ఈ ఎన్నిక వివరాలను చూస్తే ఇవసలు ఎన్నికలా లేక ఏకగ్రీవ ఎన్నికా అనేది అర్ధంకాదు. మొత్తం 847 ఓటర్లు కాగా వారిలో 430 మంది ఓటు హక్కును వినియోగించుకొన్నారు. ఎంతమంది పోటీ చేసారో తెలియరాదు కానీ, సమతం లక్ష్మీనరసయ్య 429 ఓట్లతో పొంది విజయం సాధించినట్లు మాత్రమే రికార్డులు చెపుతున్నాయి. నెగ్గిన అభ్యర్థికి తగ్గిన ఒక ఓటు చెల్లని ఓటు అనుకోవటానికి లేదు. ఎందుకంటే ఈ ఎన్నికలలో చెల్లని ఓట్లేమీ లేవట! బహుసా ఆ ఒక్క ఓటు ఈయన పోటీ అభ్యర్థికి పడిఉండాలి. అది ఆయన ఓటేమో పాపం!

అప్పట్లో ఎన్నికల లో జరిగే అవకతవకలను వైరి వర్గాలు డేగకళ్ళతో వీక్షించేవారు. ఏ చిన్న లొసుగు ఉన్నా కోర్టును ఆశ్రయించేవారు. ప్రతీ ఎన్నిక అనంతరం తప్పనిసరిగా కోర్టు కేసులు నడిచేవి. చాలా కేసులు కొట్టివేయబడినా కొన్ని నెగ్గిన సందర్భాలు కూడా లేకపోలేదు.

### ఫ్రెంచి ప్రభుత్వం జరిపిన చివరి ఎన్నికలు

1951 లో నిర్వహించిన ఎన్నికలే ఫ్రెంచి ప్రభుత్వం నిర్వహించిన ఆఖరు ఎన్నికలు. భారతదేశంలో ఫ్రెంచి పాలన కొనసాగాలా వద్దా అని నిర్ణయించటానికి జరిపిన ఎన్నికలు ఇవి. 1948 లో యానాం ఓటర్ల సంఖ్య 1200 లు ఉండగా ఈ ఎలక్షన్లకు ఆ సంఖ్య 1662 కు పెరిగింది. ఈ ఎలక్షన్లలో కామిశెట్టి పరశురాం, యర్రాలు కలిసి మద్దింశెట్టి సత్యానందం, కనకాల తాతయ్య లకు వ్యతిరేకంగా పోటీ చేసారు.

ఈ ఎలక్షన్లలో కామిశెట్టి, యర్రాల వర్గం ఓడిపోయింది. మద్దింశెట్టి, కనకాల తాతయ్యలు విజయం సాధించారు. వీరిలో మద్దింశెట్టి మేయర్ పదవి చేపట్టారు. ఈ ఎలక్షన్లలో నెగ్గిన మెంబర్లు వరుసగా, మద్దింశెట్టి సత్యానందం, కనకాల తాతయ్య, దవులూరి వెంకటరాజారావు, గిరి మాధవరావు నాయుడు, నాటి చినవెంకన్న, కశిరెడ్డి బ్రహ్మానందం, కోన







నరసయ్య, సమతం కృష్ణయ్య, పంపన వీరాస్వామి, గుర్రపు వెంకటరత్నం, జ్ఞానవేల్ నాచియప్పన్ మొదలగువారు.

1947 లో బ్రిటిష్ వారు ఇండియా విడిచిపోవటంతో ఫ్రెంచి కాలనీలలో కూడా జాతీయభావనలు బలపడ్డాయి. తదనంతరం జరిగిన అనేక నాటకీయ పరిణామాల అనంతరం ఈ ఎన్నికలలో నెగ్గిన మద్దింశెట్టి సత్యానందం, కనకాల తాతయ్య, దవులూరి వెంకటరాజారావు, నాటి చినవెంకన్న మరియు కశిరెడ్డి బ్రహ్మానందం తదితరులు, అక్టోబరు 18, 1954 న పాండిచేరీ వద్ద కల కీళూరు లో జరిగిన అభిప్రాయసేకరణ లో యానాం తరపున పాల్గొని – ఫ్రెంచి కాలనీలను భారతదేశంలో విలీనం చేయాలని ఓట్ చేసారు. ఆ విధంగా యానాంలోని ఫ్రెంచి పాలనకు చరమ గీతం పాడబడింది.

### భిన్న రాజకీయ వర్గాలు – వివిధ దశలు

యానాం చిన్నప్రాంతం అవ్వటం, అప్పటి నాయకులు కూడా ఎక్కువగా ఒకే సామాజిక వర్గానికి చెందిన వారవ్వటం వలన చాలా సందర్భాలలో నెగ్గిన, ఓడిపోయిన పక్షాల వారి మధ్య ఏదో విధమైన చుట్టరికాలు ఉండేవి. అంతేకాక ఎన్నికలలో ఏ పానెల్ పై పోటీ చేసినప్పటికీ అవి ముగిసాక మేయర్ ఎన్నిక సమయంలో నెగ్గిన అభ్యర్థుల రాజకీయ పునర్వ్యవస్థీకరణ జరిగేది. ఆ కారణంగా యానాం రాజకీయపరంగా రెండు వర్గాలుగా స్థిరీకరణ జరగలేదు. అయనప్పటికీ యానాం రాజకీయ చిత్రాన్ని మూడు దశలుగా గుర్తించవచ్చును.

మొదటి దశలో బెజవాడ బాపనయ్య, కంతేటి సత్యప్రసన్నం, సమతం వెంకటసుబ్బారాయుడు, పుణ్యమూర్తుల వెంకట సుబ్బారాయుడులు ఒక వర్గంగాను – పైడికొండల సుబ్బయ్య, కామిశెట్టి పేరమనాయుడు, ఫారమాండ్ లు మరో వర్గం గా రాజకీయాలు నడచాయి. మొదటి వర్గంలోని బెజవాడ బాపనయ్య, పుణ్యమూర్తుల వెంకట సుబ్బారాయుడు, సమతం వెంకటసుబ్బారాయుడు ల స్థానాలలోకి వారి వారసులుగా బెజవాడ వెంకటరెడ్డి (కొంతకాలం మాత్రమే), పుణ్యమూర్తుల శ్రీవెంకట రమణప్రసాదరావు, సమతం లక్ష్మినరసయ్యలు రంగప్రవేశం చేసారు. కామిశెట్టి పేరమనాయుడు స్థానంలో వారి కుమారుడు వేణుగోపాలరావునాయుడు రంగప్రవేశం చేసారు. ఈ మొదటి దశకు చెందిన నాయకులు 1880–1920 ల మధ్య యానాం రాజకీయాల్ని నడిపించారు.

రెండవ దశలో బెజవాడ వెంకటరెడ్డి కుమారుడు బెజవాడ బాపన్నాయుడు, కొత్త వెంకటరత్నం, కాపగంటి చినమంగరాజు, సమతం లక్ష్మినరసయ్య, కనకాల బ్రాహ్మడు, బులుసు సుబ్రహ్మణ్యశాస్త్రి, మహేంద్రవాడ గణపతి శాస్త్రులు, కసిరెడ్డి గోపాలం, మలిపెద్ది అంకయ్య, దున్నా కమలనాభం, మద్దింశెట్టి సత్యనారాయణ, గిరి మాధవరావునాయుడు వంటి ప్రభృతులు ఒక వర్గం కాగా – కామిశెట్టి వేణుగోపాల రావు నాయుడు, యర్రా జగన్నాథరావు (వీరు

తరువాత కామిశెట్టితో విభేదించి విడిపోయారు), నాగసూరి కామరాజు, తిక్కిరెడ్డి సత్యానందం, కొల్లాటి రెడ్డినాయుడు, గ్రంధి లక్ష్మయ్య, నాగసూరి వెంకటరాజు, వెలగలపూడి వీరయ్య, కోన సుబ్బారావు, చింతా బ్రహ్మానందం, కామిరెడ్డి వెంకటస్వామి, కూనపురెడ్డి సుబ్బారాయుడు, దనార్లకోట వెంకటరాజాచారి తదితరులు మరో వర్గంగాను ఉండేవారు. ఈ రెండవతరం నాయకుల హవా 1920–1950 ల మధ్య నడిచింది.

మూడవ దశ ఫ్రెంచి యానాం రాజకీయ చరిత్రలో అత్యంతకీలక మైనది. 1948 లో జరిగిన ఎన్నికలు ఫ్రెంచి కాలనీల భవిష్యత్తు నిర్ణయించటానికి జరిగాయి. (ఈ ఎలక్షన్లనాటి ప్రధాన, వైరిపక్షాల వివరాలు ఇదే వ్యాసంలో చూడవచ్చును) 1951 ఎలక్షన్లలో నెగ్గిన నాయకులు అచంచల పోరాట ఫలితంగా యానాంలో ఫ్రెంచి పాలనకు తెరపడింది.

**ముగింపు**

యానాం నాయకులు ప్రారంభదశ నుండి పాండిచేరీ నాయకులతోనే తాము మమేకమయ్యారు. అలా చేయటం ద్వారా యానానికి మరింత మేలు చేయవచ్చునని వీరు భావించారు. యానాం ఎన్నికలలో మొదట్లో ఉండిన ఫ్రెంచి దేశస్థుల ప్రాతినిధ్యం క్రమక్రమంగా తగ్గిపోయింది.

1872 లో ఇక్కడ జరిగిన ఎన్నికలు భారతదేశంలోనే ప్రప్రథమంగా జరిగిన ప్రజాస్వామ్యయుత సాధారణ ఎన్నికలు. బ్రిటిష్ ఇండియాలో 1919 నుండి కౌన్సిల్ మెంబర్లను కొద్దిమంది ఉన్నత వర్గాల ప్రజలు మాత్రమే ఎన్నుకొనేవారు. సామాన్య ప్రజలకు ఓటుహక్కు ఉండేదికాదు. బ్రిటిష్ ప్రభుత్వం 1935 లో చేసిన చట్టం ద్వారా ఎన్నికలలో సామాన్య ప్రజలందరికీ ఓటుహక్కు కల్పించబడింది. ఆ విధంగా దబ్బయి లక్షలుండే ఓటర్ల లిస్టు మూడున్నర కోట్లకు చేరింది. కానీ ఫ్రెంచ్ ఇండియాలో 1871 లోనే 21 సంవత్సరములు నిండిన ఓటర్లందరికీ ఓటుహక్కు కల్పించబడింది.

ఎన్నికల ప్రక్రియపై అవగాహన లేకపోవటం వల్ల యానాం మొదటి ఎన్నికలలో 1394 మంది ఓటర్లకు 12 ఓట్లు మాత్రమే పోల్ అవ్వటం ఆశక్తిదాయకం.

ఎన్నికల తంతు ముగిసిన వెంటనే ఓడిపోయిన అభ్యర్థులు నెగ్గినవారి ఎన్నిక చెల్లదని కోర్టుకేసులు వెయ్యటం రివాజుగా ఉండేది. ఏవో రెండుమూడు కేసులను తప్ప దాదాపు అన్నిసార్లూ ఆయా కేసులను యానాం కోర్టు కొట్టివేసింది.

యానాం ఎన్నికలలో దళితుల ప్రాతినిధ్యం ప్రారంభంలో లేకపోయినా వారి ఉనికి నెమ్మది నెమ్మదిగా బయటపడింది. దున్నా కమలనాభం, గుర్రపు వెంకట రత్నం, మోకా మహలక్ష్మి, రొక్కం వెంకటరెడ్డి, కమిడి వెంకట స్వామి వంటివారు మెంబర్లుగా ఎన్నికయ్యారు. యానాన్ని భారతావనిలో విలీనం చేయటంలో శ్రీ దడాల రఫేల్ రమణయ్య పాత్ర అనన్యమైనది. ఫ్రెంచి ఇండియా ఎన్నికలలో ముస్లిముల పాతినిధ్యం కూడా సముచితంగానే ఉన్నట్లు తెలుస్తుంది.



ఇక బి.సి. లకు సంబంధించిన వివరాలే నిరాశను కలిగిస్తాయి. నాటి చినవెంకన్న, పంపన వీరాస్వామి, వెలగలపూడి వీరయ్య వంటివారు మాత్రమే మెంబర్లు గా ఎన్నికయ్యారు.



# ఆనందరంగ పిళ్లై డైరీలలో యానాం ప్రస్థావన

ఆనందరంగ పిళ్లై పాండిచెరీలో వివిధ గవర్నర్ల వద్ద పనిచేసిన దుబాసీ. ఈయన 1736–1761 ల మధ్య వ్రాసుకొన్న డైరీలలో ఆనాటి సామాజిక పరిస్థితులు ప్రతిభావంతంగా ప్రతిబింబించాయి. ఫ్రెంచి ఇండియా ప్రారంభ కాలంలో జరిగిన అనేక సంఘటనలను తన డైరీలలో అద్భుతంగా పిళ్లై ఆవిష్కరించాడు. బ్రిటిష్ వారికి ఫ్రెంచివారికీ జరిగిన అనేక ఆధిపత్యపోరులు, కలోనియల్ రాజకీయాలు, ఫ్రెంచివారి బలాలు బలహీనతలని పిళ్లై నిష్పక్షపాతంగా అక్షరీకరించాడు. పిళ్ళై చనిపోయిన సుమారు వందసంవత్సరాల తరువాత ఈ డైరీలు పిళ్లై ఇంటిలో పాతసామాన్ల గదిలో లభించగా వాటిని మొత్తం పన్నెండు వాల్యూములలో ముద్రించి, ఆనాటి ఫ్రెంచిఇండియా సమాజాన్ని ప్రపంచానికి అందించటం జరిగింది. తదనంతర కాలంలో ఫ్రెంచి ఇండియాను అధ్యయనం చేయాలనుకొనే వారందరికీ పిళ్లై డైరీలు విస్మరింపరాని రిఫరెన్సులుగా మారాయి.


ఆనంద రంగపిళ్ళై

పిళ్ళై డైరీలలో యానాం ప్రస్తావన అక్కడక్కడా కనిపిస్తుంది. (ఈ క్రింది వ్యాసంలో గవర్నరు అని వ్రాసిన చోట్ల – 1742 నుంచి 1754 అక్టోబరు 15 వరకూ డూప్లే గాను, 1754 అక్టోబరు మాసాంతంలో గొదెహు అని, 1754 నుంచి 1758 వరకూ జార్జి దువాల్ అని చదువుకోగలరు)

**17 ఏప్రిల్ , 1741:** యానాం, మెర్గి, పెగు, చంద్రనాగూర్ ల నుంచి ఒక్కో షిప్పు సరుకులతో పాండిచేరీ చేరాయి.

వివరణ: Mergui, Pegu లు బర్మా (మయన్మార్) కు చెందిన పోర్టులు. 17, 18 వ శతాబ్దాలలో ఫ్రెంచివారు ఈ ప్రాంతాలనుండి సేకరించిన సరుకులను ఈ పోర్టులనుండి రవాణా చేసే

చంద్రనాగూర్ అనేది యానాంలానే భారతదేశంలోని ఒక ఫ్రెంచి కాలనీ.

**21 మార్చి, 1746:** ఈ రోజు నిజాం ప్రభువు నుంచి ఒక ఉత్తరాన్ని అమీన్ సాహెబ్ అనే వార్తాహరుడు తీసుకొచ్చాడు. దానిలోని విషయాలు ఈ విధంగా ఉన్నాయి " యానాంలోని మీ ఫాక్టరీని (వ్యాపార కూడలి) నాశనం చేయటానికని సిద్దమవుతున్న శ్రీకాకుళం, రాజమండ్రి నవాబులకు – ఆ ప్రయత్నాన్ని విరమించుకొమ్మని చెప్పాము. మీ (ఫ్రెంచివారి) వ్యవహారాలలో జోక్యం చేసుకోవద్దని, మీతో స్నేహపూర్వకంగా మెలగమని వారికి ఆదేశాలిచ్చాము. వారు మా ఆదేశాలకు లోబడి ప్రవర్తిస్తారు. మీతో స్నేహ సంబంధాలను పెంపొందించుకోవాలని మేము (నిజాం ప్రభుత్వం) ఆశిస్తున్నాము.

**వివరణ:** ఈ ఉత్తరంలో ఆశించినట్లు ఫ్రెంచివారికి నిజాం ప్రభువులకు మధ్య ఆ తరువాత కాలంలో సంబంధాలు బలపడ్డాయి. వారి వారసత్వగొడవలలో తమ మిలటరీ సేవలను అందించి అందుకు ప్రతిఫలంగా అప్పటి నిజాం పాలిత ప్రాంతాలైన ఏలూరు నుంచి శ్రీకాకుళం వరకూ ఫ్రెంచివారు కానుకలుగా పొందారు.

పై ఉత్తరం తీసుకొచ్చిన అవాయ్ సాహెబ్ వ్యవహారశైలి ఆశక్తికరంగా అనిపిస్తుంది. ఈ ఉత్తరాన్ని ఎన్నో వ్యయప్రయాసలకు ఓర్చి హైదరాబాదు నుండి పాండిచేరీ తీసుకొచ్చాను కనుక తనకు ఓ పాతిక వేల రూపాయిల విలువ చేసే వస్త్రాలను లేక 'నెట్ కేష్' కానీ ఇప్పించమని గవర్నరు గారిని కోరతాడు. దీనికి గవర్నరు సమాధానం ఏమీ చెప్పకుండా ఒక తాంబూలం, గ్లాసుడు రోజ్ షర్బత్తులతో (అతిథి మర్యాద) ఆ సాహెబ్ గారిని సత్కరించి పంపించివేసాట్ట.

**8 ఆగష్టు, 1748:** ఉదయం 6 గంటలకు గవర్నరు గారి వద్దకు వెళ్ళాను. యానాం పెద్దొర సైన్ ఫ్రే (Sain Fray) కు రాసే ఉత్తరంలో, వల్లూరి అంతన్న ను పంపించమని రాస్తాను అన్న విషయాన్ని గవర్నరుగారికి గుర్తుచేసాను. ఆ విషయాన్ని మరచిపోయానని చెప్పి తన ఆఫీసుగదిలోకి వెళుతూ ' అతని పేరేమిటి' అని అడిగారు. 'వల్లూరి అంతన్న' అని చెప్పాను, ఆ విధంగా ఉత్తరం రాసారు.

వివరణ: ఈ వల్లూరి అంతన్న కథా కమామిషు ముందు ముందు వస్తుంది

**4 నవంబరు,1748:** యానాం ఫాక్టరీలో చాలాకాలంగా పనిచేస్తున్న వల్లూరి అంతన్న గవర్నరుగారి(డూప్లే) దర్శనం కోసం వచ్చాడు. అతన్ని తీసుకొని కోటకు వెళ్ళాను. ఇతను గవర్నరుగారికి కానుకలుగా సమర్పించటానికి రెండుపొడవైన వస్త్రాలు, 5 లుంగీలు, యాభై పగోడాల నగదు తీసుకొచ్చాడు. వాటి మొత్తం విలువ సుమారు105 పగోడాలు (పగోడా=సుమారు నాలుగు గ్రాములుండే బంగారు నాణెం) ఉండొచ్చు.





ఆ కానుకలను సమర్పిస్తూ అంతన్న ఇలా అన్నాడు – "యానాం ఫాక్టరీలో నేను 25 సంవత్సరాలుగా ఫ్రెంచి కంపనీ సేవలను చేస్తూ ఉన్నాను. ఇంతకు ముందు గవర్నర్లెవరూ కూడా మీయంత కీర్తి ప్రతిష్టలు పొందలేదు. మీ తరువాత మీ అంత సమర్ధులు రాబోరు. నా ఇంతటి సుదీర్ఘ ప్రయాణంలో నేను మీ మనిషిని అని చెప్పగానే అందరూ ఎంతో గౌరవంగా చూసారు. మీ యశస్సు దర్శించే భాగ్యం కలగడం నా అదృష్టం" ఆ మాటలు విన్న గవర్నరు గారు ఆనందించి " నీ ప్రయాణానికి ఎన్నిరోజులు పట్టింది" అని ప్రశ్నించారు. " ముప్పయి రోజుల క్రితం నేను పాండిచేరీకి బయలుదేరినపుడు అందరూ, ఈ ప్రాంతాన్ని (పాండిచేరిని) బ్రిటిష్ వాళ్ళు దాడిచేస్తున్నారు అని హెచ్చరించారు. కానీ నాకు మీ శక్తి సామర్ధ్యాలు, ధైర్య సాహసాలు తెలుసుకనుక – నేనిక్కడికి చేరేసరికి బ్రిటిష్ వారు తోక ముడిచి పోతారులే అన్నాను" అని జవాబిచ్చాడు. దీనికి మరింత ఆనందించిన గవర్నరుగారు నవ్వుతూ అంతన్నకు తాంబూలం, రోజ్ షర్బతులు తెమ్మని పురమాయించారు.



జోసఫ్ ఫ్రాంకాయిన్ డూప్లే (1697-1763)

యానాం పెద్దొర సైన్ఫ్రె వ్రాసిన లేఖను అంతన్న గవర్నరుగారికి అందచేసాడు. దానిని చదువుతుండగా వచ్చిన తాంబూలం, రోజ్ షర్బతులను గవర్నరుగారే స్వహస్తాలతో అంతన్నకు అందిస్తూ "చాలా సంతోషం. మనం మరలా తీరికగా మాట్లాడుకొందాం" అన్నారు.

ఆ తరువాత అంతన్న గవర్నరు గారి భార్యను (Madam Dupleux) కలిసి ఒక చీర, నాలుగు లుంగీలు, ఆరు కలంకారీ వస్త్రాలు బహూకరించాడు. వాటి విలువ సుమారు 30 పగోడాలు ఉండొచ్చు. ఆ తరువాత అంతన్న తన బసకు వెళ్ళిపోయాడు.

**వివరణ:** పై ఉదంతంలో అంతన్న అంచనాలు అతిశయోక్తులుగా కనపడినా భవిష్యత్తులో చాలామట్టుకు నిజాలయ్యాయి. ఫ్రెంచి ఇండియా గవర్నర్లలో డూప్లే కి వచ్చినంత పేరు ప్రఖ్యాతులు వేరెవరికీ రాలేదు. భారతదేశంలో ఫ్రెంచి రాజ్య స్థాపనలో డూప్లే ధైర్య సాహసాలు, మిలటరీ

దక్షత మరువరానివి. **డూప్లేకి ఫ్రాన్సు సంపూర్ణ మద్దతు ఇచ్చి ఉన్నట్లయితే భారతదేశంలో ఫ్రెంచి వలసరాజ్యం ఏర్పడి ఉండేదని చరిత్రకారుల ఒక ఊహాగానం.**

(డూప్లేను భారతదేశం నుంచి వెనక్కి పిలిపించేసిన తరువాత, ఫ్రాన్స్ ఇతనికి సరైన గుర్తింపును ఇవ్వలేదు సరికదా ఇతను తన స్వంత సొమ్మును, ప్రభుత్వ సొమ్మును కలగాపులగం చేసేసాడని అభియోగం మోపింది. దీనితో ఆర్ధికంగా చితికిపోయిన డూప్లే తన జీవిత చరమాంకం లో "ఆసియాలో నా దేశాన్ని బలోపేతం చేయటం కోసం నా యవ్వనాన్ని, సంపదను, ప్రాణాల్ని పణంగా పెట్టాను. నేను చేసిన కృషి ఫలితాలను నేడు అందరూ అనుభవిస్తూ నన్ను హీనుడని ముద్రవేసి విస్మరించారు" అని బాధపడ్డాడు. ప్రభుత్వం వద్ద ఉండి పోయిన స్వీయార్జిత సొమ్మును తిరిగి పొందటంలో విఫలమైన డూప్లే దుర్భర దారిద్ర్యంతో, దయనీయమైన స్థితిలో మరణించాడు. రి. www.indiablognote.com వెబ్సైట్)

ఈ అంతన్న తాను 25 సంవత్సరాలుగా ఫ్రెంచి కంపనీకి సేవలందిస్తున్నానని చెప్పుకొన్నాడు. ఈ సంఘటన 1748 లో జరిగింది. అప్పటికి 25 సంవత్సరాలంటే ఫ్రెంచివారు 1723 లో యానాంలో అడుగుపెట్టిన నాటి నుంచీ అన్నమాట. ఆ లెక్కన ఈ అంతన్న యానాన్ని ఒక ఫ్రెంచి కాలనీగా నిర్మించిన కుర్టన్ వద్ద కూడా పనిచేసి ఉండాలి. అంతే కాక గవర్నరు గారు " నీవు ఇంతకు ముందు పాండిచేరీ ఎపుడయినా వచ్చావా?" అని ప్రశ్నించినపుడు – 1731లో యానాం ఫాక్టరీ (వ్యాపార కూడలి) నిర్మాణ సమయంలో ఒకసారి వచ్చానని అంతన్న బదులివ్వటాన్ని బట్టి ఫ్రెంచి యానాం ప్రారంభదశలో ఈ అంతన్న ముఖ్య పాత్ర వహించాడని భావించాలి.

ఈ అంతన్న పై కొంతమంది గిట్టని వారు పిర్యాదు చేయటంతో డూప్లే ఇతన్ని పాండిచేరీ రప్పించటం జరిగింది. పిల్లై చొరవ తీసుకొని అంతన్న అమాయకత్వాన్ని, విశ్వసనీయతను నిరూపించటంతో డూప్లే అంతన్నను మెచ్చుకొని పంపించి వేసాడు.

**1 ఏప్రిల్, 1749:** యానాం లో కంపనీ తరపున పనిచేసే నాగేశ అయ్యన్ బంధువు అయిన మృత్యుంజయ అయ్యన్ పంపిన ఉత్తరాన్ని గవర్నరు గారికి అందచేసాను. ఆ ఉత్తరంలో M. Choisy అనే ఆసామీ, మృత్యుంజయ అయ్యన్ కు అప్పుపడిన డబ్బుల గురించి ఉంది. గవర్నరు గారు తెలుగులో ఉన్న ఆ ఉత్తరాన్ని ఫ్రెంచిలోకి అనువదించి ఇమ్మనమని అనటంతో చేసి ఇచ్చాను. దానిని ఆయన చదువుకొన్నారు. ఆ ఉత్తరాన్ని త్యాగు కు ఇచ్చి చాయిసీ గారి భార్యకు అందచేయమని పంపించారు.

**వివరణ:** చాయిసీ యానాం పెద్దొరగా పనిచేస్తూ 1747 లో ఇక్కడే చనిపోయాడు. యానాం వ్యాపారి మృత్యుంజయ అయ్యన్ కు చాయిసీ 4600 రూపాయిలు బాకీపడి తీర్చకుండానే మరణించాడు. దాని వసూలు నిమిత్తం మృత్యుంజయ అయ్యన్ గవర్నరుకు వ్రాసుకొన్న ఉత్తరం అది. మొత్తం చదువుకొన్న గవర్నరు ఆ ఉత్తరాన్ని అటెండరుకిచ్చి చాయిసీ గారి భార్యకు పంపించివేసి చేతులు దులుపుకొన్నాడు. (తదుపరి జరిపిన విచారణలో చాయిసీ ఆ అప్పును తీర్చివేసినట్లు తెలటం కొసమెరుపు).






అయ్యన్ వంటి నామాంతాలు తమిళ పేర్లకు ఉంటాయి. బాహుశా అప్పట్లో పాండిచేరికి చెందిన తమిళ వ్యాపారులు యానాం వచ్చి ఇక్కడ తమ కార్యకలాపాలు సాగించి ఉండ వచ్చని పై ఉదంతాన్ని బట్టి భావించవచ్చు.

**23 మే, 1750:** యానాం పెద్దొర లెనాయిర్ వ్రాసిన ఒక ఉత్తరాన్ని ఇద్దరు వార్తాహరులు తీసుకొచ్చారు. గవర్నరు గారు దానికి ప్రత్యుత్తరాన్ని వ్రాసి చిన్న కవరులో ఉంచి తనవద్దనున్న "తెలుగు" సీలు వేసి వారికి అందచేసారు. ఆ ఉత్తరంపై చిరునామా కుంజం కన్నయ్యన్, ఇంజరం అని వ్రాసారు. ఆ ఉత్తరాన్ని యానాం పెద్దొర లెనాయిర్ కు అందచేయమనీ, దారిలో ఎవరైనా ప్రశ్నిస్తే ఈ ఉత్తరం ఇంజరంలోని బ్రిటిష్ కంపనీ వ్యాపారి అయిన కుంజం కన్నయ్యన్ కు చెందినదని చెప్పమని గవర్నర్ అన్నారు. ఈ పని చేస్తున్నందుకు ఆ వార్తాహరులకు పదిరూపాయిల సొమ్మును అందచేసారు.

**వివరణ:** భారతదేశంపై పట్టు సాధించటం కోసం బ్రిటిష్ వారు ఫ్రెంచి వారు హోరాహోరీన తలపడుతున్న రోజులవి. ఒకరి ఎత్తుగడలను మరొకరు తెలుసుకోవటానికి అనేక గూఢచర్యాలకు పాల్పడేవారు. అలాంటి సమయంలో ఇద్దరు ఫ్రెంచి అధికారుల మధ్య నడిచే ఒక సమాచారం బ్రిటిష్ వారి కంట పడకూడదన్న ఉద్దేశంతో డూప్లే లెనాయిర్ కు పంపిస్తున్న ఉత్తరం పై ఇంజరానికి చెందిన ఒక బ్రిటిష్ వ్యాపారి చిరునామా వ్రాయటం అనేది ఒక యుద్ధ తంత్రంగా పై ఉదంతాన్ని బట్టి అర్ధంచేసుకోవాలి. పై సంఘటనలో గవర్నరు గారు "తెలుగు సీలు" వేసారు అని చెప్పటాన్ని బట్టి, వివిధ ప్రాంతాలకు వివిధరకాల సీళ్ళు ఉండేవని అనుకోవాలి.

**2 ఏప్రిల్, 1753:** కోటలో యానాం వస్త్రాలను వేరుచేయటం జరుగుతున్నదని ఉదయం ఆరున్నరకే వెళ్ళాను. చాలాసేపు అక్కడే ఉన్నాను. వేరుచేయబడిన యానాం వస్త్రాలను మొత్తం 38 బేళ్ళు గా పాకింగ్ చేసారు. ఆ వివరాలు రాసుకొని మరలా ఆఫీసుకు వెళ్ళిపోయాను.

**వివరణ:** యానాంలో ఉత్పత్తి అయిన క్లాత్ ఎక్కువ నాణ్యతను కలిగిఉండేది. దీన్ని ఇతర రకాలైన వస్త్రాల నుండి వేరు చేసి ఎక్కువ ధరకు విక్రయించేవారు.

**5 ఏప్రిల్, 1753:** మచిలీపట్నం నుంచి M.Aumont, Dargy లు పాండిచేరి చేరుకొన్నారు. వారి ద్వారా – యానాం మచిలీపట్నం ల వద్ద ఉన్న బుస్సీ తదితరులు తిరిగి వచ్చేస్తున్నారన్న విషయం తెలిసింది.

**వివరణ:** బుస్సీ 1751 లో నిజాం పాలకులకు మిలటరీ సహాయాన్నందించటం కోసం పాండిచేరీ నుండి బయలుదేరి చాలాకాలం దక్కను ప్రాంతంలోనే బసచేసాడు. 1753 జనవరిలో బుస్సీ అనారోగ్యకారణాల వల్ల గూఫీ అనే అధికారికి ఫ్రెంచి సైన్య నిర్వహణ భాధ్యతలను అప్పగించి విశ్రాంతి తీసుకోవటానికి మచిలీపట్నం వెళ్ళాడు. ఇదే అదునుగా భావించిన అప్పటి నిజాం

ప్రభువు లష్కర్ ఖాన్ దక్కను నుండి ఫ్రెంచి బలగాలను పంపించివేయటానికి కుట్ర పన్నటం మొదలెట్టాడు. డూప్లే ఈ విషయాన్ని తెలుసుకొని మచిలీపట్నంలో విశ్రాంతి తీసుకొంటున్న బుస్సీ ని వెంటనే పాండిచేరీ రమ్మనమని కబురు పంపించాడు. ఆ కబురందుకొన్న బుస్సీ తదితరులు పాండిచేరి వస్తున్నట్లు ఏప్రిల్ 5 న పిళ్లై కి వచ్చిన సమాచారం ఇది.

అలా పాండిచేరీ వచ్చిన బుస్సీ, డూప్లే ఆదేశాల మేరకు నిజాం ప్రభువును కలవటానికి బయలుదేరాడు. బుస్సీ శక్తి సామర్థ్యాలు, మిలటరీ దక్షతలను దృష్టిలో ఉంచుకొని, నిజాం ప్రభువు సింహాసనం దిగి బుస్సీకి ఎదురేగి స్వాగతం పలికాడు. వీరిమధ్య 1753 నవంబరులో జరిగిన ఒప్పందాల ప్రకారం, బుస్సీ నిజాం ప్రభువునుండి సారవంతమైన నేలలు కలిగిన శ్రీకాకుళం, రాజమండ్రి, కొండపల్లి, ఏలూరు వంటి ప్రాంతాలను గ్రాంటుగా పొంది కోస్తాతీరంలో ఫ్రెంచి పతాకాన్ని ఎగరవేసాడు. ఇవి అప్పట్లో రెండు లక్షల రూపాయిల వార్షికాదాయం కలిగి ఉండేవి.

**1 ఏప్రెల్, 1753:** నేను గవర్నరు గారి వద్దకు వెళ్ళినపుడు ఆయన "యానాం నుంచి వివిధ సైజుల వెడల్పు వస్త్రాలు, వందకు పైన బ్లీచ్ చేయని వస్త్రాలు వచ్చాయి. వాటిని వెంటనే ఉతికించి పాకింగ్ చేయమని చెప్పండి" అన్నారు. నేనా పని పురమాయించటానికి బయలుదేరాను.

**1 జూలై, 1753:** యానాం దుస్తుల కోసమని యాభైవేల పగోడాలు అడ్వాన్సుగా చెల్లించడం జరిగిందని గవర్నరుగారితో చెప్పాను. 'అడ్వాన్సులు ఎవరికైతే ఇస్తున్నామో వారి పేర్ల ఎదురుగా ఎంతెంత ఇచ్చిందీ, ఎంత మొత్తానికి సరుకులు సప్లయి చేసారు వంటి వివరాలు పొందుపరచండి' అన్నారు.

**వివరణ:** యానాం చేనేత వ్యాపారులకు దుస్తులు సరఫరా చేయటానికి కొనుగోలుదారుల నుండి మొత్తం సరుకు విలువలో సగం డబ్బు అడ్వాన్సుగా ముట్టేది. మిగిలిన సొమ్ము సరుకు అందుకొన్న తరువాత పంపించేవారు.

**4 సెప్టెంబరు, 1753** (యానాం వస్త్రాలు మంచి నాణ్యతతో ఉండటంచే వాటిని ఫ్రెంచివారు లక్జరీ దుస్తులుగా భావించేవారు. ఒకసారి రంగ పిళ్ళై కు డూప్లే కు జరిగిన సంభాషణ అత్యంత ఆసక్తికరంగా ఉండి యానాం వస్త్రాల విలువను తెలియచేస్తుంది)

.......... మేము అలా మాట్లాడుకొంటూండగా పనిమనిషి వచ్చి గవర్నరుగారితో 'అయ్యగారు మీరు టోపీ పెట్టుకోలేదు' అని గుర్తుచేసింది. దానికి ఆయన నవ్వుతూ నాకేసి చూసి 'రాజులతో వచ్చిన చిక్కు ఇదే! ఔరంగజేబు ఎందర్నో రాజుల్ని జయించి, మొత్తం దేశాన్ని ఒకే గొడుగు క్రిందకు తెచ్చినప్పటికీ కూడా చవకరకం ముతక దుస్తులు ధరించేవాడట' అన్నారు.
'మీ కోటు, పంట్లాము కూడా ముతకగా ఉన్నాయి. మీ టోపీ గురించి చెప్పనక్కరలేదు .......' అన్నాను నేను.







'అంటే నేను ఔరంగజేబులా ఉన్నానంటారు. నేను కూడా చక్రవర్తినే కనుక ఇలాంటి ముతక దుస్తులు వేసుకొంటున్నానన్నమాట' అన్నారు నా వేపు నవ్వుతూ చూస్తూ.

'నేను విన్నదాన్ని బట్టి – ఔరంగజేబు ప్రజలసొమ్ము తినటం పాపమని తలచి దర్జీపని చేసి సంపాదించిన ధనంతో తనను పోషించుకొనేవాడట' అన్నాను నేను.
గవర్నరు గారి మొహం నుంచి ఒక్క క్షణం నవ్వు మాయమైంది. తేరుకొని 'ఓ పాతిక మీటర్ల **యానాం క్లాత్** ను తెప్పించండి, నేను మంచి దుస్తులు ధరించాలనుకొంటున్నాను' అని నవ్వుతో అనేసి మేడపైకి వెళ్ళిపోయారు.

**వివరణ:** డూప్లే తనని తాను చక్రవర్తిగా పోల్చుకోవటం గమనార్హం. అంతే కాక ఈ సంఘటన ద్వారా రంగపిళ్ళై ముక్కుసూటితనం, ధైర్యము మనకు తెలుస్తుంది. మొండిధైర్యం, మిక్కిలి ఆత్మ విశ్వాసం, ఎంతో సాహసం కలిగిన వ్యక్తిగా వర్ణించబడే డూప్లే వ్యక్తిత్వాన్ని ఈ ఉదంతం కొత్త కోణంలో చూపిస్తుంది.

**1 జనవరి, 1756:** పాండిచేరీ చేరిన ఓర్లియన్ అనే షిప్పు కెప్టెన్ ఇచ్చిన సమాచారంలో యానాం ప్రస్థావన ఇలా ఉంది – 'మేము (షిప్పు సిబ్బంది) అచ్చిన్ పోర్టునుండి డిశంబరు 25 న బయలుదేరాము. పదిరోజులకు యానాం చేరి అక్కడి సరుకులను ఎక్కించుకొని తరువాత మచిలీపట్నం మీదుగా పాండిచేరి చేరాము. ఈ మొత్తం ప్రయాణానికి 25 రోజులు పట్టింది.

**వివరణ:** ఆచ్చిన్ సుమిత్రా వద్దనున్న ఒక పోర్టు. ఇక్కడ ఫ్రెంచి నౌకలు కొనుగోళ్ళు జరిపేవి.

**10 ఫిబ్రవరి, 1756:** ఉదయం 7 గంటలకు నేను కోటకు వెళ్ళాను. అక్కడ కంపనీ క్లాత్, యానాం క్లాత్‌లను వేరుచేయటం జరుగుతున్నది. గవర్నరు ఇతర అధికారులు అక్కడే ఉన్నారు.

**మార్చి, 1757:** పాండిచేరి లో రూపాయి నాణాల ముద్రణకు, యానాంలో 3 స్వాముల పగోడా ముద్రణకు, నిజాం ప్రభువుల అనుమతిని ఫ్రెంచి వారు ఎంతో కృషి చేసి సాధించగలిగారు. యానాం 3 స్వాముల పగోడా నాణ్యత మద్రాసులో తయారయ్యే 'కరుక్కు పగోడా' లకు ఏమాత్రం తీసిపోవు. ఆ కారణంగా యానాం కు ప్రాముఖ్యత పెరిగింది.


ఆనంద రంగపిళ్ళై నివసించిన ఇల్లు

**వివరణ**: బంగారంతో తయారుచేసిన నాణాలను పగోడా అనేవారు. ఒక్కో నాణెం 3.4 గ్రాములుంటుంది. వలస పాలకులు వీటిని ముద్రించు కోవటానికి అప్పటి రాజుల నుండి ప్రత్యేక అనుమతులు పొందేవారు.

ఇక యానాంలో ముద్రించు కోవటానికి అనుమతి పొందిన 3 స్వాముల పగోడాపై ఒకవైపు ఇద్దరు భార్యలతో కూడిన వెంకటేశ్వర స్వామి బొమ్మ మరో వైపు గరుకు గాను ఉ ంటుంది. ఇదే నమూనాతో అప్పట్లో మద్రాసులో తయారవుతున్న నాణాలను కరుక్కు (గరుకు) పగోడాలనేవారు. పిళ్ళై డైరీలను బట్టి యానాం మూడు స్వాముల పగోడాలు మద్రాసు పగోడాల కంటే కూడా నాణ్యంగా ఉండేవని అర్ధమౌతుంది. (ఆ పగోడాలో వెంకటేశ్వరస్వామికి యానాం మీసాలవెంకన్న ఆలయంలో ఉన్నట్లు మీసాలు లేకపోవటం గమనార్హం)

**ముగింపు**

యానానికి సంబంధించి 1723–1758 ల మధ్య జరిగిన విషయాలు ఎక్కడా లభించవు. ఈ కాలంలో జరిగిన కొన్ని యానాం సంఘటనలు ఆనంద రంగ పిళ్ళై డైరీల ద్వారా తెలుస్తుంది. ఈ కాలంలో పనిచేసిన యానాం పెద్దొరల వివరాలు ఒక్క పిళ్ళై వ్రాతల ద్వారానే తెలుస్తున్నాయనటం అతిశయోక్తి కాదు. ఫ్రెంచి ఇండియాకు సంబంధించి పిళ్ళై డైరీలు – బ్రిటిష్ అధికారి మెకంజీ సేకరించిన ఖైఫీయత్తుల కంటే విలువైనవి.

ఆనందరంగ పిళ్ళైకు వచ్చిన ఒక తెలుగు ఉత్తరం

పిళ్ళైకు ఫ్రెంచి, తమిళము, డచ్, పార్సీ వంటి భాషలతో పాటు తెలుగుభాషలో కూడా మంచి ప్రవేశం ఉంది. అంతేకాక కస్తూరి రంగకవి అనే తెలుగు పండితుడు రచించిన 'ఆనందరంగ రాట్ఛందం' అనే ఛందస్సు గ్రంథానికి రంగపిళ్ళై ఆర్థిక సహాయం అందించి స్వీకరించాడు. ఆ పుస్తకంలో మొదటి పాతిక పేజీలు పూర్తిగా ఆనంద రంగపిళ్ళై జీవిత సంగ్రహాన్ని, పాండిత్యాన్ని, తెలివితేటలను, మంచితనాన్ని కీర్తిస్తూ 136 పద్యాలున్నాయి. (రంగపిళ్ళై జీవిత చరిత్ర ను తెలిపేందుకు మరేఇతర ఆధారాలు లేకపోవటంతో ఈ పుస్తకం నుంచే చరిత్రకారులు గ్రహించారు)

రంగపిళ్ళై వ్యక్తిత్వాన్ని రంగకవి ఈ విధంగా అక్షరబద్ధం చేసాడు.

చ.తెలివికి బుట్టినిల్లు జగదీశుల కెల్లను మేలుబంతి వి
ద్యల కొరగల్లు తాలిమికిఁ దావు వదాన్యతకు ~ నిధాన మా
ప్తులకును మెట్టపంట కవిభూసుర వాటికి గల్పవాటి యై
కలియుగ కృష్ణమూర్తి యనఁ గాంచెను రంగవిభుండు కీర్తులన్.





రంగపిళ్ళైకి వ్రాసిన తెలుగు ఉత్తరాలలో ఈయనను -- *శ్రీమత్సమస్త సద్గుణ సర్వజ్ఞులయ్యి అఖుంటిత లక్ష్మీప్రసన్నులయ్యి మహామేరు సమానులయ్యి రాజ మాణిక్య రాజశ్రీ ఆనందరంగ్గ పిళ్ళై గార్కి* -- అంటూ సంభోదించటాన్ని బట్టి అప్పట్లో ఈయన సమాజంలో ఒక మహారాజు పొందే గౌరవాన్ని పొందేవాడని అర్థంచేసుకొనవచ్చును.

**రంగపిళ్ళై డైరీలలో బొబ్బిలి కథ కొత్తకోణంలో చూపించబడింది:** బొబ్బిలికథ ఆంధ్రనాట జనపదుల నోట అమరత్వం పొంది ప్రసిద్దిగాంచిన గాథ. దీనిని సి.పి.బ్రౌన్ 1832లో మల్లేశం అనే జానపద కళాకారుడు పాడుతూండగా దానిని వ్రాతరూపంలోకి తీసుకొచ్చాడు. అది ఈ విధంగా ఉంటుంది.

బొబ్బిలి రాజు రంగారావుకు విజయనగర రాజైన విజయరామరాజుకు మధ్య శతృత్వం ఉండేది. విజయరామరాజు కోరికమేరకు, బుస్సీ 23 జనవరి,1757న బొబ్బిలికోటను ముట్టడించాడు. ఈ ముట్టడిలో బొబ్బిలి సైన్యం ఓడిపోయింది. కోట లోపలకు శతృసైన్యం ప్రవేశించేలోపల, బొబ్బిలి వీరులు మూకుమ్మడిగా ఆత్మాహుతికి పాల్పడ్డారు. ఫ్రెంచి వారి చేతికి తమ వారు చిక్కకూడదనే ఉద్ధేశంతో, బొబ్బిలి వీరులు తమ భార్యలను, తల్లులను, గర్భిణీస్త్రీలను, పిల్లలను, ముసలివారిని మొత్తం సుమారు పదివేలమందిని ప్రాణత్యాగం కావించి, చివరకు వారు కూడా యుద్ధంలో మరణించారు. కొంతమంది మంటల్లోదూకి, మరికొందరు కత్తులతో పొడుచుకొని, శత్రువుల తుపాకీలకు ఎదురెళ్ళి ఇంకొందరూ ఆత్మహత్య చేసుకొన్నారు.

26 మార్చి, 1757న ఆనంద రంగపిళ్ళై వ్రాసుకొన్న డైరిలో బొబ్బిలి యుద్ధం గురించి జనబాహుళ్యంలో చలామణీలో ఉన్న దానికి విరుద్ధంగా ఈ విధంగా వర్ణించబడింది. (రి. వాల్యూం 10– పేజీ.నం.334–337)

బుస్సీ బొబ్బిలి కోటను ముట్టడించినపుడు, కొద్దిమంది బొబ్బిలి వీరులు కోటనుండి బయటకు వచ్చి ప్రతిఘటించగా బుస్సీసేనలు వెనుతిరిగాయి. దీనికి ఆగ్రహించిన విజయరామరాజు తన సేనల్ని కోటవైపు మళ్ళించాడు. వారికి బుస్సీసేనలు సహాయపడ్డాయి. భీకరమైన యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో ఇరువైపులా సుమారు 8–9 వేల మంది చనిపోయారు. కోటచుట్టూ ఉన్న కందకం రక్తంతో నిండిపోయింది. **కోట వశమయినపుడు, విజయరామరాజుతో బుస్సీ "కోటలో ఒక్క చిన్న శిశువుని ప్రాణాలతో ఉంచినా ఒక శత్రువుని మిగుల్చుకొన్నట్లే" అన్నాడు. ఆ మాటలకు విజయరామరాజు కోటలో ప్రతి ఒక్కరినీ చంపివేయమని తన సైనికులను ఆజ్ఞాపించాడు. వారు ఆ విధంగానే కోటలోని స్త్రీలను, గర్భిణులను, పిల్లలను మొత్తం పదివేల మందిని హతమార్చారు, రంగారావుతో సహా.** గాయపడిన రంగారావు తమ్ముడికి వైద్యం చేయించమని బుస్సీతో విజయరామరాజు చెప్పాడు. కోటపై ఫ్రెంచి జండా ఎగరవేయబడింది. సైనికులు విజయోత్సవం చేసుకొన్నారు. ఒకరికొకరు చక్కెర తినిపించుకొన్నారు.

బొబ్బిలి యుద్ధం జరిగిన వెంటనే వ్రాయబడిన పై విషయాలు నిజాలనే అనుకోవాలి. ఎందుకంటే మిగిలిన అంశాలైన ఎంతమంది సైనికులు పాల్గొన్నారు, ఎంతమంది చనిపోయారు, తేదీలు, వివిధ వ్యక్తుల వివరాలు ప్రాచుర్యంలో ఉన్న బొబ్బిలి కథనంతో సరిపోతున్నాయి. అంతే కాక రంగపిళ్ళై కు అనేకమంది గూఢచారులు, వార్తాహరులు ఉండేవారట.

# ఫ్రెంచి సమాధులు చెప్పే గాథలు

ఉద్యోగరీత్యానో లేక వ్యాపారం చేయటానికో యానానికి అనేకమంది ఫ్రెంచి దేశస్థులు వచ్చిపోతూండేవారు. కొంతమంది ఇక్కడే స్థిరపడ్డారు కూడా. మృత్యువుకు స్థల కాలాదులతో పనిలేదు. దాని పిలుపుకు ఉన్నపళంగా బయలుదేరాల్సిందే ఎవరైనా ఎక్కడైనా ఎప్పుడైనా. అలా ఇక్కడ మరణించిన ఫ్రెంచిదేశస్థులను పద్దెనిమిదవ శతాబ్దంలో చర్చి ప్రాంగణంలో ఖననం చేయగా, తరువాత కాలంలో యానాం నుంచి మెట్టకూరు కు వెళ్ళే మార్గంలో కల ఫ్రెంచి సెమెటరీ లో ఖననం జరిపేవారు. అక్కడ ఉన్న కొన్ని సమాధుల ఫలకాలను పరిశీలిస్తే ఆనాటి వ్యక్తుల పేర్లు లభిస్తాయి. ఆ పేర్ల కొరకు శోధించగా కొంతమంది వ్యక్తుల వివరాలు లభించాయి. పాండిచేరిలో ఉన్న ఫ్రెంచి సమాధి ఫలకాలను అధ్యయనం చేసి మైకేల్ గొదార్ "Genealogie des familles de l'Inde francaise" అనే పుస్తకాన్ని రాసాడు. అందులో ఇతను యానాం సెమెటరీ వివరాలను పొందుపరచకపోవటం శోచనీయం.

### సిస్టర్ టీచర్ (కన్యస్త్రీ/మిస్సమ్మ) సమాధులు




Sister Claire (1820–1850) ఈమె సిస్టర్స్ ఆఫ్ లియోన్ మిషనరీ నుంచి వచ్చిన సిస్టర్స్ లో పెద్దావిడ. ఈమె 1820 లో తూర్పు ఫ్రాన్స్‌లోని యూజీన్ అనే ప్రాంతం లో పుట్టింది. ఈమె ఫ్రాన్స్‌లో ఉన్నపుడు ఒకనాడు పెద్ద అగ్నిప్రమాదం జరిగి మూడువేల మంది నిరాశ్రయులయినపుడు, క్లెయిర్ వారందరికీ చర్చి ప్రాంగణంలో ఆశ్రయమిచ్చి అనేకవిధాలుగా ఆదుకొన్నదట.





ఈమె యానాం వచ్చిన మరుసటి సంవత్సరమే మరణించింది. ఈమె మరణం గురించి Echo of Mont Blank (L'echo du Mont-Blanc) అనే ఓ ఫ్రెంచి పత్రిక ఇలా వ్రాసింది "ఆమె పార్థివ దేహాన్ని ఖననం కోసం తీసుకువెళ్ళేటపుడు యానాం లోని ఫ్రెంచివారందరూ ఆమె అంతిమయాత్రలో పాల్గొన్నారు. స్థానిక హిందువులు తమతమ ఆచారవ్యవహారాలను పక్కనపెట్టి పల్లకీలు దిగి కాలినడకన ఆమె దేహాన్ని అనుసరిస్తూ కన్నీటితో సాగనంపారు. యానాంకు వచ్చిన కొద్దికాలంలోనే ఆమె అంతటి ఆదరాభిమానాలను సంపాదించుకొంది"

పై వర్ణనను గమనిస్తే కన్య స్త్రీలు/సిస్టర్స్ యానాంలో ప్రజల గౌరవాన్ని ఎంతెలా చూరగొన్నారో అర్థమౌతుంది.

Sister Marie Theophile (1833-1868) ఈమె ఫ్రాన్స్ లోని Seyssel లో జన్మించి, మతవిద్యనేర్చుకొని 1866 లో యానాంలో టీచరుగా పనిచేయటానికి వచ్చిన కొద్దికాలానికే ఇక్కడే మరణించింది.

Sister Lucile (Dunand Marie -1851-1886) ఈమె 8 సెప్టెంబరు 1886 న యానాంలో చనిపోయింది. ఈమెకు తెలుగు తమిళ భాషలు, ఇక్కడి ఆచారవ్యవహారాల పట్ల మంచి అవగాహన ఉండేదట.

Sister Denice (1842-1899) ఈమె ఫ్రాన్స్ లోని క్యువాత్ అనే ప్రాంతంలో పుట్టి, యానాంలో టీచరుగా పనిచేస్తూ, 17 అక్టోబరు 1899 న ఇక్కడే చనిపోయింది.

**F. Pierre and Family:**
పేరుతో ఒక సమాధి ఉంది. పియరీ ఇంటి పేరుతో ముగ్గురి పేర్లు ప్రముఖంగా వినిపిస్తాయి.

1. Felicite Pierre valere Hugot:
సమాధిరాయిపై ఉన్న F. Pierre అన్న పేరు ఈయనదే కావొచ్చు. ఈయన 1849-1855 ల మధ్య యానాం పెద్దొరగా వ్యవహరించాడు.




2. Charles Joseph Pierre: ఈ పియరీ కుటుంబీకుడు 15 నవంబరు, 1854 న, మన్యం వెంకటరత్నం అనే వ్యాపారికి 99 టన్నుల నువ్వులను సప్లయి చేస్తానని చేసిన ఒప్పందాన్ని బట్టి ఇతను యానానికి చెందిన ఒక వ్యాపారి అని అర్థమౌతుంది.

3.Amele Pierre: ఈమె 1930 లలో యానాం బాలికల పాఠశాలలో టీచరుగా పనిచేసింది. మొత్తం మీద పియరీ కుటుంబం యానాంలోనే స్థిరపడి ఇక్కడే గతించిందని అనుకోవచ్చు.

## Marie Eugenie




సమాధిరాయిపై వివరాలు ఇంగ్లీషులో ఉండటం విశేషం. దీనికి బహుశా ఈమె భర్త G.A. Smith మద్రాసు సివిల్ సర్వీసులో పనిచేయటం కారణం కావొచ్చు. వీరిద్దరికీ 1824 జూన్ 25 న యానాంలో వివాహం జరిగింది. ఈమె తండ్రి John Bouchez 1820–30 లలో యానాంలో ఒక వెలుగు వెలిగిన ఫ్రెంచి వ్యాపారి. మేరీ యూజీన్ అన్నగారైన పాల్ బోషెజ్ కూడా యానాంలో 1850 లలో పెద్ద ఎత్తున వ్యాపారం సాగించాడు.

పై వివరాలను బట్టి మేరీ యూజీన్ ఒక పెద్దవ్యాపారి కూతురు, పెద్ద ఆఫీసరుకు భార్య, ఫ్రెంచియానాం కు ఒకనాటి ఆడపడుచు. 29 ఏళ్ల ఈమె, 25 డిసెంబరు, 1831న యానాంలో మరణించింది.

## C A Senecal

ఇతగాని పూర్తి పేరు Collixte Amable Senecal. ఇతను ఒక షిప్పు కెప్టన్. యానానికి చెందిన ఫ్రెంచి వ్యాపారి Michel Rayneau 1830 లో మరణించటంతో అతని భార్యను సెనెకల్ వివాహం చేసుకొని యానాంలో స్థిరపడ్డాడు.

ఇతని గురించిన అనేక ఆశక్తికరమైన విషయాలు1843 నాటి యానాం కోర్టు జడ్జిమెంట్ల లో కనిపిస్తాయి.




1842 లో యానాం కు చెందిన నానా సాహెబ్ అనే వ్యాపారి పాండిచేరీ నుంచి 2772 పౌండ్ల విలువచేసే రాగిని యానాంకు షిప్పులో తీసుకురావటానికి అందుకు 15 రూపాయిలు రవాణా ఖర్చులు చెల్లించేటట్లు, సెనెకల్ తో ఒక ఒప్పందం చేసుకొన్నాడు. ఇదే కాక మూడు రూపాయిల ఎనిమిది అణాల రవాణా చార్జీలతో పాండిచేరి నుంచి 450 రూపాయిల విలువచేసే బంగారపు జరీని యానాం చేర్చటానికి కూడా సెనెకల్ మరో ఒప్పందం చేసుకొన్నాడు. ఈ సెనెకల్ మహాశయుడు డిశంబరు 1842 లో పాండిచేరిలో సదరు నానాసాహెబ్ కోసమని







రాగిని మరియు బంగారపు జరీని షిప్పులో ఎక్కించుకొని బయలుదేరాడు. అక్కడినుండి నేరుగా కోరంగి రేవుకు నడపాల్సిన షిప్పుని సిలోన్ తీసుకు వెళ్లి అక్కడ రాగి ధర అధికంగా ఉందని గ్రహించి, నానా సాహెబ్ కు చేర్చాల్సిన రాగిని అక్కడ అమ్మివేసాడు. ఆపై తాపీగా షిప్పును నడుపుకుంటూ మధ్యలో మద్రాసు పోర్టులో కాసేపు ఆగి 15, ఫిబ్రవరి 1843 న కోరంగి రేవు చేరుకొన్నాడు.

నా సరుకేదయ్యా? అని అడిగిన నానా సాహెబ్ కు సెనెకల్ 'సముద్రంలో పెద్ద తుఫాను రావటం వల్ల షిప్పు దారితప్పిపోయి సిలోనుకు కొట్టుకు పోయిందనీ, అక్కడ షిప్పు సిబ్బందికి ఆహారం కొనటానికి తప్పనిసరి పరిస్థితులలో రాగిని అమ్మవలసి వచ్చిందని'– అంటూ కథలు వినిపించాడు. కనీసం సరుకు అమ్మిన డబ్బు ఇవ్వమని లేదా నీపై వాజ్యం వేస్తానని నానా సాహెబ్ బెదిరించటంతో, సెనెకల్ మొత్తం 1406 రూపాయిలకు గాను 787 రూపాయిలు రొక్కం ఇచ్చి మిగిలిన 619 రూపాయిలకు ప్రామిసరీ నోటు రాసి ఇచ్చాడు.

నోటులో వ్రాసిన డబ్బులు ఎంతకీ ఇవ్వక పోవటంతో నానా సాహెబ్ కోర్టును ఆశ్రయించాడు. మొత్తం ఉదంతం పూర్వ పరాలను కోర్టు వారు పరిశీలించినపుడు ' తాను ప్రకృతి అనుకూలించక పోవటం వల్లే తాను సరుకులు అమ్మవలసి వచ్చిందని సెనెకల్ నిరూపించుకోలేక పోయాడు. దీనికి ఆగ్రహించిన కోర్టు, నానా సాహెబ్ కు ప్రామిసరీ నోటు ప్రకారం మిగిలిన బకాయిని చెల్లించమని సెనెకల్ ను ఆదేశించటమే కాక మరో వంద రూపాయిలు నష్టపరిహారంగా ఇమ్మని తీర్పు చెప్పింది.

సెనెకల్ రాగిని తినేయటమే కాక యానాం చేర్చాల్సిన బంగారు జరీని కూడా దారిలోనే స్వాహా చేసేసాడు. పైగా తన ఇంటికి వచ్చిన నానా సాహెబ్ మనుషులైన కాశిమ్ సాహెబ్, మాతయ్య అనే ఇద్దరు వ్యక్తులు బంగారు జరీ దాచిన చెక్కపెట్టెను దొంగిలించుకు పోయారని పోలీసు కంప్లైంట్ ఇచ్చి వారిని అరెష్టు చేయించాడు. పాపం వారు అమాయికులే కావొచ్చు. ఈ రెండో కేసు తదుపరి వివరాలు తెలియరావు.

ఈ సెనెకల్ 11 డిశంబరు, 1846 న యానాంలో చనిపోయాడు. సెనెకల్ ఉదంతం యానాం ఫ్రెంచి పాలనలో ప్రాముఖ్యం కలిగిన అంశమనే చెప్పుకోవచ్చు. ఎందుకంటే, ఒక స్థానికుడు (నానా సాహెబ్) ఒక ఫ్రెంచి దేశస్థుని పై కేసు వేసి నెగ్గటం అనేది అప్పటి సామాజిక స్థితిని పట్టిచూపుతుంది. స్థానికులలో ధైర్యం, న్యాయం కోసం పోరాడే తత్వం మెండుగా ఉండేవని భావించవచ్చు. అంతేకాక ఫ్రెంచి జుడిషియల్ వ్యవస్థ యొక్క నిష్పాక్షికత కూడా గమనార్హమే.

## Micot de Lacombe

ఈ సమాధిపైనున్న ఫలకం ఈయన 87 సంవత్సరముల వయసులో చనిపోయినట్లు చెపుతుంది. దె లాకోంబె యానాంలో పేరుమోసిన షిప్పుల వ్యాపారి. ఇతను 1854 లో మాసరయ్య

అనే పడవలు నిర్మించే మేస్త్రీ కి 20 మీటర్ల పొడవైన నౌకను నిర్మించమని పురమాయించాడు. దీని కోసం 350 రూపాయిల బయానా చెల్లించి నిర్మాణానికి అవసరమైన సామాగ్రిని సమకూర్చేటట్లు వీరిరువురు కుదుర్చుకొన్న ఒప్పంద పత్రం ఆనాటి యానాం నోటరీ రికార్డులలో ఉంది.




## Paul Bouchez ?

ఈ సమాధిఫలకం దాదాపు ధ్వంసమైపోయి ఉంది. ఈ వ్యక్తి పేరులో Paul Bo అనే అక్షరాలు మాత్రమే కనిపిస్తున్నాయి. ఇది బహుశా యానాంలో వ్యాపారపరంగా ఒక వెలుగు వెలిగిన బోషెజ్ కుటుంబానికి చెందిన పాల్ బోషెజ్ సమాధి అయి ఉండటానికి అవకాశాలు ఎక్కువ. ఇతను 1850 లలో నువ్వులు, ధాన్యం భారీఎత్తున సేకరణ జరిపి షిప్పులలో కి ఎగుమతి చేసేవాడు.




## Charles Pithois

యానాంలో 1790 ల నుంచీ ప్రముఖ పాత్ర వహించిన ఫ్రెంచి వారిలో పిథోస్ కుటుంబం ఒకటి. అతి మంచితనం వలన ఆర్ధికంగా చితికి పోయి దుర్భర దారిద్ర్యంతో బాధపడి కనుమరుగైపోయిన కుటుంబం కూడా ఇదే.

చార్లెస్ పిథోస్ యానాంలో సర్జన్ గా పనిచేసి1820 ఆగస్టు, 17న కలరా బారినపడి ఇక్కడే మరణించాడు. సొన్నరెట్ పెద్దొరగా ఉన్నకాలంలో ఆయనకు వ్యతిరేకంగా లె కాన్నె, ఫార్ వంటి ప్రముఖులు 1791లో ఒక కమిటీని ఏర్పాటుచేసుకొని దానికి పిథోస్‌ను వైస్ ప్రెసిడెంటుగా ఎన్నుకొన్నారు. పెద్దొరకు వ్యతిరేకంగా వ్యవహరించటం ఇష్టంలేని పిథోస్ ఆ పదవినుంచి తప్పు కొన్నాడు.










పిథోస్ పేరుతో బ్లీచింగ్ చెరువులు ఉండటాన్ని బట్టి ఇతను వృత్తిరీత్యా వైద్యుడైనా కొంతకాలం వస్త్రాల బ్లీచింగ్ వ్యాపారం చేసాడని అర్ధమౌతుంది.

8 మంది సంతానాన్ని (నలుగురు అమ్మాయిలు, నలుగురు అబ్బాయిలు) అనాథలను చేసి 1820 లో చార్లెస్ పిథోస్ చనిపోయాడు. వీరిలో చార్లెట్టి అనే అమ్మాయికి మాత్రమే, కాకినాడ జగన్నాథపురానికి చెందిన Mr. Vanhacsten అనే డచ్ వ్యక్తితో వివాహమయ్యింది. ఆ పెళ్ళి కూడా పెటాకులు కావటంతో చార్లెట్టి తండ్రి వద్దకు వచ్చేసింది.

### పిథోస్ కుటుంబం

పిథోస్ కొడుకులలో ఒకరు (Phamphile Pithois) తండ్రి బాటలో పయనించి యానాం వైద్యునిగా పేరు తెచ్చుకొన్నాడు. 1824 లో కలరా వచ్చినపుడు, 1833 నాటి తీవ్ర కరువులోను ఇతను యానాం ప్రజలకు నిస్వార్ధంగా వైద్య సేవలందించి పలువురి మన్ననలు పొందాడు. ప్రజలకు వైద్యసేవలందిస్తున్నందుకు ఇతనికి ప్రభుత్వం నామ మాత్రంగా ఏడాదికి 500 ఫ్రాంకుల పారితోషికాన్నిచ్చేది. (అప్పట్లో కోర్టు క్లర్కుకు ఏడాదికి 1200 ఫ్రాంకుల జీతం)

చనిపోయేనాటికి పిథోస్ కు యానాంలో రెండు విశాలమైన భవంతులు, కొద్దిపాటి నగలు తప్ప మరేమీ లేవు. ఈ కుటుంబం రోడ్డున పడిందన్న ఉద్దేశ్యంతో అప్పటి సాటి ఫ్రెంచి పౌరులు చందాలు వేసుకొని 3000 వేల రూపాయిలు సేకరించారు. ఈ డబ్బును కుర్‌సన్ స్వాహా చేసేసాడు. కుర్‌సన్ చనిపోయినపుడు కూడా పిథోస్ కుటుంబీకులు ఈ డబ్బు గురించి కుర్‌సన్ వారసులను అడగక పోవటం వారి అతి మంచితనానికి నిదర్శనం.

పిథోస్ కుటుంబానికున్న రెండు ఇళ్లలో ఒక దానిని నెలకు 60 రూపాయిలకు ప్రభుత్వానికి అద్దెకి ఇచ్చుకొని ఆ డబ్బును 8 మంది పంచుకొనేవారు. పిథోస్ కుమారులలో పాంపిలి పిథోస్ వివరాలు 1844 వరకే లభిస్తాయి. జోసెఫ్ పిథోస్ యూరప్ వెళ్ళిపోయాడు. ఇతర కుమారులు తండ్రి మరణంతో తలో దిక్కుకూ చెదిరిపోయి ఉండవచ్చు.

పీథోస్ కూతుర్లైన అడిలైడ్, జెర్‌ట్రూడ్, థార్సిల్లి, స్కోలాస్టిక్‌చార్లెట్టి లు యానాంలోనే ఉండిపోయి కడు దయనీయమైన జీవితాల్ని గడిపారు. వీరి సంరక్షణార్ధం సాటి ఫ్రెంచి వారు అప్పుడపుడు ఆర్ధిక సహాయం చేసేవారు. వెయ్యి రూపాయిల విలువైన నగలను వీరు 300 రూపాయిలకు తాకట్టు పెట్టి తిరిగి విడిపించుకోలేక వాటిని ఒదులుకోవలసి వచ్చింది.

1842 లో చార్లెట్టి చనిపోయింది. ఆమె అంత్య క్రియలను చెల్లెళ్ళే జరిపించారు. చనిపోయే రోజు కూడా ఆమె పస్తులుంటున్న తన చెల్లెళ్ళకు భోజనం పంపటం అనేది ఈ కుటుంబం అనుభవించిన దారిద్ర్యాన్ని వీరి మధ్య ఉన్న బంధాన్ని తెలియచేస్తుంది.

1850 నుంచి వీరికి ఫ్రెంచి ప్రభుత్వం ఏడాదికి 792 ఫ్రాంకుల పించనును ఏర్పాటు చేసింది. అదే కాక ప్రభుత్వానికి అద్దెకిచ్చుకొన్న ఇంటి ద్వారా కొంత సొమ్ము ముడుతుండేది. వీటితో పిథోస్ కూతుర్లు జీవనాన్ని సాగించేవారు. 1858 లో మరో సోదరి అడిలైడ్ మరణించింది.

ఇక మిగిలిన ఇద్దరు కూతుర్లు 1870 వరకూ (వారికి 90 ఏళ్ళ వయసు వరకు) యానాంలోనే జీవించారు.

వీరిద్దరూ ఒకరి ఆస్థులను (అద్దెకిచ్చిన ఇల్లు, యానాం పేరయ వీధిలో ? కల నివాస గృహం దానిలోని ఫర్నిచరు) మరొకరికి దానమిచ్చుకొన్నట్లు 1864 లో ఒక దాన పట్టా రిజిస్టర్ అయి ఉంది. బహుశా వీరిలో ఎవరు ముందు చనిపోతారో తెలియదు కనుక మిగిలిన వ్యక్తికి చట్ట పరమైన చిక్కులు లేకుండా ఉండేందుకు ఆ విధంగా చేసి ఉండవచ్చు.

1870 లో వీరు చనిపోయేవరకూ ప్రభుత్వం వీరి ఇంటికి అద్దె చెల్లించింది. ఆ తరువాత అది ప్రభుత్వపరమైపోయింది. **ఆ ఇల్లే నేటి స్థానిక పరిపాలనాధికారి ఆఫీసు భవనం.**

## ఎలియనార్ గైనెట్ (Eleonor Guyenet)

ఇతను 'లె కొలాన్' అనే షిప్పు కెప్టన్. 1845 మే,11న కోరంగి లో చనిపోగా యానాం తీసుకొచ్చి ఖననం చేసారు. ఇతను ఫ్రాన్సులోని మాలో అనే ప్రదేశంలో పుట్టాడు. ఇది ఇప్పటికీ ఒక ప్రముఖ ఓడరేవు. ఇతను మూడు తెరచాపల ఓడకు కమాండరుగా పనిచేసేవాడట.

యానాంలో టీచరుగా పనిచేసిన Mary Eleonor ఈయన కుటుంబానికి చెందిన వ్యక్తి కావొచ్చు.




## మైఖేల్ అల్లార్డ్ (Michel Allard)

ఫ్రాన్సులోని మెజివె అనే ప్రాంతంలో జన్మించిన మైఖేల్ అల్లార్డ్ అనే విద్యార్ధి (మతబోధక విద్య) యానాంలో 1900 మార్చిలో చనిపోయినట్లు ఓ ఫలకం చెపుతుంది. అప్పటికి ఈ అబ్బాయి వయసు 24 సంవత్సరములు. ఫ్రాన్సులో చదువుకొంటున్న ఈ అబ్బాయి ఇక్కడ ఉన్న బంధువులింటికి రావటమో లేక చర్చిలో తర్ఫీదు పొందటానికో యానాం వచ్చి చని పోవటం దురదృష్టకరం.




## పియరీ జె.జె. దిలావెనీ (Rev.Pere J.J. Delaveney)

ఈయన ఒక చర్చి ఫాదరు. ఫ్రాన్సులోని దసింజీ అనే ప్రాంతంలో జన్మించిన దిలావెనీ 21 మే, 1863 న ఇక్కడ చనిపోయినట్లు తెలుస్తుంది. మిగతా వివరాలు తెలియరావు. అన్నెసీ డయోసీస్ అనబడే రోమన్ కాథలిక్ విభాగానికి చెందిన ఈయన పూర్తి పేరు ఫాదర్ జాన్ జాక్వస్ దెలావెనీ.




## పాల్ ఫెల్ట్జ్ (Paul Feltz)

ఫ్రాన్సు లోని స్ట్రాస్‌బర్గ్ అనే ప్రాంతంలో జన్మించిన పాల్ ఫెల్ట్జ్ యానాం జడ్జిగా పనిచేస్తూ 1917 లో యానాంలో చనిపోయాడు. అప్పటికి ఈయన వయసు యాభై ఆరు సంవత్సరములు. చంద్రనాగూర్ లో సహాయక జడ్జిగా పనిచేస్తున్న ఈయన 6 ఏప్రిల్ 1915 న యానానికి జడ్జిగా వచ్చారు.




## జాకోబస్ మార్టిన్ (Jacobus Martin)

చర్చి లోపలి భాగంలో మార్టిన్ ఫలకం ఉంది. ఈయన ఇటలీలోని సబారియా అనే ప్రాంతంలో జన్మించాడు. యానాం చర్చికి మతబోధకుడు లేని కారణంగా విశాఖపట్నంలో ఉంటున్న ఈయన సేవలను అప్పటి స్థానిక ప్రభుత్వం అభ్యర్ధించింది.




అలా 1845 లో యానాం వచ్చిన ఫాదర్ మార్టిన్, వచ్చిన కొద్ది కాలానికే 1846 లో ఇక్కడే మరణించాడు. (ఈయన గురించిన మరిన్ని వివరాలు "ఆనాటి సామాజిక వ్యవస్థ" అనే చాప్టరులో కలదు)

## విక్టర్ సిమొనెల్ (Victor Simonel)

యానాం చర్చిలో విక్టర్ సిమొనెల్ పేరుతో ఒక జ్ఞాపికా ఫలకం చూడవచ్చును. వెర్డన్ (Verdon) యుద్ధంలో వీరోచితంగా పోరాడి 1917 ఆగష్టు, 21న అసువులు బాసిన




22 సంవత్సరముల వయసుకలిగిన యువ సైనికాధికారి గౌరవార్ధం ఈ శిలాఫలకం ఉంచినట్లు తెలుస్తుంది.

వెర్డన్ అనేది ఉత్తర ఫ్రాన్సులో ఒక ప్రాంతం. మొదటి ప్రపంచ యుద్ధమపుడు ఈ ప్రాంతాన్ని 1916 లో జర్మనీ సేనలు ఆక్రమించుకొన్నాయి. ఫ్రెంచి సేనలు తమ సర్వశక్తులు కూడదీసుకొని 1917 లో ఎదురుదాడి చేసి జర్మనీ సేనలను ఓడించాయి. ఈ యుద్ధాన్ని వెర్డన్ యుద్ధమని పిలుస్తారు. ప్రపంచయుద్ధాల చరిత్రలో అత్యంత భీకరమైన యుద్ధంగా దీన్ని చరిత్రకారులు వర్ణిస్తారు.

ఈ యుద్ధంలో సుమారు రెండున్నర లక్షలమంది సైనికులు చనిపోయారు. 5 లక్షలమంది క్షతగాత్రులయ్యారు. లక్షమంది ఫ్రెంచి సైనికుల ఆచూకీ లేకుండా పోయింది. (బాంబుల దాడికి శరీరాలు తునాతునకలు అయిపోవటం వల్ల). ఆ యుద్ధంలో సమోనెక్స్ **(Samogneux)** అనే ప్రాంతం వద్ద జరిగిన ఫ్రెంచి సేనల ఎదురుదాడిలో సాహసోపేతంగా వ్యవహరించి, ఫ్రెంచి జయకేతనాన్ని ఎగరవేయటంలో ప్రముఖపాత్ర వహించిన విక్టర్ సిమోనెల్ అనే యువ సైనికాధికారి జ్ఞాపకార్ధం యానాం చర్చిలో ఒక శిలాఫలకాన్ని ఫ్రెంచి ప్రభుత్వం ఏర్పాటు చేసింది. అంతేకాక పాండిచేరీలో ఒక ప్రధాన వీధికి 'విక్టర్ సిమోనెల్' అని పేరు పెట్టటం కూడా జరిగింది.

ఈ సిమోనెల్ అనే వ్యక్తి యొక్క బంధువులు ఎవరైనా అప్పట్లో పాండిచేరీలో ప్రముఖ పదవిలో ఉండి ఉండొచ్చు. బహుశా 1912 లో యానానికి పెద్దొరగా పనిచేసిన ఎమ్. సిమోనెల్ ఇతని బంధువు కావొచ్చు. అంతకు మించి ఇతని ఇతర వివరాలు మరెక్కడా లభించవు.

## బార్బరా లెబోన్ (Barbara leBon de Beausang)

యానాం చర్చి ప్రధాన గేటుకు కుడివైపున ఒక లాటిన్ ఫలకం ఉంది. లాటిన్ లో లిఖించబడటం, అత్యంత పురాతనమైనది కావటం (1768), నల్ల రాయితో (గ్రానైట్) తయారుచేయబడి ఉండటం వంటి వివిధ కారణాల వల్ల, యానాం లో కనిపించే అన్ని శిలా ఫలకాలలోకెల్లా ఇది ప్రత్యేకమైనది.

ఫ్రెంచి వారు రాకముందు (1723) యానాంలో డచ్చి వారు వ్యాపారాలు నిర్వహించేవారని కొన్ని అభిప్రాయాలు ఉన్నప్పటికీ వాటికి చారిత్రిక ఆధారాలు ఎక్కడా లభించవు. యానానికి సమీపంలో ఉన్న కాకినాడ, పాలకొల్లు లలో ఉన్న డచ్చి సమాధిఫలకాలు లాటిన్ భాషలో ఉండటం మరియు కాకినాడ లో ఇదే కాలంలో ఉన్న కొన్ని డచ్చి సమాధి ఫలకాలు







నల్ల రాయితో చేయబడి ఉండటం వలన ఈ లాటిన్ ఫలకం డచ్చి వారికి సంబంధించినదా అనే అనుమానం కలుగక మానదు.

(ఈ ఫలకం పైనున్న రాతలను పరిష్కరించటంలో సహాయపడిన మిత్రులు శ్రీ మాచవరం మాధవ గారికి, శ్రీమతి జేన్ గోఫర్ (విశ్రాంత ఫ్రెంచి ప్రొఫెసరు– అమెరికా), శ్రీ బులుసు చైతన్య గార్లకు ధన్యవాదములు తెలియచేసుకొంటున్నాను– రచయిత)
ఆ లాటిన్ ఫలకానికి ఇంగ్లీషు అనువాదం ఇలా ఉంది.




Here lies, whom we expect to be ressurrected
Highest Lady Barbara LeBon de Beausang
Noble wife of the now dead Berticlign de la Motte
Most diligent, of the moral scruples,
Unequaled, distinguished and of piety
Well spoken of sweetness, beautiful
Richly endowed, who fled derision
Born the year of our Lord 1744 in
the month of September, 25th day,
died 1768, the 12th day of October.

You who reads this
Give abundantly
of your prayers and remember her.

పై ఫలకంలోని స్త్రీ పేరు బార్బారా. లెబాన్ అంటే మంచి వ్యక్తి అని అర్ధం. ఇక బ్యసాంగ్ అంటే ఆమె స్వస్థలం. ఈమె మరణించిన భర్త పేరు బెర్తిక్లిన్. ఇతను మొట్టె అనే ప్రాంతానికి చెందినవాడని అర్థం చేసుకోవాలి. ఇతను అత్యంత దైవ భక్తి, నీతి నిజాయితీలను కలిగినవాడట. ఇక బార్బారా చాలా అందగత్తె, ధనవంతురాలు. భర్తను కోల్పోయిన ఈమె యానాంలో 1768 లో ఇరవైనాలుగు ఏళ్ళ వయసులో చనిపోయింది.

పై ఫలకంలో చెప్పిన బ్యసాంగ్ మరియు లా మొట్టె ప్రాంతాలు ఫ్రాన్స్ దేశానికి చెందినవి. **ఇవి నేటికీ అవే పేర్లతో ఉన్నాయి.** అంతే కాక బ్యసాంగ్ ప్రాంతం నుంచి 16,17 వ శతాబ్దాలలో వివిధ దేశాలకు వలస పోయిన వారికి బ్యసాంగ్ అనే నామం ఇంటిపేరుగా స్థిర పడింది. గొదార్ (Gaudart) వ్రాసిన 'Genealogie des familles de inde francaise' అనే పుస్తకంలో బార్బరా లె బాన్ దె బ్యసాంగ్ పేరు గల స్త్రీ పదిహేడవ శతాబ్దంలో పాండిచేరిలో ఉన్నట్లు పేర్కొనబడింది. ఈమె తండ్రి జోసెఫ్ లె బోన్ దె బసాంగ్ మరియు తల్లి అన్నీ క్లూ. జోసెఫ్ పాండిచేరీలో పేరుమోసిన వ్యాపారి.

ఈ మొత్తం విషయాలను క్రోడీకరిస్తే – యానాం చర్చి లో ఉన్న లాటిన్ ఫలకం డచ్చి వారికి సంబంధించినది కాదని నిస్సందేహంగా చెప్పవచ్చును. అంతే కాక 1768 కి పూర్వమే యానాం లో చర్చి వంటి నిర్మాణం ఉండేదని కూడా అనుకోవాలి. 24 ఏండ్ల వయసులో భర్తను కోల్పోయిన బార్బారా ఏ పనిమీద పాండిచేరీ నుంచి యానాం వచ్చిందో తెలియరాదు కానీ ఆమె జీవితం ఇక్కడ ముగిసిపోవటం కడు దయనీయం.

### ఎవరెస్టి హిలరీ (Everiste Heloury)




చర్చికి వెనుక వైపున ఈ జ్ఞాపికాఫలకం ఉంది. ఇది పాండిచేరీలో పుట్టి యానాంలో 6 మే 1839 న చనిపోయిన నాలుగు సంవత్సరముల హిలరీ అనే పేరుగల పిల్లగాని సంస్మరణార్ధం ఉంచబడింది.

*'ఓ బాటసారులారా! బిడ్డను కోల్పోయిన ఆ తలిదండ్రులపై జాలిని చూపండి'* అని ఈ ఫలకంపై ఉన్న రాతలు నేటికీ విషాదాన్ని పలికిస్తున్నాయి.

### జీన్ బాప్టిస్ట్ బోషెజ్ (Jean Baptiste Bouchez) 1761-1826




యానాంలో స్థిరపడి ఇక్కడినుంచి వ్యాపారాలు చేసిన ఫ్రెంచి దేశస్థులలో ఈయన తొలితరం వ్యక్తి. Faure, Rayneau, Sauvaget, Pithois, Dulaurens, Barret వంటి వ్యాపారుల సమకాలీనుడు. ఇతను వ్యాపారం చేసిన చెరువులు బోషెజ్ చెరువులు గానే 1846 వరకూ రికార్డులలో వ్యవహరింపబడ్డాయి. పంతొమ్మిదో శతాబ్దం లో యానాం నుంచి భారీగా వ్యాపారాలు సాగించిన పాల్ బోషెజ్ ఇతని కుమారుడే కావొచ్చు.

17 సెప్టెంబరు 1785 న పాండిచేరి లోని సుపీరియర్ కౌన్సిల్ ఈయనను యానాం వ్యాపారాలు చూడమని నియమించినట్లు 1931 లో సంకలన పరచిన Resume de brevets, provisions et commissions du roi et des nominations paites par les directeurs dela compagnie des indes conseil superieur de pondicherry (ఫ్రెంచి ఈస్ట్ ఇండియా కంపెనీ నియామకాలు మరియు తదితరాలు) అనే పుస్తకం ద్వారా తెలుస్తున్నది. ఇతనికి జోసెఫ్ బెర్నార్డ్ బోషెజ్ అనే తమ్ముడు ఉన్నాడు. ఇతను షిప్పు కెప్టెన్ గా పని చేసేవాడు. దె లాకొంబే కుటుంబానికి బోషెజ్ కు కల చుట్టరికం తెలియరాదు.

### జీన్ ఎటియెన్నె గోంజెల్స్ దె లినార్స్ (Jean Etienne Gonzales de Linares)




ఈ ఫలకంపై నున్న వివరాలను బట్టి ఈమె స్పెయిన్ (Espagne) లో 1779 లో జన్మించి యానాం సమీపంలో కల ఇంజరం వద్ద 18?? లో చనిపోయినట్లు తెలుస్తున్నది.

ancestry.fr అనే వెబ్ సైటులో Jean Etienne gonzales de linares అనే అమ్మాయికి de Lasparda అనే అబ్బాయికి వివాహమైనట్లు రికార్డుల ద్వారా తెలుస్తున్నది. ఇకపోతే లాస్పార్డా అనే ఫ్రెంచి దేశస్థుడు 1824-1832 ల మధ్య యానాం పెద్దొరగా పనిచేసాడు. ఆ విధంగా చూస్తే ఈ ఫలకంపై ఉన్న స్త్రీ లాస్పార్డా భార్య అయి ఉండొచ్చునన్న ఊహ ఒక సుదూర అవకాశంగా అనుకోవచ్చు.

1863, జూన్ 29 న పారిస్ లో జారీ చేయబడిన ఒక రాజపత్రంలో **Jean Etienne Gonzales de Linares** అనే వ్యక్తికి యానాంలోని మెట్టకూరు నందు ఇరవైరెండు వేల అయిదు వందల చదరపు మీటర్ల భూమిని కొబ్బరి నూనె తయారీ ఇండస్ట్రీ నెలకొల్పుకోవటానికి ధారాదత్తం చేసినట్లు ఉంది. ఈ సమాధి ఆ వ్యక్తికి చెందినదై ఉండటానికే అవకాశాలు ఎక్కువ కనిపిస్తున్నాయి. మూడవ నెపోలియన్ గా పేర్గాంచిన చార్లస్ నెపోలియన్, ఈ రాజపత్రంపై ఫ్రెంచి ఎంపరర్ హోదాలో సంతకం చేసాడు. (రి. Bulletin des lois de la République francaise, Volume 22, page no: 62)

### మైఖేల్ లె కాన్నె Michel Le Canne (1771-1856)

చర్చి ప్రాంగణంలో వెనుక వైపున కల ఈ ఫలకాన్ని లె కాన్నె కుమార్తె ఏర్పాటు చేసినట్లు తెలుస్తుంది.

ఫ్రాన్స్ లోని లోరియంట్ అనే ప్రదేశంలో పుట్టిన లె కాన్నె పద్దెనిమిదేళ్ల ప్రాయంలో యానానికి వ్యాపారం కోసమని వచ్చి 84 సంవత్సరాల వయసులో ఈ మట్టిలో కలసిపోయిన




ఒక ఫ్రెంచి వ్యాపారి. లె కాన్నె ఒకనాటి యానాం పెద్దొర సొన్నరెట్ ను ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీరుతాగించాడు.

సొన్నరెట్ కు వ్యతిరేకంగా ఫ్రెంచి గవర్నరు ఫ్రెస్నె కు అనేక ఫిర్యాదులు చేసి అతనిపై అధికారిక ఎంక్వయిరీ వేయించటం లో లె కాన్నె విజయం సాధించాడు.

5 జూలై, 1790 న లె కాన్నె ఫ్రెంచి గవర్నరుకు ఫ్రెస్నె కు వ్రాసిన ఒక లేఖలో 'బెంగాలుకు ఎగుమతి అవ్వవలసిన తన నలభై ఓడల ఉప్పుకు సొన్నరెట్ అనుమతులు (పాస్‌పోర్టు) ఇవ్వటం లేదని, ఆ కారణంగా తనకు తీరని నష్టం వాటిల్లుతుందని' ఆరోపణ చేసాడు.

25 ఆగష్టు, 1790 న లె కాన్నె గవర్నరుకు వ్రాసిన మరో లేఖలో తన సరుకును అనుమతులు/పాస్ పోర్టులు లేని కారణంగా ఎక్కువ కాలం కోరంగి హార్బరులో ఉంచటం వీలు పడని కారణంగా తానే స్వయంగా పాస్‌పోర్టులను/అనుమతి పత్రాలను లిఖించి సరుకును బెంగాలుకు పంపించివేస్తున్నానని తన వ్యాపారానికి నష్టం కలుగకుండా చూడవలసినదిగా కోరాడు. (లె కాన్నె పంపించిన ఉప్పును బెంగాలు వ్యాపారులు అనుమతులు లేవని తిరిగి పంపించివేయకుండా ఉండేందుకు గవర్నరుగారే స్వయంగా సంబంధిత అధికారులకు ఉత్తరం వ్రాయవలసి వచ్చింది.) అంతే కాక ఇదే ఉత్తరంలో– సొన్నరెట్ కూడా పెద్ద ఎత్తున ఉప్పు వ్యాపారం చేస్తున్నాడు కనుక తన సరుకు ఎగుమతికి అనుమతులు మంజూరు చేయటం లేదని, ఇలా పక్షపాతంగా వ్యవహరిస్తూ అధికార దుర్వినియోగానికి పాల్పడుతున్న సొన్నరెట్ ను యానాం పెద్దొరగా తొలగించవలసినదిగా కూడా లె కాన్నె కోరాడు.

లె కాన్నె సాటి వ్యాపారులను కూడదీసి 'ఆక్టివ్ సిటిజన్స్ అసెంబ్లీ' పేరిట ఒక ప్రజాస్వామిక కూటమిని ఏర్పాటు చేసి సొన్నరెట్ పై తన పోరాటాన్ని కొనసాగించి, అతని వ్యవహారశైలిపై గవర్నరుగారిచే విచారణ కమిటీ వేయించగలిగాడు.

లె కాన్నె చనిపోయేవరకూ యానాంలోనే ఉంటూ వ్యాపారాలు నిర్వహించాడా లేదా అన్నది తెలియదు కానీ, 1816 నవంబరు లో లె కాన్నె కూతురైన ఆర్. లెకాన్నె కు ఎఫ్. గోవాన్ కు యానాంలో వివాహం జరిగినట్లు ది ఆసియాటిక్ జర్నల్ జూలై 1817 సంచికలో ఉంది. ఏది ఏమైనప్పటికీ ఇతగాని జీవనయానపు ఆది అంతం యానాంలోనే జరిగాయన్నది మాత్రం సుస్పష్టం.

(యానాం సమాధుల ఫొటోలు తీయటంలో ఎంతగానో సహాయపడిన మిత్రుడు శ్రీ కేతా ఫణి, ఈనాడు విలేఖరికి కృతజ్ఞతలు తెలియచేసుకొంటున్నాను. పై ఫొటోలలో వ్యక్తుల పేర్లు స్పష్టంగా కనిపించటం కొరకు అడ్జస్టు చేయటం జరిగింది గమనించగలరు–రచయిత)





# యానాన్ని పరిపాలించిన పెద్దొరలు

1723 లో మచిలీపట్నానికి చెందిన కుర్టన్ అనే ఫ్రెంచి వ్యాపారి గోదావరి తీర ప్రాంతంలో వ్యాపార స్థావరం కోసం చేసిన అన్వేషణ యానాంను కనుగొనటంతో ముగిసింది. Pierre Christoph Le Noir ఆనాటి పాండిచేరీ గవర్నరు జనరల్. అప్పటినుంచీ అనేకమంది ఫ్రెంచి వ్యాపారులు ఇక్కడి నుంచి చేనేత, ఉప్పు వ్యాపారాలు చేసారు. ఇక్కడి వ్యవహారాలు చూడటానికని ఒక అధికారిని (Chief de Services) పాండిచేరి గవర్నరు నియమించేవాడు. అప్పట్లో యానాంలో అనేక మంది ఫ్రెంచి దొరలు ఉండటంతో ఈ అధికారిని **'పెద్దొర'** అని, ఈయన నివాసముండే భవంతిని **పెద్దొర బంగ్లా** అనీ స్థానికులు పిలుచుకొనేవారు. పాండిచేరి యానానికి భౌగోళికంగా సుదూరంగా ఉండటంచే ప్రతి విషయానికి గవర్నరుగారి ఆదేశాలను, సలహాలను పొందటం ఈ పెద్దొరలకు కష్టమయ్యేది. ఆ కారణంగా అత్యవసర పరిస్థితులలో యానాం పెద్దొరలు సొంత నిర్ణయాలు తీసేసుకొని పాండిచేరికి తెలియచేసేవారు.

ఫ్రెంచి వారికి బ్రిటిష్ వారికి మధ్య జరిగిన అనేక యుద్ధాల ప్రభావం యానాం పై పడేది. 1723 లో యానాం లో ఫ్రెంచి వారు అడుగు పెట్టిన నాటి నుంచి 1954 లో భారతదేశంలో విలీనం చేసేదాకా ఉన్న మొత్తం కాలంలో నాలుగు సందర్భాలలో బ్రిటిష్ వారు ఈ ప్రాంతాన్ని కైవసం చేసుకొని పరిపాలించారు. ఆ వివరాలను ఈ క్రింది టేబుల్ చూడవచ్చును.

| ఫ్రెంచి వారు పాలించిన కాలం | బ్రిటిష్ వారు పాలించిన కాలం |
|---|---|
| 1723 - 1758 | 1758 - 1765 |
| 1765 - 1778 | 1778 - 1785 |
| 1785 - 1793 | 1793 - 1817 |
| 1802 - 1803 (1802 లో కుదుర్చుకొన్న Treaty of Amiens ప్రకారం కొంతకాలం ఫ్రెంచి వారు పరిపాలించినా, మరలా 1803, సెప్టెంబరు 11 న యానాం నాలుగోసారి బ్రిటిష్ వారి చేతుల్లోకి వెళ్ళిపోయింది.) | (మధ్యలో కొంతకాలం మినహా) |
| 1817 - 1954 | |

1723 – 1758 మధ్య కాలంలో యానాం పెద్దొరలుగా ఎవరు వ్యవహరించారన్న విషయం పట్ల సరైన సమాచారం లభించదు. ఆనందరంగ పిళ్ళై డైరీలలో అక్కడక్కడా ఉన్న సమాచారాన్ని బట్టి ఈ కాలంలో పనిచేసిన పెద్దొరల వివరాలు తెలుస్తాయి.

ఈ కాలానికి సంబంధించిన విషయాలు లభించని కారణంగా – వ్యాపార లావాదేవీలు లాభసాటిగా లేవని ఫ్రెంచి వారు యానాన్ని చాలాకాలం వదిలివేసినట్లు E. Gaudart, Patrik Pitoef, JBP More వంటి చరిత్రకారులు అభిప్రాయపడ్డారు. కానీ ఫ్రెంచి ఈస్ట్ ఇండియా కంపెనీ యానాంతో ఈ కాలంలో జరిపిన ఉత్తరప్రత్యుత్తరాలలో ఆనాటి పరిస్థితులు తెలుస్తాయి. (రి. Minutes of proceedings of the Sovereign Council of the East India Company)

ఫ్రెంచివారు 1723 లో యానాంలో కాలుపెట్టినప్పటినుంచీ ఏడాదికు నాలుగు వందల బేళ్ల వస్త్రాల వ్యాపారం చేసేవారు. 1727 వచ్చేసరికి సుబన్న మరియు రామ రాజు అనే స్థానిక రాజులు (విజయనగర రాజులు) ఫ్రెంచివారిని వేధింపులకు గురిచేయటం మొదలెట్టారు. అప్పటికి ద్రాక్షారంలో వ్యాపారాలు చేసుకొంటున్న డచ్చివారిని కూడా ఈ రాజులు అక్కడనుంచి తన్ని తరిమేసారు. ఈ నేపథ్యంలో యానాంలో ఉండటం సురక్షితం కాదని తలచిన ఫ్రెంచివారు ఇక్కడి తమ ఆస్థులను సంరక్షించమని కొంతమంది ఉద్యోగులను నియమించి 1728 లో మచిలీపట్నానికి తరలిపోయారు. తిమ్మరాజు అనే మరో స్థానిక రాజు తగిన రక్షణ కల్పిస్తానని, యానాం వచ్చి వ్యాపారాలు కొనసాగించమని లె ఫాషర్ అనే ఫ్రెంచి వ్యాపారికి రాయబారం పంపాడు. అంతేకాక 1730 లో సుబ్బన్న, రామరాజులు మరణించటంతో ఫ్రెంచివారు తిరిగి యానాంలో అడుగుపెట్టారు. ఈ మధ్యకాలంలో యానాంలో ఉండి వ్యాపారం జరపకపోయినప్పటికీ, ఇక్కడ తమ ప్రతినిధులను నియమించటం ద్వారా ఈ ప్రాంతం మాదే సుమా అని ఫ్రెంచివారు చాటుకొన్నారు.

లియోన్ పియరీ అనే షిప్పు పైలట్ 24 ఫిబ్రవరి, 1728 న యానాం సందర్శించినట్లు, 1730–34 ల మధ్య లో ఎడ్వంచురర్, డాఫిన్ అనే షిప్పులు యానానికి పలుమార్లు వచ్చినట్లు మారిటైం రికార్డులు చెపుతున్నాయి. (రి. Summary of patents, provisions and commissions of the king and appointments అనే పుస్తకం )

1732, మార్చి, 1 న ఫ్రెంచి ఈస్ట్ ఇండియా కంపనీ అధినేతల సమావేశంలో – యానాంలో చాలాకాలంగా ఇద్దరు ఫ్రెంచి అధికారులు మాత్రమే ఉంటున్నారనీ, అక్కడ జరిగే వ్యాపారానికి ముగ్గురి అవసరం ఉంది కనుక, డేవిడ్ లెబోన్ అనే వ్యాపారిని ఎనిమిది లీవ్రల (ప్రాచీన ఫ్రెంచి కరెన్సీ) జీతానికి, యానాం పంపించాలని నిర్ణయం తీసుకోవడాన్ని బట్టి అప్పట్లో యానాం నుంచి వ్యాపారం తగుస్థాయిలో జరిగినట్లు భావించవచ్చు.

పై వివరాలను బట్టి మొదట్లో ఫ్రెంచి వారు వ్యాపారం లాభసాటిగా లేదని యానాన్ని వదిలివేసారని చేసిన ఊహ సరికాకపోవచ్చు.





## Guillard

యానాంలో వ్యాపార లావాదేవీలు జరుపుకోవటానికి ఫ్రెంచి ఇండియా కంపెనీ ఒక అధికారిని నియమించేది. ఇతను మరో ఇద్దరు ఉద్యోగుల సహాయంతో ఇక్కడ సరుకులు కొనటం వాటిని షిప్పులలో ఎగుమతి చేయించటం వంటి పనులుచూసేవాడు. అలా యానాం ఫాక్టరీ (వ్యాపారకూడలి) నిర్వాహకుడిగా నియమింపబడిన గిల్లార్డ్‌ను యానానికి మొదటి పెద్దొరగా పేర్కొనవచ్చును.

యానాం ఫ్రెంచి కంపనీ ఉద్యోగి అంతన్న కేసు విచారణ జరిపేటపుడు, 'గిల్లార్డ్' యానాం లో పనిచేసాడు కాబట్టి అతనికి ఈ అంతన్న గురించి తెలుస్తుందని గవర్నరు (డూప్లే) ఈయన్ని పిలిపించాడు. (ఈ ఉదంతం 'రంగపిళ్ళై డైరీలలో యానాం ప్రస్థావన' అనే చాప్టరులో వస్తుంది). ఆ సందర్భంగా గిల్లార్డ్ తాను యానాంపెద్దొరగా 12–13 సంవత్సరాలు పనిచేసానని చెప్పుకొంటాడు. అంతే కాక అంతన్న కూడా 1730 లలో గిల్లార్డ్ కు తోడుగా ఒకసారి పాండిచేరీ వచ్చానని చెప్పటాన్ని బట్టి ఈ గిల్లార్డ్ బహుశా 1723–1737 ల మధ్య యానాంకు పెద్దొరగా పనిచేసి ఉండవచ్చు.

1737 లో గిల్లార్డ్ పక్షవాతంతో యానాంలో అనారోగ్య పాలవటంతో వైద్యం కొరకు పాండిచేరి రావటానికి ఫ్రెంచి ఈస్ట్ఇండియా కంపెనీ, 2 డిశంబరు, 1737 న ఇచ్చిన ఒక అనుమతి లేఖ ద్వారా ఇతని ఆరోగ్యం అంతంతమాత్రంగానే ఉండేదని తెలుస్తుంది. అంతేకాక గిల్లార్డ్ లేనప్పుడే యానాం నుంచి వ్యాపారం ఎక్కువగా జరిగిందని కంపనీ అధిపతి వ్యాఖ్యానించటం గమనార్హం. (రి. Minutes of Proceedings of the Sovereign Council of the East India Company. Volume 3 )

**ఈతని హయాంలో యానాంలో మూడు స్వాముల పగోడా నాణేల ముద్రణ జరిగింది.**

## M. Choisy

ఈయన 1736 లో పాండిచేరిలోని గవర్నరు కౌన్సిలులో (గవర్నరుకు సలహాలు ఇచ్చే మండలి) మెంబరు గా ఉన్నాడు. గిలార్డ్ అనారోగ్యం పాలవటంతో అతని స్థానంలో, 1738లో ఫ్రెంచి ఈస్ట్ఇండియా కంపనీ వారు, M. de Choisy ను, యానాం పెద్దొరగా పంపించారు. ఇతని హయాంలో యానాంనుంచి వ్యాపారం బాగా జరిగినట్లు తెలుస్తుంది. కరువు కాలంలో ఆహారంగా వాడుకోవటానికని యానాంనుండి చాయిసీ పెద్దఎత్తున పిండిసేకరణ జరిపేవాడు. ఇతను 1747 అక్టోబరు, 27 న యానాంలోనే చనిపోయాడు.

ఈయన ఇక్కడ ఉండగా మృత్యుంజయ అయ్యన్ అనే ఒక వ్యాపారి వద్ద 4600 రూపాయిలు అప్పు తీసుకొని తీర్చివేశాడు. ఆ అప్పు పత్రాన్ని చింపివేయకుండా చాయిసీ తన

బీరువాలో పెట్టి మరచిపోయాడు. చాయిసీ చనిపోయాకా యానాం పెద్దొరగా వచ్చిన Sainfray ఆ అప్పు పత్రాన్ని లెనాయిర్ (సైన్‌ఫ్రే తరువాత వచ్చిన యానాం పెద్దొర) కు అందించాడు. ఈ లెనాయిర్ దాన్ని, మృత్యుంజయ అయ్యన్ పంపించినట్లు గవర్నరు గారికి పంపించి, చాయిసీ భార్యనుండి 4600 రూపాయిలు ఇప్పించమని అడగటం జరిగింది. ఈ మొత్తం ఉదంతంలోని దోషులను పిళ్ళై ఎంతో చాకచక్యంగా బయటపెట్టాడు. (రి: పిళ్ళై డైరీలు) చాయిసీ గొప్ప సాహిత్యాభిమాని. ఇతని వద్ద చాలా అరుదైన పుస్తక సంపద ఉండేదట. ఈయన చనిపోయిన తరువాత ఈయన వ్యక్తిగత లైబ్రేరీ లోని 508 పుస్తకాలను వేలం వేసినపుడు క్షణాల్లో అమ్ముడుపోయాయట.

## Sainfray A J
ఇతను చాయిసీ తరువాత యానాం పెద్దొరగా వచ్చి 1748 వరకూ పనిచేసాడు.

## M. Lenoir
ఇతను సెయిన్ ఫ్రే తరువాత వచ్చాడు. ఇతను ఎంతకాలం పనిచేసాడో తెలియరాదు. 1748లో యానాం పెద్దొరగా వ్యవహరించినట్లు మాత్రం తెలుస్తుంది. అధికార వర్గాలలో ఇతనికి మంచి పేరు లేదు.

1750 లో ముస్లిం రాజులు (నాసిర్‌జంగ్) యానాం నుంచి ఫ్రెంచి వారిని తరిమేయటానికి వస్తున్నారన్న వార్తను తెలుసుకొన్న లెనాయిర్, యానాంనుంచి మూటాముల్లె సర్దుకొని బెంగాలు వెళిపోతున్నానని అందరితో చెప్పి యానానికి మైలు దూరంలో గోదావరిలో మృత్యుంజయ అయ్యన్ కు చెందిన ఒక లంకపై కొంతకాలం తలదాచుకొన్నాడు. (రక్షణ కొరకు ఇదొక ఎత్తుగడ). దూప్లే దౌత్యపరమైన కృషి వలన ముస్లిం దాడులు ఆగిపోవటంతో లెనాయిర్ తిరిగి యానాం వచ్చాడు. (రి. ఆనంద రంగ పిళ్ళై డయరీలు)

## Jacques Panon
బ్రిటిష్ వారికి, ఫ్రెంచి వారికి జరిగిన యుద్ధాల కారణంగా 18, 19 శతాబ్దాలలో యానాం నాలుగు సందర్భాలలో ఇంగ్లీషువారి పాలనలోకి వెళ్ళి తిరిగి ఫ్రెంచి వారి చేతుల్లోకి రావటం జరిగింది. అలా బ్రిటిష్ వారి మొదటి ఆక్రమణ 1758 లో జరగగా, ఇంగ్లాండులో జరిగిన శాంతి ఒప్పందం ప్రాతిపదికగా అప్పటి ఫ్రెంచి గవర్నరు Jean Law de Lauriston చొరవతో 15 మే, 1765 న ఫ్రెంచివారు యానాంను ఇంగ్లీషువారినుండి తిరిగి స్వాధీనం చేసుకొన్నారు. ఈ మొత్తం బదలాయింపును గవర్నరు తరపున Jean Jacques Panon అనే అధికారి నిర్వహించాడు.

ఆ తదుపరి పానన్ రాజమండ్రి ఫౌజ్‌దార్ నుండి (ముస్లిం రాజ ప్రతినిధి) నుండి రెండు ముఖ్యమైన అనుమతులు యానానికి సాధించిపెట్టాడు. మొదటిది, యానాం నుంచి ఫ్రెంచి వారు జరిపే వ్యాపారాలకు పన్ను మినహాయింపు. రెండవది, ప్రతి మంగళవారం






యానాంలో అధికారికంగా వారపు సంతను జరుపుకోవటం కొరకు. పన్ను మినహాయింపు అంశం ఆ తరువాత కాలంలో బ్రిటిష్ వారు అనేక సందర్భాలలో ఉల్లంఘించి ఆ సదుపాయాన్ని క్రమక్రమంగా లేకుండా చేసేసారు. పానన్ కాలంలో యానాం పొరుగు బ్రిటిష్ ప్రాంతమైన నీలపల్లి లోకూడా మంగళ వారం సంత జరిగేది. దాని వల్ల వ్యాపారులకు ఇబ్బందిగా ఉండేది. ఆ కారణంగా యానాం సంత మంగళవారమే జరుపుకొనేటట్లు నీలపల్లి సంత శనివారం జరుపుకొనేలా పానన్ అధికారిక అనుమతి పొందాడు. నేటికి కూడా యానాం సంత మంగళవారమే జరగుతున్నది. ఈ సంతలో అప్పుట్లో షిప్పులలో దిగిన విదేశీ ఉత్పత్తుల వ్యాపారం భారీ ఎత్తున జరిగేది.

1778 లో బ్రిటిష్ వారు యానాన్ని ఆక్రమించుకొనే వరకూ పానన్ ఇక్కడే ఉన్నాడా లేదా అనే విషయాలు తెలియరావు. పానన్ 1780 లో పాట్నా వెళ్ళిపోయి అక్కడ బొన్నె గాడీ అనే అమ్మాయిని పెళ్లి చేసుకొని అక్కడే స్థిరపడినట్లు అతని వంశస్థులలో ఒకరైన Guyde Richemont, Rootsweb అనే వెబ్‌సైట్లో తెలియచేసాడు. (యానాం వివాహ రిజిష్టరు లో మొదటి నమోదు పానన్ దే. 1, జూలై 1767 న జీన్ జాక్వస్ పానన్ వివాహం యానాంలో జరిగినట్లు రికార్డులను బట్టి తెలుస్తుంది. మరి ఈ మొదటి భార్య ఏమైందో పాట్నాలో మరో వివాహం ఎందుకు చేసుకొన్నాడో వంటి వివరాలు తెలియరావు. –రి.బొటానిక్ గార్డెన్ ఆఫ్ యానాం పుస్తకం పే.నం.14)

1785 లో బ్రిటిష్ వారినుండి యానాం మరలా ఫ్రెంచి వారి చేతుల్లోకి వచ్చినపుడు పెద్దొరగా Mallahendre నియమించబడ్డాడు. 1789 Jean Alexes కొంతకాలము, ఆయన తరువాత Bluter కొద్దికాలం పనిచేసాడు. బ్లటర్ తరువాత 1790 లో Pierre Sonneret యానానికి పెద్దొరగా వచ్చాడు.

## Pierre Sonneret
జీవశాస్త్ర పరిశోధకుడయిన సొన్నరెట్ యానానికి పెద్దొరగా రాకముందు పరిశోధనల పేరిట ప్రపంచాన్ని చుట్టి వచ్చాడు. ఈయన అనేక వృక్ష, జంతు జాతులను గుర్తించి శాస్త్రీయ నామీకరణ చేశాడు. కొన్నింటికి ఈయన పేరు పెట్టటం కూడా జరిగింది. ఉదాహరణకు – మన ప్రాంతంలో ఉండే బూడిద రంగు అడవి కోడి శాస్త్రీయనామం *Gallus sonnaretii* అనేది ఈయన పేరే. సొన్నరెట్ తన యాత్రానుభవాలను వర్ణిస్తూ 'Voyage Aux Indes Orientals et en China' అనే మూడు వాల్యూముల పుస్తకాన్ని వ్రాసాడు.

ఫ్రెంచి రచయిత వోల్టైర్ కు ఓ మిత్రుడు 1760 లో భారతదేశం నుంచి Ezourvedam అనే ఒక పుస్తకం అందచేసాడు. ఈ పుస్తకం లోని విషయాలపట్ల వోల్టైర్ ఎంతో ఆశ్చర్యం పొందాడట. భారతీయ వేదాలకు ఫ్రెంచి అనువాదంగా ఈ పుస్తకం చాలాకాలం పాటు చలామణీ అయింది. 1782 లో సొన్నరెట్ ఈ పుస్తకం భారతీయ వేదాలకు అనువాదం

కాదనీ, మచిలీపట్నానికి చెందిన ఒక ఫ్రెంచి చర్చి ఫాదరు విష్ణుపురాణ కథలకు క్రిష్టియన్ కథలు జోడించి వ్రాసిన ఒక మోసపూరిత రచనకు యజుర్వేదము అని పేరుపెట్టి ప్రచారించుకొన్నాడన్న సత్యాన్ని ప్రపంచానికి తెలియచేసాడు.

యానాన్ని పరిపాలించిన పెద్దొరలందరిలోకెల్లా సొన్నరెట్‌ది అరుదైన వ్యక్తిత్వం. ఈయన తెలుగుభాషలోని లయాత్మకతను ఆస్వాదించేవాడట.

సొన్నరెట్ పెద్దఎత్తున యానాం నుంచి ఉప్పు, చేనేత వస్త్రాలను ఎగుమతి చేసేవాడు. సొన్నరెట్ చేస్తున్న వ్యాపారాల పట్ల ఇతర ఫ్రెంచివారు అసూయచెంది ఇతనిపై పాండిచేరికి కంప్లైంట్లివ్వటం మొదలెట్టారు. De Mars అనే వ్యాపారి 5 జూన్, 1790 లో అప్పటి ఫ్రెంచి గవర్నరు De Fresne కు ఇచ్చిన కంప్లైంట్‌లో 'పెద్దొరగా సొన్నరెట్ అధికార దుర్వినియోగానికి పాల్పడి తన వ్యాపారాలను దెబ్బతీస్తున్నాడని' పేర్కొన్నాడు. పాండిచేరి ఈ కంప్లైంట్ ను పెద్దగా పట్టించుకోదు.

ఫిబ్రవరి 1791 లో లె కాన్నె అనే మరో వ్యాపారి ఇచ్చిన రెండవ కంప్లైంట్‌లో 'తన ఉప్పు వ్యాపారానికి సొన్నరెట్ అనుమతులు ఇవ్వటం లేదని' అభియోగం చేసాడు. ఈ కంప్లైంట్ పై కూడా పాండిచేరి పెద్దగా స్పందించదు.

ఇంతలో ఫ్రాన్స్ అసెంబ్లీకి మరియు పాండిచేరి కౌన్సిల్ కు యానాం నుంచి ప్రతినిధులను ఎంపిక చేసుకొమ్మని ఒక ఉత్తర్వు యానాం చేరింది. సొన్నరెట్ ను దెబ్బతీయటానికి దీనిని అవకాశంగా తీసుకొని, కొంతమంది యానాం వ్యాపారులు 1791లో కలోనియల్ అసెంబ్లీ పేరుతో ఒక కమిటీని ఏర్పాటు చేసుకొన్నారు. ఈ కమిటీ సభ్యులు కొంచెం **'అతి'** కి పోయి సొన్నరెట్ నుంచి పరిపాలన, జుడిషియల్ అధికారాలను తీసేసుకొన్నారు. సొన్నరెట్ జీతం కూడా తగ్గించి వేసారు. సొన్నరెట్ కూడా దీన్ని ప్రతిఘటించక, యానాం ప్రాంతంలోని వృక్ష, జంతు జాతుల అధ్యయనంలో మునిగిపోయాడు.

యానాంలో జరుగుతున్న ఈ తతంగం అంతా పాండిచేరి కౌన్సిల్ తెలుసుకొని 'అలా పెద్దొర అధికారాలను ఊడపీకడం చట్ట విరుద్దమనీ, వెంటనే సొన్నరెట్ అధికారాలను తిరిగి ఆయనకు ఇచ్చివేయమని' కమిటీ పెద్దలకు ఆదేశాలు జారీ చేసింది. దె మార్స్ ఆధ్వర్యంలోని కమిటీ వాటిని ఖాతరుచెయ్యలేదు. ఇదే సమయంలో కమిటీ మెంబరులలో పిథోస్ వంటి కొంతమంది సొన్నరెట్ పక్షాన చేరిపోవటం జరిగింది.

ఈ సందర్భంలో యానాంలోని ఫ్రెంచి వ్యాపారులు రెండు వర్గాలుగా చీలిపోయి, సంధి కుదర్చమంటూ, తీర్పులు చెప్పమంటూ స్థానిక హిందూ పెద్దలను ఆశ్రయించటం – భారతదేశ కలోనియల్ చరిత్రలో ఎక్కడా జరగని ఒక విచిత్రమైన సంఘటన.

1791, సెప్టెంబరు నెలలో పరిస్థితులను చక్కదిద్దటానికి గవర్నరు గారు ద్విసభ్యకమిటీని పంపించారు. వారు యానాంలో విచారణ జరుపుతున్న సమయంలో జరిగిన ఒక సంఘటన







వల్ల మొత్తం కథ కొత్తమలుపు తీసుకొంది.

ఒక బ్రాహ్మణ వ్యాపారిని పిథోస్ చెప్పుతో కొట్టి అవమానించినందుకు సుమారు నాలుగొందల మంది యానాం ప్రజలు ఫ్రెంచి వ్యాపారులందరిపై కర్రలతో దాడికి సిద్దమయ్యారు. ఈ ప్రతిచర్యకు బెదిరిపోయిన మొత్తం అందరూ రక్షణ కోసమని సొన్నరెట్‌ను, విచారణ కమిటీని ఆశ్రయించటం జరిగింది. విచారణ కమిటీ ఆదేశాల మేరకు వారు సొన్నరెట్ సర్వాధికారాలు మారు మాట్లాడక తిరిగి ఇచ్చివేసారు.

సొన్నరెట్ అలా వివాదాస్పదమైనా చివరకు తనదే పైచేయి అనిపించుకొన్నాడు. చింతచచ్చినా పులుపు చావదన్నట్లు ఆ తరువాత కూడా వీరు సొన్నరెట్ పై కంప్లైంట్లివ్వటం మొదలెట్టారు. 1793 లో యానాం మరలా బ్రిటిష్ వారి ఆక్రమణలోకి వెళ్ళిపోవటంతో పిట్టపోరు పిట్టపోరు పిల్లి తీర్చినట్లయింది.

## François de Courson

12 ఏప్రిల్,1817 న యానాం తిరిగి ఫ్రెంచి వారి చేతుల్లోకి వచ్చినపుడు, కుర్‌సన్ యానానికి పెద్దొరగా వచ్చాడు. యానాంలో పనిచేసిన పెద్దొరల అందరిలోను ఇతను అత్యంత వివాదాస్పదుడుగా మిగిలిపోయాడు. యానాంకు చెందిన కురసాం పేట గ్రామనామం ఇతనిదే. అత్యుత్సాహం, అత్యాశ, నమ్మక ద్రోహం చేయటానికి సంకోచించకపోవటం వంటి లక్షణాలు కుర్‌సన్‌ను ఒక మోసగాడిలా, ఒక మోసపోయినవాడిలా చరిత్రలో నిలబెట్టాయి.

కుర్‌సన్ 1817 నుండి 1824 వరకూ యానాం పెద్దొరగా వ్యవహరించాడు. 1818, ఆగష్టు లో కుర్‌సన్ భార్య మగబిడ్డకు జన్మనిచ్చింది. కుర్‌సన్ తన పదవీ కాలంలో అనేక విధాలుగా అధికార దుర్వినియోగానికి పాల్పడినట్లు ఋజువు కావటంతో పెద్దొర పదవి ని కోల్పోయాడు.

పెద్దొర పదవి పోగొట్టుకొన్న తరువాత కుర్‌సన్ యానాంలోనే ఉండిపోయి De Courson and Co అనే సంస్థను స్థాపించి అనేక వ్యాపారాలు చేసాడు. దేనిలోనూ రాణించినట్లు కనిపించదు.

కుర్‌సన్ పారిస్ లో చాలా పలుకుబడి కలిగిన కుటుంబానికి చెందిన వ్యక్తి. ఇతని తండ్రి షెవాలియర్ కుర్‌సన్ షిప్పులను పర్యవేక్షించే ఒక పెద్ద నౌకాధికారి. 1822 జూలై నెలలో కుర్‌సన్ తండ్రి యానాం వచ్చి కొడుకు వైభవాన్ని చూసి మురిసిపోయి – ఈ చిన్ని ప్రాంతం చాలా సుందరంగా ఉంది. ఇక్కడి ప్రజలు నన్ను చాలా బాగా ఆదరించారు. వారి కష్టాలు తీర్చటంలో నా కుమారుడు చేస్తున్న కృషిని పలువురు ప్రశంసించారు' అంటూ తన మారిటైమ్ రికార్డులలో రాసుకొన్నాడు. (రి: 1 June 1823, report of the ship, 'La Cleopatre', commanded by Mr Le Chevalier De Courson, captain of the vessel)

కుర్సన్ సాగించిన ఉప్పు కుంభకోణం గురించి ఇదే పుస్తకంలో మరో చోట విపులంగా చెప్పటం జరిగింది. 1816-18 సంవత్సరాల మధ్య యానాంకు వచ్చిన 21,431 ఫ్రాంకుల మిగులు ఆదాయాన్ని పాండిచేరీ ట్రెజరీకి జమచేయకుండా, కుర్సన్ తన వ్యాపారావసరాల కోసం వాడేసుకొన్నాడు.

1820 లో Baron de Richmont (Commissaire Inspector of the King in the French Establishments of India) బెంగాలు నుండి పాండిచేరీ వెళుతూ మధ్యలో యానాన్ని సందర్శించాడు. ఇక్కడ కుర్సన్ ప్రవర్తనను తన రిపోర్టులో ఇలా వర్ణించాడు - "యానాన్ని ఒక స్వతంత్ర రాజ్యంలా, దానికి తానో నవాబు లాగా కుర్సన్ భావించుకొంటున్నాడు. ఇక్కడి వ్యాపారాలన్నీ ఇతని ఆధీనమై ఉన్నవి. కుర్సన్ మరియు అతని భార్య యానాన్ని సొంత ఆస్థి లాగా అనుభవిస్తున్నారు. ఇక్కడి భూములను తనకే లీజుకు ఇచ్చుకొని, ఆ లీజు సొమ్మును మరలా తానే వాడేసుకొంటున్నాడు, పన్నులసొమ్మును ఇష్టం వచ్చిన రీతిలో ఖర్చు చేస్తున్నాడు, రెవిన్యూ మిగులు ఆదాయాన్ని తన వ్యాపారాలకు వినియోగించుకొంటున్నాడు. తన జీతాన్ని రెట్టింపు చేసేసుకొన్నాడు. ఈ కుర్సన్ వ్యవహారాన్ని లోతుగా అధ్యయనం చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది" అంటూ చాలా ఘాటుగా కుర్సన్ వ్యవహార శైలిని గవర్నరుకు నివేదించాడు.

ఒక్కసారి కూడా ఎప్పుడూ వెళ్లని మచిలీపట్నానికి కూడా తానే పెద్దొరనని చెప్పుకొంటూ, యానాం ఖజానా నుంచి జీతం తీసుకొనేవాడు కుర్సన్.

ఫ్రెంచి ప్రభుత్వం కుర్సన్ అవినీతి పై విచారణ చేయమని పెల్లిసియర్ అనే అధికారిని నియమించింది. ఈయన ఇచ్చిన రిపోర్టు ఆధారంగా 1824లో కుర్సన్ ను ఫ్రెంచి ప్రభుత్వం పెద్దొర పదవినుండి డిస్మిస్ చేసింది.

1829 లో కుర్సన్ యానాంలో నీలిమందు మొక్కల పెంపకం చేపట్టటానికి ప్రయత్నించాడు. సాంప్రదాయ వ్యవసాయ పద్దతులలో ఎక్కువమందికి ఉపాధి లభిస్తుంది కానీ నీలిమందు లాంటి వాణిజ్యపంటల వలన చాలామంది ఉపాధి కోల్పోవలసి వస్తుందనే భయంచే కుర్సన్ ప్రతిపాదనకు మద్దతు లభించలేదు.

అత్యాశకు పోయి విపరీతమైన పటాటోపంతో జీవితాన్ని సాగించిన కుర్సన్ కు చివరకు అప్పులు తప్ప మరేం మిగల్లేదు. కుర్సన్ తన వ్యాపార నిమిత్తం మన్యం వెంకటరత్నం వద్ద తీసుకొన్న డబ్బుకు పన్నెండు శాతం వడ్డీతో తిరిగి చెల్లించ వలసినదిగా కుర్సన్ వారసులను యానాం కోర్టు 1859 లో ఆదేశించింది. అప్పటికి కుర్సన్ చనిపోయి ఇరవైతొమ్మిది సంవత్సరాలు అయ్యింది.

**Amedee de Lesparda**

కుర్సన్ వంటి అవినీతి అధికారి వలన ప్రభుత్వ గౌరవానికి కలిగిన నష్టాన్ని భర్తీ







చేయటం కోసమని లెస్పార్డా అనే నిజాయితీపరుడైన వ్యక్తిని యానానికి పెద్దొరగా ఫ్రెంచి ప్రభుత్వం 1824లో నియమించింది. లెస్పార్డా 1828 మార్చి వరకూ పనిచేసి అధికారాలను డిలార్ష్ కు అప్పగించి వెళిపోయాడు. ఆ వెంటనే యానాంలో పెద్ద ఎత్తున అల్లర్లు చెలరేగటంతో వాటిని చక్కదిద్దమని, ఫ్రెంచి ప్రభుత్వం మరలా లాస్పార్డా ను డిశంబరు 1828 లో యానాం పంపించింది. ఆ విధంగా యానాం వచ్చిన లాస్పార్డా డిశంబరు 1832 వరకూ రెండవ సారి పెద్దొరగా పనిచేసాడు.

లాస్పార్డా భాద్యతలు చేపట్టిన వెంటనే, కుర్సన్ హయాంలో అన్యాయంగా ఖైదుచేయబడి గత రెండు సంవత్సరములుగా జైలులో మగ్గుతున్న ఇద్దరు ఖైదీలను గవర్నరు అనుమతితో విడుదల చేయించాడు.

అప్పట్లో యానాంలో ఉన్న మొత్తం సుమారు నాలుగు వందల హెక్టార్ల పంట భూములలో 113 హెక్టార్ల మేరకు మాన్యం భూములుండటాన్ని లెస్పార్డా గుర్తించాడు. ఈ భూములు కొంతమంది వ్యక్తుల పేర్న ఉన్నాయి. వారు ఆ భూములను చాలా కాలంగా సాగుచేసుకొంటున్నారు. ఇవి ప్రభుత్వ టాక్స్ పరిధిలోకి రావు. ఆ కాలంలో పాండిచేరీలోని మాన్యం భూముల మొత్తం కలిపి ఒక హెక్టారు, పద్దెనిమిది ఏర్లు మాత్రమే ఉన్నాయి. విస్తీర్ణరీత్యా పాండిచేరీ కన్నా చాలా చిన్నదయిన యానాం మాన్యం భూములు ఇంత ఎక్కువగా ఉండటం లాస్పార్డా కు అనుమానం కలిగించింది. అంతే కాక ఈ మాన్యం భూములు టాక్స్ పరిధిలోకి రాని కారణంగా ప్రభుత్వానికి నష్టం కలుగుతున్నట్లు ఇతను భావించాడు.

మాన్యం భూముల క్రమబద్దీకరణకు లాస్పార్డా పూనుకొన్నాడు. 30 సంవత్సరాలుగా పండించుకొంటున్న భూములకు మాత్రమే మాన్యం భూములుగా గుర్తింపునిచ్చి, మిగిలినవాటిని ప్రభుత్వ భూములుగా మార్చివేశాడు. అప్పటికి మాన్యం భూములను అనుభవిస్తున్న వారిలో తగిన ఆధారాలు (ప్రభుత్వం/జమీందార్లు/పూర్వము పాలించిన రాజులు ఇచ్చిన దానపట్టాలు లేదా 30 సంవత్సరాలుగా పండించుకొంటున్నట్లు ఋజువులు) చూపించిన వారందరికీ ఆయా భూములను వారి పేరున దఖలు పరిచాడు.

యానాంలోని గొర్రెల కాపరులకు పశుగ్రాసం కోసమని అడవి పొలంలో 21 హెక్టార్ల ప్రభుత్వ భూమిని లాస్పార్డా కేటాయించాడు. అందుకుగాను వారినుంచి పుల్లరి సుంకాన్ని ప్రభుత్వం వసూలు చేసేది. 1829 నుంచీ 1877 లో ఆ భూములను ప్రభుత్వం ప్రైవేటు వ్యక్తులకు అమ్మేసేదాకా 'పశుగ్రాస భూములు' గానే రికార్డులలో పేర్కొనబడ్డాయి.

లెస్పార్డా హయాంలో, నావల నిర్మాణం లేదా రిపేర్ల కోసమని యానాం నది ఒడ్డును ఉపయోగించుకొన్నందుకు ఆయా యజమానులనుండి నామమాత్ర అద్దెను వసూలు చేయటం జరిగేది. ఈ పద్దతి వలన యానానికి కలిగిన లాభం కంటే నష్టమే ఎక్కువ, ఎందుకంటే ఈ పన్నుపోటు పడలేక నౌక/నావ ల నిర్మాణరంగం యానాం నుంచి సమీప బ్రిటిష్ ప్రాంతాలలోకి తరలిపోయింది.

1828 లో యానాంలో చెలరేగిన అల్లర్లను (అవేమిటన్నది ముందు ముందు చదవగలరు) లాస్పార్డా సమర్ధవంతంగా పరిష్కరించాడు. అంతే కాక గవర్నరు గారిని ఒప్పించి ఆ అల్లర్లకు కారణమైన వారికి క్షమాబిక్ష కూడా కల్పించాడు. ఈ 1832 లో లాస్పార్డా పదోన్నతిపై కారైకాల్ కి బదిలీఅయి యానాన్ని విడిచి వెళిపోయాడు.

యానాన్ని పరిపాలించిన పెద్దొరలలో, లాస్పార్డా అత్యంత నిజాయితీ పరుడిగా, మంచి రాజనీతిజ్ఞుడిగా, సమర్ధవంతమైన అధికారిగా పేరుతెచ్చుకొన్నాడు.

## Delarche

ఇతను 1828 మార్చి నుండి డిశంబరు వరకూ యానానికి తాత్కాలిక పెద్దొరగా పనిచేసాడు. ఇతని హయాంలో జరిగిన అల్లర్లను అదుపు చేయటంలో పూర్తిగా విఫలమవ్వటంతో, ఇతని స్థానంలోకి ఫ్రెంచి ప్రభుత్వం లెస్పార్డాను పంపించింది.

1828 లో అల్లర్లు చెలరేగటానికి కల పూర్వాపరాలను పరిశీలిస్తే, ఆనాటి సామాజిక స్థితిని, ప్రజలలో ఉండే వివిధ స్థాయీభావనలను, అప్పటి కట్టుబాట్లను అర్ధం చేసుకొనవచ్చును.

మన్యం కనకయ్య యానానికి చెందిన ప్రముఖ వ్యాపారి. అత్యంత ధనికుడు. ఇతని వ్యాపారాలు యానాంలోనే కాక చుట్టుపక్కల బ్రిటిష్ ప్రాంతంలో కూడా విస్తరించి ఉండేవి. కనకయ్య కు బ్రిటిష్ ప్రభుత్వం జమిందారు హోదాను కల్పించింది. ఈ హోదా కలిగిన వారికి, పల్లకిలో తిరగడం, వెండి రాజదండాన్ని (శంకోలు) కలిగిఉండుట, రెండు కాగడాలతో పల్లకి ప్రయాణం వంటి గౌరవచిహ్నాలు ఉంటాయి.

యానాంలో కూడా తనకు పై సదుపాయాలకు అనుమతినిప్పించమని కనకయ్య అప్పటి పెద్దొర డిలార్ష్ ను కోరాడు. దీనివల్ల తలెత్తబోయే పరిణామాలను ఏమాత్రమూ ఊహించని డిలార్ష్ కనకయ్యకు పై సదుపాయాలన్నీ యానాంలో అనుమతిస్తూ 1828 ఆగస్టు, 18 న ఉత్తర్వు జారీ చేశాడు. అంతేకాక 9 మంది ఫ్రెంచి దేశస్థుల సంతకాలతో కూడిన ఆ అనుమతి పత్రాన్ని ఫ్రెంచి గవర్నరు కోర్దియర్ ఆమోదం కోసం పంపించాడు కూడా.

ఆ విధంగా మన్యం కనకయ్యకు ప్రత్యేక సదుపాయాలు కల్పించటం పట్ల యానాం సమాజం భగ్గుమంది. డబ్బులు వెదజల్లి అలాంటి హోదాను పొంది, సామాన్య ప్రజలను మన్యం కనకయ్య భయభ్రాంతులకు గురిచేస్తున్నాడని అంతే కాక హిందూ వర్ణవ్యవస్థ ధర్మాలను బట్టి కనకయ్య వర్ణానికి అలాంటి సదుపాయాలు లేవనీ అంటూ అట్టి అనుమతులను నిరసిస్తూ, 31 ఆగస్టు న తొంభైమంది యానాం ప్రముఖుల సంతకాలతో కూడిన ఒక పిర్యాదు పాండిచేరీ గవర్నరుకు పంపబడింది.

కనకయ్య కు వ్యతిరేకంగా ఇంటింటికీ తిరుగుతూ మరో పిర్యాదుపై సంతకాలు తీసుకొంటున్న ఇద్దరు యానాం ప్రముఖులను, 7 సెప్టెంబరున డిలార్ష్ అరెస్టు చేయించాడు.







దీనితో అంతవరకూ నివురుకప్పిన నిప్పులా ఉన్న ఆగ్రహజ్వాలలు ఒక్కసారిగా బయటపడ్డాయి. వందల సంఖ్యలో జనం డిలార్ష్ ఇంటిపై దాడికి పాల్పడ్డారు. తలుపులు బద్దలు కొట్టారు. వారిచేతిలో కర్రలున్నాయి. పోలీసులు నిస్సహాయులైనారు. ఇంతటి నిరసనను ఊహించని డిలార్ష్, ఆందోళనకారులు కోరినట్లు అరెస్టు చేయించిన ఇద్దరినీ వెంటనే విడుదల చేయించి అప్పటికి పరిస్థితిని సద్దుచేయగలిగాడు కానీ యానాం సమాజం పేలటానికి సిద్దంగా ఉన్న అగ్నిపర్వతం లా ఉందన్న విషయాన్ని ఏమాత్రమూ ఊహించలేకపోయాడు.

డిలార్ష్ విదేశీయుడైనా ఒక భారతీయ వనితను వివాహం చేసుకొన్నాడు. అయినప్పటికీ ఆనాటి ప్రజలలో పాతుకుపోయిఉన్న వర్ణ వ్యవస్థ స్వరూపాన్ని అర్ధం చేసుకోవటంలో విఫలం అయ్యాడనే అనుకోవాలి.

సెప్టెంబరు 18 న గవర్నరు కోర్దియర్, డిలార్ష్‌కు రాసిన ఒక లేఖలో, అల్లర్లకు కారణమైన వారిని రహస్యంగా అరెస్టు చేయించి పాండిచేరి పంపమని ఆదేశించాడు. ఈలోపున కనకయ్యకు అలాంటి సదుపాయాలు కల్పించవలసినదిగా కోరుతూ రెండు వినతిపత్రాలు యానాం నుంచి గవర్నరుకు పంపటం జరిగింది. దీనిపై సంతకం చేసిన 132 లో అందరూ కనకయ్య వద్ద పనిచేసే వారో లేక ఆయన బంధువులో కావటం గమనార్హం. యానానికి చెందిన ఇతర ప్రముఖులెవరూ సంతకాలు చెయ్యకపోవటాన్ని బట్టి, అప్పట్లో రాజకీయంగా, సంఖ్యాపరంగా ఆధిక్యతలో ఉన్న ఒక వర్గం యొక్క కట్టుబాటును అర్ధం చేసుకొనవచ్చును.

పై వినతి పత్రాలను అందుకొన్న గవర్నరు యానాంలోని పరిస్థితి తీవ్రతపై అనుమానం వచ్చి డిలార్ష్‌ను సంయమనం పాటించమని ఆదేశించేలోగా జరగాల్సిన నష్టం జరిగిపోయింది.

అల్లర్లకు కారణమైన వారిని రహస్యంగా అరెస్టుచేయమన్న గవర్నరు గారి ఆదేశాల మేరకు డిలార్ష్, 18 అక్టోబరున ఆ పనికి శ్రీకారం చుట్టి ఈ మొత్తం ఉదంతాన్ని నడిపిస్తున్న కొంతమందిని అరెస్టు చేయించాడు. దీనితో నిరసన జ్వాలలు మరింత ఉవ్వెత్తున ఎగసిపడ్డాయి. ఈ సారి ప్రతిఘటన చాలా బలంగా వచ్చింది. సుమారు రెండువేల మంది ఆందోళనకారులు కర్రలు ఇతర ఆయుధాలు ధరించి ప్రతి దాడులకు సిద్దమయ్యారు. ఈ సందర్భంలో పరిస్థితులను అదుపులో ఉంచటానికి యానాం అధికారులు సమీప బ్రిటిష్ పోలీసుల సహాయం తీసుకోవలసి వచ్చింది.

పరిస్థితి తీవ్రతకు భయపడ్డ ఫ్రెంచి గవర్నరు, డిలార్ష్ ను వెంటనే తొలగించి యానాం పరిస్థితులపై అవగాహన ఉన్న లెస్పార్డాను పంపించింది. లెస్పార్డా ఎంతో చాకచక్యంగా పరిస్థితిని చక్కదిద్ది, నిందితులందరికీ గవర్నరు నుండి క్షమాబిక్ష కూడా ఇప్పించడం తో మొత్తం అల్లర్లకు తెరపడింది.

## Jean-Phillippe Jourdain

(December 1832-1837 మరియు summer 1841- November 1844 మరియు April 1847 –

October 1849)

యానాం పెద్దొరలలో ఎక్కువకాలం పని చేసిన ఖ్యాతి జోర్డన్ కు దక్కుతుంది. ఇతను యానానికి వచ్చినప్పటినుంచీ రిటైర్ చేసేయమని ప్రతీ గవర్నరుతో మొరపెట్టుకొంటూనే ఉన్నాడు కానీ ఏ గవర్నరూ ఇతని విన్నపాన్ని విన్నట్టు కనిపించదు. గవర్నరు డిమాలె అయితే 'నీ ఆరోగ్యం జాగ్రత్త సుమా' అంటూ ఓ ఉత్తరంలో ఇతనికి ధైర్యం చెప్పాడు (6:23 February 1833, Letter of De Melay to Jourdain COR.GLE, India ). జోర్డన్ యానాం వచ్చినప్పటికే పెద్దవయసు కావటంచే అతని వార్థక్యమంతా ఇక్కడే గడిచిపోయిందని భావించాలి. వయసురీత్యా పెద్దవాడవటం వలన జోర్డన్ యానాం నుంచి వ్యాపారాలు చెయ్యటం లేదా వివాదాలలో ఇరుక్కోవటం కానీ జరగలేదు. అందువల్ల ఇతని హయాం పరిపాలనా పరంగా ప్రశాంతంగానే నడచింది. యానాం ఎదుర్కొన్న అనేక ప్రకృతి వైపరీత్యాలు ఈయన కాలంలోనే సంభవించటం మాత్రం కాకతాళీయం. వాటివల్ల వాటిల్లిన నష్టాన్ని ఎప్పటికప్పుడు పాండిచేరీకి నివేదించి తగిన ఆర్థిక సహాయాన్ని పొంది పునర్నిర్మాణ పనులను సమర్ధవంతంగా చేయించటంలో జోర్డాన్ కృతకృత్యుడయ్యాడు.

జోర్డాన్ చొరవ వలన యానానికి లియోన్ సిస్టర్స్ (టీచర్లు) రావటం జరిగింది. యానాన్ని అనేక సార్లు వరదలనుండి కాపాడిన పాంచాల గట్టు నిర్మాణం కూడా ఈయన ఆధ్వర్యంలోనే ప్రారంభమైంది.

జోర్డాన్ హయాంలో యానాంనుండి జరిగే వ్యాపారాలకు పొరుగునున్న ఇంగ్లీషువారు అనేక రకాలైన ఆంక్షలను విధించి దాదాపు అప్పటికే క్షీణించిపోయిన వాణిజ్యాన్ని మొత్తానికి మూతపడేలా చేయటంలో విజయం సాధించారు. వయసు కారణంగా వచ్చిన నిర్లిప్తత, మెతకతనంల వలన జోర్డాన్ సకాలంలో స్పందించకపోవటంతో అంతకు ముందు పెద్దొరలు బ్రిటిష్ వారితో పోరాడి యానాంకు సాధించిపెట్టిన చాలా సదుపాయాలు కోల్పోవలసి వచ్చింది.

అంతే కాక బ్రిటిష్ ప్రభుత్వం కొత్త కొత్త ఆంక్షలను విధించటం మొదలెట్టింది. ఉదాహరణకు – యానాం నుండి జరిగే జల రవాణాకు అంతవరకూ ఏరకమైన నియంత్రణా ఉండేది కాదు. 23 ఏప్రిల్, 1847 న బ్రిటిష్ వారు జారీ చేసిన ఉత్తర్వు ప్రకారం బ్రిటిష్ జలాలలో తిరిగే యానాం పడవలపై రిజిస్ట్రేషను పన్ను విధించటం మొదలెట్టారు. దరిమిలా యానాం నుంచి కాకినాడలో ఉంటున్న ఓ ఫ్రెంచి ఆసామీకి ఇటుకలను తీసుకువెళుతున్న రెండునావలను కోరంగి రేవులో నిలిపి 5 రూపాయిల పన్నుకట్టమని బ్రిటిష్ అధికారులు కోరటంతో, ఆ నావను నడిపే కూలీలు అంత డబ్బు చెల్లించలేక నావలను వారికే అప్పగించి యానాం వచ్చేసారట.

కూలీల ఎగుమతి విషయంలో బెడియర్ కు జరిగిన అవమానోదంతం జోర్డాన్ హయాంలోనే జరిగింది. (చూడుడు: ఫ్రెంచి యానాంలో జరిగిన బానిస వ్యాపారం చాప్టరు)







ముస్లిముల మసీదు శిధిలావస్థకు చేరుకోవటంతో కొత్త మసీదు నిర్మాణం జరుపుకోవటానికి 1847లో మరో చోట స్థలాన్ని మంజూరు చేసిన ఘనత జోర్డాన్‌కు దక్కుతుంది.

**Bernard** (1837 to February 1839 )

జోర్డాన్ స్థానంలో ఇతను కొంతకాలం తాత్కాలిక పెద్దొరగా పనిచేసాడు. 1838 లో బెర్నార్డ్ గవర్నరుకు పంపించిన ఒక నివేదికలో రాబోతున్న కరువును గూర్చి ఇలా తెలియచేసాడు – 'గత ఎనిమిది నెలలుగా వర్షాలు లేవు. వరదనీరు కూడా ఈ సంవత్సరం రాలేదు. వరిపంట అసలు కొంచెం కూడా పండలేదు. పప్పుధాన్యాల దిగుబడి కొద్దిగా ఉన్నా అది సాధారణ దిగుబడితో పోల్చితే పదోవంతు కూడా ఉండదు' అంటూ ఆనాటి దుర్భిక్ష పరిస్థితులను వర్ణించాడు. ఆ తరువాత రైతుల పన్ను బకాయిలు రద్దు పరచమని గవర్నరుగారికి బెర్నార్డ్ సిఫారుసు చేసాడు కూడా.

## Law de Clapernou (November 1844 to April 1847)

ఇతనుకూడా బెర్నార్డ్ లానే కొంతకాలం యానానికి తాత్కాలిక పెద్దొరగా పనిచేసాడు. క్లాపర్నూ పాలనలో చేనేత మరియు పడవ నిర్మాణ కార్మికులపై వృత్తిపన్ను విధించటం మొదలయ్యింది. దీనివల్ల వారి పరిస్థితి మూలిగే నక్కపై తాటిపండు పడినట్లయింది. ఆ దెబ్బకు చాలామంది కార్మికులు యానాం వదిలి ఇతర ప్రాంతాలకు తరలిపోయారు.

అప్పటి యానాం చర్చి ఫాదరయిన Abbe Dumas చర్చియొక్క ఆదాయవ్యయాల వార్షిక నివేదికలు పెద్దొరకు సమర్పించేవాడు కాదు. అతని వ్యవహారంపై అనుమానం కలిగిన క్లా పర్నూ చర్చిని తణిఖీ చేసి చర్చికి సంబందించిన కొన్ని బంగారు మరియు వెండి వస్తువులు మాయం అయినట్లు గుర్తించాడు. వాటిని డూమాస్ అమ్మేసుకొన్నట్లు విచారణలో తేలటంతో మొత్తం విషయాన్ని క్లాపర్నూ, గవర్నరుగారికి నివేదించాడు. ఫలితంగా డూమాస్ ను విధులనుండి తొలగించటం జరిగింది. (రి: correspondence of Abbot Dumas reported in the session of C.A. Pondy 7 October 1844, COR.GLE, India V.74)

## Pierre-Félicité-Valère Hugot (October 1849-1855)

ఈతని వివరాలు పెద్దగా తెలియరావు కానీ, ఒక సంఘటన ద్వారా ఇతనికి మాతృ దేశాభిమానం ఎక్కువని అర్ధమౌతుంది.

1854 లో గోదావరి నదికి ఏటిగట్ల నిర్మాణాన్ని బ్రిటిష్‌వారు పెద్ద ఎత్తున చేపట్టారు. ఈ సందర్భంగా యానాంగుండా సాగే ఏటి గట్టు నిర్మాణాన్ని తామే చేస్తామని, అనుమతించమని రాజమండ్రి కలక్టరు ఫ్రెంచి వారిని కోరాడు. అప్పుడు యానాం పెద్దొరగా ఉన్న పియరీ హూగోట్ 'యానాం ప్రాంతంలో ప్రవహించే ఏటిగట్ల నిర్మాణవ్యయాన్ని ఫ్రెంచిప్రభుత్వమే భరిస్తే హుందాగా ఉంటుందని, అలా చేయటం ద్వారా ఫ్రెంచి జాతి పరువును నిలబెట్టిన వారమవుతామని"

ఫ్రెంచి ప్రభుత్వానికి విన్నవించుకొన్నాడు. కానీ ఫ్రెంచి ప్రభుత్వం పియరీ మాటలను పెడచెవిన పెట్టి, బ్రిటిష్ వారు చేస్తానన్న సహాయానికి ఒప్పేసుకొంటుంది. అయినప్పటికీ పియరీ ఆరువందల ఫ్రాంకుల ఖర్చుతో యానాం ఏటిగట్టుకు చేర్చి మూడు లాకులు, మూడు పంటకాలవలు నిర్మాణం చేయించాడు. ఆ చర్యల ద్వారా తన స్థాయిలో ఫ్రెంచి గౌరవాన్ని నిలిపానని తృప్తి చెంది ఉండవచ్చు. (హ్యూగోట్ కాకినాడ కలక్టరుతో జరిపిన అనేక ఉత్తర ప్రత్యుత్తరాలను పాండిచేరీలో కల నేషనల్ ఆర్చైవ్స్ లో ఉన్నాయి. ఈ పుస్తకంలో పొందుపరచిన వివిధ సంతకాలు అక్కడి నుంచే సేకరించటం జరిగింది– రచయిత)

1854 లో యానాం పెద్దొరగా హ్యూగో చేసిన ఒక అధికారిక సంతకం

## Charles Filleau Saint-Hilaire: 1856-1862

ఇతని కాలంలో యానాం తీవ్రమైన కరువును ఎదుర్కొంది. మన్యవోరి మేడలో జరిగిన మానవ బలి ఉదంతం కేసును జడ్జి హెూదాలో హిలరీ విచారణ జరిపి నేర నిరూపణ జరగలేదని అందరినీ నిర్దోషులగా తీర్పు చెప్పాడు. ఈ తీర్పు పట్ల యానాం ప్రజలు తీవ్రమైన నిరసనను వెలిబుచ్చారు. (మరిన్ని వివరాలకై చూడుడు ఫ్రెంచి యానాంలో జుడిషియల్ వ్యవస్థ చాప్టరు)

## J. Blum: July 1862-1870

ఇతను మంచి సమయస్ఫూర్తి, వ్యవహార దక్షత కలిగిన అధికారి. ఇతని హయాంలో జరిగిన ఒక సంఘటన ఆనాటి సామాజిక వ్యవస్థ స్వరూపాన్ని తెలియచేస్తుంది. ఆనాడు చెలరేగిన అల్లర్లను బ్లమ్ అత్యంత సంయమనంతో ఎదుర్కొని ఫ్రెంచి వారి మూలసూత్రాలైన సమానత్వము, స్వేచ్ఛ, సౌభ్రాతృత్వముల అవసరత యానాం ప్రజలందరికీ తెలియచేసాడు.

అప్పట్లో యానాంలోని అగ్నికులక్షత్రియుల ఆర్ధిక పరిస్థితి మంచిగా ఉండేది. దీనికి కారణం యానాం నుంచి జరిగే ఎగుమతి దిగుమతులకు జలరవాణాయే ప్రధాన మార్గంగా ఉండటం. ఇక్కడనుంచి సరుకులు కోరంగి వద్ద నిలుపుచేయబడిన షిప్పుల వద్దకు పడవలలో రవాణా అవుతూండేవి. అనాదిగా జలరవాణా అనేది పల్లీయుల సొత్తు. తద్వారా వారిలో కూడా ఐశ్వర్యవంతులు పెరిగారు.







వీరిలో ఎవరికైనా అప్పటి గవర్నరు de Vernenac, 25th February 1857 న చేసిన చట్టం ప్రకారం– పాండిచేరి లో ఏ కులానికి చెందిన వారైనా పల్లకీ లో తిరగొచ్చునన్న విషయం తెలిసిందో ఏమో! 1865, జూన్ నెలలో యానానికి చెందిన కొంతమంది అగ్నికుల క్షత్రియులు తమలో జరగనున్న ఒక వివాహ వేడుకకి పల్లకి ఊరేగింపు పెట్టుకొంటామని బ్లమ్ ను కోరారు.

1828 లో మన్యం కనకయ్య పల్లకి ఎక్కి తిరగటం గొడవలకు దారితీసిన విషయం అప్పటికి అందరూ మరచిపోయారు. బ్లమ్ కూడా తిరిగి అలాంటి ప్రతిఘటన రావొచ్చునని ఊహించలేదు. పెళ్ళికూతురు, పెండ్లి కొడుకులు పల్లకిలో కూర్చుని వీధులలో ఊరేగటానికి అనుమతిని మంజూరు చేసాడు. కానీ అనూహ్యంగా తరతరాలుగా ప్రజల మనస్సులలో పాతుకుపోయిన వర్ణ వ్యవస్థ భావనలు మరలా జడలు విప్పి నాట్యం చేశాయి.

అప్పటికి యానాంలో రాజకీయంగా ఆధిక్యతను కలిగిఉన్న ఒక ప్రధాన సామాజిక వర్గం, కొంతమంది ఇతరకులాలకు చెందిన సాంప్రదాయవాదులతో కలసి, పల్లకీ ఎక్కి వివాహవేడుకలు జరుపుకొంటున్న పల్లీయులపై దాడికి దిగారు. వారి ఆస్థులను ధ్వంసం చేసారు. ఈ దాడులన్నీ వర్ణ వ్యవస్థ (నిమ్న వర్ణ ప్రజలు పల్లకి ఎక్కరాదన్న నియమం) పరిరక్షణ కోసమని కాక, తమ ఆధిక్యతకు ఎక్కడ ముప్పు వాటిల్లుతుందోనన్న భయం వల్లనే ఆ ముసుగులో జరిగిఉండొచ్చునని చెప్పుకోవచ్చు.

బ్లమ్ సంతకం

యానాం జనాభాలో దాదాపు సగభాగం ఈ రెండు కులాలే. ఇరుపక్షాలవారు కర్రలు, బరిసెలు, కత్తులతో దాడులు, ప్రతిదాడులకు సిద్దమయ్యారు. వారిని అదుపుచేయటంలో పట్టుమని పదిమందికూడా లేని యానాం పోలీసులు పూర్తిగా విఫలమయ్యారు. (ఈ ఉదంతాన్ని చెళ్ళపిళ్ళ వారు 'కథలు గాథలు' అన్న పుస్తకం మూడవ సంపుటి 524–527 పేజీలలో రసవత్తరంగా వర్ణించారు)

పరిస్థితి తీవ్రతను మదింపు వేసిన బ్లమ్, సమీప కాకినాడ కలక్టరును అదనపు పోలీసు బలగాలు వెంటనే పంపించమని కోరాడు. ఆ విధంగా వచ్చిన 50 మంది సాయుధ బ్రిటిష్ పోలీసుల సహాయంతో యానాంలో చెలరేగిన అల్లర్లను సమర్ధవంతంగా అదుపు చేయగలిగాడు. ఇక్కడి పరిస్థితిని తెలుసుకొన్న ఫ్రెంచి గవర్నరు Bontemps, 18 మంది ఫ్రెంచి పోలీసులను మరియు విచారణ నిమిత్తం ఇద్దరు జడ్జిలను యానాం పంపించాడు. వారు యానాం చేరేసరికి పరిస్థితి అదుపులోనే ఉన్నప్పటికీ, అల్లర్లకు కారణమైన వారినందరినీ

అరెస్టు చేసి, విచారణ జరిపి నిందితులకు శిక్షలు విధించటం జరిగింది.

ఈ ఉదంతం తరువాత బ్లమ్ తీసుకొన్న నిర్ణయాలు కీలకమైనవి. ఏ కులానికి చెందిన వారైనా తమ కుటుంబ వేడుకల సందర్భంగా పల్లకి నెక్కి పుర వీధులలో ఊరేగవచ్చునని బ్లమ్ ఉత్తర్వులు జారీ చేశాడు. ఇదే విషయాన్ని ఊరిలో చాలారోజులు టముకు వేయించాడు. ఈ దాడులను అదుపుచేయటంలో వీరోచితంగా వ్యవహరించి గాయపడిన యానాం పోలీసు షేక్ మహమ్మద్ కు గవర్నరుచే గోల్డ్ మెడల్ ను మంజూరు చేయించాడు.

పై చర్యలు ఈతని వ్యవహార శైలిని పట్టి చూపుతాయి. బ్లమ్ 1871 లో పదోన్నతిపై కారైకాల్ కు బదిలీ చేయబడ్డాడు.

## Bayet

ఈయన హయాంలో యానాంలో మొదటి ఎన్నికలు జరిగాయి. (నిజానికి ఆనాడు ఫ్రెంచి ఇండియాలో జరిగిన ఎన్నికలు భారతదేశంలోనే ప్రథమంగా జరపబడ్డ ప్రజాస్వామిక సార్వత్రిక ఎలక్షన్లు)

1872 లో యానాంలో మొదటిసారిగా స్థానిక కౌన్సిల్ ఎన్నికలు జరిగాయి. ఈ కౌన్సిలుకు అప్పటి యానాం పెద్దొర బేయెట్ అధ్యక్షునిగా వ్యవహరించాడు. ఈ ఎన్నికలలో కవల వెంకట చలపతి, పైడికొండల కృష్ణయ్యనాయుడు, కంతేటి సత్యప్రసన్నం, దకోస్టా జార్జెస్ అనే నలుగురు ఎన్నికయ్యారు. నిజానికి ఈ నలుగురిలోంచి ఒకరిని అధ్యక్షునిగా ఎన్నిక చేసుకోవలసి ఉంటుంది. ప్రజలకు ఎన్నికల పట్ల అవగాహన లేని కారణంగా అప్పట్లో అభ్యర్ధులను పోటీ చేయమని బతిమాలవలసి వచ్చిందట. అలాంటి పరిస్థితులలో బహుశా బేయట్ అధ్యక్షునిగా వ్యవహరించి ఉండవచ్చు. బేయట్ 1885 లో మాహేకు ట్రాన్స్‌ఫర్ అయ్యేవరకూ యానాం పెద్దొరగా పనిచేసాడు. ఈయన శెలవులపై వెళ్ళినపుడు– Desmazes (1876), M. Sice (1881), M. Filatriau (1882) లు ఇంచార్జులుగా పనిచేసారు.

బేయట్ పాండిచేరీలో నేవల్ కమిషనర్గా పదవీవిరమణ చేసి, 65 సంవత్సరముల వయసులో యానాం వచ్చి ఇక్కడే సెటిల్ అయ్యాడు. ఆనాటి యానాం నాయకులతో బేయట్ ఎంతో స్నేహంగా ఉండేవాడు. యానాంలో పనిచేసిన పెద్దొరలలో ఎవరూ యానాంలో స్థిరనివాసం ఏర్పరచుకోలేదు. బేయట్ మాత్రం యానాంలో సుదీర్ఘకాలం పనిచేయటమే కాక ఇక్కడి ప్రజలలో ఒకరిగా కలసిపోయారు.

పంతొమ్మిదవ శతాబ్ధాంతంలో M.H. Crozet (1885), M. Le (1887), M.





ఫ్రెంచి పాలనలో యానాం

Proche (1889–1893), Mr. Chalail (1893) వంటివారు యానాం పెద్దొరలుగా పనిచేసారు.

**చివరి రోజులు**

ఇరవయ్యవ శతాబ్దం వచ్చేసరికి ఫ్రెంచి యానాం అన్ని విధాలుగా తన ప్రాభవాన్ని కోల్పోయింది. యానాం నుంచి వచ్చేఆదాయం కన్నా దీని పరిపాలనకు అయ్యే ఖర్చే ఎక్కువగా ఉండేది. ఈ ప్రాంతానికున్న చారిత్రిక నేపథ్యాన్ని దృష్టిలో ఉంచుకొని దీనిని **'ఒక గౌరవచిహ్నం'** గా భావించి ఆర్థిక భారమౌతున్నా చివరి వరకూ నిలుపుకొంది.

అందువల్ల 1900–1954 మధ్య యానాన్ని పరిపాలించిన పెద్దొరలకు సాధారణ పరిపాలనా భాధ్యతలు నిర్వహించారు తప్ప అనూహ్య సంఘటనలనేమీ ఎదుర్కోలేదు. (1954 నాటి పెద్దొర తప్ప). Mr. C.Reynand (1901), Mr. Spielman (1905), Mr. Rondeau (1908), Mr. M. Gentile (1910), Mr. Baillet (1912), M. Simonel (1912–1915) వంటివారు యానాం పెద్దొరలుగా పనిచేసారు.

ఈ కాలంలో యానాం పెద్దొరలలో తనదైన గుర్తింపును తెచ్చుకొన్న వారిలో పాల్ తొమాసిని (Paul Tomasini) ను చెప్పుకొనవచ్చును. ఇతని హయాంలోనే యానాం వంతెన నిర్మాణం కార్యరూపం దాల్చింది. అప్పటివరకూ యానాం చేరాలంటే కోరంగి నదిని దాటి రావలసి వచ్చేది. 30 జూలై 1932 న ఈ వంతెన ప్రారంభోత్సవం తోమసిని ఆధ్వర్యంలో జరిగింది. (వంతెన శిలాఫలకంపై ఈయన పేరును ఇప్పటికీ చూడవచ్చును.) యానాం లో అప్పటికే నెలకొల్పబడి అణగారిన వర్గాల అభ్యున్నతి కొరకు పాటుపడుతున్న 'దీనపోషక సమాజం' నకు తొమసిని,1933 లో ప్రభుత్వగుర్తింపు కల్పించి రిజిష్టరు చేయించాడు. ఆ చర్య ఫలితంగా 1948 లో దీనపోషక సమాజ నూతన భవన నిర్మాణమునకు ఫ్రెంచిప్రభుత్వం 2000 రూపాయిల ఆర్ధిక సాయం చేసింది.

1948 లో Drouin, 1949 లో Pontonneir లు పెద్దొరలుగా పనిచేసారు. అటు పిమ్మట జీవరత్నం, ఆ తరువాత చాలా కాలం కుమరన్ లు వంటి భారతీయ అధికారులు పెద్దొరలుగా విధులు నిర్వర్తించారు.

భారత స్వాతంత్రానంతరం ఫ్రెంచి ఇండియా ప్రజలలో కూడా స్వపరిపాలన కొరకు పోరాటాలు మొదలయ్యాయి. వాటి ఫలితంగా 1954 లో ఫ్రెంచి వారు కూడా భారతదేశాన్ని వీడి పోవాల్సి వచ్చింది. ఆ సమయంలో జార్జి సాలా అనే ఫ్రెంచి దేశస్థుడు పెద్దొరగా పనిచేసాడు.



## George Sala

జార్జి సాలా 1953 సెప్టెంబరులో యానానికి అడ్మినిస్ట్రేటరు/పెద్దొర గా వచ్చాడు. ఈయనకు భారతదేశంలో పనిచేసిన పూర్వానుభవం లేదు. ఏ భారతీయ భాషలు రావు. యానాం ప్రజలలో జాతీయోద్యమ భావాలు మొలకెత్తుతున్న రోజులవి. దడాల రఫేల్ రమణయ్య, మద్దింశెట్టి సత్యానందం, కనకాల తాతయ్య, కామిశెట్టి పరశురాం, యర్రా సత్యనారాయణమూర్తి, కోన నరసయ్య వంటి నాయకుల ఆధ్వర్యంలో - యానాం ఫ్రెంచి పాలన నుండి విముక్తి కొరకు నడచిన యానాం విమోచనోద్యమం క్రమక్రమంగా పతాక స్థాయికి చేరుకొంది. అలాంటి ఉద్రిక్త పరిస్థితులలో సాలా యానాంలో ఉండటం క్షేమకరం కాదని తలచిన ఫ్రెంచి ప్రభుత్వం ఇతనిని మార్చి, 1954 లో పాండిచేరి పిలిపించివేసింది.

తన హయాంలో జరిగిన విమోచనోద్యమ ఘటనలను సాలా సమర్ధవంతంగానే పరిష్కరించగలిగినప్పటికీ **"ప్రజల సెంటిమెంట్"** ముందు ఇతని సమర్ధత నిలువలేక పోయింది.



ఏది ఏమైనా జార్జిసాలా యానాంలో పనిచేసిన ఆఖరు పెద్దొర/ఫ్రెంచి ఎడ్మినిస్ట్రే టరుగా చరిత్రలో మిగిలిపోయాడు. జార్జి సాలా భద్రతా కారణాల రీత్యా పాండిచేరికి వెళిపోయేటపుడు, అడ్మినిస్ట్రేటర్ భాధ్యతలను అప్పటి యానాం జడ్జి అయిన శ్రీ శివా కు ఇచ్చాడు.

జూన్ 13, 1954 న వేల సంఖ్యలో విమోచనోద్యమకారులు పెద్దొర బంగళాను చేరుకొని ఇంచార్జ్ అడ్మినిస్ట్రేటర్ శ్రీ శివా నుండి అధికారాలను స్వాధీనపరచు కొని యానాం ఫ్రెంచిపాలన నుండి విముక్తమైందని ప్రకటించారు. శ్రీ శివా పరిస్థితిని సమీక్షించి ప్రతిఘటించి నట్లయితే తలెత్తే శాంతిభద్రతలను దూరాలోచన చేసి అధికారాలను ఉద్యమకారులకు బదలాయించారు.

ఆ విధంగా యానాంలో సుమారు 195 సంవత్సరముల (బ్రిటిష్ వారు పాలించిన కాలాన్ని మినహాయించి) ఫ్రెంచి పాలనకు తెరపడింది.





# తెలుగు భాషకు సేవలందించిన ఫ్రెంచిదేశస్థులు

కాంబెల్, సి.పి. బ్రౌన్ వంటి బ్రిటిషు దొరలు తెలుగుభాషకు చేసిన సేవలు అందరకూ తెలిసినవే. కానీ వీరందరికంటే చాలా ముందుగానే కొందరు ఫ్రెంచి దేశస్థులు ఆ రకమైన కృషి జరిపారు. తెలుగు భాషాధ్యయనంలో బ్రిటిష్ వారికి ఫ్రెంచివారే స్ఫూర్తిగా నిలిచారనేది ఒక చారిత్రిక వాస్తవం.

ఫాదర్ **Pierre de la lane** (1669–1748) అనే ఫ్రెంచి దేశస్థుడు 1729 లో 'అమరసింహం' అనే తెలుగు నిఘంటువు మరియు వ్యాకరణ పుస్తకాన్ని రచించాడు. తెలుగును లోతుగా అధ్యయనం చేసిన మొదటి యూరోపియన్ ఇతనేనని చరిత్రకారుల అభిప్రాయం.

**G.L. Coeurdoux** (1691–1777) అనే ఫ్రెంచి దేశస్థుడు1760 ప్రాంతాలలో తెలుగు-సంస్కృత-ఫ్రెంచి త్రిభాషా నిఘంటువును, తెలుగు-ఫ్రెంచి, ఫ్రెంచి-తెలుగు నిఘంటువులను కూర్పు చేసాడు. బ్రిటిషర్లయిన కాంబెల్ 1821లోను, బ్రౌను 1852లోను తమ తెలుగు నిఘంటువులను, ఆర్డెన్ 1872లో తెలుగు వ్యాకరణ పుస్తకాన్ని రచించారు. వీటన్నింటికీ దాదాపు ఒక శతాబ్దం క్రితమే ఫ్రెంచివారు వెలువరించిన నిఘంటువులు ప్రేరణ మరియు మాతృకలు అయిఉండవచ్చునన్నది సత్యదూరం కాకపోవచ్చు.

**Etienne Le Gac** (1671–1738) అనే ఫ్రెంచి దేశస్థుడు 1729లో అనేక వేమన పద్యాలను సేకరించి ఫ్రాన్సు పంపించాడు. (ఫ్రాన్సు మ్యూజియంలో ఉన్న వీటి రాతప్రతులు ఆరుద్ర కృషితో ఆంధ్రదేశానికి వచ్చాయి) వాటిని 1806 లో అబ్బీ దుబాయిస్ అనే ఫ్రెంచి దేశస్థుడు ఫ్రెంచి భాషలోకి అనువదించి ప్రచురించాడు. ఈ పుస్తకాన్ని 1824 లో బ్రౌను చదివి వేమనంటే పిచ్చి అభిమానాన్ని పెంచుకొని, తరువాత 1829 లో వేమన పద్యాలకు

తన ఇంగ్లీషు అనువాదాన్ని వెలువరించాడు. లె గాక్ సంజీవనాథస్వామి గా తన పేరుమార్చుకొని, పాంకోళ్ళు ధరించి, శాఖాహారం భుజిస్తూ కాషాయ వస్త్రాలు ధరిస్తూ సాత్వికజీవనాన్ని గడిపేవారట. (రి. సమగ్రాంధ్రసాహిత్య చరిత్ర– ఆరుద్ర)

**Francis Ricci** అనే ఫ్రెంచిదేశస్థుడు తను స్థాపించిన స్కూలులో తెలుగును భోదిస్తూ, పిల్లలకోసమని అనేక తెలుగు వాచకాలను వ్రాశాడట.

వీరే కాక లె పియర్ గార్గాం, డూక్రోస్, పియరీ ఫ్రాంకోయిస్ జేవియర్ డుచాంప్ (ఇతను ఒక ఖగోళ శాస్త్రజ్ఞుడు), ఫాదర్ జీన్ కామెట్టి (ఇతను యజుర్వేదాన్ని ఫ్రెంచిలోకి తర్జుమా చేసాడని అంటారు) వంటి వారు తెలుగుభాషను నేర్చుకొని పద్దెనిమిదో శతాబ్దంలో ఈ గడ్డపై విస్త్రుతంగా సంచరించి, ఇక్కడి ప్రజలతో మమేకమైన ఫ్రెంచి దేశస్థులు.

యానానికి పెద్దొరగా పనిచేసిన సొన్నరెట్ ఎన్నోపుస్తకాలను రచించిన పండితుడయినప్పటికీ తెలుగు భాష పట్ల ఆశక్తి కనపరచినట్లు తెలియదు. తెలుగు భాషలోని లయ వినసొంపుగా ఉంటుంది అని వాఖ్యానించటం తప్ప తెలుగు భాషాభివృద్ధికి ఏమీ చేయలేదనే అనుకోవాలి.

**వ్రాతప్రతుల తరలింపు**

17 మరియు 18 వ శతాబ్దాలలో ఫ్రెంచి మతప్రచారకులు తెలుగుదేశం నుంచి అనేక వ్రాతప్రతులను సేకరించి ఫ్రాన్స్ పంపించారు. వీటిని ఫ్రెంచి ఇంగ్లీషు భాషలలోకి అనువదించి ప్రపంచానికి పరిచయం చేసారు. ముఖ్యంగా ఖగోళశాస్త్రం, గణితం, సాహిత్యం, ఇక్కడి ఆచార వ్యవహారాలు వంటి వివిధ రంగాలకు చెందిన వ్రాతప్రతులు అనేకం ఫ్రాన్స్ కు తరలింపబడ్డాయి. లెనాయిర్ పాండిచేరీ ఫ్రెంచి గవర్నరుగా ఉన్నసమయంలో ఇలా భారతీయ వ్రాతప్రతులను సేకరించినందుకు అయ్యే ఖర్చును ఫ్రెంచి ప్రభుత్వం భరిస్తుందని భారతదేశంలో మతభోధకుడిగా ఉన్న Etienne Le Gac తో కుదుర్చుకొన్న ఒక ఒప్పందం తెలియచేస్తుంది. దరిమిలా 1729–1735 ల మధ్య 287 వ్రాతప్రతులు పారిస్ లైబ్రేరి చేరాయి. లె గాక్ ఎక్కువకాలం తెలుగుదేశంలోనే గడిపాడు కనుక ఇవి ఎక్కువగా ఇక్కడి నుంచే సేకరించి ఉంటాడని భావించవచ్చు.

1732 లో పాన్స్ (Pons) అనే మతభోధకుడు ఫ్రాన్స్ పంపించిన 168 పుస్తకాలలో 31 వ్యాకరణ గ్రంథాలు, 22 పురాణ, వేదాంత కావ్యాలు, 25 పురాణ పుస్తకాలు, 8 ఖగోళ శాస్త్రగ్రంథాలు, 9 పద్యకావ్యాలు, 25 స్థానిక ఆచారాలకు సంబందించిన పుస్తకాలు, 29 న్యాయ శాస్త్రానికి సంబంధించిన గ్రంథాలు మరికొన్ని ఇతర పుస్తకాలు ఉన్నాయి. వీటిలో తెలుగు–ఫ్రెంచి నిఘంటువు, తెలుగు–సంస్కృత నిఘంటువులు కూడా ఉన్నాయి.

మచిలీపట్నం నుంచి సేకరించిన ‘ పంచాంగ శిరోమణి’ అనే ఒక వ్రాతప్రతిని 1750 లో పియరీ పాతుల్లెట్ (Pere Patoullet) ఫ్రాన్స్ లోని జోసెఫ్ దె లిస్లె అనే ఖగోళ శాస్త్రజ్ఞునికి పంపించాడు. ఇదే సమయంలో Xavier Duchamp పంపిన ఖగోళశాస్త్రానికి చెందిన [illegible] వ్రాతప్రతిలోని అంశాల ఖచ్చితత్వాన్ని పారిస్ అబ్జర్వేటరీ (ఖగోళఅధ్యయన





కేంద్రం) ధృవీకరించింది. ఈ రెండు వ్రాతప్రతులు ప్రస్తుతం Archives francaises de la Compagnie de Jesus at Vanves, Paris నందు బద్రపరచబడి ఉన్నాయి. (రి. Processes that shaped the sources the history of science - Florence Bretelle)

వ్రాతప్రతుల తరలింపు అనేది ఒకరకమైన మేధోపరమైన దోపిడీగా అనిపించినప్పటికీ వీటిపై పారిస్‌లో జరిగిన పరిశోధనల ఫలితంగా భారతీయ శాస్త్రవిజ్ఞాన పునాదులు ప్రపంచానికి తెలిసినట్లయింది. అంతేకాక ప్రపంచ విజ్ఞానరంగ చరిత్రను క్రోడీకరించటంలో ఈ వ్రాతప్రతులు ఎంతగానో దోహదపడ్డాయి.

పైన చెప్పబడిన వ్యక్తులకూ యానానికి ఏ విధమైన సంబంధము ఉన్నట్లు తెలియరాదు. కానీ ఆ కాలానికే యానాం ఒక ఫ్రెంచి కాలనీగా వెలిగిపోతున్నది కనుక వారు వారిజీవితకాలంలో యానాన్ని సందర్శించి ఉండవచ్చునన్న ఊహ మరీ విపరీతమైనది కాకపోవచ్చు.

# ఆనాటి సామాజిక వ్యవస్థ

పచ్చనిపొలాలు, పక్షుల సందడులు– సాతాను, హరిదాసుల కీర్తనలు– ముగ్గులతో సింగారించుకొనే ముంగిళ్ళు– ఉన్నతవర్గాల లోగిళ్ళలో వినిపించే హరికథలు, పురాణ శ్రవణాలు– దళితవాడల్లో పల్లవించే యక్షగానాలు, ఒగ్గుపాటలు– నుదుటన వ్రాసిన కులవృత్తుల్ని మోసుకు తిరిగే దళిత బహుజనులు– కొత్తబట్టలు, పిండివంటలతో పలకరించే పండుగలు– వివాహ వేడుకలలో బంధుమిత్ర సపరివారంగా ఊరిలో పల్లకీ ఊరేగింపులు– పిల్లల సృజనకు పట్టం కట్టే బొమ్మల కొలువులు– పల్లకీలు, ఎడ్ల బళ్ళు, గుర్రపుజట్కాలపై ప్రయాణాలు– తీర్థాలు, జాతరలలో వెల్లువెత్తే భక్తి ప్రవాహాలు– హిందు ముస్లిం క్రైస్తవులు వారివారి పండుగలలో పరస్పరం పంచిపెట్టుకొనే ప్రసాదాలు– సాంయంత్రం వేళలో ఇంటి అరుగులపై కాలక్షేపాలు– కులపెద్దల ఆధ్వర్యంలో తీర్పులు శిక్షలు– కొన్ని ముంగిళ్లలోనే తమ విద్యను ప్రదర్శించే విప్రవినోదులు, రుంజలు, మాలమాష్టీలు, బుడగజంగాల వంటి ఆశ్రితకులాలు– అప్పుడప్పుడూ ఊరిని మురిపించే దొమ్మరి ఆటలు, పగటి వేషాలు, కొమ్మదాసరులు, పిట్టలదొరలు– మద్యాహ్నపు తీరికవేళల్లో వామనగుంట, అష్టాచెమ్మా, పులిమేకా ఆటలతో కాలక్షేపంచేసే కులకాంతలు– సాఫీగా సాగిపోయే జీవితాలపై అప్పుడప్పుడూ కొరడా ఝుళిపించే కరువులు కాటకాలు, ప్రకృతి వైపరీత్యాలు, అంటురోగాలు– చీకటిపడంగానే ఆముదపు దీపాల వెలుగులో అవసరాలు ముగించుకొని నిద్రకుపక్రమించే జనాలు ---- ఇదీ ఆనాటి సమాజ స్వరూపం. ఈ దృశ్యాలన్నీ వందేళ్ళ క్రితం ప్రతి ఊరిలోనూ కనిపించేవే కావొచ్చు.

యానానికి మాత్రమే చెందిన కొన్ని విషయాలున్నాయి.

అప్పట్లోయానాం పడవలరేవు ప్రధాన వాణిజ్యకూడలిగా ఉండేది. ఇక్కడినుంచి యానాం ఉత్పత్తులు పడవల ద్వారా కోరంగి వద్దనిలుపుచేసిన ఓడలలోకి ఎగుమతి అయ్యేది. 18, 19వ శతాబ్దాలలో ప్రతీరోజూ కొన్ని వందల పడవలలో సరుకుల రవాణా జరిగేది.





పడవల రేవుకు ఆనుకొని ఉన్న గ్రాండ్ బజార్ వీధి (నేటి త్యాగరాజ వీధి) పొడవునా ఫ్రెంచి వ్యాపారులు గుర్రాలపై సంచరించేవారు. కూలీలు, కళాసీలతో ఆ ప్రాంతమంతా కిటకిటలాడుతూండేది.

యానాం నడిబొడ్డునకల మన్యవారి మేడ ఎదురుగా ఉన్న ఖాళీ స్థలంలో (నేటి పార్కు) మన్యం జమీందారు తోలుబొమ్మలాటల ప్రదర్శనలు ఏర్పాటుచేసేవారు. ఒకటి రెండువారాలు సాగే ఆ ప్రదర్శన ఆనాటి ప్రజల ఆటవిడుపు.

ఫ్రెంచి దేశస్థులు 'పెటాంగ్' అనే ఆటను ఆడుకొనేవారు. ఇది ఒక రకమైన గోలీక్కాయల ఆట. కానీ ఈ ఆటలో గాజు గోలీలకు బదులు సుమారు కెజీ బరువుండే ఇనుప గోలీలుంటాయి. ఆడే పద్ధతి గోళీల ఆటను పోలిఉంటుంది.


1830 లో లిఖించబడ్డ యానాం పడవలరేవు చిత్రం

20 వ శతాబ్ద ప్రారంభంలో మీసాల వెంకన్న తీర్థం, గణపతి ఉత్సవాలు వైభవంగా జరగటం మొదలైంది. ఈ దేవుళ్ళ ఊరేగింపులో స్థానిక రాజకీయ వర్గాలమధ్య ఘర్షణలు జరిగిన సందర్భాలు కూడా ఉన్నాయి.

దేవాలయాలలో ఉండే ఆలయ నర్తకీమణులు (దేవదాసీలు ?) తమ ఆటపాటలతో భక్తులను అలరించేవారు. యానాం వచ్చే ఫ్రెంచి అతిథుల గౌరవార్థం జరిగే విందు వినోదాలు ఊరేగింపులలో వీరి నాట్య ప్రదర్శనలుండేవి.

ప్రతి మంగళవారం జరిగే యానాం సంతలో షిప్పులలో దిగుమతి అయిన

విదేశీవస్తువులు, మద్యం విరివిగా లభించేది. వీటికోసం సుదూర ప్రాంతాలనుండి ప్రజలు వచ్చేవారు. ఫ్రెంచి మద్యం కోసం సమీపప్రాంత పాలకులైన ఇంగ్లీషువారు కూడా వచ్చేవారు.

సమాజంలోని నిమ్నకులాలకు చెంది విద్యార్థులను అగ్రవర్ణాల పిల్లలతో సమానంగా ఒకే బెంచీపై కూర్చోబెట్టి విద్యనభ్యసించేలా 1890ల లోనే చేయటం ఒక అరుదైన విషయం.

నిమ్నకులాల వారు పల్లకీలో ఊరేగినపుడు ఘర్షణలు రేగిన నేపథ్యంలో - అన్ని కులాలవారు, వారి వారి కుటుంబ వేడుకల సందర్భంలో పల్లకీలలో ఊరేగవచ్చని ఫ్రెంచి ప్రభుత్వం యానాం పేట పేటలలో చాటింపు వేయించింది.

సమాజం అనగానే భిన్న మతాల, ఆచారాల సమ్మేళనం. భిన్నత్వంలోనే ఏకత్వం అనేది భారతీయ తత్వచింతనలోనే ఉంది. అందుకనే ఏనాడూ యానాంలో మత ఘర్షణలు జరిగిన సందర్భాలు కానరావు.

## ముస్లిములు

1723 లో కుర్టన్ యానాన్ని మొదటిసారిగా సందర్శించినపుడు అక్కడ కొద్దిమంది రజకులు మాత్రమే ఉన్నట్టు గుర్తించాడు. కానీ అప్పుడు యానాం ముస్లిం పాలనలో ఉంది కనుక ముస్లిములు లేకపోవటం ఆశ్చర్యం కలిగించే విషయమే. ఏది ఏమైనప్పటికీ ఫ్రెంచి వారు యానాంలో వ్యాపారాలు మొదలుపెట్టిన తరువాత క్రమక్రమంగా హైదరాబాదు మరియు పొరుగునున్న బ్రిటిషు ప్రాంతాలనుంచి ముస్లిములు రావటం మొదలైంది.


Gallois E అనే ఫ్రెంచి చిత్రకారుడు గీసిన యానాం ముస్లిం యువతి చిత్రం (1946 )

### యానాం మసీదు చరిత్ర

యానాం పెద్దబజారు వీధిలో ఉన్న మసీదు శిథిలావస్థకు చేరుకొన్న కారణంగా అప్పటి పెద్దొర Claparnou మరొకచోట మసీదు నిర్మాణానికి స్థలాన్ని మంజూరు చేసాడు. అలా కొత్తగా మంజూరు చేసిన స్థలంలో అప్పటికే మూతపడిన ఓ బ్లీచింగ్ చెరువు (ఫారె లాండ్రీ) ఉండేది. నిరుపయోగంగా ఉన్న ఆ చెరువును రజకులు అప్పటికి రెండు దశాబ్దాలుగా వాడుకొంటూ ఉన్నారు. ఆ స్థలాన్ని మసీదుకు కేటాయించటాన్ని వారు వ్యతిరేకించారు. 59 మంది సంతకాలు





చేసిన మహజరును పెద్దొరకు సమర్పించారు.

పాత మసీదు శిథిలావస్థకు చేరుకోవటం, ఎక్కువమంది ప్రార్ధనలు జరుపుకోవటానికి అది సరిపోకపోవటం, అంతే కాక అది హిందువుల ఇళ్ళ మధ్య ఉండటం వల్ల ఘర్షణలు తలెత్తవచ్చునన్న అనేక కారణాలను పరిగణలోకి తీసుకొన్న ఫ్రెంచి ప్రభుత్వం - రజకులు వ్యతిరేకించినప్పటికీ ఆ స్థలాన్ని మసీదు నిర్మాణానికి 1848 లో కేటాయించింది. (రి: 2 ఫిబ్రవరి, 1848 సెషన్ కలోనియల్ అసెంబ్లీ- ఇండియా వాల్యూం-78)

ఈ మొత్తం వ్యవహారాన్ని బట్టి 1845 నాటికి యానాంలో గణనీయమైన సంఖ్యలో ముస్లిములు ఉన్నట్లు అర్ధమౌతుంది. మసీదు శిథిలావస్థకు చేరుకోవటాన్ని బట్టి వారి ఆర్ధిక స్థితికూడా అంతంత మాత్రమేనని భావించాలి.

1917 లో యానాం ముస్లిములు చేసిన విజ్ఞప్తుల మేరకు గవర్నరు గారు (మార్టిన్యూ) మసీదు కమిటీ ఏర్పాటు చేసుకోవటానికి అనుమతి మంజూరు చేసారు. ఆ విధంగా ఇబ్రహీం ఖాన్, ముర్తుజ్ మొహమ్మద్, అబ్దుల్ ఖాదిర్ ల ఆధ్వర్యంలో ఏర్పడిన మసీదు కమిటీ, యానాం మసీదు మరియు మసీదు ఆస్థులను పర్యవేక్షణ కావించేది.

జోర్దాన్ యానాం పెద్దొరగా ఉన్న కాలంలో నిర్మించుకొన్న మసీదు మరలా శిథిలావస్థకు చేరుకోవటంతో 1946లో పునర్నిర్మాణం జరిపారు. (రి. యానాం చరిత్ర-దాట్ల దేవదానం రాజు)

1830-1860 ల మధ్య యానాం నుంచి బోర్బన్, మారిషస్ వంటి ప్రాంతాలకు వలసలు పోయిన వారిలో ముస్లిముల సంఖ్య అధికంగానే ఉండేది. 1880 లెక్కల ప్రకారం యానాం జనాభా మొత్తం 4520. వీరిలో 173 మంది ముస్లిములు.

పంతొమ్మిదవ శతాబ్దాంతంలో ముస్లిములు రాజకీయార్ధికాభివృద్ది సాధించటంతో కొన్ని ప్రముఖమైన ప్రభుత్వోద్యోగాలను కైవసం చేసుకొన్నారు. ఫ్రెంచి ప్రభుత్వం పొరుగున ఉన్న బ్రిటిష్ వారిలా ముస్లిముల కొరకు ప్రత్యేక స్కూళ్ళను ఏర్పాటుచేయలేదు. యానాం ముస్లిములు సాంప్రదాయ అవరోధాలను అధికమించి ఆధునిక విద్యను తమ సంపదగా భావించుకొని ముందుకు సాగారు. యానాం నుంచి అనేక మంది ముస్లిములు పాండిచేరీ వెళ్ళి విద్యాభ్యాసం కొనసాగించారు. 1870లలో ప్రభుత్వ భూములను ఫ్రెంచి ప్రభుత్వం వేలం వేసినపుడు అబ్బా సాహెబ్, అబ్దుల్ ఖాదిర్, మొహమ్మద్ ముర్తుజా వంటి కొందరు వేలంలో పాల్గొని భూస్వాములుగా కూడా మారారు.

అప్పట్లో పోలీసు శాఖలో ఎక్కువగా ముస్లిముల భాగస్వామ్యం ఉండేది. 1845 లో మర్దా ఖాన్, 1865 లో షేక్ మహమ్మద్ లు యానాం పోలీసు శాఖాధిపతులుగా పనిచేసారు.

అబ్దుల్ రెహ్మాన్, మహమ్మద్ ఉస్మాన్, జిక్రియా, అబ్దుల్‌రజాక్, మహమ్మద్ సలేహా,

దరియా ఖాన్, సాలార్‌సాహెబ్, సత్తార్ సాహెబ్, ఇబ్రహిమ్ ఖాన్ వంటి ముస్లిం ప్రముఖులు టీచర్లు, ప్రభుత్వోద్యోగులు, రాజకీయనాయకులు గా రాణించి ఆనాటి సమాజానికి సేవలు చేసారు.

## క్రిష్టియనులు

### యానాం చర్చి చరిత్ర

1789 లో వచ్చిన తుఫానుకు కోరంగి వద్దనున్న ఓ చర్చి కూలిపోవటంతో అక్కడి చర్చిఫాదరు చనిపోయారు. ఆ తరువాత ఆ చర్చికి సంబందించిన 'పవిత్ర పాత్ర' (Chalice) మరియు 'సెయింట్ అన్నె' విగ్రహము తుఫానుకు కొట్టుకొని వచ్చి యానాం సమీపంలో దొరికాయట. వాటి కోసమని యానాంలో సెయింట్ అన్నె చర్చి నిర్మాణం జరిగింది. (రి. జె.బి.పి. మోర్)



యానాం చర్చి

యానాం చర్చి ప్రాంగణంలో కల ఒక లాటిన్ శిలాఫలకాన్ని బట్టి 1768 నాటికే అక్కడ చర్చి లాంటి ప్రార్ధనా స్థలమున్నట్లు తెలుస్తుంది. (మరిన్ని వివరాల కొరకు ఫ్రెంచి సమాధులు చెప్పే గాథలు చాప్టరు చూడండి – రచయిత)

1839 తుఫానుకు చర్చి పైకప్పు కూలిపోయినపుడు దాని పునర్నిర్మాణం కోసమని ఫ్రెంచి ప్రభుత్వం 110 ఫ్రాంకులు ఖర్చు చేసినట్లు రికార్డులు చెపుతున్నాయి. అదే విధంగా 1845 లో మరలా 500 ఫ్రాంకులతో చర్చి కి మరమ్మత్తులు చేయించినట్లు తెలుస్తుంది.

పూర్తిగా శిథిలావస్థకు చేరుకొన్న యానాం చర్చిని 1857 లో 2000 ఫ్రాంకులు ఖర్చు చేసి పునర్నిర్మించటం జరిగింది. సూడానీస్ పద్దతిలో కట్టిన చర్చి భవనం నేటికీ చెక్కు చెదరకుండా, నిన్న మొన్న కట్టిన దానిలా ఉండటం ఆనాటి పనితనానికి నిదర్శనంగా చెప్పుకోవాలి.

1862 లో 700 ఫ్రాంకుల ఖర్చుతో, క్రీస్తు చరిత్రను తెలిపే అనేక సుందరమైన పటాలను, చర్చి గడియారాన్ని– ఇటలీ, పారిస్‌ల నుంచి తెప్పించి అలంకరించారు. క్రీస్తు జీవితాన్ని తెలిపే పటాలలోని జీవం చూపరులను సమ్మోహితులను చేస్తుంది.





1943 వచ్చిన తుఫానుకు అమెరికాకు చెందిన ఒక ఓడ యానాం సమీపంలో ఇసుకలో కూరుకుపోయింది. దానిని బయటకు తీసుకురావటానికి ఎన్ని రకాలుగా ప్రయత్నించినా ఫలించలేదు. ఆ ఓడకు సంబందించిన స్విన్లీ అనే ఇంజనీరు యానాం చర్చిలో లూర్ధుమాతను ప్రార్ధించాడట. ఆ తరువాత ఓడను ఇసుకనుండి లేపటానికి చేసిన ప్రయత్నాలు ఫలించాయట. ఆ అద్భుత ఘటనకు కృతజ్ఞతగా ఆ ఇంజనీరు యానాం చర్చి ప్రాంగణంలో పవిత్ర కొండగుహను (గ్రోటో) ను నిర్మించాడు. ఇది నేటికీ పలువురి భక్తుల ప్రార్ధనలు అందుకొంటూంది.

### వివిధ చర్చి ఫాదర్లు

1835 లెక్కల ప్రకారం యానాంలో 29 మంది క్రిష్టియనులు మాత్రమే ఉన్నారు. వీరి సంఖ్య 1880 నాటికి 88 కి చేరుకొంది. జనాభా ప్రాతిపదికన చూస్తే ఇది రెండుశాతం కూడా కాదు. ఫ్రెంచి వారు క్రిష్టియానిటీ అనేది **తమకు మాత్రమే చెందిన 'వ్యవహారం'** గా భావించటం వల్ల యానాంలో పెద్దగా మతాంతీకరణలు జరగలేదు. అంతే కాక ఒకానొక దశలో చర్చి నిర్వహణే కష్టంగా మారిన సందర్భాలు కూడా ఉన్నాయి.



Gallois E అనే చిత్రకారుడు గీసిన యానాం క్రిష్టియన్ యువతి చిత్రం (1946)

19వ శతాబ్ధ ప్రారంభంలో కొన్ని దశాబ్దాలపాటు యానాం చర్చికి ఫాదరు లేకపోవటాన్ని కూడా ఫ్రెంచి ప్రభుత్వం పెద్దగా పట్టించుకోలేదు. అందుకనే 1826 లో కోర్డియర్ (ఫ్రెంచి గవర్నరు) ఫ్రాన్సుకు వ్రాసిన ఓ ఉత్తరంలో 'ఇండియాకు మతభోధకులను పంపక పోతే, మనం స్వీకరించిన కాథలిజంను వ్యాప్తి చేయలేము. అంతేకాక ఈ మతాన్ని స్వీకరించిన మనవాళ్ళు కూడా భోధకులు లేని కారణంగా జారిపోయే ప్రమాదముంది' – అని విన్నవించుకొంటాడు. (రి. 13 జనవరి, 1826 Letter of Cordier, Interim General Administrator to the minister - India Card, 531, D.977)

గవర్నరు విన్నపాన్ని పారిస్ పెద్దగా పట్టించుకొన్నట్లు కనపడదు. 1841 లో యానానికి చెందిన అబ్బీ కామెల్స్ అనే క్రిష్టియన్ విశ్వాసి 'ఒక మత భోధకుని పంపించమని' గవర్నరు ను వేడుకొన్నాడు. అయినప్పటికీ పాండిచేరీ నుండి ఏ రకమైన స్పందనా రాదు. యానాం కాథలిక్కులు తమ మతపరమైన కార్యక్రమాలకు 100 మైళ్ళ దూరం లో ఉన్న విశాఖపట్టణం

వెళ్ళ వలసి వచ్చేది.

చర్చి ఫాదర్ల కొరతను నివారించటానికి ఫ్రెంచి ప్రభుత్వం స్థానిక క్రిష్టియన్లకు తర్ఫీదు ఇచ్చి వారిని అవసరమైన చోట్లకు పంపించేది. వీరు ఎక్కువగా కేరళా ప్రాంతానికి చెందినవారవ్వటం వలన వీరిని 'కెనరిన్ ప్రీష్ట్' లు అనేవారు. అలా యానాంలో కొంతకాలం కెనరిన్ ప్రీష్ట్ లు తమ భోధనలు సాగించినట్లు తెలుస్తుంది.

ఎట్టకేలకు ఫ్రెంచి ప్రభుత్వం 1844 లో Abbot Vincent Dumas అనే మతభోధకుడిని ఏడాదికి రెండువేల ఫ్రాంకుల జీతంపై యానానికి పంపించింది. యానానికి తొలి యూరోపియన్ చర్చి ఫాదరు ఈయనే. కానీ ఈయన వ్యవహారశైలి వివాదాస్పదమయ్యింది. అప్పటి యానాం పెద్దొర క్లాపర్నా చర్చి ఆదాయ వ్యయాలను నివేదించమని అడగగా దుమాస్ ఖాతరు చెయ్యలేదు. అంతే కాక 12 జూన్, 1844 న దుమాస్ వ్రాసిన ఓ లేఖలో చర్చికి చెందిన మేరీమాత బంగారు నక్లెసును, ఒక వెండి వస్తువును, డబ్బు అవసరం వచ్చి అమ్ముకొన్నానని నిస్సిగ్గుగా ఒప్పుకోవటంతో ఈయనను ఫ్రెంచి ప్రభుత్వం 1844 లో యానాం మతభోధక విధులనుంచి తొలగించి ఫ్రాన్స్ పంపించి వేసింది. (రి: Correspondence of Abbot Dumas reported in the session of Colonial Assembly Pondy- 7 October, 1844)

అప్పటి స్థానిక ప్రభుత్వం అభ్యర్ధన మేరకు విశాఖపట్నం నుండి జాకోబస్ మార్టిన్ (Jacobus Martin) యానాం చర్చికి మతబోధకుడు గా వచ్చారు. 1845 లో యానాం వచ్చిన ఫాదర్ మార్టిన్, కొద్ది కాలానికే అస్వస్థతకు గురయి 1846 లో ఇక్కడే మరణించాడు.

రెండుమూడు క్రిష్టియన్ కుటుంబాలు మాత్రమే ఉన్న యానానికి మార్టిన్ చర్చిఫాదరుగా వచ్చాడు. ఈయన యానాం వచ్చిన కొద్దికాలానికే అందరి మన్ననలను సంపాదించుకొన్నాడు. క్రిష్టియనేతరులు కూడా ఇతని మంచితనం, దైవభక్తిల పట్ల గౌరవం ప్రదర్శించేవారు. తన భోధనలు అందరికీ అందించాలన్న ఆశయంతో మార్టిన్ మైళ్ళకొలదీ దూరాలు అలా నడచుకొంటూ పర్యటించేవాడట. వేసవి ఎండలకు ఒకనాడు వడదెబ్బ తగిలి నేలపై పడిపోయాడు. ఆ మరునాడు విపరీతమైన జ్వరంసోకి మార్టిన్ అపస్మారక స్థితిని చేరుకొని తన ప్రాణాల్ని ప్రభువులో లీనం చేసాడు. యానాం చేరుకొన్న మూడునెలలకే అలా మార్టిన్ జీవితం ముగిసిపోయింది. మార్టిన్ దేహాన్ని యానాం మెట్టకూరు రోడ్డులో ఉన్న ఫ్రెంచి సిమెటరీలో ఖననం చేసారు.

ఇది జరిగిన మూడేళ్ళకు బిషప్ నెరెట్, మద్రాసువెళుతూ మార్గమధ్యలో యానాంలో కొద్దిరోజులు బసచేసాడు. నెరెట్ ఆ సమయంలో మార్టిన్ అస్థికలను ప్రభుత్వ అనుమతితో ఫ్రెంచి సిమెటరీనుంచి యానాం చర్చి ప్రాంగణంలోకి తరలించి ఒక జ్ఞాపికాఫలకాన్ని చర్చిలో ఏర్పాటుచేసాడు. ఆ సమాధిఫలకాన్ని ఇప్పటికీ యానాం చర్చిలో చూడవచ్చును. (రి. Memory & Documents published by the Academy Salesian - 1890)







1846 చర్చి ఫాదరుగా డ్యూపాంట్ (Dupont) రాకతో యానాం లోని క్రిష్టియానిటీ బలపడింది. యానాం ప్రజలకు ఈయన చేసిన సేవలు అనన్యమైనవి. వరదలు, కరువులు, కలరా వంటి వివిధ వైపరీత్యాలలో డ్యూపాంట్ విశిష్టమైన సేవలందించి అందరి మన్ననలు పొందారు.

డ్యూపాంట్ చురుకైన మనిషి. నిజాయితీకి మారు రూపం. ఏదో ఒక పనిని కల్పించుకొని నిరంతరం ప్రజలకు ఉపయోగకరంగా తన జీవితాన్ని మలచుకొన్న వ్యక్తి. ఈయన యానాం వచ్చిన కొత్తలో ఇక్కడి ప్రజలకు సరైన వైద్య సదుపాయం లేదన్న విషయాన్ని గుర్తించి, తనకు తెలిసిన వారి వద్ద వైద్య శాస్త్రంలో ప్రాధమిక చికిత్సా పద్దతుల శిక్షణ తీసుకొన్నాడు. వైద్యుడు లేని లోటును తనవంతు కొంత తీర్చి ప్రజలకు మరింత చేరువయ్యాడు. డ్యూపాంట్ నిస్వార్ధసేవలను గుర్తించిన యానాం ప్రజలు ఈయనను విశ్వసించటం మొదలెట్టారు.

ఇంతలో యానానికి భయంకరమైన వరదలు వచ్చిపడ్డాయి. ఈ వరదలకు ఇళు ్ళ, పంటలు, ఆహారనిల్వలు సర్వనాశనం అయ్యాయి. ఎటుచూసినా పెద్ద పెద్ద పాములు, మొసళ్ళు, మృత కళేబరాలతో యానాం ప్రజలు బిక్కుబిక్కు మంటూ జీవనం సాగిస్తున్న సమయంలో డ్యూపాంట్ ఎంతో తెగించి నాటు పడవపై చుట్టు పక్కల గ్రామాలలో చెట్లపైన, గుడిసెల పైనా చేరి ప్రాణాలు కాపాడుకొంటున్న అనేక మందిని యానాం పట్టణానికి చేర్చాడు. ఇంటింటికీ తిరిగి భాధితులను పడవపైకి ఎక్కించుకొని చర్చి ప్రాంగణంలో దింపి మరలా తిరిగి బాధితులను ఆదుకోవటానికి వెళ్ళిపోయేవాడు. డ్యూపాంట్ సేవల వలన అనేక వందల మంది ప్రాణాలు నిలిచాయనటం అతిశయోక్తి కాదు.

ఆ తరువాత కలరా తాకిడికి యానాం అతలాకుతలమైంది. ఆ సమయంలో వీధులన్నీ నిర్మానుష్యం అయిపోయాయి. ప్రతి ఇంటినుంచీ చనిపోయిన తమ కుటుంబ సభ్యులను తలచుకొంటూ శోకాలు, ఏడుపులు వినిపించేవి. ఏ ఇంటినుంచన్నా అటువంటి ఏడుపులు వినిపించటం లేదంటే ఆ ఇంటిలోని వారందరినీ కలరా కబళించిందని భావించాల్సినంత దారుణమైన పరిస్థితి. అలాంటి నేపథ్యంలో డ్యూపాంట్ తనకున్న కొద్దిపాటి వైద్య పరిజ్ఞానంతో రోగులకు విశేషమైన సేవలందించాడు. ఎంతో ప్రమాదకరమని తెలిసినా, ఇంటింటికీ తిరుగుతూ కలరా రోగులకు ధైర్యం చెప్పి, మందులిచ్చి తన సాయశక్తులా నిస్వార్ధ సేవలందించాడు.

ఈయన తెలుగు నేర్చుకొని స్థానిక పిల్లలకొరకు చర్చిలోనే పాఠశాలను నెలకొల్పి విద్యాసేవలందించాడు. డ్యూపాంట్ హయాంనుంచీ చర్చి ఆదాయ వ్యయాల నివేదికలు ప్రభుత్వానికి ప్రతియేటా సమర్పించటం మొదలైంది. 1849 లో చర్చి ఆదాయం 1747 ఫ్రాంకులు కాగా, దానిలో 1372 ఫ్రాంకుల ఖర్చు 375 ఫ్రాంకుల మిగులు చూపించటం జరిగింది. చర్చికి వచ్చిన ఆదాయంలోంచి దేవునికి విలువైన ఆభరణాలు డ్యూపాంట్

సమకూర్చిపెట్టాడు. ఈయనచొరవ వల్లనే యానానికి కన్యస్త్రీలు/సిస్టర్ టీచర్లు రావటం జరిగింది.

డ్యూపాంట్ తరువాత 1853 లో డిలాలెక్స్ (Delalex) ఫాదరుగా వచ్చారు. ఈయన హయాంలోనే యానాం చర్చి సర్వాంగ సుందరంగా తయారయి 1857 లో ప్రారంభోత్సవం చేసుకొంది. వీరి తరువాత డిబోర్న్స్ (J.M.Debornes) అనే ఫాదరు యానాంలో చాలాకాలం పనిచేసారు.




19 వ శతాబ్ధంలో చర్చి సమర్పించిన బడ్జెట్లను గమనిస్తే ఒక్క 1857 లో తప్ప (చర్చి పునర్నిర్మాణం జరిగిన సంవత్సరమది) మిగిలిన కాలమంతా ఎంతో కొంత మిగులు ఆదాయం ఉండేది. పెద్దొర, చర్చి ఫాదరు పోలీసు అధికారి మరియు వైద్యాధికారులతో ఏర్పడిన కమిటీ ఆధ్వర్యంలో ఈ మిగులు ధనంతో పేదల కొరకు వితరణ కార్యక్రమాలు జరిగేవి.

1902 లో పుల్ఫిన్ యానాం చర్చి ఫాదర్ గా పనిచేసారు. 1910 లో ఈయన స్థానంలో ఫాదర్ బోషే (జోసెఫ్ ఫెలిక్స్) చర్చి ఫాదర్ గా నియమింపబడ్డారు.

1916 లో చర్చి కమిటీ తన ఆదేశాలను ఖాతరు చేయటం లేదని, చర్చి ఆదాయ వ్యయాల పద్దులను ప్రభుత్వానికి సమర్పించటం లేదని, రెండు సంవత్సరాలుగా తన ఉత్తరాలకు చర్చి కమిటీ ఏ విధంగానూ స్పందించటం లేదనీ- యానాం పెద్దొర గవర్నరుగారికి పిర్యాదు చేసాడు. దీనికి స్పందిస్తూ గవర్నరుగారు యానాం చర్చి కమిటీని రద్దు పరచారు. అంతే కాక కొత్త కమిటీ ఎన్నిక జరుపుకోవటానికి మరియు మెంబర్లు ఎలాఉండాలో విధి విధానాలు నిర్ణయించారు. వాటి ప్రకారం వెస్ట్రీబోర్డు (చర్చి కమిటీ) లో యానాం మేయరు ప్రతిపాదించిన ఒక కాథలిక్కు మెంబరు, హెల్త్ ఆఫీసరు, పోలీసు కమీషనరులు ఉండటం మొదలైంది.

ఇరవయ్యవ శతాబ్దానికి వచ్చేసరికి యానాం చర్చి పేరును దశదిశలా వ్యాపింపచేసిన వ్యక్తి ఫాదర్ గాంగ్లాఫ్. ఈయన 1921 నుంచి 1957 వరకు యానాం చర్చి ఫాదరుగా వ్యవహరించారు. యానానికి చెందిన ప్రముఖ విమోచనోద్యమ నాయకుడు శ్రీ దడాల రఫేల్ రమణయ్య ను ఫాదర్ గాంగ్లాఫ్ చేరదీసి స్వంత ఖర్చులతో పాండిచేరీ పంపించి విద్యాబుద్దులు నేర్పించారు.

గాంగ్లాఫ్ హయాంలో యానాం చర్చిలో అరుదైన వృక్షజాతులతో కూడిన బొటానికల్





గార్డెన్ నిర్మించబడింది. ఇక్కడి మొక్కలను పరిశీలించటానికి వివిధ యూనివర్సిటీలనుంచి విద్యార్ధులు వచ్చేవారట. బిగోట్ అనే ఒక ఫ్రెంచి అధికారి యానాం బొటానికల్ గార్డెన్ లో ఉన్న వృక్షజాతులను వర్ణిస్తూ Le jardin Botanique de Yanaon (Botanic Garden of Yanam) అనే పుస్తకాన్ని రచించాడు.

## Le Jardin Botanique de Yanaon (Botanic Garden of Yanam)



బొటానిక్ గార్డెన్ - ఫాదర్ గాంగ్లాఫ్

'Le Jardin Botanique de Yanaon' అనేది యానాం గురించి వ్రాయబడిన మొట్టమొదటి పుస్తకం. దీనిని Alfred Alphonse Leon Bigot రచించాడు. ఇతను పాండిచేరీ మెడికల్ స్కూల్ డైరెక్టరు. కలకత్తాలోని రాయల్ అగ్రి-హార్టికల్చరల్ సొసైటీ మెంబరు. ఇతను 1950లో యానాం సందర్శించినపుడు చర్చి ప్రాంగణంలో చర్చి ఫాదరు A. Gangloff మూడు దశాబ్దాలుగా పెంచిపోషిస్తున్న గార్డెన్ ను చూసి అందులో ఉన్న అరుదైన వృక్షసంపదకు ఆశ్చర్యపడి ఆ గార్డెన్ ను సందర్శించేవారికి ఒక గైడ్ వలె ఉంటుందని వ్రాసిన పుస్తకమిది.

ఫాదర్ గాంగ్లాఫ్ 1921లో యానాం చర్చి ఫాదరుగా నియమింపబడి నపుడు చర్చి ప్రాంగణంలో అరటిమొక్కలు, కొబ్బరి చెట్లు కొద్దిపాటి పూలమొక్కలు మాత్రమే ఉండేవి. కాల క్రమేణా ఈయన వివిధప్రాంతాలనుండి మొక్కలను సేకరించి పెంచటం మొదలెట్టారు. కొన్ని మొక్కలను విదేశాలనుంచి రప్పించారు. మరికొన్నింటిని కలకత్తాలోని రాయల్ అగ్రి-హార్టికల్చరల్ సొసైటీ నుండి తెప్పించారు. ఆ సొసైటీ సెక్రటరీ పెర్సి లాంకాస్టర్, గాంగ్లాఫ్ గారికి మిత్రుడగుటచే అనేక అరుదైన దేశ విదేశీ వృక్షజాతుల సేకరణ సులభతరమైంది. వీరు ఆ మొక్కలకు అంట్లుగట్టి ఔత్సాహికులైన వృక్షప్రేమికులకు కానుకలుగా ఇచ్చేవారట. అంతేకాక వివిధ యూనివర్సిటీ విద్యార్ధులు ఈ మొక్కల అధ్యయనం కొరకు వచ్చినపుడు వారికి కూడా అరుదైన మొక్కలను యూనివర్సిటీ గార్డెన్‌లలో పెంచుకొనేందుకు బహూకరించే వారట. వీరు అప్పటి భారతీయ బొటానిస్టులనేకులతో పరిచయాలు కలిగిఉండి వివిధ మొక్కలను ఇచ్చిపుచ్చుకొనేవారట.

బిగో (Bigot) యానాన్ని సందర్శించినప్పటికి ఫాదర్ గాంగ్లాఫ్ వయసు 83

సంవత్సరాలు. ఆ వయసులో కూడా ఎంతో ఉత్సాహంగా, చురుకుగా, ఓపికతో ఆ మొక్కలను ఎక్కడెక్కడ నుంచి సేకరించిందీ, ఇక్కడి వాతావరణం సరిపడక ఏ ఏ విదేశీ మొక్కలు చనిపోయినదీ ఆయన వివరించటం చాలా ఆశ్చర్యపరచిందని బిగో తన పుస్తకంలో తెలిపాడు

ఈ గార్డెన్ 1866 చ.గజాల స్థలంలో విస్తరించి ఉంది. ఇందులో 57 కుటుంబాలకు చెందిన మొత్తం 195 జాతుల మొక్కలు ఉన్నాయి. ప్రతీ మొక్క వద్ద చిన్న చెక్క పలకపై దాని శాస్త్రీయనామము, వృక్షరాజ్యంలో దాని స్థానము వంటి వివరాలు రాసిపెట్టటం జరిగింది. ఈ గార్డెన్‌లో ఉన్న మొక్కలలో ఎక్కువ శాతం విదేశీ మొక్కలే. భారతదేశానికి చెందిన మొక్కలు పరిమితంగా ఉండేవి. స్థల పరిమితి వలన అతి సాధారణంగా కనిపించే కొబ్బరి, తాటి, అత్తి చెట్లు, గులాబీమొక్కలు, చేమంతులు వంటివి ఈ గార్డెన్‌లో ఉంచలేదట.

చైనా, జపాన్, వెస్ట్ ఇండీస్, మెక్సికో, బ్రెజిల్, గ్యాటామెలా, మలయా, సిలోన్, ఆస్ట్రేలియా, ఇండో చైనా, మలక్కా, ఆఫ్రికా, మార్టినిక్, క్యూబా, అమెరికా, మడగాస్కర్, ఫ్రెంచి గయానా, ఉగాండా, బర్మా, జమైకా వంటి దేశాలకు చెందిన అనేక మొక్కలు ఈ గార్డెన్‌లో చూపరులను ఆకర్షిస్తూ ఉండేవి. (ఈ పుస్తకంలో 195 జాతుల మొక్కల గురించిన పూర్తివివరాలు బిగొ పొందు పరచాడు)

ఈ గార్డెన్ లో మాత్రమే ఉన్న విశిష్టమైన మొక్క జాతులను గూర్చి బిగో తన పుస్తకంలో వర్ణించాడు. యెల్లో ఓలియాండర్ అనే మొక్క సాధారణంగా పసుపుపచ్చని పూలను కలిగి ఉంటుందనీ కానీ యానాం గార్డెన్‌లో ఉన్న మొక్క లేత పింక్ పుష్పాలను కలిగి ఉందని బిగో గుర్తించాడు. ఈ గార్డెన్ లో ఎరుపు కండ కలిగిన పళ్ళనిస్తున్న బొప్పాయి చెట్టు ఒక అరుదైన రకమని బిగో అభిప్రాయపడ్డాడు.

నాగమల్లి చెట్టుని (Couroupita guianensis) Perroter అనే ఫ్రెంచి దేశస్థుడు ఫ్రెంచి గయానా నుండి తెచ్చి పాండిచేరీ ప్రభుత్వ గార్డెన్‌లో వేసాడు. అక్కడి నుంచి ఈ మొక్క యానాంకు చేరింది. కాకినాడకు చెందిన పైండా జమీందారు ఒక తోటనిండా ఈ మొక్కలను పెంచుతున్నట్టు బిగో పేర్కొన్నాడు. (నేటికీ కాకినాడలోని ఆ ప్రాంతాన్ని నాగమల్లి తోట అని అంటారు)

బోర్బన్ కు చెందిన Latania bourbonica అనే ఒక రకమైన ఆర్నమెంటల్ ఈతచెట్టు అప్పటికి 75 సంవత్సరాలనుంచి ఈ గార్డెన్‌లో పెరుగుతున్నదనీ, విచిత్రమైన రంగురంగుల క్రోటన్‌లు, తులిప్ లు, అనేక మెడిసినల్ మొక్కలు ఈ గార్డెన్‌కు అదనపు ఆకర్షణగా ఉన్నాయని బిగో తన పుస్తకంలో పేర్కొన్నాడు.

యానాం విమోచనోద్యమ సారధి శ్రీ దడాల రఫేల్ రమణయ్య తన చిన్నతనంలో ఈ గార్డెన్‌లో మొక్కలకు నీళ్ళువేసే పనికి కుదిరినట్లు తన ఆత్మకథలో తెలిపారు. (ఆ సమయంలో దడాలలో ఉన్న తెలివితేటలను, పెద్దచదువులు చదువుకోవాలన్న ఆకాంక్షను గుర్తించిన ఫాదర్ గాంగ్లాఫ్ తన స్వంత ఖర్చులతో అతనిని పాండిచేరీ పంపించి పెద్దచదువులు చెప్పించారు. శ్రీ దడాల పెద్దయ్యాకా ప్రతిఏటా వేసవిలో గాంగ్లాఫ్ గారు ఊటీలోచేసే బస ఖర్చులు పెట్టుకొనేవారట.





ఫ్రెంచి పాలనలో యానాం
శ్రీదడాల భౌతికకాయం ఫాదర్ గాంగ్లాఫ్ సమాధి చెంతనే ఖననం చేయబడటం వారిరువురి జన్మాంతర అనుభందాన్ని తెలియచేస్తుంది – రచయిత)

సిరిల్ యాంటోనీ వ్రాసిన 'పాండిచేరీ గెజటీర్స్' లో ఈ గార్డెన్ గురించి వర్ణిస్తూ, ఫాదర్.గాంగ్లాఫ్ అనంతరం ఈ గార్డెన్‌కు సంరక్షణ కరువై అనేక మొక్కలు అంతరించిపోయాయని, 1970 ల నాటికి ఈ గార్డెన్ లో 75 వృక్ష జాతులు మాత్రమే ఉన్నాయని పేర్కొన్నాడు. నేడు పాతిక ముప్పై మొక్కలు మించి లేకపోవటం మరింత శోచనీయం.

## హిందువులు

1880 జనాభా లెక్కల ప్రకారం మొత్తం 4520 మందిలో 4259 మంది హిందువులు ఉన్నారు. ఆనాటి యానాం సమాజం చాతుర్వర్ణ నిర్మితం. ఇవి కాక అయిదో వర్ణంగా పిలువబడే మరో వర్గం సామాజిక వివక్షకు గురవుతూ ఊరికి దూరంగా మనుగడ సాగిస్తూండేది. యానాం పెద్దొర జోర్దయిన్ 1830 లలో గీయించిన యానాం మేప్ లో టవునుకు దూరంగా మెట్టకూరు వెళ్ళే మార్గంవద్ద 'మాలపేట' ఉన్నట్లు, అదే విధంగా టవునుకు వెలుపల పడమర వైపున 'జోర్దయిన్ పేట' పేరుతో చర్మకారుల నివాసాలున్నట్లు చూపబడింది. (యానాం మాలపేట అన్న పేరును రికార్డుల నుంచి తొలగించి అంబేద్కర్‌నగర్‌గా మార్పు చేయించటంలో– యానానికి చెందిన దళితమేధావి, అంబేద్కరిష్టు, జనమిత్ర ఎడిటర్ అయిన శ్రీ పొనుగుమట్ల విష్ణుమూర్తి గారి కృషి ఎంతో ఉంది. పెద్దొర పేరుమీదుగా నెలకొల్పబడిన జోర్దయిన్ పేట కాల క్రమేణా జాంబవాన్ పేట గా రూపాంతరం చెందింది – రచయిత)

Gallois E అనే ఫ్రెంచి చిత్రకారుడు గీసిన యానాం హిందూ యువతి చిత్రం (1946 )



ఫ్రెంచి వారి మూలసూత్రాలయిన స్వేచ్ఛ, సమానత్వము, సౌభ్రాతృత్వము వంటి భావనలు వారి పాలనలో ప్రతిబింబిస్తూ ఉండేవి. ఆ కారణంగా దళితజనోద్దరణ విషయంలో పొరుగునున్న బ్రిటిష్ ప్రాంతాలకంటే యానాం కొంచెం మెరుగుగానే ఉండేదన్న విషయం గమనార్హం.

ఇక సవర్ణ హిందువుల విషయానికి వస్తే ఫ్రెంచి పాలన ప్రారంభదశలో ఇక్కడ వ్యాపారాలు పెద్ద ఎత్తున జరిగేవి కనుక వైశ్యుల ఆధిపత్యం ఎక్కువగా ఉండేది.

యానాంలో భూములు అన్నీ మొదట్లో ప్రభుత్వ ఆధీనంలో ఉండేవి. ప్రభుత్వం వీటిని రైతులకు లీజుకి ఇచ్చేది. కాలక్రమేణా ఈ పద్ధతికి స్వస్థి పలికి ప్రజలకు ఆస్థి హక్కు కల్పించి ఎంతో కాలంగా లీజుకు సాగుచేసుకొంటున్న వ్యక్తులకు కొద్దిపాటి ధరకు ఈ భూములను హక్కుభుక్తం చేసింది. ఆ విధంగా ఇక్కడి ప్రజలు మొదటి సారిగా 'అమ్ముకోగలిగే ఆస్థిహక్కును' పొందారు. అలా లబ్ధిపొందిన వారిలో ఎక్కువగా కాపుకులస్థులు ఉండటంతో, కాల క్రమేణా ఆ కులస్థుల ఆధిపత్యానికి తెరలేచింది. వీరు సామాజికంగా, రాజకీయంగా,విద్యాపరంగా అభివృద్ధిచెందారు. ఆయా రంగాలకు అధిపతులయ్యారు. 19 వ శతాబ్ద ప్రారంభంలో మొదలైన వీరి ఆధిపత్యం 1954 లో యానాంలో ఫ్రెంచి పాలన ముగిసే సమయానికి కూడా కొనసాగుతూనే ఉంది.

ఫ్రెంచి యానాంలో బ్రాహ్మణులు అధికంగా విద్యారంగానికే పరిమితమయినట్లు తెలుస్తుంది. మన్యం జమీందారు వద్ద దివాన్ గా పనిచేసిన శ్రీ బులుసు సుబ్రహ్మణ్యశాస్త్రులు తప్ప రాజకీయంగా పేర్గాంచిన మరో కుటుంబం కనిపించదు.

యానాం నిర్మాణం తొలుత బి.సి ల చె మటతోనే జరిగిందన్నది ఒక చారిత్రక వాస్తవం. ఎందుకంటే యానాం ఒక వ్యాపారకూడలిగా ఉన్నసమయంలో సుమారు మూడువేల చేనేతకార్మికుల కుటుంబాలు ఇక్కడ నివసించేవి. నిత్యం కొన్ని వేల మగ్గాలు ఆడుతూండేవి. వీరు నేసిన వస్త్రాలు దేశవిదేశాలకు ఎగుమతి అయి కొన్ని కోట్ల ఫ్రాంకుల వ్యాపారం జరిగింది.

అప్పట్లో ముతక దుస్తులకు బ్లీచింగ్ చేసి ఎగుమతి చేసేవారు. ఈ పనిలో కొన్ని వందల రజకుల కుటుంబాలు పాలుపంచుకొన్నాయి.

యానాం నుంచి రోజూ కొన్ని వందల పడవలలో సరుకులు కోరంగి వద్దనిలుపు చేసిన ఓడలలోకి రవాణాచేయబడేది. ఈ పనిలో కొన్నివేల మంది కళాసీలు, రేవు బోయీలు శ్రమించేవారు. యానాం నుంచి మడగాస్కర్, రీయూనియన్ వంటి ప్రాంతాలకు ఎగుమతి అయిన కూలీలలో దళితుల తరువాత బి.సి. లకు చెందిన నిరుపేదలే అధికంగా ఉన్నారు.

ఆ రకంగా ఫ్రెంచి యానాం నిర్మాణంలో రాళ్ళెత్తిన కూలీలు బహుజనులే అనడం సత్యదూరం కాదు.

### 1870 లో యానాంలో జరిగిన కులగణన

పాండిచేరీ జడ్జి గా పనిచేసిన A. Esquire భారతదేశంలోని కులవ్యవస్థపై Les castes dans I'Inde (Castes in India) అనే పుస్తకాన్ని రచించాడు. అతని పరిశోధనలో భాగంగా యానాంలో కూడా పర్యటించి ఇక్కడ ఉన్న వివిధ కులాలను గుర్తించి తన పుస్తకంలో ఒక టేబుల్ రూపంలో పొందుపరిచాడు.

ఈయన సేకరించిన వివరాల ప్రకారం ఆనాటి యానాం సమాజంలో ఈ క్రింది కులాలు ఉన్నట్లు తెలుస్తుంది. (ఇక్కడ ఎస్క్వైర్ వాడిన కులనామాలనే వాడటం జరిగింది)

- వైదిక, వైష్ణవ, నియోగి, మార్ధ అనే నాలుగు శాఖలతో బ్రాహ్మలు,
- గవర, లింగధారి, టెక్కి, బేరి, కళింగ వంటి అయిదు శాఖలతో వైశ్యులు,
- కాపులు, వెలమలు, కమ్మవారు, పల్లీయులు, గొల్లవారు, శాలీలు, విశ్వకర్మలు, తెలకుల వారు, కుమ్మరులు, చాకలివారు, గాజుల వారు, ఎరుకలవారు, మేదరలు,నేర విద్యల వారు, గంగిరెద్దుల వారు, మాలవాండ్రు అంటూ మొత్తం నలభై శాఖలతో శూద్రులు,
- సంఘం వెలుపల అస్పృశ్యులుగా జీవిస్తున్న వారిగా మాదిగవారిని, చచ్చర వారిని ఎస్క్వైర్ గుర్తించాడు.

ఎస్క్వైర్ తన పరిశీలనలో ఆనాడు యానాంలో క్షత్రియులు ఎవరూ లేరని పేర్కొనడం గమనార్హం. అంతే కాక మాల కులస్థులను శూద్రులలో నలభయ్యవ సంఖ్యగా పేర్కొనటం కూడా గమనార్హమే. ఎందుకంటే ఆనాటి హిందూ వర్ణధర్మ ఆచారాల ప్రకారం వీరిని శూద్రులతో చేర్చేవారు కాదు.

### దేవాలయాలు

యానాంలో అనాదిగా పూజలందుకొంటున్న ఆలయాలు మూడు. అవి విష్ణాలయం, శివాలయం మరియు పిల్లారాయుని గుడి. ఇవి కాక పోలేరమ్మ మహలక్ష్మమ్మ ఆలయాలు, రామాలయం, అంబేద్కర్ నగర్ లోని రామాలయం వంటివి కూడా ఫ్రెంచి వారి కాలం నుంచీ పూజలందుకుంటూనే ఉన్నాయి.

విష్ణాలయంలో ఉండే వెంకటేశ్వర స్వామి విగ్రహానికి కు మీసాలుండటంతో దీనిని మీసాల వెంకన్న ఆలయం అని కూడా పిలుస్తారు. చాలాకాలం క్రితం యానానికి చెందిన పల్లీయులు ఉదయాన్నే వేటకు వెళ్ళేముందు వెంకటేశ్వర స్వామికి చద్దికూడును ప్రసాదంగా సమర్పించేవారని, అందుచేత ఈ ఆలయాన్ని "చద్దికూడు వెంకన్న" ఆలయంగా స్థానికులు పిలుచుకొనేవారట.

పదకొండవ శతాబ్దానికి చెందిన రెడ్డిరాజులు ఈ ఆలయాన్ని నిర్మించారని యానానికి చెందిన శ్రీ సమతం కృష్ణయ్య, 1954 లో వ్రాసిన "Historie de la Divinite Sri Venkteswara swamy, Yanaon" అనే వ్యాసం లో తెలియచేసారు. దీనికి ఆధారాలుగా– ముస్లిముల దాడులు జరిగినపుడు మూలవిరాట్ విగ్రహాలను దాయటానికి ఆలయం వెనుక

వైపున 29 అంగుళాల పొడవుతో 17 అంగుళాల వెడల్పుతో ఉన్న కందకం ఉందనీ – విగ్రహాలకు అభిషేకం చేసిన నీరు బయటకు వచ్చే సోమసూత్రం మకరం ఆకారంలో ఉందనీ, ఆగమ శాస్త్రాల ప్రకారం శూద్ర రాజులు మాత్రమే మకర ఆకారంలో ఉన్న సోమసూత్రాల నిర్మాణం చేస్తారనీ– కనుక యానాం వెంకటేశ్వర ఆలయాన్ని శూద్రరాజులైన రెడ్డి రాజులు నిర్మించి ఉండొచ్చని– హిందూ దేవాలయాలపై ముస్లిముల దాడులు 11, 16 శతాబ్దాల మధ్య జరిగాయి కనుక ఈ ఆలయనిర్మాణం ఆ సమయంలో జరిగి ఉండవచ్చని శ్రీ సమతం తన వ్యాసంలో సూత్రీకరించారు.

సమతం మాటలు అంత విశ్వసనీయమైనవిగా అనిపించవు ఎందుకంటే ఫ్రెంచి రికార్డులలోకానీ, బ్రిటిష్ రికార్డులలో కానీ ఎక్కడా యానాం ఒక పురాతనమైన నగరంగా వర్ణింపబడలేదు. సరికదా యానాం ఒక ఆధునిక టవును అనీ ఫ్రెంచి వారు ఇక్కడకు రాక ముందు ఈ ప్రాంతమంతా ఒక చిట్టడవిగా ఉండేదని పేర్కొనబడింది. అంతేకాక యానానికి సమీపంలో కల ద్రాక్షారామ భీమేశ్వర ఆలయంలోని శిలా శాసనాలపై తూర్పుగోదావరి జిల్లాలోని అనేక ఆలయాలు, ఊర్లను గురించి ఉన్న సమాచారంలో యానాం ప్రస్తావన ఎక్కడా కనిపించదు.

1890 లో ముద్రితమైన “Memoires & Documents publies par Academy Salesienne by Tome Treizieme” అనే పుస్తకంలో యానాం ప్రస్తావన పేజీ నం.169లో ఈ విధంగా ఉంది......

> యానాం వాణిజ్యపరంగా ఒక వెలుగు వెలిగిన ఫ్రెంచి కాలనీ. 1787 లో యానాం నుంచి మూడు వేల బేళ్ళ అద్దకం వేసిన వస్త్రాల ఎగుమతి జరిగింది. ఫ్రెంచి వారు ఈ ప్రాంతాన్ని ఎప్పుడు చేజిక్కించుకొన్నారో తెలియదు కానీ, **1706 లో వచ్చిన భయంకరమైన ఉప్పెన సమయానికి యానాం అనే గ్రామం లేదు. అప్పుడు ఈ ప్రాంతమంతా ఒక చిట్టడవి లాగ ఉండేది.**

1915 లో F.R. Hemingway అనే బ్రిటిష్ అధికారి వ్రాసిన Madras District Gazetteers of Godavari అనే పుస్తకంలో యానాం గురించి ఇలా ఉంది....

> యానాం అనేది చాలా ఆధునిక టవును. **ఇది 1706 నాటికి లేదు.** ఇక్కడ ఫ్రెంచి వారు 1750 లో ఒక ఫాక్టరీ (వ్యాపారకూడలి) ఏర్పాటు చేసారు. ఈ ప్రాంతం 1752 లో ఫ్రెంచి వారికి దఖలు చేయబడింది.

Henry Morris 1878 లో ప్రచురించిన Descriptive and Historical Account of the Godavery District అనే పుస్తకపు 52వ పేజీలో ఫ్రెంచి యానాం పూర్వ స్థితి గురించిన సమాచారం ఆసక్తిదాయకంగా ఉంటుంది.







> తొంభై నాలుగు సంవత్సరాల వయసున్న గొల్లపూడి నాగిశెట్టి అనే ఒక వృద్ధుడు 1706 లో కోరంగి వద్ద సంభవించిన అతిపెద్ద సునామీ గురించి తెలిపిన సమాచారాన్ని మోరిస్ తన పుస్తకంలో ఉటంకించాడు. 1706 లో వచ్చిన ఆ ఉప్పెనకు ఎంతో మంది గల్లంతయ్యారని, చెట్లు, ఇళ్ళు నాశనం అయ్యాయని, ఊళ్లలో ఉప్పుమేటలు వేసాయని, **అప్పట్లో యానాం, నీలపల్లి, కాపులపాలెం వంటి ఊళ్ళు లేవని ఆ ప్రాంతమంతా ఒక అవిచ్ఛిన్నమైన అడవిగా ఉండేదని** నాగిశెట్టి తెలిపినట్లు మోరిస్ పేర్కొన్నాడు.

1723 లో యానాన్ని మొట్టమొదటి సారిగా చూసిన కుర్టన్ అనే ఫ్రెంచి వ్యాపారి ఇక్కడ కొద్దిపాటి రజకులు తప్ప ఎవరూ లేరని పేర్కొనటం కూడా ఈ సందర్భంలో పరిగణనార్హమే.

పైన ఉదహరించిన రిఫరెన్సులను పరిగణనలోకి తీసుకొంటే **1723 కి పూర్వం యానాం అనే ప్రదేశం ఒక చిన్న తీరప్రాంత గ్రామం అయిఉండటానికే అవకాశాలు ఎక్కువగా అనిపిస్తాయి.** సమతం తన వ్యాసంలో వర్ణించినట్లు యానామేమీ అప్పటికే శతాబ్దాల చరిత్రకలిగిన పురాతన నగరం కాకపోవచ్చు. పైన ఉటంకింబడిన ఆధారలను బట్టి ఒకవేళ యానాం అనేది ఫ్రెంచివారిచే నిర్మించబడిన టవునే అయితే ఇక్కడ అనాదిగా పూజలందుకొంటున్న వెంకన్న మరియు శివాలయాల నిర్మాణాలు బహుశా ఇది వ్యాపారపరంగా ఉచ్ఛస్థితిలో ఉన్న 1730–1760 ల మధ్య జరిగి ఉండొచ్చునని భావించాలి. ఈ కాలంలో యానాంలో వేలకొలదీ చేనేతకుటుంబాలు ఉపాధి పొందుతూండేవి. వందల కొలదీ వ్యాపారులు తమ కార్యక్రమాలు సాగించేవారు. వారందరి పూనికతో ఈ ఆలయాల నిర్మాణం జరిగిఉండొచ్చు. (ఏది ఏమైనప్పటటికీ ఈ విషయంలో పురావస్తు పరిశోధనలు జరిగితే తప్ప స్పష్టమైన కాల నిర్ధారణ చేయటం కష్టం)

ఫ్రెంచి వారు ఎక్కడా ఈ ఆలయాల గురించి ప్రస్తావించకపోవటం వల్ల వారేమీ వీటి నిర్మాణానికి ఆర్ధిక సాయం చేసినట్లు అనుకోలేం. అదీ కాక అప్పట్లో కొంతమంది ఫ్రెంచివారు హిందూ దేవాలయాల పట్ల అనుచితంగా ప్రవర్తించిన సంఘటనలు కూడా లేకపోలేదు. ఉదాహరణకు డూప్లే భార్య పాండిచేరీలోని శివాలయంలోని శివలింగంపై మానవమలినాలను చల్లించినట్లు, కొంతమంది ఫ్రెంచి అధికారులు చెప్పులతో శివలింగాన్ని అపవిత్రం చేసినట్లు ఆనందరంగ పిళ్ళై డైరీలలో కన్పిస్తుంది.

1881 నాటి ఫ్రెంచి రికార్డులలో యానాం వెంకన్న తీర్ధానికి స్కూళ్లకు మూడు రోజులు సెలవులు ఉండటాన్ని బట్టి, ఆనాటికే యానాం వెంకన్నతీర్ధం వైభవోపేతంగా జరిగేదని భావించాలి. వెంకన్న ఆలయరాజగోపుర పునర్నిర్మాణం 1935 లో జరిగింది. ఆ కాలంనుంచే ప్రతీఏటా రథోత్సవం అంగరంగవైభవంగా జరగటం మొదలైంది.

రాజరాజేశ్వరి ఆలయ (శివాలయం) నిర్వహణకొరకు యానాం జమీందారిణి శ్రీమన్యం మహలక్ష్మమ్మ గారు కొన్ని భూములు దానం చేసారు. త్రిపురారి బసవరాజు అనే శిల్పి ఆధ్వర్యంలో 1930 లలో రాజరాజేశ్వరీ విగ్రహం, ఇతర దేవతామూర్తులకు మకరతోరణాల నిర్మాణం జరిగింది. అమ్మవారి విగ్రహంలోనే నగలు చెక్కటంలో బసవరాజు పనితనం నేటికీ దర్శించవచ్చును. ఇదే శిల్పి యానాం వెంకన్న రథాన్ని నిర్మించారు.

యానాన్ని దర్శించటానికి వచ్చిన ఒక తమిళ సాధువుకు వినాయకుని విగ్రహం దొరికిందట. దాన్ని ఆయన ఆ ప్రదేశంలోనే ప్రతిష్ఠించి ఆలయనిర్మాణం కావించాడట. అదే నేటి యానాం పిల్లారాయుని గుడి. ఈ సంఘటన ఎప్పుడు జరిగిందో తెలియరాదు. జోర్డైన్ 1830 లో గీయించిన యానాం మేప్‌లో ఈ ఆలయం ఉన్నట్లు కనిపించకపోవటాన్ని బట్టి ఈ ఆలయనిర్మాణం ఆ తరువాత కాలంలో జరిగి ఉండొచ్చునని భావించాలి.

యానాంలో పోలేరమ్మ, మహలక్ష్మమ్మలు గ్రామదేవతలుగా అనాదిగా పూజలందుకొంటూ ఉన్నారు. ఈ ఆలయాలు ప్రస్తుతం ఉన్న ప్రదేశానికి దక్షిణదిక్కుగా పొలాలలో రెండు చెక్క విగ్రహాలు వెలిసాయట. అది బహుశా 19 వ శతాబ్దం చివరలో కావొచ్చు. యానానికి చెందిన శ్రీ గీసాల సుబ్బన్న వీటికి ధూప,దీప నైవేద్య సేవలు అందించేవారట. వారి తదనంతరం ఆయన కుమార్డు శ్రీ గీసాల కృష్ణమూర్తి ఆ ఆచారాన్ని కొనసాగించారట.

ఈ ఆలయ నిర్వహణకు శ్రీ మన్యం మహలక్ష్మమ్మ భూరి విరాళాలందచేసారు. అంతవరకూ మట్టి గరగలతో సంబరం జరిపేవారట. వాటి స్థానంలో ఇత్తడి గరగలు, ఇత్తడి ఘటం లను మహలక్ష్మమ్మ గారు 1920 లో చేయించారు. వాటిని నేటికీ ఆలయంలో చూడవచ్చును. 1911 నాటి ఫ్రెంచి రికార్డులలో ఈ ఆలయాలు ఉన్న ప్రాంతాన్ని "అమ్మోరి పుంత" (Pagode Amor et du Punta) గా వ్యవహరింపబడింది.

1950 ల ప్రాంతంలో పొలాలలో ఉన్న చెక్క ప్రతిమలను ప్రస్తుతం నెలకొని ఉన్న ప్రదేశానికి తరలించి దేవాలయాలు కట్టటం జరిగింది. ఆ సమయంలో చెక్క ప్రతిమల స్థానంలో రాసున్నంతో చేసిన పోలేరమ్మ, మహలక్ష్మమ్మ విగ్రహాలను నిర్మించారు. ఇవి శిధిలావస్థకు చేరుకోవటంతో ఈ మధ్యే ఈ ఆలయాల పునర్నిర్మాణం జరిగింది.

యానాం అంబేద్కర్ నగర్ లో ఉన్న రామాలయం 1880 ల ప్రాంతంలో నిర్మించబడింది. శ్రీకాకుళంనుంచి తీసుకువచ్చిన ఒక ఆచారిగారి ఆధ్వర్యంలో దీని నిర్మాణం జరిగిందని స్థానికులు చెపుతారు.

ఇరవైయ్యవ శతాబ్దపు ప్రారంభంలో యానాంలో గణేష్ ఉత్సవాలు జరగటం మొదలయ్యింది. వినాయకుని నిమజ్జన ఊరేగింపులు అప్పటి రాజకీయవర్గాలకు బలప్రదర్శన వేదికలుగా ఉండేవి. 1933 ఆగస్టు లో జరిగిన గణేషనిమజ్జన ఊరేగింపు ఆనాటి మేయరు నివాసముండే కామిశెట్టివారి వీధి గుండా వెళ్ళినపుడు జరిగిన ఘర్షణల సందర్భంలో–అప్పటి





అడ్మినిస్ట్రేటరయిన జీవరత్నం దాడులకు పాల్పడినవారికి మద్దతు ఇస్తున్నారని యర్రా జగన్నాధరావు, తోట సత్యం వంటి వారు, చేసిన పిర్యాదుల మేరకు ఆయనను బదిలీ చేసి కుమరన్ ను నియమించటం జరిగింది.

యానాం ఆలయాలలో పర్వదినాలలో జరిగే వేడుకలకు, ఉత్సవాలకు ఫ్రెంచి అధికారులు తప్పని సరిగా హాజరయ్యేవారట. ఇది హిందూమతంపై ఉన్న అభిమానం తోనా లేక ఆయా సమయాలలో ఆలయాలలో జరిగే దేవదాశీల నృత్యాలను తిలకించటానికా అన్నది ప్రశ్నార్ధకమే!

## ఆనాటి ఆలయకమిటీలు

యానాంలోని శివాలయం, వెంకటేశ్వర ఆలయాలకు అంతవరకూ నిర్వహణాధికారుగా వ్యవహరించిన మెర్ల సోమయాజులు మరియు శ్రీ కూనంరెడ్డి కృష్ణమ లు దివంగతులవటంతో ఆ ఖాళీలను పూరింపమని, శ్రీ బులుసు సుబ్రహ్మణ్య శాస్త్రులు, ఎస్.వి. నరసయ్య లు ప్రభుత్వానికి విన్నవించటం జరిగింది.

వీరి విజ్ఞప్తుకు స్పందించిన గవర్నరు గారు యానాం దేవాలయాలకు కొత్త కమిటీని ఏర్పరచుకొమ్మని సెప్టెంబరు 1894 లో ఉత్తర్వులు జారీ చేసారు. ఈ ఉత్తర్వు ప్రకారం స్థానిక శివాలయ, వెంకటేశ్వర ఆలయ భక్తులు 1894 సెప్టెంబరు, 16 న వెంకటేశ్వరాలయంలో సమావేశమయి ఇద్దరు కమిటీ మెంబర్లను ఎన్నుకోవాలి, ఈ మొత్తం తతంగమంతా యానాం పోలీసు కమీషనరు గైలాట్ విల్లెట్టె పర్యవేక్షణలో జరుగుతుందని గవర్నరు గారు నిర్ధేసించారు.

పై వివరాలను బట్టి 1894 కు పూర్వమే యానాం ఆలయాల నిర్వహణకొరకు కమిటీలుండేవని అర్ధమౌతుంది. (రి. అఫీషియల్ జర్నల్, సెప్టెంబరు 1894 సంచిక)

## 1767 నాటి ఒక అరుదైన వ్రాత ప్రతి

జీన్ లా దె లారిస్టన్ (**Jean Law de Lauriston**) 1765–1777మధ్య పాండిచేరీకి గవర్నరుగా పనిచేసాడు. అత్యంత సమర్ధుడు, సౌమ్యుడు గా పేరు తెచ్చుకొన్నాడు. ఇతను భారతదేశంలో తన పదవీ కాలంలో రాసుకొన్న డైరీలను ఆధారంగా చేసుకొని రాసిన 'మొఘలు సామ్రాజ్య విశేషాలు' అనే పుస్తకం నేటికీ మొఘలుల పాలన పై ఒక మంచి రిఫరెన్సు గా నిలిచిఉంది.

1758 లో యానాన్ని మొదటి సారిగా బ్రిటిష్ వారు ఆక్రమించుకొన్నారు. 1765 లో యానాన్ని బ్రిటిష్ వారి నుండి తిరిగి చేజిక్కించుకోవటంలో లారిస్టన్ పాత్ర గణనీయమైనది. **ఆ సమయంలో లారిస్టన్ ఉపేక్షించి ఉంటే యానాం ఎప్పటికీ బ్రిటిష్ ప్రాంతం గానే ఉండిపోయేది అనటంలో సందేహం లేదు.**

ఇతను బ్రిటిష్ అధికారులతో సంప్రదింపులు జరిపి యానాం నుండి జరిగే అన్ని

విధించటం మొదలెట్టటంతో 19 వ శతాబ్ధాంతానికి వచ్చేసరికి యానాం వ్యాపారపరంగా తన వైభవాన్ని కోల్పోయింది.

ఈ నోట్‌కు తెలుగు అనువాదం


N° 4 Yanaon

(Law de Lauriston, 1767)

source: http://www.e-corpus.org/

D.F.C. Yanaon, n°4

*"యానాం అనే ఈ ప్రాంతం నుంచి అత్యుత్తమ చేనేత దుస్తులు లభిస్తున్నవి. పరిస్థితులు అనుకూలించినట్లయితే ఇక్కడినుంచి ఏడాదికి పది లక్షల లీవ్ర్ ల (ప్రాచీన ఫ్రెంచి కరెన్సీ. ఒక్కొక్కటి సుమారు నాలుగు వందల గ్రాముల వెండి విలువతో సమానం) విలువైన వ్యాపారం చేయవచ్చును. వస్త్రాలే కాక ఈ ప్రాంతం నుండి టేకుకలప, నూనెలు, ధాన్యం మరియు ఇతర పప్పుధాన్యాలు సేకరించే వాళ్ళం.* 1767 లో లారిస్టన్ వ్రాసుకొన్న ఒక నోట్ లో యానాం ప్రస్తావన ఈ విధంగా ఉంది.

*యానానికి వాణిజ్యపరమైన ప్రాధాన్యతే కాక మరో రకమైన ప్రత్యేకత కూడా ఉంది. బ్రిటిష్‌వారితో మనకు సర్కారు ప్రాంతంలో యుద్ధాలు జరిగే సమయంలో, బ్రిటిష్ వారి పట్ల అసంతృప్తి తో ఉన్న కొందరు రాజుల మద్దతు కూడకట్టు కోవటానికి యానాం ప్రధాన స్థావరంగా ఉండేది. యానానికి మంచి వ్యాపార భవిష్యత్తు ఉంది""""*

ఈ నోట్ లోని అంశాలను గమనిస్తే లారిస్టన్ 1767 లో యానాంలో బస చేసిన సమయంలో వ్రాసినట్లు అనిపిస్తుంది. అంతే కాక ఆనాటి యానాం వ్యాపార సామర్థ్యం, రాజకీయ ప్రాధాన్యం కూడా అర్ధం చేసుకొనవచ్చును.
లారిస్టన్ రాసుకొన్న ఈ నోట్ యానానికి సంబంధించిన అరుదైన పురాతన డాక్యుమెంటు. లా దె లారిస్టన్ గౌరవార్ధం ఫ్రెంచి ప్రభుత్వం పాండిచేరీలోని ఒక ప్రాంతానికి 'లాస్ పేట' అనే పేరు పెట్టింది. అది ఈనాటికీ అదే పేరుతో పిలవబడుతూన్నది.





## ఫ్రెంచి జాతీయఉత్సవాలు – యానాం

ఫ్రెంచి రివల్యూషన్ సమయంలో 1789 జూలై, 14 న బాస్టైల్ అనే కోట ముట్టడి జరిగింది. ఈ సంఘటన ఫ్రెంచి రివల్యూషనును మలుపుతిప్పిన ఘటనగా భావిస్తారు. ఆనాటి ఆ విజయోత్సవాన్ని స్మరించుకోవటానికి 1878 నుంచీ ఫ్రాన్స్ ప్రభుత్వం ప్రతిఏటా జూలై 14 న 'ఫెతె దె నేషనల్' (Fete de Nationale) పేరిట ప్రభుత్వ ఉత్సవాన్ని జరుపుకొంటూంది. దానినే 'బాస్టైల్ డే' అనికూడా అంటారు. 1881 లో యానాంలో జరిగిన ఫెతె దె నేషనల్ గురించిన వర్ణన 1881 జూలై, 28 నాటి Journale Officiale de l'inde Francaise సంచికలో ఈ క్రింది విధంగా ఉంది........

...... పదమూడు సాయింత్రానికల్లా యానాం టవును పండుగ వాతావరణాన్ని సంతరించుకొంది. ప్రతి ఒక్కరి మోహాలలో ఆనందం తాండవిస్తోంది. మున్సిపాలిటీవారు ఎంతో శ్రద్ధ తీసుకొని నగరాన్ని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దారు. ప్రతిచోటా సంతోషం వెల్లి విరుస్తున్నది.

సూర్యుడు ఉదయించగానే తుపాకుల కాల్పులు మొదలయ్యాయి. ఫ్రెంచి జాతీయపతాకం జండాస్థంభం పైకి లేచింది. అది అతిశయంతో గాలిలో రెపరెపలాడుతోన్నది. మన పోలీసులు ఉత్సాహంగా తుపాకులు ధరించి మార్చింగ్ చేసారు. ప్రజలు మిక్కిలి సంతోషంతో 'వీవ్ లె ఫ్రాన్స్, వీవ్ లె రిపబ్లిక్' (Long live France, Long live Republic) అంటూ బిగ్గరగా నినాదాలు చేసారు. వారందరూ ఉన్నంతలో కొత్త దుస్తులు ధరించి ఎంతో ఉల్లాసంగా దేశభక్తిని ప్రదర్శిస్తున్నారు.

పెద్దొర బంగ్లా, పెద్దబజారు వీధి, మేయరీ (మున్సిపాలిటీ) ప్రాంతాలు పూల అలంకరణలతో నిండిపోయాయి. ప్రభుత్వ ఆఫీసులు, ఊరిలోని ప్రముఖుల ఇళ్ళపై ఫ్రెంచి జాతీయ జండాలు ఎగురుతున్నాయి.

ఉదయం ఎనిమిది గంటల సమయానికల్లా కౌన్సిల్ మెంబర్లు, ఆఫీసర్లు, ఉద్యోగులు, పలువురు స్థానిక ప్రముఖులు పెద్దొర బంగ్లాను చేరుకొన్నారు. అక్కడ జరిగిన గొప్ప బహిరంగ సభలో మేయరు శ్రీ బెజవాడ బాపనయ్య యానాం ప్రజల తరపున ఇలా మాట్లాడారు "గౌరవనీయులైన పెద్దొర M. Sice గారికి – యానాంలో ఫెతె దె నేషనల్ జరుపుకోవటం ఇది రెండవసారి. గత సంవత్సరపు వేడుకలు మా మనసులలో ఇంకా సజీవంగానే ఉన్నాయి. సందర్శకుల సంఖ్య పెరిగింది. మన సమీప బ్రిటిష్ ప్రాంత ప్రజలు కూడా ఈ ఉత్సవంలో ఉత్సాహంగా పాల్గొనటానికి పెద్ద సంఖ్యలో వచ్చారు ...... మీ వంటి ఉత్తమ అధికారులను యానానికి పంపిస్తున్నందుకు ఫ్రెంచి గవర్నరు గారికి ధన్యవాదములు తెలియచేసుకొంటున్నాను. 'వీవ్ లె ఫ్రాన్స్, వీవ్ లె రిపబ్లిక్'.

ఆ తరువాత కాపు కులపెద్ద అయిన శ్రీకామిశెట్టి పేరమ ఈ విధంగా మాట్లాడారు "గౌరవనీయులైన పెద్దదొర గారికి, బేయట్ గారి నిష్క్రమణ తరువాత ఏమాత్రం జాప్యం లేకుండా మిమ్మలను ఇక్కడకు పంపటం మాకు ఆనందంగా ఉంది. మీరు కూడా బేయట్ వలే మంచి అధికారిగా పేరు తెచ్చుకొంటారని ఆశిస్తున్నాను. యానాం వాణిజ్య రంగం రోజురోజుకూ కుదేలవుతున్నది. దీనికి ప్రభుత్వపరమైన రాయతీలు ఇవ్వవలసిన అవసరం ఎంతైనా ఉంది.

స్త్రీ విద్య పట్ల ప్రభుత్వం చూపుతున్న ప్రోత్సాహం అభినందనీయం. కానీ ఈ రంగానికి మరిన్ని నిధులు సమకూర్చాలి. ఈ విషయాలను మీరు గవర్నరు గారి దృష్టికి తీసుకువెళతారని ఆశిస్తున్నాను. మిష్టర్ ఛీఫ్ మమ్ములను అభివృద్ధి పథంపైకి నడిపించండి.... 'వీవ్ లె ఫ్రాన్స్.

తరువాత పెద్దొర M. Sice మాట్లాడుతూ, ఈ సూచనలను గవర్నరు దృష్టికి తీసుకువెళతానని – యానాం విద్యారంగాన్ని అభివృద్ధి చేయటానికి కృషి చేస్తానని హామీ ఇచ్చారు.

తదనంతరం మార్కెట్టు వద్దకల క్రీడా స్థలంలో (మన్యవారి మేడ ఎదురుగా ప్రస్తుతం పార్కు ఉన్న ప్రదేశంలో) – నడకపోటీలు, గోనె సంచీలో నిల్చొని చేసేనడక పోటీలు, ఒక కాలు పైకిమడచి కట్టుకొని నడిచేపోటీలు, రెండుకాళ్ళు పాదాలవద్ద కట్టుకొని నడిచేపోటీలు, పిండిపోగులో దాచిన డబ్బుల్ని నోటితో తీసే పందాలు, నూనె రాసిన కర్ర స్థంభం పైకి ఎగబ్రాకే పోటీలు, కోడిపందాలు, పందిని చేతులతో వేటాడటం – వంటి వివిధ వినోద కార్యక్రమాలు Mr. Norton ఆధ్వర్యంలో జరిగాయి. మధ్యాహ్నం గుర్రప్పందాలు, ఈతపోటీలు వంటిపోటీలు జరిగాయి. యానాంలో జరిగే ప్రతి కార్యక్రమానికి తప్పని సరిగా ఉండే 'కళావంతుల మేళాలు' అందరినీ అలరించాయి.

సాయింత్రం అయ్యేసరికి 21 తుపాకుల కాల్పులు, ఫిరంగిమోతలతో యానాం దద్దరిల్లింది. యానాం భవనాలు, ఇళ్ళు దీపాలంకరణలతో ప్రకాశించటం మొదలైంది. ఆ రాత్రి పెద్దొర బంగళాలో గొప్పవిందు జరిగింది. ఆ విందులో యానాం ప్రజా నాయకులు, అధికారులు, ఉద్యోగులు, అనేక మంది స్థానిక ప్రముఖులు పాల్గొన్నారు. అదే సమయంలో కన్నులు మిరుమిట్లు గొలిపేలా బాణాసంచా కాల్చటం జరిగింది. "ఇది ప్రజల ఉత్సవం దీనిలో ప్రజలను తప్పనిసరిగా భాగస్వామ్యులను చేయండి" అన్న గవర్నరుగారి ప్రత్యేక ఆదేశాలననుసరించి– ఆ రోజు రాత్రి వందల సంఖ్యలో వచ్చిన సామాన్య ప్రజలకు అన్న సంతర్పణ, దుస్తుల పంపిణీ జరిగింది.

ఆ విధంగా 1881, జూలై 14 న యానాంలో జరిగిన బాస్టైల్ డే వేడుకలు ముగిసాయి.

## షోల్‌షెర్, మారియన్నె విగ్రహాల ఆవిష్కరణ

14 జూలై, 1887న జరిగిన ఫ్రెంచి నేషనల్ డే సందర్భంగా యానాం మున్సిపల్ హాలులో జరిగిన సమావేశంలో విక్టర్ షోల్‌షెర్ మరియు మారియన్నె విగ్రహాల ఆవిష్కరణ జరిగింది.





(విక్టర్ షోల్‌షెర్ – బానిసత్వ నిర్మూలన కొరకు పోరాడిన ఫ్రెంచి రచయిత మరియు సెనేటర్. మారియన్నె– ఫ్రెంచి జాతీయ చిహ్నం. ఒక సాధారణ ఫ్రెంచి వనిత బస్ట్‌సైజు శిల్పం. ఆమెను గొల్లభామ అని స్థానికులు పిలుచుకొనేవారు. ఆనాడు ఆవిష్కరించబడిన విక్టర్ షోల్‌షెర్ విగ్రహం యానాం మున్సిపాలిటీ భవనంలోను, మారియన్నె విగ్రహం అడ్మినిస్ట్రేటరు ఆఫీసునందు నేటికీ చూడవచ్చును)

ఈ విగ్రహాల తయారీ కోసమని స్థానికులు చందాలు వేసుకొన్నారు. ఆనాడు అలా చందాలు ఇచ్చిన వారి వివరాలు 1885, డిశంబరు 25 నాటి Journale Officiale de l'inde Francaise సంచికలో లభిస్తాయి. 124 మంది చందాదారులు 71 రూపాయిల మొత్తాన్ని సమకూర్చటం జరిగింది. అప్పుడు చందాలు ఇచ్చినవారిలో మోక భూలోకం, పాలెపు సుబ్బారాయుడు, నల్లా రెడ్డిగాడు, కర్రి వెంకటరత్నం, పెయ్యల పాపిగాడు, పందు పుత్రగాడు, మొండి గోవిందు, పినపోతు భైరవస్వామి, కామాడి అప్పాస్వామి, ధన్నార్లకోట సోమలింగం, దున్నా చిన నాగులు, పెమ్మాడి స్వామి, బొల్లోజు పెద బసవలింగం, వంటి అనేక మంది దళిత బహుజనులు కూడా ఉండటం ఆనాటి సామాజిక స్థితికి, చైతన్యానికి అద్దం పడుతుంది.


ఆనాటి మారియన్నె విగ్రహం

ఈ రెండు విగ్రహాలను అప్పటి పెద్దొర అయిన Mr. M. Le ఆవిష్కరించాడు. ఆ సమావేశానికి హాజరయిన అశేష ప్రజలు లాంగ్ లివ్ షోల్‌షెర్, లాంగ్ లివ్ రిపబ్లిక్ అని నినాదాలు చేసారు.

ఆనాటి మేయర్ శ్రీ బెజవాడ బాపనయ్య తన ఉపన్యాసంలో -- టౌనుహాలు భవననిర్మాణం చేయించిన పెద్దొరగారికి, ఉన్నతాధికారులకు కృతజ్ఞతలు తెలియచేసారు. మన అవసరాలను గుర్తించి తీర్చే ఫ్రెంచి ప్రభుత్వ ఔదార్యానికి ఈ భవనం సాక్ష్యంగా నిలచిపోతుందనీ, హాలు మధ్యలో అలంకరించిన షోల్‌షెర్ విగ్రహం మొత్తం టౌనుహాలుకే అందాన్నిస్తుందని– మానవులంతా ఒక్కటేనని ప్రవచించి, నల్లజాతీయుల హక్కుల కోసం పోరాడి బానిసత్వ నిర్మూలనకు జీవితాన్ని అంకితం చేసిన మహనీయుడైన షోల్‌షెర్ విగ్రహాన్ని మన ఊరిలో ప్రతిష్ఠించుకోవటం ఒక అదృష్టంగా భావిస్తున్నానని– అంటూ ప్రసంగించారు.

తరువాత జరిగిన అనేక వినోద క్రీడా సంబరాల అనంతరం ఆరోజు సాయింత్రం పెద్దొర బంగళాలో పెద్ద విందు జరిగింది.

## రినౌన్సర్లు – కథా కమామిషు

భారతదేశంలో ప్రప్రధమంగా సార్వత్రిక ఎన్నికలు నిర్వహించిన ఘనత ఫ్రెంచిప్రభుత్వానికుంది. 1872 లోనే ఫ్రెంచి కాలనీలలోని అర్హులైన పౌరులందరికీ ఓటుహక్కు కల్పించబడింది. కానీ ఎన్నికల పరిణామక్రమంలో ఓటరు లిస్టుల తయారీ మాత్రం అనేక చిత్రమైన మలుపులు తీసుకొంది. మొదట్లో యూరోపియన్లకు ఒకటి, భారతీయులకు మరొకటి అంటూ రెండురకాల ఓటరు లిస్టులు ఉండేవి.

సమానత్వము, సౌభ్రాతృత్వం అంటూ ప్రవచించే ఫ్రెంచి ప్రభుత్వం ఈ విధంగా రెండులిస్టులు తయారు చేసి భారతీయులను వివక్ష కు గురిచేయటాన్ని కొంతమంది నిరసించారు. **"భారతదేశంలోని కాలనీలన్నీ ఫ్రాన్స్ దేశపు అంతర్భాగాలే"** అని పదేపదే చెప్పుకొచ్చే ఫ్రెంచి ప్రభుత్వం, తనకాలనీలలోని ప్రజలందరినీ సమానంగా చూసి ఒకే ఓటరు లిస్టు వర్తింపచేయాలన్న డిమాండ్ ప్రాధాన్యత సంతరించుకొంది.

1880 లలో పాండిచేరీలో రెండు ప్రధాన రాజకీయ వర్గాలుండేవి. ఒకదానికి పొన్నుతంబి, మరొకదానికి షణ్ముగం నాయకత్వం వహించేవారు. 1819 లో జారీ చేసిన ఓ డిక్రీ ప్రకారం భారతీయులను వారి వారి ఆచార వ్యవహారాల ప్రకారం విచారణ జరపవలసి ఉంటుంది. ఫ్రెంచి వారికి మాత్రం ఫ్రెంచి సివిల్ కోడ్ ప్రకారం న్యాయవిచారణ జరిగేది. పొన్నుతంబి వర్గం ఈ డిక్రీని సవాల్ చేస్తూ, ఫ్రెంచి సివిల్ కోడ్‌ను ప్రజలందరకూ వర్తింపచేయాలని డిమాండ్ చేయటం మొదలెట్టింది. అంతే కాక భారతీయులకు తమ "భారతీయత" ను త్యజించి ఫ్రెంచి సివిల్ కోడ్ ను కోరుకొనే 'హక్కు' కల్పించమని ఫ్రెంచి ప్రభుత్వంపై పొన్నుతంబి ఒత్తిడి చేయటం మొదలెట్టాడు.

1881 సెప్టెంబరు, 21 న ఫ్రెంచి ప్రభుత్వం పొన్నుతంబి డిమాండ్ కు తలొగ్గి, భారతీయులు తమ "భారతీయత" ను ఐచ్ఛికంగా త్యజించే హక్కును కల్పించింది. ఆ విధంగా పొన్నుతంబి నాయకత్వంలో భారతీయతను త్యజించటానికి అనేక మంది ముందుకొచ్చారు. వీరిలో అధికశాతం ఫ్రాంకోఇండియన్స్ మరియు క్రిష్టియన్లు. వీరందరినీ Renouncers (త్యజించినవారు) అని పిలిచేవారు. **ఇక్కడ భారతీయతను త్యజించడమంటే మతం మారటం అన్న అర్ధంలో కాక ఫ్రెంచి సంస్కృతి సాంప్రదాయాల పట్ల విశ్వాసం ప్రకటించటంగా అర్ధం చేసుకోవాలి.**

దీనితో సరిపుచ్చుకోని పొన్నుతంబి ఈ రినౌన్సర్లని యూరోపియన్ ఓటరు లిస్టులో చేర్చాలంటూ పోరాటం మొదలెట్టాడు. పొన్నుతంబి తాను రినౌన్సర్ గా మారటమే కాక తనపేరును కూడా "La Porte" అని ఫ్రెంచి పేరుగా మార్చుకొన్నాడు.

ఈ రినౌన్సర్లను మొదటి లిస్టులో (యూరోపియన్‌లిస్టు) లో చేర్చాలా ఒద్దా అంటూ







ఫ్రాన్స్ సెనేట్ లో చర్చ జరిగినపుడు- బానిసత్వ నిర్మూలనకు ఎంతో కృషి జరిపిన షోల్‌షెర్ రినౌన్సర్లను యూరోపియన్ లిస్ట్ లో చేర్చరాదని వాదించటం ఆశ్చర్యకరంగా అనిపిస్తుంది. దానితో ఫ్రెంచి ప్రభుత్వం వీరిని మొదటి లిస్టులో చేర్చకపోగా వీరి కోసమని మరో ఓటరులిస్టును తయారుచేయటం మొదలెట్టింది. ఆ విధంగా పొన్నుతంబి, అతని మిత్రబృందం రెంటికి చెడ్డ రేవడిలా మూడవ లిస్టనే త్రిశంకు స్వర్గంలో తేలారు.

ఇక యానానికి సంబంధించి, 1896 లో 106 మందితో కూడిన రినౌన్సర్‌లతో కూడిన ఒక ఓటరు లిస్టు తయారయ్యింది

ఈ లిస్టులో ఉన్న వారి పేర్లను గమనిస్తే దాదాపు అందరూ దళిత, బహుజనులే కావటం కాకతాళీయం కాకపోవచ్చు. యానాం రినౌన్సర్ల లిస్టులోని 106 మందిలో పల్లీయులు 69, మాలలు 17, మాదిగలు 11, కాపులు 8, రజకులు 1 చొప్పున ఉన్నారు. (రి. Journale Officiale de l'inde Francaise 1896 సంచికలు. కులనామాలను రికార్డులలో ఉన్నట్లు యథాతథంగా వాడటం జరిగింది-రచయిత). ఈ లిస్టులో బ్రాహ్మణులు, వైశ్యులు, ముస్లిములు లేదా అప్పటికి రాజకీయంగా ఆధిక్యతలో ఉన్న ఒక సామాజిక వర్గానికి చెందిన ప్రముఖ కుటుంబీకులు ఎవరూ ఉండకపోవటం అనుమానాస్పదంగా అనిపించక మానదు.

పాండిచేరీలో ఈ రినౌన్సర్ ఉద్యమం ద్వారా ప్రాబల్యం పెంచుకొన్న కొంతమంది నాయకుల ఒత్తిడి మేరకు యానాం నుంచి కూడా కొంతమంది ఓటర్ల పేర్లను వాడుకొని ఈ లిస్టు తయారు చేసి ఉంటారని భావించవచ్చును. **తమ పేర్లు ఇలా "భారతీయత" ను త్యజించిన వారి జాబితాలో చేర్చబడ్డాయి అన్న విషయం వారికి తెలుసో తెలియదో కూడా అనుమానమే!**

స్థానిక ప్రజలను ఈ విధంగా రెండు విధాల ఓటరులిస్టుల ద్వారా విడదీయటంలో (రినౌన్సర్లు, రినౌన్సర్లు కానివారు అంటూ) రాజకీయ లబ్ది చేకూరే అవకాశం లేకపోలేదు ఎందుకంటే అతితక్కువగా ఉండే ఈ రినౌన్సర్ల ఓట్ల ద్వారా ఒక అభ్యర్ధి ఎన్నిక సునాయాసంగా జరిగే అవకాశం ఏర్పడుతుంది.

అలాగ అప్పట్లో కొంతకాలం మూడు రకాల ఓటరు లిస్టులు తయారయ్యేవి. మొదటి రకంలో యూరోపియన్లు, రెండవ లిస్టులో భారతీయులు, మూడవ లిస్టులో రినౌన్సర్లు ఉండే వారు. ఆయా లిస్టులలోని ఓటర్లు వారి ప్రతినిధులకు మాత్రమే ఓట్ చేసే అధికారముంటుంది. అంటే రినౌన్సర్ లిస్ట్‌లో ఉండేవారు మరో రినౌన్సర్ ను మాత్రమే ఎన్నుకోవటానికి ఓటుహక్కు ఉంటుంది తప్ప మొదటి, ఇతర లిస్టుల నుంచి నిలబడిన వారికి తమ ఓటు వేసే అవకాశం ఉండదు.

కానీ యానానికి సంబందించి ఈ రూలు ఖచ్చితంగా పాటించిన సందర్భాలు కనబడవు. ఎందుకంటే కొన్ని సందర్భాలలో బెజవాడ బాపనయ్య మొదటి లిస్టు తరపున (అంటే యూరోపియన్లు మాత్రమే పోటీ చేయాల్సిన లిస్టునుంచి), పైడికొండల వెంకట సుబ్బయ్య,

పుణ్యమూర్తుల నరసింహమూర్తి వంటివారు మూడవ లిస్టు తరపునా (రినౌన్సర్ల లిస్టునుంచి) పోటీ చేసి నెగ్గారు. ఈ ఎన్నికలు చెల్లవంటూ యర్రగుంట వీరాస్వామి తదితరులు కోర్టులో కేసులు వేసారు. అభ్యర్థులు లేని కారణంగా ఆ విధంగా పోటీ చేయటం జరిగిందంటూ, అందులో తప్పేమీ లేదంటూ యానాం కోర్టు ఆ కేసులను కొట్టివేసింది.

భారతీయతను త్యజించటం ద్వారా అన్నికులాలు ఏకమయి మొత్తం ప్రజలందరూ ఫ్రెంచి సివిల్ కోడ్ పరిధిలోకి వస్తారని పొన్నుతంబి ఆశించాడు. అంతేకాక అంచెలంచెల హిందూ వర్ణవ్యవస్థను రూపు మాపటానికి ఇదొక సదవకాశంగా భావించాడు. కానీ వేల సంవత్సరాలుగా భారతీయులను శాసిస్తున్న వర్ణవ్యవస్థ అంత సులభంగా కూలటం సాధ్యమయ్యే పనేనా! షణ్ముగం నాయకత్వంలోని మరో వర్గం యధాతధ స్థితిని కొనసాగించాలన్న అభిప్రాయాన్ని వెలిబుచ్చేది.

1899 సెప్టెంబరు 10న జారీచేసిన ఓ డిక్రీ ద్వారా ఫ్రెంచి ప్రభుత్వం రినౌన్సర్ లిస్టులను రద్దు పరచింది. అంతవరకూ రినౌన్సర్లుగా ఉన్నవారిని మొదటిలిస్టులో కలిపివేసారు. ఆ విధంగా భారతీయతను ఐచ్ఛికంగా త్యజించిన వారందరికీ ఎట్టకేలకు యూరోపియన్ ఓటరు లిస్టులో స్థానం లభించింది. ఇదే డిక్రీ ద్వారా యానాంలో యూరోపియన్ల సంఖ్య అతి స్వల్పంగా ఉండటంచే యానానికి సంబంధించి యూరోపియన్ ఓటరు లిస్టును కూడా రద్దు చేసారు. అలా 1899 నుంచీ యానాం ఓటర్లు అందరూ ఒకే ఓటరు లిస్టులో ఉండటం మొదలైంది. పాండిచేరీలో మాత్రం రెండు ఓటరు లిస్టుల పద్దతి 1946 లో రద్దు పరచేవరకూ కొనసాగింది.

## యానాంలో జరిగిన సతీసహగమన దురంతం

C.P.T. Laplace (1793-1875) ప్రపంచాన్ని చుట్టివచ్చిన ఫ్రెంచి యాత్రికుడు. ఇతను La Favorite అనే షిప్పులో ప్రయాణించి తన ప్రపంచ పర్యటన విశేషాలను "Voyage au tour du monde" (Travel around the world) అనే పుస్తకంలో గ్రంధస్థం చేసాడు.

లాప్లాస్ 28 జూన్, 1830 న మద్రాసు నుండి యానాం బయలుదేరి జూలై 16 న కోరంగి చేరుకొన్నాడు. అక్కడ లాప్లాస్ తన షిప్పును మరమ్మత్తుల కొరకు ఇచ్చి పల్లకి పై యానాం బయలు దేరాడు. దారిపొడవునా ఉన్న పచ్చని చెట్లు, వరిపొలాల సౌందర్యానికి ముగ్ధుడనయ్యానని, ఇక్కడి ప్రజల నిర్మలత్వము, మర్యాద ఎంతగానో ఆకర్షించాయని, తాను పాండిచేరీలో ఎటువంటి ఆతిథ్యాన్ని పొందాడో అంతే ఆప్యాయతను అప్పటి యానాం పెద్దొర లాస్పార్డా నుంచి పొందానని తన పుస్తకంలో వర్ణించాడు.

లాప్లాస్ తన షిప్పు మరమత్తులు ముగిసేవరకూ దాదాపు ఇరవై రోజుల పాటు యానాంలో బస చేసాడు. ఆ సమయంలో యానాం పడవలరేవు, కొంతమంది ఆటకత్తెల







తైలవర్ణ చిత్రాలను రచింప చేయించాడు. కోరంగి రేవులో అప్పట్లో భారీస్థాయిలో ఎగుమతులు దిగుమతులు జరిగేవి. ఇక్కడ షిప్పుల మరమత్తులు కూడా జరిగేవి. లాప్లాస్ ఈ ప్రాంతంలో అధికసంఖ్యలో ఉన్న భోగం స్త్రీలలో చాలామందికి లైంగిక వ్యాధులు ఉన్నాయని గ్రహించి, తన షిప్పుసిబ్బందిని వారివద్దకు వెళ్లవద్దని సలహా ఇచ్చాడట. ఇతని గౌరవార్ధం యానాం పెద్దొర ఏర్పాటుచేసిన నృత్యప్రదర్శనలో 'కాళీయమర్ధనం' అనే నృత్యరూపకం ఎంతగానో ఆకర్షించినట్లు తెలిపాడు. అంతేకాక యానాం నాట్యకత్తెల చలాకీతనం, నృత్యభంగిమలు తాను ఎప్పటికీ మరచిపోలేనని రాసుకొన్నాడు.

**లాప్లాస్ 1830 లో రచింపచేసిన యానాం నాట్యకత్తె చిత్రం**




అప్పట్లో యానాంలో జరిగిన సతి దురాచార సంఘటనను (చనిపోయిన భర్త చితిపై అతని భార్యను సజీవ దహనం చేసే ఆచారం) లాప్లాస్ తన పుస్తకపు 298-300 పేజీలలో వర్ణించాడు. ఈ సంఘటన యానానికి సంబంధించి అత్యంత దిగ్భ్రాంతిని కలిగించేదిగా చరిత్రలో మిగిలిపోయింది.

లాప్లాస్ వర్ణించిన ఆనాటి ఆ ఉదంత ఉరామరి అనువాదం....

భర్త చితిపై భార్యను సజీవదహనం చేసే దారుణమైన సంఘటన ఈ ప్రాంతంలో మా రాకకు కొంతకాలం క్రితవే జరిగింది. సతీసహగమనం జరిగిన ప్రదేశం వద్ద ఇప్పుడు నాలుగు కర్రలతో నిర్మించిన ఒక పందిరి ఉంది. దాని మధ్యలో రాతితో చేసిన ఎత్తయిన ఫలకం ఏర్పాటు చేసారు. దానికి పూలు, పసుపు కుంకుమలతో పూజలు చేస్తున్నారు. ప్రజలు తండోప తండాలుగా వచ్చి ఆ ప్రదేశాన్ని దర్శిస్తున్నారు.

అప్పటికి ఒక నెల క్రితం భర్తను కోల్పోయిన ఓ బ్రాహ్మణ స్త్రీ ని సతీసహగమనం చేయించాలని కులపెద్దల నిర్ణయం జరిగాక ఇక ఊరిలో ఒక రకమైన ఉన్మత్త వాతావరణం అలముకొంది. ఇప్పుడు పందిరి ఉన్న స్థానంలో, ఎండుకర్రలు సాంబ్రాణిలతో ఆమె కొరకు

ఎనిమిది అడుగుల లోతైన చితి ఏర్పాటు చేయబడింది.

పిన్నవయసులోనే ముసలి భర్తను కోల్పోయిన ఆ బ్రాహ్మణ వితంతువు తెల్లని దుస్తులు, ఒంటినిండా నగలు ధరించి, పురోహితుల మంత్రోచ్చారణల నడుమ నడుచుకొంటూ ఆ చితిని సమీపించింది. ఆ అభాగ్యురాలి వెనుక అశేషజనవాహిని వెంబడించింది. ఆమె అందమైన మొఖంలో కళ లేదు. అలసిపోయినట్లు ఉంది. కళ్లల్లో కాంతి లేదు. నడుస్తున్నప్పుడు కాళ్ళు తడబడుతున్నాయి. బహుసా పూజ పేరిట ఆమెచే తాగించిన మత్తు పానీయాల ప్రభావం కావొచ్చు. చితి వేదికపైకి ఆ అమ్మాయిని ఎక్కించారు. ఆమె చుట్టూ ఉన్న మహిళలు ఆమె వేసుకొన్న నగలను తొలగించి పురోహితులకు అందించగా, వారు వాటిని పంచుకొన్నారు. మంత్రోచ్చారణల స్వరం పెరిగింది. ఆమెను కీర్తిస్తూ శ్లోకాలు చదువుతున్నారు. వాటికి ఆమె ఒక్కసారిగా పిచ్చి ఉద్రేకానికి లోనై చితిలోకి దూకేసింది. మిన్నంటిన భాజా భజంత్రీల శబ్దాలలో ఆమెచేసే ఆక్రందనలు కలసిపోయాయి. పెద్ద మొత్తాలలో ఆజ్యం, సాంబ్రాణిలు చితిపై కుమ్మరించటం వల్ల ఎగసిన మంటలు, పొగల మధ్య ఆ నిర్భాగ్యురాలి కదలికలు కనుమరుగయ్యాయి............ అంటూ ఆనాడు యానాంలో జరిగిన సతీదహన దురంతాన్ని లాప్లాస్ తనపుస్తకంలో వర్ణించాడు.

షిప్పు రిపేరు పూర్తవటంతో లాప్లాస్, ఆగస్టు 2 న యానాంనుంచి బయలు దేరి సింగపూరు వైపు బయలు దేరివెళ్ళిపోయాడు.

**విశ్లేషణ:** భారతదేశంలో సతీసహగమన దురాచారం ఎక్కువగా బెంగాలు, రాజస్థాన్ ప్రాంతాలలో కనిపించేది. బెంగాలు ప్రెసిడెన్సీ లో 1813 నుంచి 1828 మధ్య మొత్తం ఎనిమిదివేలకు పైగా సతీదహనాలు జరిగాయి. రాజారామ్మోహన్ రాయ్ వంటి సంఘసంస్కర్తల విజ్ఞప్తులకు స్పందించిన బ్రిటిష్ ప్రభుత్వం ఈ దురాచారం పై ఉక్కు పాదం మోపి కట్టడిచేయగలిగింది.

ఈ సందర్భంగా చార్లెస్ నేపియర్ సతీ దహనంపై చేసిన ఒక కామెంటు ద్వారా ఆనాటి పరిస్థితులను అర్ధం చేసుకొనవచ్చును. *"విధవలయిన వారిని భర్త చితిపై పడేసి కాల్చేయటం మీ ఆచారమంటారు. సరే బాగుంది. మాకూ ఒక ఆచారముంది. ఎవ్వరైన ఒక స్త్రీని సజీవంగా దహనం చేస్తే, వారి మెడకు ఒక తాడు బిగించి ఉరివేస్తాము. మీరు సతీదహన చితిని పేర్చుకోండి, దాని పక్కనే మా వడ్రంగులు ఉరికొయ్యలను నిర్మిస్తారు. మీ ఆచారం మీరు పాటించుకోండి, మా ఆచారం మేం పాటిస్తాం"* -- చార్లెస్ నేపియర్, బ్రిటిష్ జనరల్.

ఇక ఫ్రెంచి వారి విషయానికి వస్తే పద్దెనిమిదవ శతాబ్దాంతంలో జరిగిన ఫ్రెంచి రివల్యూషన్ లో స్త్రీల హక్కుల గురించి చేసిన ఉద్యమం, స్త్రీల పట్ల ప్రపంచ దృక్పథాన్ని మార్చివేసిందనటంలో సందేహం లేదు. అందుకనే 1829 లో బ్రిటిష్ వారు సతీదురాచారాన్ని నిషేదింటానికి ముందే ఫ్రెంచివారు తమ కాలనీలలో (ముఖ్యంగా చంద్రనాగూరు) ఈ






దురాచారాన్ని అంతమొందించటానికి చట్టం చేసారు.

యానాంలో జరిగినట్లు లాప్లాస్ చెపుతున్న ఈ దురాచారం గురించి మరెక్కడా ఏ విధమైన సమాచారం లభించదు. ప్రపంచ చరిత్రలో మానవహక్కుల గురించి గొప్ప పోరాటం జరిపి ప్రపంచానికే మార్గదర్శకులుగా నిలచిన ఫ్రెంచి వారి పాలనలో చోటుచేసుకొన్న ఈ ఉదంతం పట్ల వారి స్పందన కూడా తెలియరాదు. అప్పటి ఫ్రెంచి అధికారులు ఈ దుశ్చర్యను నిలువరించకపోవటం ఆశ్చర్యకరంగా అనిపించకమానదు.

సతీదహన ప్రదేశం ఒక సందర్శనాస్థలంగా మారి ప్రజల పూజలందుకొంటున్నట్టు లాప్లాస్ వర్ణించాడు. ఆనాటి ఆ వికృతకృత్యపు ఆనవాళ్ళు గుడిరూపంలోనో లేక మరోలానో నేడు లేకపోవటం బహుశా కాలం కూడా ఆ హేయమైన చర్యకు సిగ్గుపడి ఆ ఆనవాళ్ళను చెరిపేసి ఉంటుందని భావించుకోవాలి.

లాప్లాస్ లాగ యానాన్ని సందర్శించిన ఫ్రెంచి యాత్రికులు మరో ఇద్దరు ఉన్నారు. De Surville అనే ఆయన మార్చి 1766 లో యానాన్ని సందర్శించి కొద్దిరోజులు ఇక్కడే బసచేసాడు. St.Jean అనే యాత్రికుడు, బాప్టిస్టే అనే షిప్పుపై భారతదేశ సందర్శనలో భాగంగా 1769 లో యానాం వచ్చాడు. కానీ వీరెవరూ లాప్లాస్ లా తమ అనుభవాలను గ్రంథస్థం చేయలేదు.

## యానాంకు చైనా బంగారం

యానాంలో జరుగుతున్న వ్యాపారానికి కావలసిన ధనం కొరకు స్థానికంగా టంకశాలను ఏర్పాటు చేసుకోవటానికి కావలసిన అనుమతు లను ముస్లిం పాలకులనుండి ఫ్రెంచి వారు పొందారు. దరిమిలా యానాం లో మూడు స్వాముల పగోడాల (నాలుగు గ్రాములుండే బంగారు నాణాలు) ముద్రణ జరిగేది. కానీ రోజు రోజుకూ యానాంనుంచి జరిపే వ్యాపారం పెరిగిపోతూండటంతో నాణాల ముద్రణకు బంగారం సరఫరా చేయలేక ఫ్రెంచి ఈస్ట్ ఇండియా కంపనీ కటకటలాడి పోయేది.

జూన్ 9, 1738 న జరిగిన ఒక సమావేశంలో ఫ్రెంచి ఈస్ట్ ఇండియా కంపనీ అధిపతులు - St. Benoist అనే షిప్పు ద్వారా 30 వేల డాలర్లు (వెండి నాణాలు) చైనా పంపించి బంగారం కొని వెంటనే యానాం పంపించాలని నిర్ణయం తీసుకొన్నారు. ఈ మొత్తం వ్యవహారాన్ని పర్యవేక్షించటానికి Mr. Signard అనే ఫ్రెంచి వ్యాపారిని నియమించారు.

జూలై 24, 1739 న తీసుకొన్న మరో నిర్ణయంలో 60 వేల డాలర్ల విలువచేసే బంగారాన్ని చైనా నుంచి తెప్పించి యానాంకు అత్యవసరంగా సరఫరా చేయాలని తీర్మానం చేసుకొన్నారు. (రి. Process vebaux de deliberatios du council souverain de la companie de indes - ఫ్రెంచి ఈస్ట్ ఇండియా కంపనీ కౌన్సిల్ నిర్ణయాలు అనే పుస్తకం నుండి)

పై వివరాలను బట్టి అప్పట్లో యానాం వ్యాపారపరంగా ఎంత ఉచ్ఛస్థితిలో వెలిగిపోయిందో అర్ధమౌతుంది. అంతే కాక యానాం పగోడాలు మద్రాసులో బ్రిటిష్ వారు ముద్రిస్తున్న పగోడాల కంటే ఎక్కువ నాణ్యంగా ఉండేవని ప్రఖ్యాతికెక్కడంతో వీటికొరకు డిమాండ్ ఎక్కువగా ఉండేది. వ్యాపారం మాట పక్కన పెడితే, ఇలా నాణాల ముద్రణ ద్వారా ఫ్రెంచి కంపనీకి పది శాతం లాభం ఉండేదట.

## ఫ్రెంచివిప్లవ సమయంలో (1789-1799) యానాంలో ఏం జరిగింది?

1790 లలో ఫ్రెంచివిప్లవం జరిగింది. ఫ్రెంచి రాజు అయిన పదహారవ లూయిని గిలిటన్ ద్వారా వధించటంతో రాజరిక వ్యవస్థకు తెరపడి ప్రజారాజ్య స్థాపనకు దారితీసింది. ఇది ప్రపంచ చరిత్రలో మానవజాతిని ప్రభావితం చేసిన అరుదైన ఘటన. ఫ్రెంచి కాలనీలలో ఒకటిగా ఉన్న యానాం ఈ విప్లవ సమయంలో ఏ విధంగా స్పందించిందో గమనిస్తే కొంచెం నిరాశే కలుగుతుంది. బహుశా ఫ్రాన్స్ లో ఉవ్వెత్తున ఎగసిపడుతున్న విప్లవజ్వాలల గూర్చిన సమాచారం యానాం చేరటానికి నెలల సమయం పట్టటం అనేది కారణం కావొచ్చు.

ఈ సమయంలో యానాం వాణిజ్యపరంగా ఉచ్ఛస్థితిలో ఉంది. ప్రతీ ఏటా రెండు లక్షల మౌండ్ల ఉప్పు యానాం నుంచి బెంగాలుకు ఎగుమతి అయ్యేది. (ఒక మౌండ్ సుమారు 12 కేజీలు). ఇక్కడ నుండి ఎగుమతి అవుతున్న దుస్తులు ఫ్రాన్స్ లో అత్యంత విలాసవంతమైనవిగా అమ్ముడుపోతున్న కాలమది. ఇలాంటి పరిస్థితులలో యానాం ప్రజలు వ్యాపారానికే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చారు తప్ప విప్లవాన్ని పట్టించుకొన్నట్లు కనిపించదు. ఫ్రెంచి విప్లవం తాలూకు వార్తలు క్రమక్రమంగా యానాం చేరుతున్నాయి.


యానాంలో ముద్రించ బడిన మూడు స్వాముల బంగారు నాణెం

1791 జూలై, 5 న పాండిచేరీ ప్రజలు సమావేశమయి వారినుంచి 21 మందిని ఎన్నికచేసుకొని 'కలోనియల్ అసెంబ్లీ' ని ఏర్పాటుచేసుకోవాలని నిర్ణయించుకొన్నారు. ఆ విధంగా ఫ్రెంచి ఇండియాలో ప్రధమ ప్రజాస్వామ్యిక వ్యవస్థ ఏర్పాటుకు శ్రీకారం చుట్టబడింది. మొత్తం ఇరవైయొక్క మందిలో 15 మంది పాండిచేరీ నుంచి, ముగ్గురు చంద్రనాగూరునుంచి, మాహె కారైకాల్ మరియు యానాం ల నుంచి ఒక్కొక్కరు చొప్పున అభ్యర్ధులుంటారని తీర్మానం చేసుకొన్నారు. ప్రతీ రెండు సంవత్సరాలకు ఈ అభ్యర్ధుల పదవీకాలం ముగిసిపోతుందనీ–అప్పుడు కొత్త సభ్యుల ఎన్నిక జరుపుకోవాలని నిర్ణయించారు. మరో





ఫ్రెంచికాలనీగా ఉన్న మచిలీపట్నాన్ని యానానికి అనుసంధానం చేసారు. ఈ కాలంలో Burilhon, Bouvard, Braincourt, Bury వంటివారు ఈ కలోనియల్ అసెంబ్లీకి యానాం తరపున ప్రాతినిధ్యం వహించారు.

ఫ్రాన్స్‌లో రూసో, వోల్టయిర్ బోధనలతో ప్రభావితమై జరుగుతున్న విప్లవ మహోద్దేశాలు గ్రహించక, యానాంలోని ఫ్రెంచి వ్యాపారులు అప్పటి పెద్దొర అయిన సొన్నరెట్ పై తిరుగుబాటు లేవదీసారు. అదికూడా తమ వ్యాపారాలకు అడ్డుతగులుతున్నాడన్న అల్పకారణాలవల్ల కావటం హాస్యాస్పదంగా అనిపించక మానదు. అప్పటి యానాం ఫ్రెంచి వ్యాపారులు సొన్నరెట్ లో నిరంకుశ రాచరిక ప్రతినిధిని చూసారో ఏమో! అతని పోలీసు, జుడిషియల్ అధికారాలను ఊడపీక్కొని అతని జీతం కూడా తగ్గించి వేసారు. (ఈ ఉదంత వివరాలను ఇదే పుస్తకంలో యానాన్ని పాలించిన పెద్దొరలు అనే చాప్టరులో విపులంగా చదువగలరు– రచయిత). సొన్నరెట్ ను పదవీచ్యుతుడిని చేసి 'యాక్టివ్ సిటిజెన్స్ అసెంబ్లీ' పేరిట ఒక ప్రజాస్వామ్యయుత సంస్థను ఏర్పాటుచేసి పరిపాలన సాగిద్దామని యానాం వ్యాపారులు ప్రయత్నించినట్లు తెలుస్తుంది. ఈ సంస్థను ఏర్పాటు చేసినవారిలో Audet, Bayet, Besnier, Boucher, Danzas, Delaurens, Fermier, Latouche, Le Canne, de Mars, Mariette వంటివారు ప్రముఖులు.

యానాం చేనేత కళాకారులు నేసిన గోడకు వేలాడదీసుకొనే ఓ కళారూపం



ఫ్రెంచి వ్యాపారులు ఫ్రాన్స్‌లో జరుగుతున్న ఫ్రెంచి విప్లవానికి ఎలా ప్రభావితం అయ్యారో స్పష్టంగా చెప్పలేం కానీ, యానాం స్థానిక ప్రజలు మాత్రం ఇక్కడి ఫ్రెంచి వారికి **"లోకల్ విప్లవం"** రుచి చూపించిన సంఘటన ఇదే సమయంలో జరగటం కాకతాళీయమే! యానానికి

చెందిన ఒక బ్రాహ్మణ వ్యాపారిని పిథోయిస్ అనే ఓ ఫ్రెంచి దేశస్థుడు చెప్పు తీసుకొని బెదిరిస్తూ ఇంటినుంచి గెంటివేయటం పట్ల ఉగ్రులైన స్థానికులు వందల సంఖ్యలో గుమిగూడి కత్తులు, బరిసెలతో ఫ్రెంచి దేశస్థుల ఇళ్లపై దాడులకు సిద్ధమయ్యారు. పరిస్థితి అదుపు తప్పటంతో 16 అక్టోబరు, 1791 న సొన్నరెట్ బహిరంగ సభ ఏర్పాటుచేసి, పిథోయిస్ చేత క్షమాపణ చెప్పించటం ద్వారా స్థానికులను సంతృప్తిపరచి, అంతవరకూ తనకు వ్యతిరేకంగా వ్యవహరించిన వారికి కూడా రక్షణ కల్పించి, పరిస్థితిని చాకచక్యంగా తిరిగి తనవైపుకు తిప్పుకొన్నాడు. 1793 లో యానాన్ని బ్రిటిష్ వారు ఆక్రమించుకోవటం వల్ల ఆ తదుపరి జరిగిన వివరాలు తెలియరావు.

ఫారే అనే ఫ్రెంచి వ్యాపారి తనవద్ద పనిచేస్తున్న చిత్రకారులకు (దుస్తులపై రంగుల అద్దకం పని విరివిగా జరిగేది) కరువు కారణంగా బియ్యం దొరకక పస్తులుంటున్నారని, పాండిచేరీ నుంచి బియ్యం పంపించ వలసినదిగా అప్పటి గవర్నరయిన ఫ్రెస్నెను కోరినట్లు, 23 ఏప్రిల్,1792 న వ్రాసిన ఒక లేఖ ద్వారా తెలుస్తుంది. ఫారే అభ్యర్ధన మేరకు గవర్నరు గారు పాండిచేరీ నుంచి ఒక షిప్పు లో బియ్యాన్ని యానాం పంపించారు. పై సంఘటనను బట్టి ఆ సమయంలో యానాంలో వ్యాపారాలు భారీస్థాయిలో జరుగుతున్నప్పటికీ తీవ్రమైన కరువు పరిస్థితులు నెలకొని ఉండేవని అర్ధమౌతుంది.

## ఫ్రాన్స్ మ్యూజియంకు చేరిన యానాం రొయ్యలు

1845 లో అప్పటి యానాం పెద్దొర అయిన జోర్డైన్ యానాం నది ఒడ్డున సాయింత్రపు వ్యాహ్యాళి చేస్తున్నపుడు, ఒక చిన్న అమ్మాయి సుమారు రెండడుగుల పొడవు ఉన్న వింత రొయ్యను పట్టుకొని ఇంటికి తీసుకువెళుతున్నదట. అంత పెద్ద రొయ్యను జోర్డైన్ అంతవరకూ చూసి ఉండకపోవటంతో, అలాంటి జీవులను పట్టుకు రమ్మని కొందరు బెస్తవారికి పురమాయించాడు. వాళ్ళు వలల సాయంతో ఓ యాభై అరవై అలాంటి రొయ్యలను పట్టుకొని జోర్డైన్ వద్దకు తీసుకొచ్చారు. అంత పెద్ద పెద్ద రొయ్యలను అంతవరకూ తాము కూడా చూడలేదని ఆ బెస్తవారు అన్నారట. గోదావరి అలజడిగా ఉన్న కారణంగా ఈ జీవులు ఇలా ఒడ్డుకు కొట్టుకొని వచ్చి ఉండొచ్చని అందరూ అభిప్రాయ పడ్డారు. జోర్డైన్ వాటిని ఫార్మాలిన్ లో భద్రపరిచాడు.

ఫ్రాన్స్ కు చెందిన జంతుశాస్త్ర పరిశోధకులు యానాం వచ్చినపుడు జోర్డైన్ ఆ వింతరొయ్యలను వారికి చూపించాడు. వారు వాటిని *Palaemon carcinus* గా గుర్తించారు. (ఈ పేరును తరువాత *M.rosenbergii* గా మార్చారు. దీనిని తెలుగులో నీలకంఠ రొయ్య అంటారు. ఇది గోదావరి పరీవాహక ప్రాంతాలలో లభిస్తుంది). జోర్డైన్ అలా సేకరించి భద్రపరచిన ఆ వింత రొయ్యలను రెండేసి చొప్పున ఫ్రాన్స్ మ్యూజియంకు, బోర్డక్స్ మ్యూజియంకు, రోవెన్ మ్యూజియంకు పంపించి మిగిలినవి మిత్రులకు బహూకరించాడట. (రి. 1846 నాటి





Review Zoologique పత్రిక)

ఫ్రెంచి నాచురలిస్టు Guerin Meneville (1799-1874)తన జీవితకాలంలో ప్రపంచవ్యాప్తంగా పర్యటించి అనేక జీవజాతులను గుర్తించి నామకరణం చేసాడు. ఇతను వ్రాసిన “Biota of France and French Colonial Territories” అనే పుస్తకం ప్రముఖమైనది. ఈ పుస్తకంలో మెనివిల్లి యానాంలో ఒక కొత్త జీవిని కనుగొన్నట్లు పేర్కొన్నాడు. దానికి *Callianassa haemata (yanaon)* అని నామకరణం చేసాడు. ఇది ఒక రకమైన రొయ్య జాతికి చెందిన జీవి. ఆ విధంగా యానాం ఊరి పేరు ఒక జీవి శాస్త్రీయనామంలో చోటుచేసుకోవటం జరిగింది. (రి. Proceedings of the Academy of Natural Sciences Vol 145-1994 Page No. 37)

## అదనపు జడ్జిలుగా స్థానికపెద్దలు

అప్పట్లో యానాం కోర్టు తీర్పులలో ఫ్రెంచి జడ్జికి సహాయపడటానికి కొందరు స్థానిక పెద్దలను సలహాదారులుగా ప్రభుత్వం నియమించేది. ఈ పద్దతి పాండిచేరీలో 1848 నుంచీ మొదలైంది. ఏదైనా ఒక కేసులో విచారణ జరిపేటపుడు స్థానిక ఆచారాలకు, కుల కట్టుబాట్లకు ప్రాధాన్యత ఇవ్వాలనే ఉద్దేశంతో ఫ్రెంచి ప్రభుత్వం ఆయా వర్గాలకు చెందిన పెద్దల సహాయం తీసుకొనేది. వారు చేసే సూచనలు, సలహాలకు అనుగుణంగా తీర్పులు చెప్పబడేవి. స్థానిక పెద్దొర సిఫార్సుల మేరకు వీరి నియామకం జరిగేది. వీరిని సహాయక జడ్జిలు/అదనపు జడ్జిలు అని పిలిచేవారు. వీరు ఆనాటి సమాజంలో పెద్దలు, మర్యాదస్తులుగా చలామణీ అవుతున్న వారిగా అర్ధం చేసుకోవాలి.

(ఆనాటి సమాజంలో వివిధ కాలాలలో పెద్దమనుషులుగా పేర్గాంచిన వారి గురించి తెలుసుకోవటానికి ఉపయోగపడుతుందనే ఉద్దేశంతో వారి పేర్లను యధాతధంగా ఇక్కడ ఇవ్వటం జరిగింది. గమనించగలరు. వీటికి రిఫరెన్సులు ఆయా సంవత్సరాల Journale Officiale de l'inde Francaise సంచికలు)

### 1883

బళ్ల లక్ష్మయ్య, ఎర్రంశెట్టి పద్మరాజు, కాపగంటి పెదమంగరాజు, కామాడి అప్పాస్వామి, శిదల సన్యాసయ్య, కాళ్ల వెంకటరత్నం, కామిశెట్టి పేరమ, గిరి వెంకటరామయ్య, మెర్ల పెరియ సోమయాజులు, కామాడి మీరయ్య, సమతం కృష్ణయ్య, షేక్ లాలా, మారేటి వెంకటరత్నం, ఎర్రగుంట వెంకన్న, మహమ్మద్ అబ్దుల్ ఖాదిర్, కోన వెంకటరత్నం, కసిరెడ్డి సుబ్బారాయుడు, కాపగంటి చిన మంగయ్య, కంతేటి సత్య ప్రసన్నం, సత్తర్ సాహెబ్, నాగసూరి భామయ్య, పెన్నాడ సుబ్బారాయుడు, పైడికొండల సుబ్బయ్య, దేవగళ్ళ సుబ్బారాయుడు, బొల్లోజు బసవలింగం, కసిరెడ్డి బ్రహ్మానందం, వర్ధినీడి బాపనయ్య.

### 1891

అబ్దుల్ రెహ్మాన్, బళ్ల సుబ్బయ్య, బేయట్ (ఈయన యానాం పెద్దొరగా పని చేసి రిటైర్ అయిన తరువాత ఇక్కడే సెటిల్ అయ్యారు), బెజవాడ బాపనయ్య, కామిశెట్టి పేరమ,

పైడికొండల కృష్ణయ్య, పుణ్యమూర్తుల నరసింహమూర్తి, సమతం కృష్ణయ్య, దరియా ఖాన్, గిరి మాధవరావు నాయుడు.

**1899**

ఎమ్. క్లాపర్‌నూన్ (రెవిన్యూ అధికారి), చార్లెస్ యూజీన్ (సెంట్రల్ బాయిస్ స్కూల్ హెడ్ మాస్టర్), బెజవాడ వెంకటరెడ్డి, గిరి మాధవరాయుడు, పుణ్యమూర్తుల నరసింహమూర్తి, వర్ధినీడి అయ్యప్పనాయుడు, కామిశెట్టి పేరమ, ముంతాజ్ మహమ్మద్, తోట రమణ, సమతం వెంకటరత్నం.

**1933**

జిక్రియా మొహమ్మద్, సి. రాజ కనబాడి (నోటరీ), బులుసు సుబ్రహ్మణ్య శాస్త్రులు, లాల్ మొహమ్మద్ ఖాన్, బెజవాడ బాపనయ్య, సమతం లక్ష్మీ నరసయ్య, తోట నరసింహమూర్తి, గిరి బలరామ స్వామి, నాగసూరి వెంకటరాజు, షేక్ మొహమ్మద్ హుస్సేన్.

1883 నాటి లిస్టులో ఉన్నంత భిన్న కులాల ప్రాతినిధ్యం తరువాత తరువాత కొరవడటం గమనించవచ్చు. సమాజంలోని భిన్న వర్గాలను ప్రతిబింబించాల్సిన జాబితా కాలక్రమేణా అప్పట్లో రాజకీయంగా ఆధిపత్యంలో ఉన్న కులానికి చెందిన వారితో నిండిపోవటం గమనార్హం. మొదటి లిస్టులో ఉండిన సుమారు ఇరవైశాతం బహుజనుల ప్రాతినిధ్యం తరువాత పూర్తిగా అదృశ్యమైంది.

## మెడల్స్ మరియు హానర్స్

ఉత్తమ సేవలందించిన ఉద్యోగులకు ఫ్రెంచి ప్రభుత్వం ప్రోత్సాహకాలను ఇచ్చేది. బంగారు పతకాన్ని ఫస్ట్‌క్లాస్ మెడల్ అని, వెండిపతకాన్ని సెకండ్ క్లాస్ మెడల్ అని కాంశ్య పతకాన్ని తర్డ్ క్లాస్ పతకమని అనేవారు. ఇవి కాక లైఫ్ టైం అచ్చీవ్‌మెంట్ అవార్డు లాంటి 'షెవాలియర్' అవార్డు ఇచ్చేవారు.

యానాం నుంచి ఇవి ఎక్కువగా అత్యంత ధైర్యసాహసాలు కనపరచిన పోలీసులకు దక్కేవి. ఆ తరువాత ఎడ్మినిస్ట్రేటర్ ఆఫీసులో పెద్దొరకు అత్యంత విశ్వసనీయంగా పనిచేసిన వారికి వచ్చేవి. వివిధ కాలాలలో ఈ అవార్డులు దక్కించుకొన్న వారి వివరాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

1865 యానాం అల్లర్లను అదుపుచేయటంలో వీరోచితంగా వ్యవహరించి గాయపడిన పోలీసు షేక్ మహమ్మద్ గోల్డ్ మెడల్ పొందారు. ఇంతకు పూర్వం యానాం నుంచి ఇలాంటి గౌరవం దక్కించుకొన్నవారి వివరాలు తెలియరావు.







| గ్రహీత పేరు | సంవత్సరం | ఉద్యోగం | అవార్డు |
|---|---|---|---|
| మొహమ్మద్ అబ్దుల్ | 1891 | ప్రభుత్వ లేఖరి | బంగారు పతకం |
| శింగంశెట్టి కనకరత్నం | 1912 | ప్రభుత్వ లేఖరి | బంగారు పతకం |
| లాల్ మహమ్మద్ దరియాఖాన్ | 1912 | క్లర్కు | బంగారు పతకం |
| నక్కిరెడ్డి హనుమంతరాయుడు | 1913 | పోలీసు | బంగారు పతకం |
| షేక్ అహ్మద్ | 1913 | బ్రిగేడియర్ | కాంస్య పతకం |
| షేక్ ముర్తుజా | 1913 | కోర్టు ఉద్యోగి | రజిత పతకం |
| మొహమ్మద్ హుస్సేన్ | 1914 | ప్రభుత్వోద్యోగి | రజిత పతకం |
| తోట నరసింహమూర్తి | 1927 | ప్రభుత్వోద్యోగి | ప్రత్యేక ప్రశంసా పతకం |
| గీదా బాపనయ్య | 1935 | పోలీసు | రజిత పతకం |
| షేక్‌మొహమ్మద్ అబ్దుల్ సత్తర్‌సాహెబ్ | 1935 | బ్రిగేడియర్ | కాంస్య పతకం |

షెవాలియర్ అవార్డు అనేది ఫ్రెంచి ప్రభుత్వం ఇచ్చే అత్యంత గౌరవప్రదమైన పురస్కారం. దీనిని లైఫ్ టైం అచీవ్‌మెంట్ అవార్డుతో పోల్చవచ్చును. (ఈ అవార్డు సివిలు, మిలిటరీ రంగాలకు చెందిన ప్రముఖులకు ప్రధానం చేయబడుతుంది. దీనిలో రిబ్బన్, స్టార్, మెడల్ వంటి అనేక స్థాయిలు కలవు. వీటన్నిటిలోను Legion of Honour అనేది అత్యున్నతమైనది. పుదువై లోని నల్లం క్లినిక్ అధినేత అయిన డా.నల్లం బాబు గారు మాత్రమే Legion of Honour పురస్కారంను పొందారు) ఫ్రెంచి యానానికి సంబందించి ముగ్గురికి షెవాలియార్ అవార్డులు ప్రదానం చేయబడ్డాయి.

**బెజవాడ బాపనయ్య** (1893–1945): ఈయన మహాత్మాగాంధీ ప్రబోధించిన అహింసాయుత పద్దతులను మనసావాచా కర్మణా ఆచరించిన గాంధేయవాది. యానాం మేయరుగా చాలా కాలం పనిచేసారు. వీరు చేసిన సేవలను గుర్తించిన ఫ్రెంచిప్రభుత్వం షెవాలియర్ అవార్డును ఇచ్చి సత్కరించింది.

**మహమ్మద్ జిక్రియా**: ఈయన కొంతకాలం ప్రభుత్వోద్యోగాన్ని చేసారు. వకీలు వృత్తి లో రాణించి 1933 లో యానాం కోర్టులో సహాయక జడ్జి గా వ్యవహరించారు. వీరు తుది వరకూ ఫ్రెంచి విధేయులుగానే ఉన్నారు. వీరికి ఫ్రెంచి ప్రభుత్వం 1935 లో షెవాలియర్ అవార్డును ప్రధానం చేసింది.

**మద్దింశెట్టి సత్యన్నారాయణ మూర్తి**: యానాం విద్యారంగానికి విశేషమైన సేవలు చేసినందుకు గాను వీరికి ఫ్రెంచి ప్రభుత్వం 1954 లో షెవాలియర్ అవార్డు ఇచ్చి సత్కరించింది.

## విద్యారంగ అవార్డులు

ఆనాటి యానాం విద్యాధికులు స్వచ్ఛందంగా విద్యాభివృద్ధికి కృషిచేసేవారు. అలా విద్యారంగానికి విశిష్టమైన సేవలు చేసిన పౌరులకు ఫ్రెంచి ప్రభుత్వం వివిధ బిరుదులను ప్రధానం చేసి ప్రోత్సహించేది

ఆ విధంగా ఇబ్రహిం ఖాన్, బెజవాడ బాపనయ్య, పుణ్యమూర్తుల నరసింహమూర్తి మరియు కామిశెట్టి వేణుగోపాలరావు నాయుడులు Officer de Instruction Publique (Officer of Public Instruction) అనే అవార్డును పొందారు. బెజవాడ వెంకటరెడ్డి, గిరి లక్ష్మీనారాయణ, కొత్త వెంకటరత్నం, పుణ్యమూర్తుల వెంకటసుబ్బారాయుడు, శింగంశెట్టి కనకరత్నం, సమతం లక్ష్మీనారాయణ, గిరివెంకన్న వంటివారు Officer d'Academic (Officer of Academics) అనే అవార్డును పొందారు..

## Order of the Nation పురస్కారం పొందిన ఏకైక భారతీయుడు శ్రీసమతం కృష్ణయ్య

మాతృభూమి గౌరవాన్ని నిలపటంలో గొప్ప ధైర్యసాహసాలు, అంకిత భావాన్ని ప్రదర్శించిన ఫ్రెంచి పౌరులకు ఫ్రెంచి ప్రభుత్వం ఇచ్చే అత్యుత్తమ అవార్డు Order de la Nation (Order of the Nation). ఫ్రెంచి ఇండియా మొత్తానికి ఈ అవార్డును పొందిన ఒకే ఒక వ్యక్తి శ్రీ సమతం కృష్ణయ్య. వీరు యానానికి చెందిన ఒక కవి, పండితుడు, నాయకుడు, ఆయుర్వేద వైద్యుడు అన్నింటికీ మించి ఫ్రెంచి వారిపట్ల అచంచలమైన విశ్వాసాన్ని భక్తిని ప్రదర్శించిన ఒక విధేయుడు. 19 వ శతాబ్ధాంతంలో రాజకీయాలలో రాణించిన సమతం వెంకట సుబ్బారావు కు వారసునిగా సమతం కృష్ణయ్య రాజకీయ ప్రవేశం చేసి యానాం మున్సిపల్ కౌన్సిలర్ గా, స్కూల్ కమిటీ అధ్యక్ష్యునిగా, దేవాలయకమిటీ ధర్మకర్తగా, మేయర్ గా పనిచేసారు. ఫ్రెంచి యానానికి చివరి మేయర్ ఈయనే.

1947 లో భారతదేశం బ్రిటిష్ వారి పాలననుండి విముక్తమైన నేపథ్యంలో యానాంలో కూడా జాతీయవాద వాదనలు బలపడి ఫ్రెంచి వారికి వ్యతిరేకంగా 'యానాం విమోచనోద్యమం' ఊపందుకొంది. ఆ దశలో ఫ్రెంచి రాజ్యానికి వ్యతిరేకంగా పనిచేస్తున్నారన్న కారణంతో ప్రజలచే ఎన్నికకాబడిన మేయరైన మద్దింశెట్టి సత్యానందం ను తొలగించి సమతం కృష్ణయ్యను 1954 లో మేయరు గా ఫ్రెంచి ప్రభుత్వం నియమించింది. ఫ్రెంచి విధేయుడైన సమతం, ఫ్రెంచి పాలన యానాంలో కొనసాగాలని కోరుకొనే ప్రజలను సమీకరించటం, సభలు సమావేశాలు నిర్వహించి భారతదేశ భక్తులు చేస్తున్న ఫ్రెంచి వ్యతిరేక పోరాటాన్ని ఖండించటం వంటి పనులు చేసారు. 78 సంత్సరాల వయసులో, శారీరిక అనారోగ్యంతో ఉన్నప్పటికీ, తాను నమ్మిన సిద్ధాంతాలను, విశ్వాసాలను మనసా వాచా కర్మణా అమలు చేయటానికి ఈయన పరిశ్రమించారు. ఫ్రెంచి వ్యతిరేక వాదులపై చట్ట పరమైన చర్యలు గైకొనాలని కోర్టును ఆశ్రయించారు.

ఫ్రెంచి పాలనకు వ్యతిరేక ఉద్యమం పతాకస్థాయికి చేరుకొని విమోచనోద్యమకారులు





జూన్ 13, 1954 న యానాంను ఫ్రెంచి పాలననుండి విముక్తి చెందించారు. అంతవరకూ యానాంలో ఫ్రెంచి అనుకూలురుగా వ్యవహరించిన అనేక మంది దాడులు జరుగవచ్చునన్న భయంతో ఊరువిడిచి పారిపోయారు. కొంతమంది ఇంటి అటకలపై, గడ్డిమేట్లలో, నూతులలో గోదావరి లంకలపై దాక్కున్నారట. కానీ శ్రీసమతం ఆత్మ రక్షణార్థం పిస్తోలు చేతబూని యానాంలోనే ఉన్నారు.



శ్రీ సమతం కృష్ణయ్య

విమోచనోద్యమ కారులకు రక్షణ కల్పించటానికి కాకినాడ కలక్టరు గారి ఆదేశాలమేరకు అనేక మంది భారత సాయుధ పోలీసులు యానాంలోకి వచ్చారు. ఆరోజు జరిగిన విజయోత్సవ ఊరేగింపు సాగిస్తున్న భారతదేశ భక్తులకు, స్థానిక యంగ్మెన్స్ లైబ్రేరీ మేడపైనుంచి చూస్తున్న శ్రీసమతం కనబడటం జరిగింది. ఆయన చేతిలో స్వీయరక్షణార్థం ఉన్న పిస్తోలును చూసి ఆయనే కాల్పులు జరపటానికి ప్రయత్నిస్తున్నారన్న అనుమానంతో సాయుధ పోలీసులు వారిని కాల్చి చంపటం జరిగింది. ఈ మొత్తం ఉదంతం అత్యంత నాటకీయంగా జరిగినప్పటికీ, శ్రీ సమతం ఫ్రెంచి మాతృభూమి కోసం ధైర్యసాహసాలు, అకుంఠితమైన భక్తిని ప్రదర్శించి అసువులుబాసారు. వీరి ప్రాణ త్యాగాన్ని గుర్తించిన ఫ్రాన్స్ ప్రభుత్వం 19 జూన్ , 1954 న వీరికి Order of the Nation అనే అత్యంత ప్రతిష్టాత్మకమైన అవార్డును ప్రకటించటం ద్వారా ప్రజలు తనపై ఉంచిన విశ్వాసాన్ని నిలుపుకొంది.

## మన్యం జమిందారీ

గోదావరి జిల్లాలలో వైశ్య సామాజిక వర్గానికి చెంది జమీందారులుగా పేర్గాంచిన ఒకే ఒక కుటుంబం మన్యం వారిది. కాకినాడకు చెందిన మన్యం కనకయ్య 1790 లలో పెద్ద ఎత్తున వ్యాపారాలు సాగించి గొప్ప ఐశ్వర్యవంతుడయ్యాడు. ఈయన యానాంకు మకాం మార్చి అక్కడ కూడా వ్యాపారాలు సాగించి మరింత వృద్ధినొందాడు. ఇతనికి వెంకట నర్సయ్య, సత్యలింగం, రెడ్డియ్య, వెంకటరత్నం మరియు ప్రకాశ రాయుడు అనబడు అయిదుగురు కుమారులు కలరు. వీరిలో సత్యలింగం తండ్రి లానే మంచి పేరు తెచ్చుకొన్నాడు. 1827 లో పోలవరం ఎస్టేట్ వేలానికి వచ్చినపుడు దానిలో కొంతభాగమైన గూటాల అనే ప్రాంతాన్ని సత్యలింగం 2,30,000 రూపాయిలకు రాజా అప్పారావు వద్దనుండి కొన్నాడు. ఆ విధంగా మన్యం వారి కుటుంబానికి **గూటాల జమీందారీ** లభించింది. జమిందారీ చిహ్నాలయిన

ఢంకా, నగరా మరియు వెండి శంకోలు లను ఉపయోగించుకోవటానికి బ్రిటిష్ ప్రభుత్వం సత్యలింగంకు అనుమతినిచ్చింది. తరువాత కాలంలో ఫ్రెంచి ప్రభుత్వం కూడా అట్టి అనుమతులను మంజూరు చేసింది.

1850 లో సత్యలింగం మరణించగా, ఈతని కుమారుడయిన కనకయ్య మరియు సోదరుడు వెంకటరత్నం లు గుటాల జమిందారీకి వారసులయ్యారు.

కాల క్రమేణా వెంకటరత్నం మరియు అతని నలుగురు కుమారులు ఒకరి తరువాత ఒకరు గతించటంతో 1860 నాటికి మన్యం కనకయ్య మాత్రమే ఒకే ఒక వారసుడు గా మిగిలారు. ఈయన కుమారుని పేరు మన్యం చినకనకయ్య. ఇతనికి ఇంగ్లీషు, ఫ్రెంచి, సంస్కృత భాషల్లో మంచి ప్రావీణ్యం ఉండేదట. యానాంలో ప్రస్తుతం మన్యవోరి మేడగా పిలువ బడుతున్న భవంతిని చిన కనకయ్యే నిర్మించాడు ఒకనాటి జమీందారీ తనానికి చిహ్నాలుగా ఉండిన ఫిరంగులు ఈ భవన ప్రహరీ గోడపై నేటికీ చూడ వచ్చును.




యానాం ప్రభుత్వ భూములను ఫ్రెంచి ప్రభుత్వం వేలం వేసినపుడు, ఈయన లక్షరూపాయిలు వెచ్చించి చాలా భూములను చేజిక్కించు కొన్నాడు. ఇతని విద్వత్తు, ఉన్నత వ్యక్తిత్వం, సౌజన్యాలకు ఫ్రెంచి వారు ఈయనను ఎంతగానో గౌరవించేవారట. మన్యం జమిందారు యానాంలో పెద్ద సత్రాన్ని నెలకొల్పి పేదలకు నిరతాన్నదానం గావించే వారట.

1865 లో మన్యం చిన కనకయ్యకు మహలక్ష్మమ్మ తో వివాహం జరిగింది. ఈమె విశాఖపట్నానికి చెందిన సిదరాల సత్యలింగం అనే పెద్ద వ్యాపారి కుమార్తె. పెళ్లినాటికి ఈమె







వయసు 9 సంవత్సరాలు. ఎనిమిది సంవత్సరముల వైవాహిక జీవితం అనంతరం మన్యం చిన కనకయ్య అకాల మృత్యువాత పడ్డారు. ఆ విధంగా మన్యం మహలక్ష్మమ్మ జమిందారిణిగా పిన్న వయసునుంచే మొత్తం వ్యవహారాలన్నీ చూసుకోవలసి వచ్చింది.

మన్యం మహలక్ష్మమ్మ గారు గొప్ప సౌశీల్యవంతురాలు. భర్త వలే పేదల పట్ల ఎంతో ఔదార్యాన్ని ప్రదర్శించేవారట. ఎంతో మందికి అనేక భూములను దానం చేసారట. భర్త నెలకొల్పిన అన్నదాన సత్రానికి ఈమె మరిన్ని నిధులిచ్చి అభివృద్ధి చేసారు. ఈమె రెండు ఆలయాలను (?) నిర్మించి , శిధిలమైన మూడు ఆలయాల పునరుద్దరణ గావించారట. అవి బహుసా స్థానిక శివాలయం, పోలేరమ్మ/మహలక్ష్మి ఆలయాలు కావొచ్చు. ఫ్రెంచి ప్రభుత్వం తలపెట్టిన వితరణ కార్యక్రమాలకు ఈమె భూరివిరాళాలు ఇచ్చేవారట.

1890 లలో మన్యం జమిందారీ దివాను అనేక అవకతవకలకు పాల్పడటంతో ఈమె కొంతకాలం ఆర్ధిక ఇబ్బందులు పడ్డారట. ఆయనను తొలగించి కొత్త దివానును (బులుసు సుబ్రహ్మణ్య శాస్త్రులు ?) నియమించాకా, ఆర్ధిక పరిస్థితి చక్కబడి జమిందారీ మరలా కళకళ లాడటం జరిగిందట. పాండిచేరీ నుండి ఎవరైనా అధికారులు యానాం సందర్శించినపుడు వారు మన్యం కుటుంబం ఇచ్చే ఆతిథ్యాన్ని స్వీకరించి వెళ్ళేవారట. ఫ్రెంచి పాలనలో యానాంలో జరిగిన అనేక అధికారిక విందువినోదాలకు మన్యం వారి భవనం వేదికగా ఉండేది.

దాన ధర్మాలు చేయటంలో, ఔదార్యత కలిగి ఉండటంలో, చిన్న వయసులోనే పెద్ద భాధ్యతలు మీదపడినా చలించక ధైర్యంగా పరిస్థితులను ఎదుర్కొని నిలదొక్కుకోవటంలో శ్రీమన్యం మహలక్ష్మమ్మ నేటికీ ఆదర్శ ప్రాయులే.

1930లలో మన్యం జమీందారు కుటుంబీకులు యానాం నుండి మకాం మార్చుకొని వెళిపోయారు. (రి. Aristocricy of Southern India by A. Vadivelu )

మన్యం చినకనకయ్య తరువాత ఆ వంశం దత్తత కుమారుల వలననే కొనసాగింది. 1949 లో రాజా మన్యం కనకయ్య చనిపోయేనాటికి మన్యం జమీను విలువ 7,42,487 రూపాయిల విలువ ఉన్నట్లు లెక్కించబడింది. కొత్త వెంకట రత్నం వారసులుగా కొనసాగారు. రాజా మన్యం కనకయ్య గారి సతీమణి అయిన మీనాక్షమ్మ గారు యలమర్తి కృష్ణారావు ను 1951 లో దత్తత తీసుకొని అతనికి రాజా మన్యం కనకయ్య అని నామకరణం చేసారు. ఆ తరువాత వారసత్వ హక్కుల కొరకు మన్యం కుటుంబీకుల మధ్య అనేక కోర్టు కేసులు నడచినట్లు www.indiankanoon.org అనే వెబ్‌సైటు ద్వారా తెలుస్తుంది.

ఏది ఏమైనప్పటికీ ఫ్రెంచి యానాం సామాజిక, రాజకీయ, ఆర్ధికాభివృద్ధులలో మన్యం వారి కుటుంబం పోషించిన పాత్ర విస్మరింపరానిది.

# ఫ్రెంచి యానాం ఆర్ధిక స్థితిగతులు

1816 లో బ్రిటిష్ వారినుండి ఫ్రెంచివారు యానాన్ని తిరిగి స్వాధీనం చేసుకొన్న తరువాత యానాం ఆదాయవ్యయాలను పరిశీలిస్తే ఏవో కొన్ని సంవత్సరాలలో తప్ప ఏనాడూ మిగులు బడ్జెట్ లు కనిపించవు. 1817 లో 5662 ఫ్రాంకులు, 1838 లో 3074 ఫ్రాంకులు, 1842 లో 7941 ఫ్రాంకులు, 1843 లో 9732 ఫ్రాంకులు, 1867 లో 2191 ఫ్రాంకుల బడ్జెట్ లోటు ఉన్నట్లు రికార్డుల ద్వారా తెలుస్తుంది. కొన్ని ఆర్ధిక సంవత్సరాలలో యానాం మిగులు బడ్జెట్టును కూడా చూపించక పోలేదు. ఉదా. 1860 లో 13609 ఫ్రాంకులు, 1861 లో 7883 ఫ్రాంకులు, 1864 లో 5333 ఫ్రాంకుల మిగులు ఆదాయం ఉన్నట్లు తెలుస్తుంది. (ఆ కాలంలో యానాంనుంచి విపరీతంగా జరిగిన "కూలీల ఎగుమతి" ఈ ఆదాయానికి కారణం కావొచ్చన్నది విచారించదగ్గ అంశం)

### ఆనాటి ఆదాయ మార్గాలు

తప్పుడు తూకాల వల్ల అమ్మేవారికి కొనేవారికి నష్టం వాటిల్ల కూడదనే ఉద్దేశంతో, ధాన్యం, పప్పులు వంటి వాణిజ్యసరుకుల తూకం ప్రభుత్వమే జరిపేది. అందుకు గాను నామమాత్రపు రుసుం వసూలు చేసేది. చేనేత పరిశ్రమలో జరిగే బ్లీచింగ్ ప్రక్రియకొరకు ప్రభుత్వ భూములను/చెరువులను లీజుకు ఇవ్వటం ద్వారా కొంత ఆదాయం ప్రభుత్వానికి సమకూరేది. బ్రిటిష్ వారినుంచి తక్కువధరకు ఉప్పును కొని అధిక ధరలకు ప్రజలకు అమ్మటం అనేది ఒక రకంగా విచిత్రమైన ఆదాయవనరు. ఇవి కాక మద్యం, కల్లు అమ్మకాలు, భూమి పన్ను, వృత్తి పన్నుల ద్వారా వచ్చే ఆదాయాలు అనాదిగా ఉండేవే.

అప్పట్లో ప్రజలు కట్టే పన్నులను పన్నులు అన్న పేరుతో కాక 'కంట్రిబ్యూషన్స్' అనేవారు. అంటే ప్రభుత్వ నిర్వహణ కొరకు ప్రజలు ఇచ్చే చందా గా అన్వయించుకోవచ్చు. అలాగని ఈ 'కంట్రిబ్యూషన్' లు ఐచ్ఛికం కాదు, తప్పనిసరే! యానానికి చెందిన వడ్రంగి,







చేనేత, కుమ్మరి, కమ్మరి, కంసాలి, పడవలు నడిపేవారు, మంగలి, గీతపని, రజకులు, గొల్లవాండ్రు వంటి వివిధ వృత్తులలో ఉన్నవారినుంచి ఫ్రెంచి ప్రభుత్వం ముక్కుపిండి వృత్తి పన్ను వసూలు చేసేది. ఈ విధమైన పన్ను పొరుగునున్న బ్రిటిష్ ప్రాంతంలో ఉండకపోవటంచే, యానాం చేతివృత్తుల వారు కరువుసమయాలలో యానాం విడిచి బయటకు వలసలు పోయేవారు. వివిధ కాలాలలో ప్రభుత్వానికి వచ్చిన ఆదాయ వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| సంవత్సరం | తూనికలు, చెరువులు, ఉప్పు అమ్మకాల ద్వారా వచ్చిన ఆదాయం (ఫ్రాంకులలో) | మద్యం అమ్మకాలు భూమి, వృత్తి పన్నులు ద్వారా | మొత్తం |
|---|---|---|---|
| 1820 | 5,128 | 10,179 | 15,307 |
| 1829 | 5,950 | 14,894 | 20,844 |
| 1857 | 4,500 | 21,276 | 25,776 |
| 1864 | 5,296 | 29,831 | 35,127 |
| 1870 | 3,900 | 30,506 | 34,406 |

పై గణాంకాలనుబట్టి మొదట్లో అధికంగా ఉండిన వాణిజ్య సంబంధిత ఆదాయవనరులు (మొదటి కాలమ్) క్రమక్రమంగా క్షీణించటం, పన్నుల మోత పెరగటం గమనించవచ్చు.

19వ శతాబ్దాంతానికల్లా యానాం ఆర్ధిక పరిస్థితి పూర్తిగా క్షీణించింది. 1881 నాటి ఫ్రెంచికాలనీల ఆదాయవ్యయాలను పరిశీలిస్తే యానాం ఆర్ధికపరిస్థితి స్పష్టంగా అవగతమౌతుంది.

| ఫ్రెంచి కాలనీ | ఆదాయం ఫ్రాంకులలో | స్థానిక వ్యయం | కామన్‌పరిపాలన నిర్వహణ కొరకు ఐన వ్యయం వాటా (జనాభా ప్రాతిపదికన) | మొత్తం | మిగులు లేదా లోటు |
|---|---|---|---|---|---|
| పాండిచేరీ | 11,09,275 | 9,06,669 | 1,74,822 | 10,81,491 | + 27,784 |
| చంద్రనాగూర్ | 1,85,181 | 1,51,974 | 29,185 | 1,81,159 | + 4,022 |
| కారైకాల్ | 4,00,898 | 2,88,118 | 63,181 | 3,49,299 | + 51,599 |
| మాహే | 47,345 | 46,162 | 7,462 | 53,624 | - 6,279 |
| **యానాం** | **34,732** | **40,600** | **5,544** | **46,144** | **- 11,412** |

పై టేబుల్ ను గమనిస్తే మొత్తం కాలనీలలో మాహే, యానాంల ఆర్ధిక పరిస్థితి అంతంత మాత్రంగా ఉండినట్లు తెలుస్తుంది. మాహే కు సంబంధించి ఆ ప్రాంత ఆదాయం

స్థానిక ఖర్చులకు (ఉద్యోగుల జీతభత్యాలు) సరిపోవటం గమనించవచ్చు. ఇక యానాం విషయానికి వస్తే పరిస్థితి అత్యంత దయనీయంగా కనిపిస్తుంది. అన్ని కాలనీల కామన్ పరిపాలన కొరకు అయిన ఖర్చులో యానాం తన వాటా ఇవ్వలేని పరిస్థితే కాక, ఉద్యోగుల జీతభత్యాల కొరకు కూడా పాండిచేరీ వైపు నోరు తెరుచుకొని ఉండాల్సిన పరిస్థితి ఉంది. దీనికి ప్రధాన కారణం 18, 19 శతాబ్ధాలలో ఇక్కడ విరివిగా జరిగిన వ్యాపారం క్షీణించిపోవటమే.

యానాం ఆర్ధిక పరిస్థితి దాదాపు ఇలానే 1954 వరకూ కొనసాగటం గమనార్హం. అందుకనే ఫ్రెంచి ప్రభుత్వం యానాన్ని సమీప బ్రిటీష్ వారికి ఇచ్చివేసి కారైకాల్/పాండిచేరీల వద్ద ఇంతే విస్తీర్ణమున్న ఏదైనా బ్రిటిష్ ప్రాంతాన్ని తీసుకోవాలని చాలాసార్లు యోచించింది. కానీ అలాచేసినట్లయితే, భారతదేశంలో ఫ్రెంచివలస రాజ్యస్థాపన కొరకు అసువులు బాసిన వేలాది ఫ్రెంచి సైనికుల బలిదానాలకు అర్ధం లేకుండా పోతుందని భావించింది. **అంతే కాక ఒకనాడు కోస్తాలో శ్రీకాకుళం మొదలు మచిలీపట్నం వరకూ ఫ్రెంచిరాజ్యం ఉండే దనటానికి మిగిలిన ఒకే ఒక సాక్ష్యం యానాం మాత్రమే.** కనుక యానాన్ని ఒక "గౌరవ చిహ్నం" గా భావించి లాభనష్టాలు బేరీజు వేసుకోకుండా చివరివరకూ పోషించింది.

## 1882 సంవత్సరపు యానాం బడ్జెట్ ప్రసంగం

యానాం ఆర్ధిక పరిస్థితి పట్ల అప్పటి నాయకులు అప్రమత్తమయినట్లే అనిపిస్తుంది. కొన్ని పరిష్కార మార్గాలను ప్రభుత్వానికి సూచించారు కూడా.

డిశంబరు 27, 1882 న దె లా నాటివిల్ అధ్యక్ష్యతన పాండిచేరీ జనరల్ కౌన్సిల్ మీటింగ్ జరిగింది. దీనికి యానాం తరపున పైడికొండల వెంకటసుబ్బయ్య కౌన్సిల్ మెంబరు హొదాలో హాజరయి యానాం బడ్జెటును సమర్పించారు. (చ. Journale Officiale de l'inde Francaise , 2 ఫిబ్రవరి, 1883 నాటి సంచిక) ఆయన చేసిన బడ్జెట్ ప్రసంగం నుంచి కొన్ని అంశాలు ...........

సభికులారా,

*యానాం ఆర్ధిక పరిస్థితి చాలాకాలంగా క్లిష్టంగా ఉంటోంది. కొత్తగా విధించిన పన్నుల వల్ల ఈ దుస్థితి వచ్చిందా? కాదు. ఈ ప్రాంతం వాణిజ్యపరంగా కుదేలవటంతో ఇక్కడి వాసులు క్రమక్రమంగా ఇతర ప్రాంతాలకు ఉపాధికొరకు వలసలు పోతున్నారు. సమీప బ్రిటీష్ ప్రాంతంలో నీటిపారుదల సదుపాయాలు మెరుగయ్యాయి. ఈ వలసలకు అదికూడా కారణమే.* (కాటన్ ఆనకట్ట నిర్మాణం అప్పటికి పూర్తయింది - రచయిత)

అధ్యక్ష్యా







*1881 లో యానాం స్థానిక కౌన్సిల్ లో బెజవాడ బాపనయ్య అధ్యక్ష్యతన చేసిన ఒక తీర్మానంను ఈ సందర్భంగా గుర్తుచేస్తున్నాను. ఆ తీర్మానంలో "యానాంకు చెందిన అడవిపాలంకు పైపుల ద్వారా లేదా మల్లవరం ప్రాంతం వద్ద కోరంగికాలువపై ఒక ఆక్విడక్టు నిర్మించటం ద్వారా మంచినీరు చేరే ఏర్పాటు చేయమని కోరడమైనది"*

*అలా చేయటం ద్వారా నిరుపయోగంగా ఉన్న సుమారు 300 కాండీల భూమి సాగులోకి వస్తుంది. (1 కాండీ = 2 హెక్టార్లు) ప్రస్తుతం ఈ భూములు పశుగ్రాసం కొరకు మాత్రమే ఉపయోగపడుతున్నాయి. వీటినుంచి 1400 రూపాయిల పుల్లరి ఆదాయం మాత్రమే ప్రభుత్వానికి వస్తున్నది. ఇవి పంటభూములుగా మారితే ఒక కాండీకి 37 రూపాయిల చొప్పున సుమారు ఏటా 12 వేల రూపాయిల ఆదాయం ప్రభుత్వానికి టాక్సు రూపేణా సమకూరుతుంది.*

*మిత్రులారా*

*ఈ మొత్తం ప్రాజెక్టుకు సుమారు 40 వేల రూపాయిలు మాత్రమే ఖర్చవగలదని అంచనా వేయటం జరిగింది. ఈ ప్లాను ద్వారా వచ్చే ఆదాయంతో పోల్చినట్లయితే ఇది మరీ ఎక్కువ మొత్తం కాదు.*

*కనుక నా సహచరులారా*

*దయచేసి ఈ ప్రతిపాదనకు మద్దతు పలకవలసినదిగా కోరి ప్రార్ధిస్తున్నాను........* అంటూ యానాం ఆనాటి యానాం బడ్జెట్ ప్రసంగం సాగింది.

మొత్తం వార్షిక ఖర్చులో జీత భత్యాలు కాక ప్రజల సదుపాయాలకొరకు వెచ్చించిన మొత్తాలు (ఫ్రాంకులలో) ఈ క్రింది విధంగా ఉన్నాయి.

| | |
|---|---|
| విద్యార్ధుల ఉన్నత చదవులకై ఇచ్చే 12 స్కాలర్‌షిప్పుల విలువ | 412-00 |
| విద్యారంగానికి అవసరమైన పుస్తకాలు ఇతర సామాగ్రికొరకు | 600-00 |
| అనాధ శిశువుల సంరక్షణార్ధం | 600-00 |
| సంక్షేమ నిధి (దీని ద్వారా వృద్దాప్య పించన్లు, అనాధలకు సహాయం అందించేవారు) | 1800-00 |
| హాస్పటల్ మందుల ఖర్చు | 500-00 |
| వార్షిక రిలీఫ్ ఫండ్ (ప్రకృతి వైపరీత్యాలలో ఖర్చు చేయటానికి) | 737-00 |
| **వీధి దీపాల చమురు ఖర్చులకు** | 400-00 |
| ఫెతె దె నేషనల్ (ఫ్రెంచి జాతీయదినోత్సవం) జరపటానికి | 250-00 |

మొత్తం నలభైవేల బడ్జెట్టులో పై మొత్తాలను మినహాయించగా మిగిలినదంతా ఉద్యోగుల జీతభత్యాల ఖర్చుగా భావించాలి. ఇదే బడ్జెట్టులో కొత్త జండా స్థంభం ఏర్పాటుకు, చర్చి, కనకాలపేట స్కూలు, పడవలరేవు, జైలు బిల్డింగు ల రిపేర్లకు అదనంగా 675 ఫ్రాంకులు మంజూరు చేయమని కోరడమైంది. పై వివరాలను బట్టి ఆనాటి యానాం ఆర్థిక పరిస్థితి అవగతమౌతుంది.

పైడికొండల వెంకట సుబ్బయ్య చెప్పిన ప్రణాళికను ఫ్రెంచి ప్రభుత్వం పట్టించుకోలేదు. నిజానికి ఈ ప్రణాళిక రూపకర్త, యానాం మేయరు శ్రీ బెజవాడ బాపనయ్య. ఈయన తన ప్రతిపాదనలో- యానాం కాకినాడ మార్గమధ్యంలో మల్లవరంకు వెళ్లే దారివద్ద కల కోరంగికాలువకు అవతలవైపునున్న బ్రిటిష్ వారి పంటకాలువ నుండి పంటనీటిని కోరంగి కాలువపై అక్విడక్టు నిర్మించి యానానికి చెందిన అడవిపొలం వరకూ చేర్చమని కోరారు. తద్వారా ఒనగూడే లాభాలు పైడికొండల తన ప్రసంగంలో చెప్పటం జరిగింది. ఈ పథకం కార్యరూపం దాల్చకపోవటానికి, ఫ్రెంచివారు యానాన్ని ఉంచుకోవాలా లేక బ్రిటిష్ వారి మరో ప్రాంతంతో మార్పిడిచేసుకోవాలా అనే డోలాయమాన స్థితిలో ఉండటం కారణం కావొచ్చు. దార్శనికత కలిగిన ఆనాటి నాయకుల మాటలను ఫ్రెంచి ప్రభుత్వం పరిగణలోకి తీసుకొని ఈ ప్రొజెక్టును చేపట్టి ఉంటే యానాం వ్యవసాయరంగం అభివృద్ధి చెంది ఆర్థికపరిస్థితి మెరుగుపడేదన్న విషయంలో సందేహపడక్కరలేదు.

## అద్దె భవనాల్లో వలసరాజ్యం

అప్పట్లో యానాం ప్రభుత్వ ఆఫీసులన్నీ అద్దె భవనాలలోనే ఉండేవి. ఈ పరిస్థితి ఇరవయ్యవ శతాబ్దం ప్రారంభం వరకూ కొనసాగింది. ఫ్రెంచి ప్రభుత్వం సొంతభవనాలు ఎందుకు నిర్మించుకోలేదన్నది ఆశ్చర్యకరంగా అనిపించకమానదు. 1881 సంవత్సరానికి గాను ఫ్రెంచి ప్రభుత్వం చెల్లించిన వివిధ అద్దెల వివరాలు ఈ విధంగా ఉన్నాయి. (ఫ్రాంకులలో)

పెద్దొర భవనానికి (1336), జడ్జిల నివాస భవనానికి (300), కోర్టు భవన సముదాయంకు (800), సెంట్రల్ బాయిస్ స్కూల్‌కు (240), ఆడపిల్లల స్కూలు భవనంకు (300), కన్య స్త్రీల స్కూలుకు (600), రెవిన్యూ భవనాలకు (200), హాస్పటల్ భవనానికి (200). వీటిలో బాయిస్ స్కూల్, కోర్టు భవనాలను మున్సిపాలిటీ నుంచి లీజుకు తీసుకొని ప్రభుత్వం అద్దె చెల్లించేది.

పై వాటిలో పెద్దొర భవనాన్ని ఫ్రెంచి ప్రభుత్వం 1904 లో 2500 రూపాయిలకు, Mr. Paul Le Faucher నుండి కొనుగోలు చేసినట్లు రికార్డులు చెపుతున్నాయి. అంతవరకూ హాస్పటల్ గా ఉన్న తన ఇంటిని Dr. Morgain, ప్రభుత్వానికి దానం ఇచ్చి అక్కడ నూతన హాస్పటల్ భవనాన్ని నిర్మించమని తన వీలునామాలో పేర్కొన్నాడు. మిగిలిన భవనాలు ఫ్రెంచి ప్రభుత్వానికి ఎప్పుడు దఖలు పడ్డాయో తెలియరాదు. ఆ విధంగా యానానికి సంబంధించి







'ఫ్రెంచి వలస రాజ్యం' అద్దె భవనాలలోనే కాలక్షేపం చేసేసిందని చెప్పుకోవచ్చు.

## ప్రభుత్వ నిర్వహణలో ప్రజల కంట్రిబ్యూషన్స్

ప్రభుత్వ నిర్వహణ కొరకు ప్రజలవద్దనుంచి వసూలు చేసే డబ్బును పన్నులని కాక కంట్రిబ్యూషన్స్ అనేవారు. జమీందారుల నుండి సామాన్య ప్రజల వరకూ ఏ ఒక్కరూ దీనికి మినహాయింపు కాదు. ఆఖరుకు ప్రభుత్వం నుంచి సంక్షేమ సహాయం పొందిన నిర్భాగ్యులు కూడా ఎంతోకొంత

— 575 —

ÉTABLISSEMENT DE YANAON.

| MM. | Rs. | Fs. | Cs. |
|---|---|---|---|
| Sri Raja Maniom Mahalatchavama, zamindar.................. (మన్యం జమిందారిణి) | 500 | » | » |
| Kotta Vincattaratnom, conseiller municipal. | 200 | » | » |
| Samatom Latchimi Narasaya, conseiller général................................ | 50 | » | » |
| Bezavada Vincataredy, conseiller général. | 50 | » | » |
| Gabriel Jablin, directeur de l'usine de Nilapalli................................ | 25 | » | » |
| Simonel, Administrateur p. i. (పెద్దొర) ... | 50 | » | » |
| J. Artique, curé.. (చర్చి ఫాదర్) ........ | 10 | » | » |
| Marianadin, percepteur.. (టాక్స్ కలక్టర్) ... | 36 | » | » |
| Soucé, officier de santé... (హెల్త్ ఆఫీసర్) | 23 | » | » |
| Abbaychettiar, directeur de l'école centrale de garçons....... (హెడ్ మాస్టర్) | 27 | » | » |
| Pa del, commissaire de police. (పోలీస్ అధికారి) | 10 | » | » |
| Lalmohamadkhan, délégué du chef du service des contributions. (కంట్రిబ్యూషన్స్ వసూలు అధికారి) | 16 | » | » |
| Gu ry Tataya, directeur de l'école centrale de filles................................ | 14 | » | » |
| Capaganty Vincataratnom, marchand. (వ్యాపారి) | 30 | » | » |
| Capaganty Sattirazou, conseiller municipal. | 50 | » | » |
| Granty Latchoumanaya, marchand........ | 30 | » | » |
| Elamarty Vincataratnom, dito. ........ | 30 | » | » |
| Mazety Somarazou, dito. ........ | 10 | » | » |
| Guiry Madavaraïdou, conseil agréé........ | 5 | // | // |
| Singomchetty Canacaratinom, écrivain du Gouvernement..... (కోర్టు రైటరు) ... | 11 | » | » |
| Mohamed Zicria, écrivain du Gouvernement. | 7 | » | » |
| Ibrahimkhan, conseiller municipal...... | 10 | » | » |
| Samatom Narasingaraïdou, propriétaire (భూస్వామి) | 10 | » | » |
| Guiry Vimana, notaire........ (నోటరీ) . | 5 | » | // |
| Noulou Soubaraw, marchand........... | 3 | » | » |
| Salarsaïb, délégué du chef du service des travaux publics . (పబ్లిక్ వర్క్‌ల పర్యవేక్షణాధికారి) | 9 | » | » |
| K. Ramana, commis de la perception.... | 5 | » | » |
| B. Vincatanarayanaraw, agent de poursuites. (లాయర్) | 3 | » | » |
| Tota Narasinhassoimy, instituteur.. (టీచర్) | 12 | // | // |
| Mahindravada Soorinarayanamourty, instituteur................................ | 9 | » | » |
| Malipedy Virana, instituteur............. | 12 | » | » |
| Tota Ramana, dito. ............... | 8 | » | » |
| Malipady Ancaya, dito. ............... | 6 | » | » |
| Marie Amélie Pierre, maîtresse de couture. (టీచర్) | 3 | » | » |
| Tota Sourianarayana, commis du service des contributions.... (కంట్రిబ్యూషన్స్ వసూలు అధికారి) | 7 | » | » |
| Check Mohamed Houssin, commis du service des contributions. ............. | 6 | » | » |
| Mohamed Abdoul Latif, commis du service des contributions...................... | 6 | » | » |



కంట్రిబ్యూట్ చేసేవారు. 1914 సంవత్సరానికి యానాం ప్రజలు వద్దనుంచి ఆ విధంగా వసూలు చేసిన మొత్తం 1768 రూపాయిల 4 అణాలు. (ఆనాటి సమాజంలోని వ్యక్తులు, వివిధ సామాజిక

| MM. | Rs. | Fs. | Cs. |
|---|---|---|---|
| Bulla Sourianarayana, surveillant d'irrigation............ (నీటి పారుదల అధికారి) | 2 | » | » |
| Mme Cassiny, sage-femme................ | 7 | » | » |
| Dupierre, vaccinateur...... (టీకాల అధికారి) | 4 | » | » |
| Gaffourkhan, infirmier .... (కాంపౌండరు) | 3 | » | » |
| Malipedy Mallaya, opérateur.............. | 10 | » | » |
| Abel Francine, aide-opérateur......... .. | 6 | » | » |
| Robert O'Neill Eaton, aide-opérateur...... | 4 | » | » |
| Cheick Ahamed, brigadier..... (పోలీసు) | 5 | » | » |
| Chicam Mataya, directeur de l'école privée d'Adivipaléom....... (స్కూలు హెడ్ మాస్టరు) | 2 | » | » |
| Nandoury Narayanamourty, directeur de l'école privée de Canacalapettah....... | 2 | » | » |
| Bhoupatirazou Souraparazou, fermier des îles d'Iskitippah......... ( రైతు ) | 20 | » | » |
| Bonda Gangaya, fermier des îles d'Iskitippah.......... ( రైతు ) | 10 | » | » |
| Madimchetty Bapana, instituteur... (టీచర్) | 8 | » | » |
| Kamichetty Ayapanaidou, propriétaire..... | 4 | » | » |
| Naquiredy Anoumantaraidou, pion. (సూపర్‌వైజర్) | 4 | » | » |
| Mohamed Houssène, pion............... | 2 | » | » |
| Carry Vincatarattinom, garde de police... | 2 | » | » |
| Erragounta Manicom, dito. ... | 2 | » | » |
| Cheick Pakir Ahamed, dito. ... | 2 | » | » |
| Mohamed Issouf. dito. ... | 2 | » | » |
| Nandoury Camirazou, dito. .... | 2 | » | » |
| Abdoul Gaffour, dito. .... | 2 | » | » |
| Cheick Mirasaib, dito. .... | 2 | » | » |
| Cheick Satarseib, dito. .... | 2 | » | » |
| Tota Vincaya, dito. .... | 2 | » | » |
| Cheick Mohamed Houssin, dito. .... | 2 | » | » |
| Canacala Vincataredy, dito. .... | 2 | » | » |
| Erragounta Vincatarattinam, garde de police............................ | 2 | » | » |
| Guiry Ramassoimy, garde de police....... | 2 | » | » |
| Bapanesaib, dito. ........ | 2 | » | » |
| Manga Canacaya, dito. ........ | 2 | » | » |
| Tota Sitaya, dito. ....... | 2 | » | » |
| Minala Sitaramassoimy, dito. ....... | 2 | » | » |
| Carevedy Soureraw, dito. ........ | 2 | » | » |
| Poudouvai Boutchirazou, pion.......... | 2 | » | » |
| Nandoury Sitaramassoimy, dito.......... | 2 | » | » |
| C. Vincatramaya, dito ........ | 2 | » | » |
| Erra Sattaya, manœuvre....... (కూలీ) | 2 | » | » |
| Chican Vincatarazou, manœuvre.......... | 2 | » | » |
| Coupoula Narassana, dito. ......... | 2 | » | » |
| Pampana Souvana, dito. ......... | 2 | » | » |
| Bandarou Soubouraw, dito. ......... | 2 | » | » |
| Someswarapou Reddy, dito. ......... | 2 | » | » |
| Enamadala Vincana, pion............... | 1 | » | » |





| MM. | Rs. | Fs. | Cs. |
|---|---|---|---|
| Manème Tirapaya, homme de peine. (దండన అధికారి) | 2 | » | » |
| Dadala Soubadou, jardinier..... (తోటమాలి) | 1 | » | » |
| Pouvalou Vincadou, agent auxiliaire. . (హెల్పర్) | 1 | » | » |
| Commune de Yanaon.................... | 100 | » | » |
| Comité de bienfaisance de Yanaon......... | 100 | » | » |
| Nagassoury Comarazou, marchand. (వ్యాపారి) | 3 | » | » |
| Check Abdoul Khader, dito............ | » | 4 | » |
| Pilla Paparaw, dito. ......... | » | 4 | » |
| Namboury Gangarazou, dito. ........ | » | 4 | » |
| Checkal Vincatraw, tailleur. (టైలర్) ....... | 1 | » | » |
| Capaganty Vincatara Anama, propriétaire. (భూస్వామి) | 10 | » | » |
| Amanchi Souba, propriétaire............ | 1 | » | » |
| Checka Naraya, marchand.............. | 1 | » | » |
| Grandy Soubaya, dito. ............... | 3 | » | » |
| Bollozou Bhramara Viramallaya, orfèvre. (కంసాలి) | 2 | » | » |
| Boudala Virava, huilier....... (తెలకుల వ్యాపారి) | 2 | » | » |
| Kamichetty Perama, ex-écrivain du secrétariat................. (ప్రభుత్వ లేఖరి) | 4 | » | » |
| Atmury Rajandra Mohan-Lakshmy Narassinharaw, propriétaire................ | 4 | » | » |
| Aezula Soubaya, marchand.............. | 4 | » | » |
| Checkala Sitaya, dito. .............. | 8 | » | » |
| Vancayala Souria Narayanamourty, marchand............................ | 1 | » | » |
| Bomaganty Rameswaraw, propriétaire. ... | 8 | » | » |
| Sontenou Somana, orfèvre....... (కంసాలి) | 4 | » | » |
| Camady Appasvamy, propriétaire.......... | 1 | » | » |
| Kassinkota Virabrahmam, orfèvre......... | 1 | » | » |
| Chicala Ramachandroudou,............ | 1 | » | » |
| Mohamed Houssemane, conseil agréé....... | 5 | » | » |
| Recapally Chelamaya, marchand.......... | 2 | » | » |
| Colloury Bhimaya, dito. .......... | » | 2 | » |
| Yandamoury Sechachalam............... | 1 | » | » |
| Chicatta Vincana, cultivateur... ( రైతు ) ..... | 2 | » | » |
| Vadapally Krishnamatcharioulou, desservant de la pagode Vichnou. (విష్ణాలయ పూజారి) | 1 | » | » |
| Soundarapally Soubana................ | 1 | » | » |
| Devagalla Vincatanarassaya, huilier...... | 1 | » | » |
| Devagalla Vincanna, dito......... | 1 | » | » |
| Dandila Varahalou, orfèvre.............. | 1 | » | » |
| Velagalapoundy Viraya, médecin empirique................ ( వైద్యుడు ) ...... | 2 | » | » |
| Polichetty Boulhisatty, marchand......... | 1 | » | » |
| Manepally Sri Ramoulou, desservant de la pagode Siva...... (శివాలయ పూజారి) | 1 | » | » |
| Manepally Vissama.................... | 1 | » | » |
| Vallem Mouttilingam, fermier du bac de Yanaon Nilapally................... | 3 | » | » |
| P. Hofland, président du conseil de fabrique.......................... | 5 | » | » |

— 578 —

# JOURNAL OFFICIEL

## DES ÉTABLISSEMENTS FRANÇAIS DANS L'INDE

2e PARTIE.

55e Année. — N° 39. Mardi 29 septembre 1914.

| MM. | Rs. | Fs. | Cs. |
|---|---|---|---|
| Doddy Ramamourty, charaf | 8 | » | » |
| Kounamredy Soubaraïdou, conseiller municipal | 4 | » | » |
| Tikiredy Pintayya, marchand | 2 | » | » |
| Camiredy Soubaya | » | 4 | » |
| Cottagalla Moutialou, laitier (యాదవులు) | » | 2 | » |
| Chinta Vincata Soubaya, cultivateur | 5 | « | » |
| Gorrela Bapirazou, maçon (తాపీ మేస్త్రీ) | » | 2 | » |
| Tota Chittiya | » | 2 | » |
| Davouloury Vincana, marchand | » | 4 | » |
| Mani Govindou Narassana, et Sourana | 1 | » | » |
| Mouni Bhaïravassoimy, laitier | 1 | » | » |
| Danguety China Mavillou, blanchisseur (రజకులు) | 1 | » | » |
| Vadiparty Dhammi, dito. | 1 | » | » |
| Douvirapou Massènon dito. | 1 | » | » |
| Tisserands de salicota (శాలికోటకు చెందిన నేతకాంద్రు) | 3 | 5 | » |
| Total à reporter pour l'Etablissement de Yanaon | 1.768 | 1 | » |

(పై పట్టికలలో కొంతమంది వ్యక్తుల వృత్తులకు తెలుగు అనువాదం ఇవ్వటం జరిగింది. గమనించగలరు - రచయిత)





# ప్రజా ప్రయోజనాల పనులు

పాలితులకు రక్షణ మరియు మౌలిక సదుపాయాల కల్పన అనేది పాలకుల బాధ్యత. వీటిని అందించటం కోసం రాజ్యం పన్నులరూపంలో ప్రజలవద్ద నుండి ధనాన్ని సేకరిస్తుంది. సామ్రాజ్యకాంక్షతో, వ్యాపారదృష్టితో రాజ్యాధికారం చేజిక్కించుకొన్న ప్రభుత్వాలకు పన్నులపై ఉన్న ఆశక్తి పనులపై ఉండదు. ఒక వేళ ప్రజలకు ఉపయోగపడిన పనులు చేపట్టినా వాటిలో కూడా ప్రయోజనం ఉండకపోదు. ఉదాహరణకు కాటన్ ఆధ్వర్యంలో గోదావరి నదిపై ఆనకట్ట కట్టటానికి అయిన ఖర్చు మొత్తం, సాగులోకి తీసుకురాబడ్డ వ్యవసాయభూములపై విధించే పన్నురూపంలో మూడు సంవత్సరాలలో తిరిగి వచ్చేసిందట.

ఫ్రెంచి కాలనీలు దూరం దూరంగా విస్తరించిన ఉన్న చిన్న చిన్న ప్రాంతాలవటం వలన పొరుగున ఉన్న బ్రిటిష్ వారి వలే విస్తృతమైన స్థాయిలో అభివృద్ధి చేసే అవకాశం ఫ్రెంచి ప్రభుత్వానికి లభించలేదు. అందుకనే రైల్వేస్, తంతి తపాలా, విద్యుత్‌శక్తి వంటి సదుపాయాలకొరకు వీరు పూర్తిగా బ్రిటిష్ వారిపై ఆధారపడవలసి వచ్చేది.

రోడ్లు, పాఠశాలలు, హాస్పటల్స్, వంతెనలు, పంట కాలువలు వంటి సదుపాయాలు ఒక ప్రాంతానికి కల్పించాలంటే ఆ ప్రాంతం అందించే ఆదాయం ప్రధాన పాత్ర వహించక మానదు. ఆదాయాన్నిచ్చే ప్రాంతాన్ని నెత్తికెక్కించుకోవటం, ప్రతీ చిన్న విషయానికి చెయ్యిచాపే ప్రాంతాన్ని కసిరికొట్టటం రాజనీతిలో అనాదిగా జరిగేదే!

ఫ్రెంచి ప్రభుత్వం యానాంలో చేపట్టిన భారీ పనులలో పాంచాలగట్టు, మెట్టకూరు మార్గంలో కల స్లూయిస్ (రామన్నకోడు), పంటనీరందించే మూడుతూములు, చర్చి భవనం, పెద్దొర భవన పునర్నిర్మాణం, పబ్లిక్ కుళాయిలు, వంతెన, కొన్ని స్కూల్స్, హాస్పటల్ భవనాల నిర్మాణాలు, దీనపోషక సమాజభవన నిర్మాణానికి ఇచ్చిన విరాళం వంటివి కనపడతాయి. యానాంలో మౌలికమైన మార్పులను తీసుకురావటానికి ఫ్రెంచి ప్రభుత్వం పెద్దగా దృష్టిపెట్టలేదనే

చెప్పుకోవాలి. అంతేకాక యానాంలో కలోనియల్ ఇంజనీర్ పోస్ట్ లేకపోవటం కూడా ఒక కారణం కావొచ్చు. ఏదైనా ఒక ప్రజాహిత వర్క్ చేపట్టాలి అంటే కలోనియల్ ఇంజనీరు ప్రతిపాదనలు తప్పనిసరి. బడ్జెట్‌లో ఏ పనికైనా నిధులు విడుదల చేయాలంటే ఇంజనీర్ సిఫార్సులు ఉండాల్సిందే. యానాంలో పబ్లిక్ వర్క్ లపై ప్రతిపాదనలు తయారుచేయటానికి పాండిచేరీనుంచి కలోనియల్ ఇంజనీరు రావలసివచ్చేది. ఆయనను యానాం తీసుకురావటం అంటే చాలా పెద్ద ప్రయత్నమేమో అప్పట్లో, ఎందుకంటే 19వ శతాబ్దం మొత్తం మీద మూడుసార్లు మాత్రమే కలోనియల్ ఇంజనీర్ యానాంలో పర్యటించటం జరిగింది.

## పాంచాల గట్టు

స్థానిక ఎడ్మినిస్ట్రేటర్ భవనానికి దక్షిణంవైపున ఫ్రెంచి వారు నిర్మించిన ఎత్తైన పటిష్టమైన గోడ నేటికీ నిలిచిఉంది. దీనిని పాంచాలగట్టు అని స్థానికులు పిలుచుకొంటారు. 19వ శతాబ్ద ప్రారంభంలో యానాన్ని తుఫాన్లు, వరదలు, ఉప్పెనలు వంటి అనేక ప్రకృతి భీభత్సాలు ముంచెత్తాయి. వరదనీరు యానాంలోకి ప్రవేశించి అప్పట్లో మంచిగా నడుస్తున్న క్లాత్ మరియు ఉప్పు వ్యాపారాల గొడౌన్లను నాశనం చేసేది. వరదనీరు ఊళ్ళో ప్రవేశించకుండా పటిష్టమైన గోడను కట్టాలని ఫ్రెంచి ప్రభుత్వం యోచించి, 1834 లో దీన్ని కట్టటం ప్రారంభించింది. ఈ గోడ పొడవు 300 మీటర్లు. దీనికి 3.3 మీటర్ల లోతైన పునాది వేసారు. పునాది నుంచి దీని ఎత్తు 6.32 మీటర్లు ఉండేలా నిర్మాణం జరిగింది. దీనికుపయోగించిన రాళ్లని రాజమండ్రి క్వారీలనుంచి తెప్పించటం జరిగింది. నిధులకొరత వలన దీని నిర్మాణం రెండుసార్లు ఆగిపోయినా ఎట్టకేలకు 1842 లో పూర్తయింది. ఒకానొక సమయంలో నిధులు లేక, దీనికొరకు తెప్పించిన నాలుగువేల అడుగుల నాపరాళ్లను అమ్మివేయవలసివచ్చిందట. మొత్తం నిర్మాణానికి 45 వేల ఫ్రాంకుల ఖర్చయ్యింది. ఈ గోడ కట్టకముందు ఎడ్మినిస్ట్రేటరు బంగళావరకూ వరదనీరు చేరి ఇసుక మేటలు వేసేదట. పాంచాలగట్టు యానాన్ని అనేకసార్లు వరదముప్పు నుంచి కాపాడింది.

## వ్యవసాయానికి సాయం

వ్యవసాయరంగాన్ని పటిష్టపరచటానికి ఫ్రెంచి ప్రభుత్వం ప్రయత్నించినట్లు అప్పట్లో జరిగిన కొన్ని పబ్లిక్ వర్క్‌ల వలన తెలుస్తుంది. 1836 లో 384 ఫ్రాంకుల ఖర్చుతో అడవిపొలంలో వరదనీటిని నిలువరించటానికి ఏటిగట్టు నిర్మాణం జరిగింది. 1848 లో 1467 ఫ్రాంకులఖర్చుతో పోటుసమయంలో గోదావరి నీరు చేలలోకి ప్రవేశించకుండా ఏటిగట్లను పటిష్టపరిచారు. (సముద్రానికి చేరువలో ఉన్న కారణంగా పోటు సమయంలో ఉప్పునీరు గోదావరి లోకి పొడుస్తుంది) 1866 లో 600 ఫ్రాంకుల ఖర్చుతో మెట్టకూరు భూములకు పంటనీరు అందించటానికి మూడుతూములను, ఫ్రెంచి చానెల్ ను, అడవిపొలంలో రెండు చెరువులను ఏర్పాటు చేయటం జరిగింది. 1870 లో మెట్టకూరు భూములలోకి వరదనీరు ప్రవేశించకుండా





ఏటిగట్టును నిర్మించారు. 1881 లో 675 ఫ్రాంకుల ఖర్చుతో దీని ఎత్తును పెంచారు.

యానాం వ్యవసాయరంగానికి ఊతమివ్వటానికి ఫ్రెంచి ప్రభుత్వం పై పనులను చేపట్టినట్టు తెలుస్తుంది. కానీ అనేక ప్రతిపాదనలను నిధులు లేవని తిరస్కరించిన సందర్భాలు కూడా ఉన్నాయి. ఎవరైనా పౌరులు తమ స్వంతఖర్చులతో ప్రజాహితపనులు చేపడతామంటే 'భేషుగ్గా చేసుకోండని' ఫ్రెంచి ప్రభుత్వం వెంటనే అనుమతులు మంజూరుచేసేది. అడివిపొలంలో ఉన్న తన పొలాలకు సాగునీటి సదుపాయం కొరకు ఒక పంటకాలువ స్వంతఖర్చులతో తవ్వించుకోవటానికి శ్రీమతి వాడ్రేవు శేషమ్మ కు గవర్నరుగారు 1913లో అలాంటి అనుమతి మంజూరు చేసినట్లు రికార్డుల ద్వారా తెలుస్తుంది.

## వంతెనల నిర్మాణం

1858 నాటికి యానాంలో చిన్నాచితకా వంతెనలు మొత్తం 14 ఉండేవి. ఈ వంతెనలవలన యానాం ఒక గ్రామ స్థాయినుంచి టవును గా పరిణామం చెందింది. వీటి ద్వారా అన్ని ప్రాంతాల మధ్య రాకపోకలు జరిగేవి. వీటిలో మాలపల్లి (ప్రస్తుత అంబేద్కర్ నగర్) వద్ద మురుగుకాలువపై ఉన్న వంతెన, కనకాలపేట పంట కాలువపై కల వంతెనల వంటివి చెక్కలతో నిర్మించటం జరిగింది. మాలపల్లి వద్ద నున్న బ్రిడ్జిని 1864 లో 308 ఫ్రాంకుల ఖర్చుతో సున్నం, ఇటుకలతో నిర్మించారు.

"యానాం జండా స్థంభం నుంచి గోదావరి ఒడ్డుకు వెళ్లే దారిలో ఉన్న ఊట కాలువను దాటటం చాలా ఇబ్బందిగా ఉందని, ఏటా వచ్చే వరదల సమయంలో మరీ ప్రమాదకరంగా ఉంటోందనీ, ఈ ప్రదేశంలో ఒక వంతెనను నిర్మించవలసినదిగా" 1851లో పెద్దొర హ్యూగోట్ గవర్నరుగారికి విన్నవించాడు. దరిమిలా 1852 లో మూడు ఆర్చిలతో కూడుకొన్న ఒక సుందరమైన బ్రిడ్జిని నిర్మించటం జరిగింది. సాయింకాల సమయాలలో ఫ్రెంచివారు ఈ బ్రిడ్జిపై కుర్చీలు వేసుకొని కూర్చొని తేనీరు సేవిస్తూ గడిపేవారట. (ఈ బ్రిడ్జి మొన్నమొన్నటి వరకూ ఉండేది – రచయిత)




యానాం–నీలపల్లి వంతెన ఫ్రెంచివారు నిర్మించిన వంతెనలలో కెల్లా అత్యంత విశిష్టమైనది. ఇది యానాన్ని పొరుగునున్న బ్రిటిష్ నేలతో

అనుసంధానం చేసింది. అంతవరకూ పడవలరేవు వద్ద పడవదాటి యానాంలోకి ప్రవేశించవలసి వచ్చేది. 1906 జనవరి, 8 న ఫ్రెంచిగవర్నరు ఫిలెమా లామైర్ యానాం పర్యటించినపుడు జరిగిన బహిరంగ సభలో అప్పటి మేయరు శ్రీబెజవాడ బాపనయ్య "చాలాకాలంగా యానాం ప్రజలు వంతెన నిర్మాణం కొరకు ఎదురుచూస్తున్నారనీ వారి కలను ఫ్రెంచిప్రభుత్వం నెరవేరుస్తుందని ఆశిస్తున్నానని" ప్రసంగించటాన్నిబట్టి యానాం-నీలపల్లి వంతెన నిర్మాణం కొరకు విజ్ఞప్తులు చాలాకాలం నుంచే యానాం నాయకులు చేస్తున్నట్టు తెలుస్తుంది. దరిమిలా యానాం-నీలపల్లి బ్రిడ్జి నిర్మాణం కొరకు 1921 బడ్జెట్టులో 53,000 రూపాయిలు




కేటాయించారు.

ఈ బ్రిడ్జి పొరుగునున్న బ్రిటిష్ పౌరులకు కూడా ఎంతో ఉపయోగకరంగా ఉంటుం దన్న కారణంగా, దీని నిర్మాణంలో బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూడా భాగస్వామ్యులను చేయాలని ఫ్రెంచి ప్రభుత్వం మద్రాసు గవర్నరు తో సంప్రదింపులు జరిపింది. ఈ చర్చలు ఒక కొలిక్కి రావటానికి అయిదేళ్ళు పట్టింది. ఈ అయిదేళ్ల ఫ్రెంచి బడ్జెట్లలో యానాం బ్రిడ్జికి కేటాయించిన డబ్బులు అలా మిగిలిపోయినట్లు చూపించటం జరిగింది. (ఈ నిధులను వేరే పనులకు మళ్ళించకపోవటం గమనార్హం). బ్రిటిష్ ప్రభుత్వం ఎంతమేరకు డబ్బును ఈ బ్రిడ్జి నిర్మాణానికి తమ వాటాగా అందచేసారో తెలియరాదు కానీ, దీని ప్రారంభోత్సవానికి ఆనాటి మద్రాసు గవర్నరు గారు విచ్చేయటం ద్వారా వారూ పాలుపంచుకొన్నారనే అనుకోవాలి.

1927 డిశంబరు, 10 న మద్రాసు ప్రెసిడెన్సీ గవర్నరు శ్రీ విస్కౌంట్ గోషెన్ ఈ వంతెనకు శంఖుస్థాపన చేసారు. 1932 జూలై, 30 న యానాం ఎడ్మినిస్ట్రేటర్ పాల్ తౌమాసిని దీనిని ప్రారంభించారు. ఆ సందర్భాల శిలాఫలకాలను నేటికీ ఈ వంతెనపై చూడవచ్చును. ఈ





వంతెన అప్రోచ్ రోడ్ కొరకు మద్దింశెట్టి బాపన్న తన భూములు కొన్ని ప్రభుత్వానికి ఇచ్చారు.

ఈ బ్రిడ్జి నిర్మాణంలో నదీగర్భంనుంచి తవ్వితీసిన ఇసుకను బెజవాడబాపనయ్య మరియు బ్రిడ్జి కంట్రాక్టరు కలసి అమ్మేసుకొన్నారనీ, పెద్దఎత్తున అవినీతి జరిగిందనీ అంటూ అనేక ఆరోపణలు వెల్లువెత్తాయి. దీని వెనుక బెజవాడ బాపనయ్య హస్తం ఉందని ప్రచారం జరిగింది. బ్రిడ్జి కంట్రాక్టరు మునిసిపాలిటీకి చెందిన ఇసుకను వాడుకొన్నందుకు, 27,031 రూపాయిలు చెల్లించాడని బెజవాడ బాపనయ్య సాక్ష్యాధారాలతో నిరూపించటంతో ఆ ఆరోపణలు సద్దుమణిగాయి.

యానాంలో ఫ్రెంచివారు చేసిన పబ్లిక్ వర్క్‌లలోకెల్లా ఈ వంతెన అత్యంత విలువైనది. పక్కనే కొత్తవంతెన నిర్మించినప్పటికీ ఫ్రెంచి వంతెన ఇప్పటికీ పటిష్టంగానే ఉండి సేవలందిస్తూనే ఉంది.

## మార్గైన్ ఆసుపత్రి

చార్లెస్ పిథోయిస్ అనే ఫ్రెంచి వ్యాపారి వైద్యవృత్తి చేపట్టి యానాం సర్జన్ గా మంచి పేరు తెచ్చుకొన్నాడు. 1820 లో పిథోయిస్ మరణించగా అతని కొడుకులలో ఒకరు (Phamphile Pithois) తండ్రి బాటలో పయనించి యానాం వైద్యునిగా పేరు గడించాడు. ఇతని వివరాలు 1844 వరకే లభిస్తాయి. ఆ తరువాత ఇతనేమయ్యాడో తెలియరాదు.

1846 లో యానాం చర్చి ఫాదరుగా వచ్చిన డ్యూపాంట్ ఇక్కడ వైద్యుడు లేడన్న విషయాన్ని గుర్తించి, వైద్యం తెలిసిన తన మిత్రులవద్ద ప్రాథమిక చికిత్స పద్ధతులను నేర్చుకొని వైద్యసేవలందించాడు.

1853 లో వైద్యునిగా వచ్చిన ఎమ్. మార్గైన్ (M. Margain) యానానికి చేసిన సేవలు అనన్యమైనవి. ఈయన తన ఇంటిలోనే హాస్పటల్‌ను నెలకొల్పి రోగులకు చికిత్స చేసేవాడు. యానాం హాస్పటల్ స్థాయి పెంచమని 18, అక్టోబరు 1881 న జరిగిన కౌన్సిల్ సమావేశంలో చర్చ జరిగింది. బెజవాడ బాపనయ్య, కశిరెడ్డి తమ్మన్న ల ఆధ్వర్యంలో జరిగిన ఆ సమావేశంలో *"యానాం ఆసుపత్రికి ఏడాదికి కేవలం 1200 ఫ్రాంకుల కేటాయింపు జరుగుతున్నదని, డా. మార్గైన్ తన స్వంత గృహంలో కనీస సదుపాయాలు సమర్ధవంతంగా కల్పిస్తున్నారని- ఈ సందర్భంగా హాస్పటల్ కు ఒక కొత్త భవనాన్ని నిర్మించి, ఆధునీకరించి సహాయపడవలసినదిగా ప్రభుత్వాన్ని కోరగా- దానికి యానాం పెద్దొర ప్రస్తుత ఆర్ధిక పరిస్థితి అనుకూలంగా లేని కారణంగా వీలుపడదని తెగేసి చెప్పారు."*

పై ఉదంతం జరిగిన కొద్దికాలానికే డా.మార్గైన్ చనిపోయాడు. ఆయన తన వీలునామాలో అప్పటికి హాస్పటల్‌గా ఉన్న తన ఇంటిని ప్రభుత్వానికి దానం చేసాడు. ఇది

అప్పటి మార్కెట్ విలువ సుమారు వెయ్యి రూపాయిలు. అంతే కాక తన ఆర్ధికపరిస్థితి బాగాలేని కారణంగా శిధిలావస్థకు చేరుకొన్న ఆ ఇల్లు ఉన్న ప్రదేశంలో నూతన హాస్పటల్ భవనాన్ని నిర్మించలేకపోయాననీ, ప్రభుత్వం పూనుకొని అక్కడ ఒక కొత్త హాస్పటల్ భవనాన్ని నిర్మించాలని కోరాడు.

1883 లో జరిగిన కౌన్సిల్ సమావేశాలలో బెజవాడ బాపనయ్య సమర్పించిన ఒక వినతి పత్రంలో "యానాంలో 5 పడకల హాస్పటల్ ను ఏర్పాటు చేసి, డా.మార్గైన్ చివరికోరికను తీర్చమని, ఇక్కడి ప్రజల ఆకాంక్షలను, అవసరాలను గవర్నరుగారికి తెలియచేయవలసినదిగా" అప్పటి పెద్దొర అయిన బేయట్ ని కోరారు. దీనికి స్పందించిన ఫ్రెంచి గవర్నరు 1884 లో 1800 ఫ్రాంకుల నిధులను మంజూరు చేయటంతో అన్ని వసతులు కలిగిన హాస్పటల్ భవనాన్ని నిర్మించారు. యానాం వచ్చి జీవితపర్యంతం ఇక్కడి రోగులకు నిస్వార్ధంగా సేవలు చేసి, ఇక్కడే గతించిపోయిన మంచివ్యక్తి, గొప్పవైద్యుడు అయిన మార్గైన్ పేరిట ఆ హాస్పటల్‌కు "మార్గైన్ హాస్పటల్" అని పేరుపెట్టడం జరిగింది. **యానాం హాస్పటల్ ఈ రోజుకు కూడా అదే చోటులో ఉంది.**

1884 నాటి యానాం బడ్జెట్టులో హాస్పటల్ ఖర్చులలో డాక్టరుగారు పల్లకీ కొనుక్కోవటానికి 100 ఫ్రాంకులు మంజూరు చేసినట్లు ఉండటం ఆసక్తిదాయకంగా అనిపిస్తుంది.

1900 లో M.M. Lopez Sebastian Francois యానాం డాక్టరుగా పనిచేసాడు. అప్పట్లో పాండిచేరీలో మెడిసిన్ చదివే విద్యార్ధులకు హౌస్ సర్జన్‌షిప్ యానాం వంటి ప్రాంతాలలో చేయాలనే నిబంధన ఉండేది. వీరిని student in Pharmacy అనేవారు. ఈ సదుపాయం వలన యానాం హాస్పటల్‌కు డాక్టర్ల కొరత ఉండేది కాదు.

ఫ్రెంచికాలనీలలో స్మాల్ పాక్స్ (మసూచి) మరణాలు ఎక్కువగా ఉండేవి. యానాంలో కూడా మసూచి మరణాలు సంభవించటంతో ఫ్రెంచి ప్రభుత్వం యానాం ప్రజలందరికీ 1903 లో మసూచి టీకాలు వేయించింది. 1906 లో యానాంలో మలేరియా కారణంగా ప్రతి వెయ్యిమందికి 11 మందిచొప్పున మరణించినట్లు రికార్డులు చెపుతున్నాయి. 1908 లో మలేరియా బారినపడి యానాంలో 59 మంది చనిపోయారు. (6. Bullitin of National Academy of Medicine)

కాలక్రమేణా పాండిచేరీనుంచి యానాం వచ్చి వైద్యసేవలందించటానికి వైద్యులు నిరాశక్తత చూపించటంతో వైద్యుల కొరత మొదలైంది. యానాంలో డాక్టరు లేకపోవటం వల్ల ప్రజలు అనేక ఇబ్బందులకు గురవుతున్న విషయాన్ని గమనించిన చర్చి ఫాదర్ గాంగ్లాఫ్ 1933 లో కాకినాడ నుంచి ఒక డాక్టరును అభ్యర్ధించి, తీసుకువచ్చి రోగులకు వైద్య సదుపాయాన్ని కల్పించారు. అదే పరిస్థితి చాలాకాలం కొనసాగింది.









## పాండిచేరీలో యానాం వైద్యుని కీర్తి బావుటా (1908-1976)

పదకొండు సంవత్సరాల ప్రాయంలో ఫ్రెంచి ప్రభుత్వ మెరిట్ స్కాలర్‌షిప్ సాధించి చదువుకోవటానికి యానాం నుంచి ఒంటరిగా ప్రయాణం చేసి పాండిచేరీ లో రెండు జతల బట్టలతో అడుగుపెట్టిన ఒక విద్యార్థి తదుపరి కాలంలో- ఉపాధ్యాయుల చే అత్యంత ప్రతిభావంతుడైన విద్యార్థిగా, ప్రజలచే మానవత్వం కలిగిన వైద్యునిగా, విద్యార్థులచే ఉత్తమ ప్రమాణాలు కలిగిన సర్జరీ ప్రొఫసరుగా, రాజకీయ నాయకులచే గొప్ప సమర్ధత కలిగిన వైద్య నిర్వహణాధికారిగా, సహాద్యాయిలచే ట్రాపికల్ సర్జరీలో అథారిటీగా పేరు తెచ్చుకొన్నాడు. ఆ విద్యార్థి పేరు నల్లం సత్యనారాయణ.

అప్పట్లో ఉన్నత చదువులకోసం యానానికి ఎంతో సుదూరంగా ఉండే పాండిచేరీ పంపటానికి తల్లితండ్రు లు ఇష్టపడేవారు కాదు. అంతే కాక పిల్లలు కూడా ఇంటిపై బెంగతో చదువు మధ్యలోనే నిలిపి తిరిగి వచ్చేసేవారు. అందుచేత అధికారులు యానాం విద్యార్థులకు మెరిట్ స్కాలర్‌షిప్ ఇవ్వటానికి సంకోచించేవారు. కానీ మెరిట్ స్కాలర్‌షిప్ ఇవ్వటానికి జరిపిన మౌఖిక పరీక్షలో నల్లం సత్యనారాయణ ప్రదర్శించిన అసాధారణ ప్రతిభను గుర్తించి నెలకు పదిహేను రూపాయిల స్కాలర్‌షిప్‌ను మంజూరుచేయటం జరిగింది. ఈ విషయం తెలుసుకొన్న నల్లం సత్యనారాయణ తండ్రిగారైన శ్రీ నల్లం పరాంకుశం గారు, తమ అబ్బాయిని పాండిచేరీ పంపించటానికి తన అయిష్టతను తెలియచేయగా స్కాలర్‌షిప్ కమిటీ మెంబర్లలో ఒకరయిన యానాం జడ్జి Mr. Jules Rassendren పరాంకుశం గారితో మాట్లాడి పాండిచేరీలోని తన ఇంటిలోనే అబ్బాయికి వసతి ఏర్పాటు చేస్తానని హామీ ఇచ్చి ఒప్పించారట. అలా నల్లం సత్యనారాయణ పదకొండేళ్ళ వయసులో ఒంటరిగా పాండిచేరీలో ఉన్నత విద్యనభ్యసించటానికై యానాం నుంచి బయలుదేరాడు. తాను వచ్చిన భాద్యతను మరువక శ్రద్ధతో విద్యనభ్యసించటం, పెద్దల యెడల గౌరవప్రపత్తులను కలిగిఉండటం వంటి లక్షణాలచేత కొద్దికాలంలోనే ఆ అబ్బాయి- టీచర్లకు, రాశేంద్రన్ కుటుంబసభ్యులకు ఎంతో ప్రీతి పాత్రుడయ్యాడు.


డా. నల్లం సత్యనారయణ గారు

Baccalaureate (Degree course) చదువు పూర్తయిన తరువాత నల్లం అప్పటి హెల్త్ డైరెక్టర్ Dr.Labernadie సలహామేరకు 1932 లో డాక్టరు చదువు చేపట్టారు. 1936 లో శ్రీ నల్లం నెడుంగాడు అనే చిన్న పల్లెటూరుకి డాక్టరుగా నియమింపబడ్డారు. ఆ తరువాత బాహూర్ అనే ప్రాంతానికి మెడికల్ ఆఫీసరుగా ట్రాన్స్‌ఫర్ చేయబడ్డారు. ఫ్రెంచి జాతీయ పతాకం కట్టిన ఒక ఎడ్లబండిపై ఈయన ప్రతీరోజూ బాహూర్ కు సంభందించిన 12 గ్రామాలను తిరుగుతూ ప్రజలకు వైద్యసేవలందించేవారు. ఫ్రెంచి ప్రభుత్వం వీరిని బాహూర్ మేయర్ భాద్యతలను కూడా నిర్వర్తించమని కోరటంతో, ఆ భాద్యతలను కూడా సమర్ధవంతంగా నిర్వర్తించి ప్రజలలో మంచి పేరు తెచ్చుకొన్నారు. 1940లో వీరికి బాహూర్ నుంచి యానాంకు ట్రాన్స్‌ఫర్ అయినపుడు, ఆ ఊరి ప్రజలందరూ ఇళ్ళకు తాళాలు వేసి పిల్లా, పాపలతో రైల్వే స్టేషనుకు వచ్చి సాదరంగా వీడ్కోలు పలకటాన్ని బట్టి వీరెంత వారి అభిమానాన్ని చూరగొన్నారో అర్ధం చేసుకొనవచ్చును.

శ్రీ నల్లం సత్యనారాయణ గారు యానాంలో పనిచేసిన కాలంలో హస్తవాసి మంచిదన్న పేరు తెచ్చుకోవటంతో, ఎంతో మంది చుట్టుపక్కల ప్రాంతాల రోగులు వీరి వద్దకు వైద్యానికి వచ్చేవారు. అతి క్లిష్టమైన హెర్నియా ఆపరేషన్లను ఈయన ఎంతో సునాయాసంగా చేసేవారట.

1942 నుంచి1966 లో రిటైర్ అయ్యేవరకూ శ్రీ నల్లం పాండిచేరీ హాస్పటల్ నందు డిపార్ట్‌మెంట్ ఆఫ్ సర్జరీలో పనిచేసారు. ఆ సమయంలో వైద్యవిద్యార్ధులకు అనాటమీ, సర్జరీ శాస్త్రాలను భోదించేవారు. మెడికల్ జర్నల్స్ లో సర్జరీకి సంభందించిన అనేక వ్యాసాలను వ్రాసారు. ఎన్నో వేల సర్జరీలను చేసి రోగులకు సేవలందించారు. ఫ్రాన్స్ నుంచి వచ్చిన వైద్యులు వీరి వద్ద సర్జరీలో మెళుకువలు నేర్చుకొనేవారు. "నల్లం క్లినిక్" అనే పేరుతో ఒక ప్రెవేట్ వైద్యశాలను నెలకొల్పి ఎంతో మందికి ఉచిత వైద్యం చేసేవారు. రోగి వేషధారణను చూసి కొంతమంది నిరుపేదలకు మందులు ఉచితంగా ఇవ్వటమే కాక, 'మంచి తిండి తిను' అంటూ సొరుగులోంచి డబ్బులు కూడా తీసి ఇచ్చి పంపించేవారట. 1952 లో యానాం భయంకరమైన వరద తాకిడికి గురయినపుడు, శ్రీ నల్లం తన మిత్రులు, పేషంట్ల నుండి భారీ విరాళాలు సేకరించి యానాం వచ్చి బాధితులకు స్వయంగా అందచేసారు.

యానాం నుంచి చదువుకోవటానికి పాండిచేరీ వచ్చిన విద్యార్ధులకు తగిన వసతి దొరికేవరకూ శ్రీ నల్లం తన ఇంట్లోనే ఆశ్రయం కల్పించేవారు. అలా వీరి ఇల్లు నిత్యం అనేక మంది అతిధులతో ఒక సత్రాన్ని తలపించేదట. శ్రీ సత్యనారాయణ గారి ధర్మపత్ని శ్రీమతి సత్యనారాయణమ్మ గారు కూడా ఎంతో ప్రేమగా వారందరికీ వండి వడ్డించేవారు. శ్రీ నల్లం దాతృత్వాన్ని నేటికీ కొంతమంది పాతతరం యానాం వాసులు తలపోసుకొంటూంటారు. శ్రీ నల్లం కు సాహిత్యం, కర్ణాటక సంగీతం ల పట్ల ఆశక్తి ఎక్కువ. 1967లో శ్రీ నల్లం పాండిచేరీలోని తెలుగు వారి సాంస్కృతిక వికాసం కొరకు "ఆంధ్రమహాసభ" అనే సంస్థను స్థాపించారు. ఇది నేటికీ నడుస్తూన్నది.

శ్రీ నల్లం జీవనయానాన్ని గమనిస్తే-కృషి పట్టుదల ఉన్న వ్యక్తి ఎంత ఎత్తులకైన ఎదగగలడనీ, ఎంత ఎదిగినా మూలాల్ని మరచిపోకుండా కాపాడుకోవటం అవసరమనీ, వైద్యవృత్తిలో కత్తెరకు నైపుణ్యమే కాక హృదయానికి ఉదారత కూడా ఉండాలని తెలుస్తుంది.

## హెల్త్ కమిటీలు

పట్టణంలో పారిశుధ్య పరిరక్షణ, అంటువ్యాధుల నివారణ చర్యలు, ప్రజలలో వాక్సినేషన్–వ్యక్తిగత పరిశుభ్రత వంటి ప్రక్రియల పట్ల అవగాహన కల్పించటం వంటి విధులు నిర్వర్తించటం కొరకు ఫ్రెంచి ప్రభుత్వం హెల్త్ కమిటీలను నియమించేది. దీనికి పెద్దొర ఛైర్మెన్‌గాను, మేయరు, హెల్త్ ఆఫీసరు (డాక్టరు) లు ప్రధాన మెంబర్లు గాను మరికొంతమంది ప్రముఖులు ఇతర మెంబర్లుగాను ఉండేవారు. 1885 లో యానాం హెల్త్ కమిటీకి కంతేటి సత్యప్రసన్నం, పైడికొండల సుబ్బయ్య, కూనంరెడ్డి కృష్ణమ లను మెంబర్లను గవర్నరుగారు నియమించారు. 1906 లో సమతం వెంకటసుబ్బారాయుడు, పుణ్యమూర్తుల వెంకటసుబ్బారాయుడు, కాపగంటి సుబ్బరాజు, యానాం పోలీసు కమీషనర్ లు హెల్త్ కమిటీ మెంబర్లుగా వ్యవహరించారు.

## పెద్దొర భవన పునర్నిర్మాణం

1904 లో ఫ్రెంచి ప్రభుత్వం ప్రైవేటు వ్యక్తులనుండి పెద్దొర భవనాన్ని కొనుక్కుంది. అంతవరకూ అద్దె చెల్లిస్తూండేది. ఇది అప్పటికి సుమారు వందేళ్లక్రితం డాక్టర్ పిథోస్ నిర్మించిన రెండంతస్థుల భవనం. 1906 లో వచ్చిన వర్షాలకు ఇది దెబ్బతిని పూర్తిగా శిథిలావస్థకు చేరుకోవటంతో, అక్టోబరు 22 న గవర్నరుగారు అత్యవసరంగా సమావేశమయి పునర్నిర్మాణం చేయాలని నిర్ణయించారు. అందుకొరకు రెండువేలరూపాయిల ప్రత్యేక బడ్జెట్టును కేటాయించి, ఈ నూతన భవననిర్మాణాణ ఖర్చులు, నాణ్యతను చూడటానికి Ribero అనే అధికారిని నియమించారు. అలా అపుడు నిర్మించబడిన భవనమే నేటికీ యానాం కలక్టరు అధికారిక నివాసంగా ఉంది.

## ఇతర పనులు

యానాం పాత మేప్ లలో ప్రజల మంచినీటి అవసరాలు తీర్చటానికి ద్రాక్షారం వెళ్ళే రోడ్డు పక్కన నల్లచెరువు, అంబేద్కర్ నగర్ వద్ద ఒక చెరువు (దళితులకొరకు) ఉన్నట్లు తెలుస్తుంది. ఇవి కాక ప్రధాన వీధులలో నూతులు ఉండేవి. 1869లో ఫ్రెంచి ప్రభుత్వం పెద్ద మార్కెట్ వద్ద (గ్రాండ్ బజారు) ఒక ప్రజలకొరకు ఒక నుయ్యి నిర్మించినట్లు రికార్డులు చెపుతున్నాయి.

1906 లో ఫ్రెంచిగవర్నరు యానాం పర్యటించినపుడు శ్రీబెజవాడ బాపనయ్య "యానాం ప్రజలకు పైపుల ద్వారా మంచినీటి సరఫరా ఏర్పాటు చేయమని" కోరారు. కానీ పైపుల ద్వారా నీటి సరఫరా స్వప్నం నెరవేరటానికి మరో పాతికేళ్లు నిరీక్షించవలసి వచ్చింది. 1931 లో ఫ్రెంచి ప్రభుత్వం 18,500 రూపాయిలలో యానాంలో పైపులద్వారా రక్షిత మంచినీటి సరఫరా పనులను చేపట్టినట్లు ఆ ఏడాది పాండిచేరీ బడ్జెట్టు ఆదాయ వ్యయాల పట్టిక లో కనిపిస్తుంది.





1948 లో యానాంలోని "దీనపోషక సమాజం" యొక్క నూతన భవన నిర్మాణానికి ఫ్రెంచి ప్రభుత్వం రెండువేల రూపాయిల ఆర్థిక సహాయం చేసింది. 1948, అక్టోబరు 25 న అప్పటి ఫ్రెంచి గవర్నరు శ్రీ ఎ. మెనార్డ్ చేతులమీదుగా ఈ భవనప్రారంభోత్సవం జరిగింది. ఫ్రెంచి ప్రభుత్వం యానాంలో ఇంతభారీ స్థాయిలో సామాజిక సంస్థలకు ఆర్థికసహాయం చేసిన ఇతర సంఘటనలు కనిపించవు. బహుశా దీనపోషక సమాజం యానాం దీనజనోద్ధరణకు చేస్తున్న కృషిని గుర్తించి అందించిన తోడ్పాటుగా భావించుకొనవచ్చును.

1839 నాటి మేప్‌లో యానాం టవునును అనుబంధ గ్రామాలతో అనుసంధానం చేస్తూ మూడు ప్రధానమైన రోడ్లు కనిపిస్తాయి. ఇవి పెద్దొర భవనం నుంచి (పెద్దొర భవనం ముందు ఉన్న రోడ్డును Rue de Government అనే వారు) మెట్టకూరు చివరవరకూ 3500 మీటర్ల రోడ్, యానాం నుంచి ఫరంపేట వరకూ 6000 మీటర్ల పొడవున్న ఒక రోడ్, కనకాలపేట వరకూ 2500 మీటర్ల ఒక రోడ్. ఆ తరువాత ఫరంపేట నుంచి అడవిపొలం వరకూ (10.3 కి.మీ) రోడ్డును పొడిగించటం జరిగింది. 1864–1870 ల మధ్య యానాం లో అనేక చిన్నచిన్నరోడ్ల నిర్మాణం జరిగింది.

ఇక సామాజిక సంక్షేమ కార్యక్రమాలు చేపట్టటానికి ఫ్రెంచి ప్రభుత్వం **'వెల్ఫేర్ కమిటీ'** పేరిట ఒక కమిటీని నియమించేది. జీవించటానికి ఏ ఆధారమూ లేనివారికి పించనులు ఇప్పించటం, ఆపత్కాలాలలో ప్రజలను ఆదుకోవటం, వంటి కార్యక్రమాలు చేసేది. బాధిత ప్రజలు ఈ వెల్ఫేర్ కమిటీకి తమగోడును విన్నవించుకొంటే కమిటీ సభ్యులు నిజనిర్ధారణ చేసి తగురీతిలో ఆ కుటుంబానికి ఆర్థికసాయం చేసేవారు. 1881 బడ్జెట్టులో వెల్ఫేర్ కమిటీకి 1800 రూపాయిలు కేటాయించగా 1904 లో ఈ మొత్తాన్ని వెయ్యిరూపాయిలకు తగ్గించటం గమనార్హం.

# ఆనాటి సాహితీ వేత్తలు

సాహిత్యపరంగా ఘనతవహించిన ఇంజరం, పిఠాపురం, రాజమండ్రి, కాకినాడ, కోనసీమ వంటి ప్రాంతాల నడుమ ఉన్న యానాం సహజంగానే ఆ వాసనలను పుణికి పుచ్చుకొంది. ఫ్రెంచియానాంలో అలనాటి సాహితీవేత్తల వివరాలు ఉన్నాయి కానీ కొంతమంది రచనలగురించి పెద్దగా సమాచారం తెలియరాదు.

**చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి:** ఈయన తిరుపతివెంకట కవులుగా పేరుతెచ్చుకొన్న జంటకవులలో ఒకరు. వీరు కడియంలో 1870 లో జన్మించారు. పదేండ్లవయసులో వీరు యానానికి విద్యాభ్యాసం కోసం వచ్చారు. కొంతకాలం ఫ్రెంచిస్కూలులో విద్యనభ్యసించారు. వీరు యానాంలో ఉండగా తెలుగు, ఆంగ్లం, సంస్కృతం భాషలు అధ్యయనం చేసారు. తిరుపతిశాస్త్రి 18 ఏండ్ల వయసులో ఉన్నప్పుడు, యానాం వెంకటేశ్వర స్వామి పై వ్రాసిన శతకంలో వ్యాకరణ దోషాలున్నాయని స్థానిక పండితులు విమర్శించటంతో, పౌరుషంవచ్చి వారణాసి వెళ్ళి సంస్కృత వ్యాకరణాన్ని నేర్చుకొని వచ్చారట. వీరి అత్తగారి ఊరు యానామే. 1901 లో తిరుపతిశాస్త్రి కాకినాడకు మకాం మార్చారు. వీరు సంస్కృతం, తెలుగులలో అనేక స్వతంత్ర మరియు అనువాద రచనలు చేసారు. తిరుపతిశాస్త్రి రచించిన నాటకాలలో పాండవవిజయము ప్రసిద్దమైనది. 'కథలు గాథలు' పేరిట వీరు వ్రాసిన వ్యాసపరంపర ఆనాటి కాలమాన పరిస్థితులకు అద్దంపడుతుంది.

**మహేంద్రవాడ వీర గణపతి శాస్త్రి:** (1911–1976) వీరు ఫ్రెంచి ప్రభుత్వముచే Officer de Instruction Publique (Officer of Public Instruction) అనే అవార్డును పొందారు. ఇది నేటి ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు వంటిది. గణపతి శాస్త్రి ఆంధ్రదేశము గర్వించదగిన జ్యోతిష్యశాస్త్ర పండితులు. జ్యోతిష్య శాస్త్రానికి సంబంధించి వీరు, హస్త సాముద్రికము, భృగురాజ కాండ, సంఖ్యా జ్యోతిష్య సారము, అరచేతిలో అదృష్టం వంటి వివిధ గ్రంధాలను రచించారు. ఈ పుస్తకాల "ఒక్క కాపీ ఉంటే పంపించండి" అంటూ దేశ విదేశాలనుంచి నేటికీ వీరి కుటుంబీకులకు







ఉత్తరాలు వస్తున్నాయంటే ఆయా పుస్తకాల విలువను అర్ధం చేసుకొనవచ్చును.

**సమతం కృష్ణయ్య:** వీరు యానానికి చెందిన కవి,పండితుడు, ఆయుర్వేద వైద్యుడు మరియు రాజకీయనాయకుడు. ఈయన తెలుగు చందస్సు పై అనితరసాధ్యమైన పట్టును సాధించి, పద్యాలను అలవోకగా అల్లేవారట. వీరు రచించిన పుస్తకాల వివరాలు తెలియరావు.

**కాళ్ల వెంకటరత్నం:** ఈయన 1930లలో యానాం కోర్టులో బైలిఫ్ గా పనిచేసారు. వీరు లలితమైన పదాలలో గీతాలను, పద్యాలను వ్రాసేవారట. ఒకనాటి యానాం మేయరైన మద్దింశెట్టి సత్యానందం వంశచరిత్రను కాళ్ల వెంకటరత్నం చందోబద్దంగా గ్రంధస్థం చేసారు.

**వంటెద్దు సుబ్బారాయుడు మరియు వి. వెంకటస్వామి నాయుడు:** వీరు అద్భుతమైన పద్యాలను రచించేవారట. కొన్ని పుస్తకాలను కూడా ప్రచురించినట్లు అంటారు కానీ ఏవీ లభ్యంలో లేవు. వీరిలో వంటెద్దు వెంకటస్వామినాయుడు మున్సిపల్ కౌన్సిలర్ గా కూడా పనిచేసారు.

**గెల్లా శ్రీనివాసరావు:** 1908 సంవత్సరములో జన్మించారు. వీరికి సంగీత, సాహిత్యములలో మంచి ప్రవేశం ఉంది. దీనపోషక సమాజం తరపున చేసే ధనుర్మాస భజనలకు వీరు అనేక కీర్తనలు వ్రాసి, స్వరపరచి ఇచ్చేవారు. గెల్లా శ్రీనివాసరావు తాను వ్రాసిన కవితలను ప్రముఖ కవి దేవులపల్లి కృష్ణశాస్త్రికి చూపించినపుడు ఆయన వాటిని ఎంతగానో మెచ్చుకొని ప్రశంసించారట.

**పాము రామమూర్తి:** వీరు 1930 లో జన్మించారు. అనేక రచనలు చేసి దళితుల అభ్యున్నతికొరకు జీవితాంతం శ్రమించారు. 'ఆది ఆంధ్ర జాతీయగీతములు', 'హరిజనోద్యమము' 'రాష్ట్ర హరిజన నాయకుల చరిత్ర' వంటి పెక్కు గ్రంథములను పాము రామమూర్తి రచించారు.

**వేదుల రామకృష్ణ శాస్త్రి:** జంటకవులుగా పేరుగాంచిన రామకృష్ణకవులలో ఒకరైన వీరు యానాంలో తన మొదటి అవధానాన్ని చేసారు. దీనికి చెళ్ళపిళ్ళ తిరుపతి శాస్త్రి ఒక పృచ్ఛకునిగా ఉన్నారట.

**బొల్లోజు బసవలింగం:** వీరు 1932లో జన్మించారు. 16 సంవత్సరముల ప్రాయంలో వీరు రచించిన "రాణిదుర్గావతి" అనే పద్యకావ్యం పలువురి పండితుల ప్రశంసలు పొందింది. వీరు పిన్న వయసులో రచించిన ఉగాది పద్యాలు, యానానికి చెందిన మరోకవి అయిన సమతం కృష్ణయ్య కు ఎంతగానో నచ్చటంతో వాటికి పటం కట్టించి 'యంగ్మెన్స్ లైబ్రేరీ' లో పెట్టించారట. ఎవరుదోషి, వారసుడు, రాధామాధవం, త్యాగజ్వాల, కర్తవ్యం, నిజందాగదు, సతీఅహల్య, బాగుపడాలంటే, శ్రీకృష్ణరాయబారం వంటి అనేక నాటకాలను బొల్లోజు బసవలింగం రచించారు.

డా.అంబేద్కర్ రచనలను కొన్ని అనువదించారు. వీరి కలంపేరు సువర్ణశ్రీ.

యానాంలో పండితులకు, విద్వాంసులకు కొదవులేదు. ఇంద్రగంటి విశ్వపతిశాస్త్రి, కశిరెడ్డి సుబ్బారాయుడు, నాగసూరి వెంకటరాజు వంటివారు గొప్ప పాండిత్యప్రకర్షను ప్రదర్శించేవారట. చుట్టు పక్కల ఊళ్లనుంచి విద్యార్థులు యానాం వచ్చి ఇక్కడి పండితుల వద్ద వేదాధ్యయనం చేసేవారట. ప్రతీరోజు వీరు అలా ఉచ్చ స్వరంతో వేదపఠనం కావిస్తుండటం స్థానికులకు శ్రావ్యంగా అనిపించినా, ఒక ఫ్రెంచిదొరకు మాత్రం నచ్చక పోలీసు కంప్లైంట్ ఇచ్చి ఆ వేదపాఠశాలను వేరేచోటికి తరలింపచేసాడట.

ఏది ఏమైనప్పటికీ ఫ్రెంచియానాం సాహిత్య, పాండిత్యాల పరంగా వెనుకబడిలేదనే చెప్పొచ్చు. పాండిచేరీకి చెందిన భారతీదాసన్, అరవిందో, సుబ్రహ్మణ్య భారతి (కొంతకాలం పాండిచేరీలో ఉన్నారు) వంటి ప్రముఖ సాహితీవేత్తల ప్రభావం యానాం సాహితీకారులపై ఉన్నట్లు అనిపించదు. యానాంలో పనిచేసిన ఫ్రెంచిదేశస్థులలో సొన్నరెట్ మినహా ఎవరూ రచనా వ్యాసంగాన్ని నెరపినట్లు తెలియరాదు.







# ఆనాటి ప్రజల వితరణ

ఆపదలో ఉన్న వారిని ఆదుకోవటం అనేది సమాజమౌలిక లక్షణం. సమాజం యొక్క పరిణతి అది ప్రదర్శించే కూరిమి ద్వారానే తెలుస్తుంది. ఫ్రెంచియానాం అనేక సందర్భాలలో అవసరమైనవారికి తనవంతు సహాయాన్ని అందించి తన ఔన్నత్యాన్ని చాటుకుంది. అప్పట్లో ఇక్కడి ప్రజలు స్పందించిన సందర్భాలను గమనిస్తే ఆశ్చర్యం కలుగక మానదు. ఇవి ఎక్కువగా అంతర్జాతీయ స్థాయికి చెందినవై ఉన్నాయి. దీనికి కారణం ఫ్రెంచిరాజ్యం ప్రపంచవ్యాప్తంగా విస్తరించి ఉండటం కావొచ్చు.

**మార్టినిక్ అగ్నిపర్వత విస్ఫోటనం:** మార్టినిక్ (Martinique) అనేది యానాంలానే ఆనాటి మరో ఫ్రెంచికాలనీ. ఇది దక్షిణఅమెరికా కు సమీపంలో కల ఒక ద్వీపం. ఇక్కడ 1902 మే, 8 న భారీ అగ్నిపర్వత విస్ఫోటనం జరిగింది. ఈ ప్రమాదంలో 30 వేల మంది మృతి చెందారు. అనేక వేలమంది నిరాశ్రయులయ్యారు. ఇరవయ్యవ శతాబ్దపు అత్యంత దారుణమైన విస్ఫోటనం గా దీనిని వర్ణిస్తారు. ఆనాటి మార్టినిక్ బాధితుల సహాయార్థం యానాం ప్రజలు చందాలు వేసుకొని కొంత డబ్బు పంపించటం జరిగింది. కొంతమంది వివరాలు ఈ విధంగా ఉన్నాయి. (రి. Journale Officiale de l'inde Francaise సంచికలు)

ఎమ్. స్పీల్‌మేన్ ఆడ్మినిస్ట్రేటర్ , మన్యం మహలక్ష్మమ్మ, జమిందారిణి, బెజవాడ వెంకట రెడ్డి, కామిశెట్టి పేరమ, ఇ.ఫాసియోల్, పోలీస్ కమిషనర్, లా దె క్లాపర్నాన్, టాక్స్ కలక్టర్, బెజవాడ బాపనయ్య మేయర్, కోన సత్తియ్య, కశిరెడ్డి వెంకన్న, మాజేటి చిన రామన్న, కాపగంటి సుబ్బరాజు, ఎర్రంశెట్టి వెంకటరామయ్య, యేటన్ నోటరీ, కాళ్ల రెడ్డి, ఎమ్. లే, బాలికల స్కూలు హెడ్ మాస్టర్, గిరి తాతయ్య, ఎ. పెర్రావూ రెవిన్యూ అధికారి. వీరే కాక రూపాయి కన్నా తక్కువమొత్తాలు ఇచ్చిన వారు వందమందికి పైగా ఉన్నారు. మన్యం మహలక్ష్మమ్మ అందరికన్నా ఎక్కువ మొత్తం ఇచ్చినట్లు తెలుస్తుంది. (అప్పట్లో యానాం నుంచి వసూలు చేసిన ఆస్థి పన్ను సగటు మొత్తంలో సుమారు నలభైశాతం వరకూ ఈమె వాటాగా ఉండేది.)

**మొదటి ప్రపంచ యుద్ధం:** మొదటి ప్రపంచ యుద్ధంలో గాయపడిన ఫ్రెంచి సైనికుల సహాయార్ధం ఫ్రెంచికాలనీల ప్రజలు చందాలు వేసుకొని కొన్ని నిధులను సమీకరించి పంపించారు. పాండిచేరీనుంచి 43,283/-, కారైకాల్ 47,010/-, మాహే 897/- యానాం 2,429/- రూపాయిలు పంపించినట్లు రికార్డులలో ఉంది.

యుద్ధ సమయంలో నిధుల సమీకరణ కొరకు ఫ్రెంచి ప్రభుత్వం గోల్డ్‌బాండ్ స్కీమును ప్రవేశపెట్టింది. ఇందులో ప్రజల వద్దనుంచి బంగారంను తీసుకొని దానికి సమాన విలువకల బాండు ను జారీ చేస్తుంది. ఈ బాండును కొంతకాలం తరువాత నగదుగా మార్చుకొనవచ్చును. ఈ పథకానికి చేయూతనిచ్చి తమ దేశభక్తిని చాటుకోవలసినదిగా ఫ్రెంచి గవర్నరు 1915 లో కాలనీల ప్రజలకు విజ్ఞప్తి చేసారు.

గవర్నరుగారి విజ్ఞప్తిమేరకు యానాం నుంచి అనేక మంది బంగారు నాణాలను ప్రభుత్వానికి ఇచ్చి బాండులను పొందారు. వారిలో దవులూరి నారాయణ స్వామి, మలిపెద్ది అంకయ్య, సాదనాల వెంకన్న, బళ్లా వెంకటరత్నం,ఇబ్రహిం ఖాన్, గిరి మాధవరావునాయుడు, దవులూరి చినవీరాస్వామి, తదితరులు ఉన్నారు.

**రెండవ ప్రపంచ యుద్ధం:** 1940 లో జర్మనీ చేతిలో ఫ్రాన్స్ ఓడిపోయి సంధి కుదుర్చుకొంది. ఈ సంధిని ఇష్టపడని కొంతమంది, చార్లె డిగాలే అనే మిలటరీ అధికారి నాయకత్వంలో జెర్మనీ సేనలకు వ్యతిరేకంగా పోరాటం జరుపటం మొదలెట్టారు. దీన్ని 'ఫ్రీ ఫ్రెంచి మూవ్‌మెంట్' అంటారు. పాండిచేరీలోని ఫ్రెంచి గవర్నరు అనేక తర్జనబర్జనల అనంతరం ఈ మూవ్‌మెంటుకు మద్దతు ప్రకటించాడు. ఈ ఉద్యమం ముందుకు నడవటానికి యానాం ప్రజలు కూడా తమ వంతు ఆర్ధిక తోడ్పాటునందించారు. వారిలో ఎర్రా జగన్నాథరావు, గిరి బలరామ స్వామి, దవులూరి వెంకటరాజు,మన్యం కనకయ్య, కొత్త వెంకటరత్నం, ఇబ్రహిం ఖాన్, వర్ధినీడి కొండయనాయుడు, మొహమ్మద్ హుస్సేన్, కోన వెంకటరాజు, మహమ్మద్ జక్రియా తదితరులు ఉన్నారు.

**ఆంధ్రనిఘంటువుకు ఆర్ధికసాయం:** యానానికి సమీపానకల కరప గ్రామానికి చెందిన కోట్ర శ్యామల కామశాస్త్రి కూర్చిన 'ఆంధ్ర వాచస్పత్యం' అనే నాలుగు వాల్యూముల తెలుగు నిఘంటువు ముద్రణకు, ఇరవయ్యవ శతాబ్దప్రారంభంలో యానాం ప్రజలు భారీగా విరాళాలు ఇచ్చి ప్రోత్సహించారు. నెలకు నూరు పేజీల చొప్పున 1934 లో ఈ నిఘంటువు ముద్రణ మొదలై 1940 నాటికి పూర్తయింది. ఈ నిఘంటు నిర్మాణంలో శ్యామల కామశాస్త్రి గారు తన నలభై ఎకరాల భూమిని వ్యయం చేసి నిస్సహాయులైన తరుణంలో యానాం ప్రజలు భూరి విరాళాలు ఒసగి ఆ బృహత్కార్యాన్ని ముందుకు నడిపించారట. ఈ నిఘంటువు సూర్యారాయాంధ్ర నిఘంటువును మించి ఉన్నదని గిడుగువారు ప్రశంసించారు.







**తల్లమ్మ ఔదార్యం**

వంతెన నిర్మించటానికి ముందు యానాం రావాలంటే స్థానిక పడవలరేవు వీధి వద్దకల రేవులో పడవదాటవలసి వచ్చేది. రాత్రిపూట రేవు మూసివేసిన తరువాత వచ్చిన ప్రయాణికులు, రేవు కూలీలు ఆ సమీపంలో కల ఒక మేడ అరుగులపై పడుకొనే వారు. ఆ మేడ యజమానురాలైన ఒక కళావంతుల స్త్రీ (శ్రీ నాగసూరి వెంకటరత్నం గారి భార్య) వారికి భోజనవసతి కల్పించేవారట. అలా ప్రతీ రాత్రీ ఎంతో మందికి ఆమె స్వహస్తాలతో ఒడ్డించి పెట్టేదట. శీతాకాలపు చలిలో నిద్రలో వణుకుతూన్న ప్రయాణీకులపై దుప్పట్లు కప్పేదట. ఆమె అసలు పేరు ఏమైనప్పటికీ ఆమె ప్రదర్శించే ఔదార్యం పట్ల గౌరవంగా ఆమెను **"తల్లమ్మ"** (అమ్మలకు అమ్మ) అని స్థానికులు పిలుచుకొనేవారు. నేటికీ నిలిచి ఉన్న ఆ మేడను కొందరు పాతతరం వ్యక్తులు **తల్లెమ్మ మేడ** గానే వ్యవహరిస్తారు.

# ఫ్రెంచి పాలన చివరి రోజులు

భారత్ లోని ఫ్రెంచి కాలనీల చరిత్రను గమనిస్తే, వీరు మొదటగా 1668 లో సూరత్ వద్ద ఒక స్థావరాన్ని ఏర్పాటు చేసుకొని తమ వ్యాపార కార్యకలాపాలను మొదలెట్టారు. ఆ తరువాత మచిలీపట్నం, ఢాకా, కాసింబజార్, బాలాసోర్, కాలికట్, పాట్నా లలో చిన్న చిన్న వ్యాపార గిడ్డంగులను నెలకొల్పారు. 1673/74 లో పాండిచేరీ, 1721 లో మాహే, 1723 లో యానాం, 1738 లో కారైకాల్, 1774 లో చంద్రనాగూర్ లను తమ స్థావరాలుగా చేసుకొన్నారు. పాండిచేరీ, మాహె, కారైకాల్, చంద్రనాగూర్ మరియు యానాం లు మినహా మిగిలిన చిన్న చిన్న ప్రాంతాలను ఫ్రెంచి గవర్నర్ బారన్ 1947 అక్టోబరు 6 న స్వతంత్ర్య భారతదేశానికి అప్పగించేసాడు.

### ఫ్రాన్స్‌కు సెంటిమెంటు – భారత్‌కు అవసరం

మిగిలిన ప్రాంతాలు ఫ్రెంచి పాలననుండి విమోచనం చెంది భారతావనిలో విలీనం చెందటంలో అనేక నాటకీయపరిణామాలు చోటుచేసుకొన్నాయి. ఫ్రెంచి కాలనీలన్నీ దూర దూరంగా ఉండటం వల్ల వీటిని నియంత్రించటం ఫ్రెంచి వారికి కష్టంగా ఉండేది. భారతావని సుమారు 10 లక్షల చదరపు మైళ్ళు ఉంటే, ఈ కాలనీలన్నీ కలిపి రెండువేల చదరపు మైళ్ళ విస్తీర్ణం మాత్రమే. అంతే కాక ఈ ప్రాంతాలకు స్పష్టమైన సరిహద్దులు లేవు. ఉదాహరణకు పాండిచేరీలోని చాలా ప్రాంతాలు పాండీతో విభక్తమై అన్నివైపులా భారత భూభాగాన్ని కలిగి ఉన్నాయి. పాండీనుంచి ఈ ప్రాంతాలకు వెళ్లాలంటే భారత భూభాగాన్ని దాటి పోవాల్సిందే. ఈ ప్రాంతాలను సంరంక్షించుకొనేందుకు అవసరమైన మిలటరీ శక్తి కూడా ఈ ఫ్రెంచి కాలనీలలో లేదు. అయినప్పటికీ భారత్ లోని తన కాలనీలతో ఫ్రాన్స్ కు ఉన్న అనుబంధం వలసరాజ్య భావనలకు అతీతంగా ఉండేది. ఇవి తమ దేశ అంతర్భాగాలని ఫ్రాన్స్ ఏనాడో ప్రకటించింది. అందుకనే ఫ్రాన్స్ లో చేపట్టే ప్రతీ సంస్కరణనూ పాండిచేరీలో కూడా అమలు పరచేది. 1882 లో తొలిసారి మున్సిపల్ ఎలక్షన్లు జరుపుతున్న సమయంలో “ఈ ఎలక్షన్ల ద్వారా ప్రజలు ఫ్రెంచి దేశంతో తమకున్న బంధాన్ని బలోపేతం చేసుకొంటారని ఆశిస్తున్నామని” గవర్నరు వ్యాఖ్యానించాడు.





1881 లో ఒక డిక్రీ ద్వారా స్థానిక ప్రజలు తమ భారతీయతను త్యజించినట్లయితే వారు కూడా ఫ్రాన్స్‌లోని పౌరులవలే ఫ్రెంచిచట్టాల పరిధిలోకి వస్తారని ప్రకటించింది. ఆ విధంగా పాండిచేరీనుంచి అనేక వేల మంది తమ భారతీయతను త్యజించి ఫ్రెంచి సంస్కృతి సాంప్రదాయాల పట్ల తమ కున్న అభిమానాన్ని చాటుకొన్నారు. తద్వారా ఈ కాలనీ ప్రజలు ఫ్రాన్స్ లో నివసించే ఫ్రెంచి పౌరులతో సమాన రాజకీయ, పౌరహక్కులను కలిగి ఫ్రెంచి సెనేట్‌లో తమ ప్రాతినిధ్యాన్ని పొందటం మొదలైంది. అందుకనే 1954 లో ఈ ప్రాంతాలను భారతదేశంలో విలీనం చేయమంటే – సుమారు 8 దశాబ్దాల పాటు ఫ్రెంచి పౌరులుగా ఉన్న ఈ ప్రజల అభిప్రాయం రిఫరెండం ద్వారా తెలుసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉందని ఫ్రాన్స్ వాదించింది.

ఇక భారత్ విషయానికి వస్తే, భౌగోళికంగా ఐక్యంగా ఉండటమనేది స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత భారతదేశం ముందున్న ప్రధమ లక్ష్యం. అందుకనే అప్పటికి దేశమంతా చెల్లాచెదురుగా ఉన్న కొన్ని వందల ప్రిన్స్‌లీ స్టేట్ లను ఒక్కొక్కటినీ నయానా భయానా ఒప్పించి విలీనం చేసుకోవటంలో కృతకృత్యమైంది. (ఆనాడు విలీనం కాకుండా మిగిలిపోయిన కాశ్మీర్ నేటికీ ఒక సమస్యగానే మిగిలిపోయింది). పోర్చుగీస్ మరియు ఫ్రెంచి దేశాలు 1947 నాటికి భారతదేశంలో ఇంకా తమ కాలనీలను కలిగిఉన్నాయి. వీటిని కూడా కలుపుకోగలిగినట్లయితే భారతదేశం అవిచ్ఛిన్నమైన భూభాగంగా అవతరిస్తుంది. అలా చేయలేక పోయినట్లయితే ఈ ప్రాంతాల వల్ల దేశ సమగ్రత, అంతర్గత భద్రతలకు ముప్పువాటిల్లే అవకాశముంటుందని భారత్ భావించింది.

పోర్చుగీస్ కాలనీలైన గోవా, డయ్యు, డామన్, దాద్రా మరియు నగర్ హవేలీ లను భారతావనిలో విలీనం చేసే ప్రక్రియలో ఎంతో మంది ప్రాణాలు కోల్పోయారు. భారతదేశం ఒకానొక దశలో పట్టుమని మూడువేల మంది కూడాలేని పోర్చుగీసు బలగాలపై ముప్పయివేల మంది సైనికులను, భారీ వాయుసేనలను రంగంలోకి దింపవలసి వచ్చింది. భారత్ చర్యలకు వ్యతిరేకంగా పోర్చుగల్, భద్రతా మండలిని ఆశ్రయించగా రష్యా తనకున్న వీటో పవర్ ను ఉపయోగించి భారత ఉద్దేశ్యాలు నెరవేరేలా సహకరించింది. అలా 1961లో పోర్చుగీసు కాలనీలు భారతదేశపు అంతర్భాగాలైనాయి.

ఇక ఫ్రెంచి కాలనీల విషయానికి వస్తే భారతదేశం సంయమనం పాటించింది. ఎందుకంటే స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వంఅనే భావనలను ప్రవచించే దేశంగా ఫ్రాన్స్ కు ప్రపంచవ్యాప్తంగా గుర్తింపు ఉంది. అంతే కాక భారతదేశంలోని తమ కాలనీలను ఒక వ్యాపార స్థావరాలుగా ఫ్రాన్స్ భావించక తమ దేశ అంతర్భాగాలుగా పరిగణించి ఇక్కడి పౌరులకు ఫ్రెంచి పౌరులకున్నటువంటి అన్ని రకాల రాజకీయ పౌర హక్కులను కల్పిస్తూఉండటం కూడా ఈ కాలనీల విషయంలో భారతదేశం ఆచి తూచి వ్యవహరించటానికి మరో కారణం. అహింస, అలీనతలకు పెద్దపీట వేసిన వ్యక్తిగా నెహ్రూకు అంతర్జాతీయంగా పెద్ద పేరు ఉంది. ఫ్రెంచి

కాలనీల విషయంలో 1947–1954 మధ్య భారత్–ఫ్రాన్స్ లు చిన్న చిన్న అభిప్రాయభేధాలను వ్యక్త పరచినా, **అంతిమంగా విన్–విన్ పరిస్థితులను పరస్పరం కల్పించుకొని ఇరుదేశాలు సమస్యనుంచి గౌరవంగా బయటపడ్డాయి.** ఈ కాలనీల విషయమై భారత్–ఫ్రాన్స్ ల మధ్య యుద్ధం జరగవచ్చునని అప్పట్లో ఉహాగానాలు ఉండేవని పాండిచేరీ ఆఖరు ఫ్రెంచి గవర్నరుగా పనిచేసిన André Ménard, August 30, 1985 న Patrick Pitoeff అనే చరిత్రకారునికి ఇచ్చిన ఇంటర్వ్యూలో అనటాన్ని బట్టి ఆనాటి పరిస్థితులను అర్థం చేసుకొనవచ్చును. భారతదేశం ఒకవైపు దౌత్యపరమైన చర్చలు, సంప్రదింపులు, చేస్తూనే, మరో వైపు ఈ కాలనీలను దిగ్బంధనం చేయటం వంటి చాణుక్యనీతిని ప్రదర్శించిందన్న విమర్శను ఎదుర్కోవలసి వచ్చింది.

## భిన్న వాదనలు

ఫ్రెంచి కాలనీల విలీనం పట్ల రెండు ప్రధాన వాదనలు ఉన్నాయి. ఫ్రాన్సే స్వచ్ఛందంగా ఈ కాలనీలను భారత్ కు అప్పచెప్పేసిందంటూ ఇండో–ఫ్రెంచి సంబంధాలను బలోపేతం చేసే వాదన ఒకవైపు మరియు ఈ కాలనీల ప్రజలలో జాతీయవాద భావనలు పెరిగి వలస పాలకులకు వ్యతిరేకంగా పోరాటం జరిపి వారిని పారద్రోలారన్న వాదనలు మరో వైపు వినిపిస్తాయి. రెండు వాదనలనూ వాస్తవాలుగానే స్వీకరించాలి. ఈ కాలనీల ప్రజల కోరుకుంటే ఈ ప్రాంతాలను భారతావనికి అప్పచెప్పేస్తానని ఫ్రాన్స్ ముందునుంచీ చెపుతూనే ఉంది. అలాగే చంద్రనాగూరు ను 1949 లోనే భారత్ కు ఇచ్చివేసింది. అదే విధంగా ఆనాడు ఫ్రెంచి పాలనకు వ్యతిరేకంగా పోరాడిన వి.సుబ్బయ్య, దడాల రఫేల్ రమణయ్యల ఆత్మకథలను పరిశీలిస్తే రెండవ వాదనను కూడా అంగీకరించక తప్పదు. *ఇక భారతదేశం సంయమనంతో ఈ రెండు ప్రక్రియలకు ప్రేరణకారిగా వ్యవహరించి, సమస్యను శాంతియుతంగా, అహింసా పద్ధతులలో పరిష్కరించుకోగలిగింది.*

భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వబోతున్నట్లు బ్రిటన్ ప్రకటించగానే, ఫ్రెంచ్ఇండియా పరిపాలనా వ్యవస్థను 1946 లో ఫ్రాన్స్ సమూలంగా మార్చివేసి, ప్రజా ప్రతినిధులకు విస్తృతాధికారాలు కట్టబెట్టి "స్వయంపాలన" జరుపుకొనే విధంగా చేసింది.

ఎప్పుడైతే బ్రిటిష్ వారు భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రకటించి తప్పుకొన్నారో, ఈ కాలనీల ప్రజలలో కూడా స్వాతంత్ర కాంక్ష పెరిగి ఈ ప్రాంతాలను ఫ్రెంచి పాలననుండి విముక్తి చేయాలన్న భావనలు పెరగసాగాయి. అదే సమయంలో ఫ్రెంచి పాలన ఉండాలని కోరుకొనే ప్రజలు కూడా ఉండేవారు. ఈ నేపథ్యంలో 1948 లో భారత్–ఫ్రెంచి ప్రభుత్వాలు ఈ 5 కాలనీల గురించి ఒక ఒప్పందం చేసుకొన్నాయి. దీని ప్రకారం ఈ కాలనీల ప్రజలు వారు భారతదేశంలో విలీనం చెందాలా వద్దా అనే విషయాన్ని ఎన్నికల ద్వారా (రిఫరెండం) తెలియచేయాలి. ఈ రిఫరెండం కూడా ఏ ప్రాంతంలో జరిగితే దాని ఫలితం ఆ ప్రాంతానికే పరిమితం. తదనుగుణంగా చంద్రనాగూర్ 1949 లో రిఫరెండం జరుపుకొని సమీప బెంగాల్ లో విలీనం అవుతానన్న తన ఆకాంక్షను తెలియచేసింది. దరిమిలా ఫ్రెంచి ప్రభుత్వం మారు







మాట్లాడక చంద్రనాగూరు ను భారతదేశానికి ఇచ్చివేయటానికి 1951 లో ట్రీటీ ఆఫ్ సిషన్ అనే ఒప్పందాన్ని చేసి, 1952లో దాని సార్వభౌమాధికారాలను భారత ప్రభుత్వానికి అప్పచెప్పింది.

1948 లో పాండిచేరీలో జరిగిన సార్వత్రిక ఎన్నికలలో ఫ్రెంచి పాలన ఉండాలని కోరుతున్న సోషలిస్టు పార్టీ ఘనవిజయం సాధించటంతో మిగిలిన ప్రాంతాలలో జరగాల్సిన 'రిఫరెండం' ప్రక్రియ అటకెక్కింది. అప్పట్లో పాండిచేరీ ఎన్నికలలో భారీ ఎత్తున రిగ్గింగులు జరిగేవి. ఆ కారణంగా రిఫరెండం జరపటానికి తగిన పరిస్థితులు ఫ్రెంచి కాలనీలలో లేవని భారత్ తన నిరసనను తెలియచేసింది.

ఈ సందర్భంలో విలీనానికి సంబంధించి ఫ్రెంచి ప్రభుత్వం మరియు భారత ప్రభుత్వాలు ఈ కాలనీల ప్రజలకు 'అయితే ఫ్రెంచి ప్రభుత్వం లేక భారత ప్రభుత్వం' అనే తప్ప మరే విధమైన ఎంపిక అవకాశాల్ని ఇవ్వలేదు. రిఫరెండం జరగాలని ఫ్రెంచి ప్రభుత్వం, రిఫరెండం లేకుండా విలీనం జరగాలనీ పట్టుపట్టుకొని కూర్చున్నాయి తప్ప – ఈ కాలనీలు ఫ్రాన్స్ మరియు భారత్ ల ఉమ్మడి సార్వభౌమాధికారాలతో ఉండటమా (Project Ramadier) లేక ఈ కాలనీలన్నీ భారతంలో ఉంటూ స్వయం ప్రతిపత్తి కలిగిన ఫ్రెంచి ప్రాంతాలుగా ఉండటమా (Project Coste Floret) లేదా ఫ్రెంచి వారు దశలు దశలుగా ఓ పాతిక ముప్పయి సంవత్సరాల కాలంలో ఈ ప్రాంతాలనుండి వైదొలగటమా లేక వీటిని స్వతంత్ర్య రాజ్యాలుగా పరిగణించటమా వంటి అవకాశాలను అన్వేషించలేదన్న విమర్శలు లేకపోలేదు.

## దిగ్బంధనం/Blockade

పాండిచేరీలో ఫ్రెంచి పాలనను అంతమొందించాలని ఉద్యమించిన వారిలో వి.సుబ్బయ్య, సెల్లాన్ నాయకర్, బాలసుబ్రమణియన్, ఎ. అరుల్‌రాజ్, ఎమ్. పెరియసామి, దడాల రఫేల్ రమణయ్య వంటివారు ప్రముఖులు. ఫ్రెంచి విధేయుడైన ఎడ్వర్డ్ గుబేర్ (వీరు తరువాత తమ అభిప్రాయాలను మార్చుకోవటం జరిగింది) నాయకత్వంలో కొంతమంది ఫ్రెంచిపాలన కొనసాగాలని పోరాటం జరిపేవారు. మొదట్లో ప్రజలు ఈ ఫ్రెంచి విధేయవర్గానికే మద్దతు పలికారు. ఈ మద్దతు చూసుకొని కొంతమంది ఫ్రెంచి అధికారులు "ఫ్రెంచి కాలనీలలోని అంగుళం భూమిని కూడా భారతదేశం చేజిక్కించుకోలేదు" అని బీరాలు పోయారు. ఈ పరిస్థితులలో భారత ప్రభుత్వం **రాజకీయ చతురతను** ప్రదర్శించి ఫ్రెంచికాలనీలను ఆర్థికంగా, వ్యాపార రీత్యా, రాకపోకల పరంగా, మౌలిక వసతుల పరంగా ఒక రకమైన దిగ్బంధనానికి గురిచేసి ఫ్రెంచి ప్రభుత్వాన్ని, ప్రజలనూ ఉక్కిరి బిక్కిరి చేసింది. (THE "COLD WAR" FRANCO-INDIAN (1949-1954) By Jacques Weber CIDIF). ఇలాంటి నిర్బంధాలు పాండిచేరీకి కొత్త కాదు. బ్రిటిష్ వారివల్ల అనేకసార్లు ఇలాంటి ఇబ్బందులకు గురయ్యిన చరిత్ర ఉంది. అప్పటికీ ఇప్పటికీ ఉన్న తేడా అల్లా ఫ్రెంచి వారిలో లోపించిన నైతికస్థైర్యం మరియు వలసవాదుల పట్ల సర్వత్రా వెల్లువెత్తుతున్న నిరసన.

పాండిచేరీ చుట్టూ ముళ్లతీగె వేయబడి భారతభూభాగంలోకి రాకపోకలు నియంత్రించబడ్డాయి. పాండిచేరీనుంచి ఎవరైనా బయటకు రావాలంటే అక్కడి భారత కౌన్సిల్ చే జారీ చేసిన ఫొటోతో కూడుకొన్న "పాస్‌పోర్ట్" ను సరిహద్దు వద్దనున్న చెక్ పోస్ట్ ల వద్ద చూపించవలసి వచ్చేది. ఈ పాస్‌పోర్టును ఒక రూపాయి రుసుముతో (అప్పట్లో రూపాయి అంటే చాలా పెద్ద మొత్తం) ఒకటి లేదా రెండు నెలల 'వెలిడిటీ' తో, కారణాలను క్షుణ్ణంగా పరిశీలించిన తరువాత మాత్రమే పాండిచేరీలో ఉన్న భారత కౌన్సిల్ జారీ చేసేది. ఒక్కోసారి అప్లయిచేసిన కొన్ని నెలల తరువాత పాస్‌పోర్ట్ మంజూరు అయ్యేది. ఈ విధానం వల్ల పాండిచేరీ ఒక "బంధింపబడిన ప్రజల ప్రాంతం" అయిపోయింది.

ఈ విధానం వల్ల నిత్యం పాండిచేరీ నుంచి బయటకు వెళ్లి పనులు చేసుకొనే కూలీల మనుగడ కష్టమై పస్తులుండే పరిస్థితి వచ్చింది. అంతే కాక పాండిచేరీ నుంచి ఏ విధమైన వస్తువులను బయటకు/లోపలకు తీసుకువెళ్ల కూడదన్న నిబంధన వల్ల–పాండిచేరీకి చెందిన కూలీలు బయట ప్రాంతాలకు కూలి పనులకు వెళ్ళేటపుడు వారు తీసుకొని వెళ్ళే అన్నం కేరేజీలను కూడా అనుమతించేవారు కాదు. అందువల్ల వారి భోజనాన్ని సరిహద్దుల వద్ద తినటమో లేక పారవేయటమో చేయవలసి వచ్చేదట. ఇదే నిబంధన వల్ల జాలరులు తాము పట్టుకొన్న చేపలను ఇంటికి తీసుకొని వెళ్ళే అవకాశం ఉండేది కాదట. దీనికి తోడు పాండిచేరీకి రాకపోకలు చేసేవారి వద్ద 50 రూపాయిలకు మించి డబ్బులు ఉండకూడదన్న నియమం కూడా ఉండేది.

వెహికిల్ యజమానులకు భారతభూభాగం/పాండిచేరీ లలో ఏదో ఒక ప్రాంతాన్ని ఎంచుకోవటానికి భారతప్రభుత్వం 120 రోజుల సమయం ఇచ్చింది. ఆ తరువాత వాటి రాకపోకలను నియంత్రించటం మొదలెట్టింది. పాండిచేరీకి వెళ్ళే రైళ్లు బస్సులు బయటే నిలిపివేయబడేవి. ఫ్రెంచి కాలనీ ప్రజలకు స్వేచ్ఛా రాకపోకలను కల్పిస్తూ ఫ్రెంచి ప్రభుత్వం 1941 లో బ్రిటిష్ ప్రభుత్వంతో చేసుకొన్న ఒప్పందాన్ని భారతప్రభుత్వం ఉల్లంఘిస్తున్నదని ఫ్రెంచిప్రభుత్వం ఆరోపించింది. (UNE HISTOIRE SINGULIÈRE : PONDICHÉRY DE 1947 À 1954 By Stephanie Samy CIDIF)

ఈ సమయంలోనే సందట్లో సడేమియా లాగ, పాండిచేరీకి బంగారం, వజ్రాలు వంటి విలువైన వస్తువులు విదేశాలనుంచి దిగిమతి అయి, భారతసరిహద్దు ప్రాంతాలకు స్మగుల్ అయ్యేవి. ఒక్క 1951–1952 మధ్య పాండిచేరీ వ్యాపారులు పదిహేను టన్నుల బంగారాన్ని, పద్నాలుగు కోట్ల ఫ్రాంకుల విలువైన వజ్రాలను విదేశాల నుంచి దిగుమతి చేసుకొని సమీప భారత పాలిత ప్రాంతాలకు స్మగుల్ చేసి భారీ లాభాలు మూటకట్టుకొన్నారు. ఈ విషయాన్ని గ్రహించిన భారత ప్రభుత్వం పాండిచేరీ చుట్టూ తన పహారాను మరింత కఠినతరం చేసింది.

పాండిచేరీకి చెరాల్సిన పోస్టల్ కవర్లు మద్రాసులో నిలిచిపోయేవి. 1954 మే నాటికి 8 వేలకు పైగా పేరుకు పోయాయి. 1937 నుంచి పాండిచేరీకి విద్యుత్తును సరఫరా చేస్తున్న కావేరీ విద్యుదుత్పత్తి కేంద్రంను రిపేరుల నిమిత్తం మూసివేస్తున్నందున, ఇకపై సరఫరా చేయలేదని భారతప్రభుత్వం 1953 లో ఒక లేఖ ద్వారా ఫ్రెంచి గవర్నరుకు తెలిపింది. విద్యుత్ సరఫరా నిలిచిపోవటంతో పాండిచేరీలోని తక్కువ ఉత్పత్తి సామర్థ్యం కలిగిన థర్మల్ విద్యుత్ కేంద్రం సహాయంతో మరియు అవసరాన్ని బట్టి జెనరేటర్‌లను ఏర్పాటు చేసుకొని ఫ్రెంచి ప్రభుత్వం కొన్ని ప్రాంతాలకు పరిమితంగా విద్యుత్ ను సరఫరా చేయటం మొదలెట్టింది. పాండిచేరీకి దిగుమతి చేసుకొనే పెట్రోల్, కూరగాయలు, దుస్తులు, పండ్లు వంటి వస్తువుల నిలుపుదల జరిగింది. నిత్యావసరాలైన బియ్యం, నూనెలు వంటి వాటిని ఫ్రెంచిప్రభుత్వం ఇండోచైనా పాకిస్తాన్ వంటి దేశాలనుంచి షిప్పులలో దిగుమతి చేసుకోవలసి వచ్చేది.





ఫ్రెంచి పాలనలో యానాం

పాండిచేరీ కి నీటిని సరఫరా చేసే పంట కాలువ 1954 లో మూసివేయబడింది. పాండిచేరీలోని బాహూరు చెరువుకు నీటినందించే కాలువ లాకులు మూతపడటంతో, పంటలకు నీరందక నాశనం అయ్యాయి. 1949 లో మొదలైన ఈ దిగ్బంధన ప్రక్రియ 1954 నాటికి పాండిచేరీని ఉక్కిరి బిక్కిరి చేసేసింది. ఫ్రాన్స్ వెలుపలి నుండి అన్ని విధాల సహాయ సహకారాలందించినా, పోగా పోగా ప్రజలలో అసంతృప్తి పెరగసాగింది.

ఈ మొత్తం పరిస్థితులను అవగాహన చేసుకొన్న పాండిచేరీ ఆర్చిబిషప్, ఫ్రాన్స్ ఫారిన్ మినిస్ట్రీలో పనిచేస్తున్న తన మిత్రునికి వ్రాసిన లేఖలో ***"ఫ్రాన్స్ ఇకపై ఏమాత్రమూ ఇండియాలోని తన కాలనీలను నిలుపుకోలేదు. తనను నమ్ముకొన్న ప్రజలకు కొన్ని సదుపాయాలు కల్పించి నవ్వుతో బయటకు వెళ్లటమే ఉత్తమం, గెంటివేయబడటం కన్నా"*** అని అనటం ఆనాటి ఫ్రెంచివారి ఆలోచనలకు అద్దం పడుతుంది.

(పాండిచేరీ దిగ్బంధం గురించి ఇంతటి సమాచారాన్ని ఈ పుస్తకంలో పొందు పరచటానికి కారణం– ఆనాటి ఫ్రెంచి పౌరుల త్యాగాల పట్ల, ఫ్రాన్స్ ప్రదర్శించిన సౌహార్ద్రత పట్ల అవగాహన లేకుండా, ఈ ఫ్రెంచికాలనీలకు ఇంతటి ప్రత్యేక ప్రతిపత్తి కల్పించటం ద్వారా నెహ్రూ తప్పుచేసాడనీ, ఈ ప్రాంతాలలో ఉన్న ఫ్రెంచ్ ఉనికి వల్ల మనమింకా వలసవాదుల పాలనలోనే ఉన్నట్లు అనిపిస్తోందనీ, ఈ ప్రాంతాలను సమీప రాష్ట్రాలలో ఎందుకు విలీనం చేయటం లేదనీ వంటి రకరకాల వాదనలు నేడు అక్కడక్కడా వినిపిస్తున్నాయి. భారతదేశానికి **ఈ ప్రాంతాలను భౌగోళికంగా తనలో కలుపుకోవటం అనేది దేశ సమగ్రత, ఐక్యత, అంతర్గత భద్రత ల దృష్ట్యా ఒక చారిత్రిక అవసరం.** హైదరాబాద్, పోర్చుగీస్ పాలిత ప్రాంతాల విలీనంలో జరిపినట్లు ఫ్రాన్స్ పై సైనిక ప్రయోగానికి భారత్ సాహసించలేకపోవటానికి కారణాలు ప్రత్యేకంగా చెప్పుకోనక్కరలేదు. అందుకనే దౌత్యపరమైన చర్చలు, సంప్రదింపులూ ఒకవైపు చేస్తూనే గొప్ప పరిణతి కలిగిన చాణుక్యనీతిని ప్రదర్శించింది. ఆనాడు ఫ్రాన్స్ మరియు ఈ కాలనీలలోని ఫ్రెంచి పౌరులు చేసిన త్యాగాలకు ప్రతిఫలంగా భారత్ ఈ ప్రాంతాలకు **ప్రత్యేక ప్రతిపత్తి** కల్పించిందన్నది విస్మరించకూడని ఒక చారిత్రిక వాస్తవం -- రచయిత)

ఇక యానాం విషయానికి వస్తే, పాండిచేరీలో జరిగినంత తీవ్రంగా కాకపోయినా ఈ ప్రాంతం కూడా దిగ్బంధనానికి గురయినట్లు ఆనాటి వార్తాపత్రికల ద్వారా తెలుసుకొనవచ్చును. 20 ఏప్రిల్, 1954 నుండి యానాంకు వచ్చే బస్సులను యానాంకు వెలుపలే నిలువరించటం

బొల్లోజు బాబా

మొదలైంది (రి. హిందూ, 22,ఏప్రిల్, 1954). శ్రీ దడాల, భయంకరాచారి, డి.ఎస్.ఆర్.సోమయాజులు, కొంపెన సుబ్బారావు ల ఆధ్వర్యంలో కాకినాడనుంచి యానాంకు సరుకులు చేరవేస్తున్న బండ్లను, 24 ఏప్రిల్, 1954 న నిలిపివేసి తిరిగి కాకినాడ పంపించి వేయటం జరిగింది. ఈ విషయం తెలుసుకొని కాకినాడనుంచి యానాంకు రావాల్సిన బళ్ళు బయలుదేరనే లేదు (రి. 28 ఏప్రిల్, 1954).

యానాంకు నిత్యావసరాలు అందకపోవటంతో ఇక్కడి ప్రజాజీవనం స్థంభించిపోయింది. యానాం వ్యాపారులకు కాకినాడలో పెట్రోలు, కిరోసిన్, ఇతరనూనెలు అక్కడి వ్యాపారులు నిరాకరించేవారట. బిల్లు భారతీయుని పేరుపై తీసుకొని అతికష్టం మీద సరుకులను యానానికి రహస్యంగా చేరవేయవలసి వచ్చేదట. గోదావరి నదిపై జరిగే సరుకుల రవాణాను అడ్డుకొని పడవలను, సరుకులను, వలలను భారత కస్టమ్స్ అధికారులు స్వాధీనం చేసుకొనేవారట.

పంటకాలువల రిపేర్లు పనులు చేయిస్తున్నామన్న కారణంచే, యానాంకు వచ్చే మంచినీటి సరఫరాను 28 ఏప్రిల్, 1954న కాకినాడ కలక్టరు నిలుపుదల చేయించారు. యానాం ప్రజలందరికీ మంచినీటి నందించే నీళ్ళ చెరువులు అప్పటికే ఖాళీ అయ్యాయి. ఈ విషయంలో ఫ్రెంచి ఎంబసీ కల్పించుకొంటే తప్ప మే 1 నుండి యానాంకు నీటి సరఫరా పునరుద్దరణ కాలేదు. (రి. The Last Days of Yanam - George Sala published in July 1996 Lettre du CIDIF)

ఈ నేపథ్యంలో భారతదేశంలో తమ మనుగడ ఇక అసాధ్యమన్న నిర్ణయానికి ఫ్రాన్స్ వచ్చేసింది. ప్రజలందరూ పాల్గొనే రిఫరెండం జరపాలని అంతవరకూ వాదించిన ఫ్రెంచిప్రభుత్వం తన పట్టు సడలించి, ప్రజానాయకులు పాల్గొనే రిఫరెండానికి సిద్ధపడింది. అలా 1954లో పాండిచేరీ సమీపంలోని కీఝూరు అనే ప్రాంతంవద్ద జరిగిన ప్రజానాయకుల అభిప్రాయసేకరణ జరిపింది. దీనిలో 7 ఓట్లు ఫ్రెంచిపాలనకు అనుకూలంగాను, 164 ఓట్లు వ్యతిరేకంగాను రావటంతో, ఫ్రెంచిప్రభుత్వం 1954 అక్టోబరు 26న పాండిచేరీ, మాహె, కారైకాల్ మరియు యానాంలను యథాతథ స్థితిలో భారతదేశానికి అప్పగించుతూ ఒక ఒప్పందం చేసింది. దీనినే 'డిఫాక్టో ఒప్పందం' అంటారు. దీనికి అనుగుణంగా 1954 నవంబరు, 1న ఈ ప్రాంతాలనుండి ఫ్రెంచివారు ఖాళీచేసి వెళిపోయారు. ఈ రోజును 'డిఫాక్టో దినం' గా ఇక్కడి ప్రజలు పాటిస్తారు.

**భారత పతాక రెపరెపలు**

పాండిచేరీలో అంతవరకూ పనిచేస్తున్న ఫ్రెంచి దేశస్థులు వెళిపోయే ముందు అట్టహాసంగా అధికారిక సంబరాలు జరిపి వెళ్లాలని యోచించినా, ఫ్రాన్స్ ఆ ప్రతిపాదనలను తిరస్కరించింది. ఒక వార్ షిప్పులో పాండిచేరీలోని ఫ్రెంచివారినందరినీ ఫ్రాన్స్‌కు తరలించాలని మొదట్లో భావించినా ఆ ఆలోచనకూడా కార్యరూపం దాల్చలేదు. కడకు ఎవరికి వారు మద్రాసు వెళ్లి ఫ్లయిట్ ద్వారా పారిస్ చేరుకొన్నారు. 1954 నవంబరు 1 నాటికి పాండిచేరీలో ఫ్రెంచి గవర్నరు ఇంచార్జిగా ఎస్కర్‌గుయిల్ (Escargueil), డిప్లొమేటిక్ సలహాదారునిగా P. Landy









1954, నవంబరు 1 న "Farewell Salute " స్వీకరిస్తున్న P. Landy. (కోటు ధరించిన వ్యక్తి). పాండిచేరీ చివరి భారత కౌన్సిల్ జనరల్ & మొదటి హై కమీషనర్ అయిన శ్రీ కేవల్‌సింగ్ ను కూడా ఫొటోలో చూడవచ్చును.

మరియు మరికొద్ది మంది ఫ్రెంచి అధికారులు మాత్రమే పాండిచేరీ లో మిగిలారు. ఢిల్లీ నుంచి వచ్చిన భారత విదేశీ వ్యవహారాల శాఖ సెక్రటరీ జనరల్ RK Nehru నవంబరు 1ఉదయాన పాండిచేరీలో ప్రప్రథమంగా భారతదేశ జండాను ఎగురవేశారు. పాండిచేరీ చివరి భారత కౌన్సిల్ జనరల్ మరియు మొదటి హై కమీషనర్ అయిన కేవల్ సింగ్ ను P. Landy ఆహ్వానించి అధికారాలను బదలాయించారు. ఆ తరువాత జరిగిన బహిరంగ సభలో, భారత ప్రెసిడెంట్ రాజేంద్ర ప్రసాద్, ప్రధాని నెహ్రూ లు పంపించిన సందేశాలను RK Nehru ప్రజలకు చదివి వినిపించారు. ఆ విధంగా మూడు వందల సంవత్సరాల ఫ్రెంచి పాలనకు తెరపడి భారత పాలనకు తెరలేచింది. 20 జనవరి, 1955 నాటి హిందూ పత్రిక తన ఎడిటోరియల్ లో ఈ ప్రాంతాలకు కల భౌగోళిక, సాంస్కృతిక వ్యత్యాసాలను దృష్టిలో ఉంచుకొని, చంద్రనాగూర్ విషయంలో జరిగినట్లుగా సమీప రాష్ట్రాలలో విలీనం చేయాలని వ్రాసింది.

**ఈ ప్రాంతాల భవిష్యత్తు పై అనేక సందేహాలు**

అంతర్జాతీయ చట్టాల ప్రకారం డీఫాక్టో ట్రాన్స్‌ఫర్ జరిగినా ఈ ప్రాంతాల సార్వభౌమాధికారాలు ఫ్రాన్స్ వద్ద ఉన్నట్లే లెక్క. ఈ రకమైన పరిస్థితి ఇదివరలో బోస్నియా, సిప్రస్ ప్రాంతాల విషయంలో వచ్చిందని కొంతమంది నిపుణులు అభిప్రాయపడ్డారు. అంటే ఈ ప్రాంతాల సార్వభౌమాధికారాలను ఫ్రాన్స్ భారత్ కు సమర్పించనంతవరకూ భారత్ ఈ

ప్రాంతాలలో అధికారిక పరిపాలన చేపట్టటానికి వీలుండదు. అందుకనే భారత్ ఫ్రాన్స్‌తో మరో ఒప్పందం చేసుకొనే వరకూ ఇక్కడ ఫ్రెంచి పరిపాలనా వ్యవస్థను యథాతథంగా కొనసాగించింది. ఆ మరో ఒప్పందమే 1956 మే, 28న భారతప్రధాని శ్రీపండిట్ జవహర్ లాల్ నెహ్రూ మరియు ఫ్రాన్స్ దేశ ప్రతినిధి ఒస్త్రరాగ్ లు చేసుకొన్న ట్రీటీ ఆఫ్ సిషన్ (Traité de cession).

ఈ మొత్తం ప్రక్రియపట్ల పాండిచేరీలో నిరసన వ్యక్తమయింది. Grande Comore, Mohammed Saeed Sheikh, MP Raymond Dronne, దైవశిఖామణి వంటి కొంతమంది ఫ్రెంచి విధేయులు తమ తీవ్ర అసంతృప్తి వ్యక్తపరిచారు. ఈ కాలనీల ప్రజలకు ద్వంధ్వ పౌరసత్వం కల్పించాలనీ, ప్రజలందరూ పాల్గొనే రిఫరెండం తిరిగి నిర్వహించాలనీ, ఈ ప్రాంతపు ఫ్రెంచి సంస్కృతిని కాపాడమనీ, ఆటోనమీ ని కల్పించాలనీ, కీఊరు లో ప్రజాప్రతినిధులు మాత్రమే పాల్గొన్న రిఫరెండం ఫ్రెంచి రాజ్యాంగ విరుద్దమనీ అంటూ వీరు ఇరు ప్రభుత్వాలను డిమాండ్ చేసారు. ఈ ప్రాంతాలను సమీప రాష్ట్రాలలో విలీనం చేస్తారేమోన్న ప్రజల అనుమానాలను నివృత్తి చేయటానికి ఆనాటి భారత హైకమీషనరు కృపాలానీ, 1957, ఫిబ్రవరి 9 న ఏర్పాటుచేసిన ఒక ప్రెస్ కాన్ఫరెన్సులో "ఈ ప్రాంతాలను సమీప రాష్ట్రాలలో విలీనం చేసే ఉద్దేశాలు భారతప్రభుత్వానికి లేవని, ట్రీటీ ఆఫ్ సిషన్ లో చేసుకొన్న ఒప్పందం ప్రకారం వీటి ప్రత్యేకతను నిలుపుతుందనీ" తెలిపారు.

ఈ ప్రాంతాల భవిష్యత్తు గురించి ప్రజలలో ఉండిన ఆందోళనలు 1955 లో పాండిచేరీలో జరిగిన ఎన్నికలను ప్రభావితం చేసాయి. ఫ్రెంచి కాలనీలను భారతావనిలో విలీనం చేయటంలో ప్రధాన పాత్రపోషించిన శ్రీగుబేర్ – 'పాండిచేరీని ఫ్రాన్స్ కు అప్పగించాలి' అనే నినాదంతో ఎన్నికల బరిలో దిగిన Marcel Valot అనే స్వతంత్ర అభ్యర్ధిచేతిలో ఓడిపోయాడు. ఈ ప్రాంతాలకు ఆటోనమీ కల్పించాలనీ ఇక్కడి ఫ్రెంచి సంస్కృతిని కాపాడాలన్న డిమాండ్ తో ఎన్నికలలో పోటీ చేసిన పాపులర్ పార్టీ పాండిచేరీలో ఉన్న 18 అసెంబ్లీ స్థానాల్లో 12 స్థానాల్ని గెలుచుకోవటం గమనార్హం. (ఇతర ప్రాంతాలలో గుబేర్ వర్గం ఎక్కువ సీట్లను దక్కించుకొంది). మున్సిపల్ ఎన్నికలలో మూడొంతులు పైగా సీట్లను పాపులర్ పార్టీ కైవసం చేసుకొంది. పై ఫలితాల ద్వారా పాండిచేరీ ప్రజలలో ఫ్రెంచి విధేయత ఉన్నట్లు స్పష్టమవటంతో ఈ కాలనీల భవిష్యత్తుపై ఆ తదుపరి జరిగిన చర్చలలో ఈ ప్రాంత ప్రజల ఫ్రెంచి సంస్కృతిని పరిరక్షించాలన్న వాదనకు బలం చేకూరింది. ఈ ఎన్నికల తరువాత గుబేర్ తన పంథాను మార్చుకొని, ప్రజాభీష్టం మేరకు ఈ ప్రాంతాలకు ప్రత్యేకప్రతిపత్తి కల్పించటంలో అవిరళ కృషిచేయటం గమనార్హం. (కోడిపందాలు ఎక్కువగా ఆడతాడు కనుక ఎడ్వర్డ్ గుబేర్ ను ఫ్రెంచివారు కోడి–గుబేర్ అని పిలిచేవారట. ఫ్రెంచి వారు వెళిపోవటంతో ఇతని పేరు గుబేర్ పిళ్ళై గా మారిపోయింది. ఈ చిన్న ఉదంతం ఫ్రెంచిపాలనకు–భారత పాలనకు మధ్య మౌలికంగా ఉన్న తేడాను అద్భుతంగా పట్టి చూపుతుంది. మొదటిదానిలో జాత్యహంకారం రెండవదానిలో సామాజిక మూలాల ప్రదర్శన కనిపిస్తాయి.)







అంతర్గత కుమ్ములాటల కారణంగా 1955 ఎన్నికల ద్వారా ఏర్పడిన అసెంబ్లీని 1958 లో భారతప్రభుత్వం రద్దు చేసి పాండిచేరీలో రాష్ట్రపతి పాలనను విధించింది. తిరిగి 1959 లో జరిగిన ఎన్నికలలో, 'ఈ ప్రాంతాలను సమీప రాష్ట్రాలలో విలీనం చేయం' అన్న నినాదంతో కాంగ్రెస్ ఎన్నికలలోకి దిగి విజయం సాధించింది.

**ట్రీటీ ఆఫ్ సిషన్ కల్పించిన హామీలు**

డిఫాక్టో ట్రాన్స్ఫర్ ఒప్పందానికి ట్రీటీ ఆఫ్ సిషన్ ఒప్పందానికి మధ్య కల సుమారు రెండేళ్ల వ్యవధిలో ఇరుదేశాలు ఈ ప్రాంతాల భవిష్యత్తుపై స్పష్టమైన అవగాహనకు వచ్చాయని ఆ ఒప్పందంలో పొందుపరచిన ఈ క్రింది అంశాలను బట్టి తెలుస్తుంది.

**పౌరసత్వం:** 1956 నాటికి పాండిచేరీలో మూడు రకాలైన ఫ్రెంచి పౌరులుండేవారు. ఇక్కడకు వచ్చి స్థిరపడిన ఫ్రెంచి దేశస్థులకు పుట్టిన వారు, 1880 లలో తమ భారతీయతను త్యజించి ఫ్రెంచి సివిల్‌కోడ్ ను ఎంచుకొన్న భారతీయులు మరియు ఈ రెండు వర్గాలకు చెందని వారు. వీరు తమకు ద్వంధ్వ పౌరసత్వం ఇమ్మని భారత మరియు ఫ్రెంచి ప్రభుత్వాలను కోరారు. అది జరగని పనని ఇరుదేశాలు తేల్చి చెప్పేసాయి. ఈ ట్రీటీ ఆఫ్ సిషన్ లో వీరికి పౌరసత్వ ఎంపిక అవకాశం కల్పించబడింది. దీని ప్రకారం ఈ ట్రీటీ అమలులోకి వచ్చిన (1962) ఆరునెలలలోగా తమ ఫ్రెంచి పౌరసత్వాన్ని నిలుపుకోవటానికి వ్రాతపూర్వకంగా తెలియచేయవలసి ఉంటుంది. అలా చేసిన వారికి వారు అంతవరకూ కలిగి ఉన్న ఫ్రెంచి పౌరసత్వాన్ని ఇక ముందు కూడా కలిగి ఉంటారు లేనివారు భారతపౌరసత్వాన్ని పొందుతారు.

ఫ్రెంచి వారు వెళిపోయేటపుడు ఇచ్చిన **సౌహార్ధ్ర పూర్వక పౌరసత్వ ఐచ్ఛికత**ను ఉపయోగించుకొని పాండిచేరీనుంచి సుమారు 6000 మంది ఫ్రెంచి నేషనాలిటీని నిలుపుకొన్నారు. వీరి సంఖ్య ప్రస్తుతం పదిహేనువేలకు పైమాటే. ఫ్రాన్స్‌లో నివసించే పౌరునికి ఉండే వృద్ధాప్య పించను, పేదరికంలో ఉంటే అందే సహాయం, నిరుద్యోగ భృతి, విద్య వైద్యాల కొరకు రాయతీలు వంటి సోషల్ సెక్యూరిటీ పథకాలన్నీ ఈ ఫ్రెంచినేషనల్స్ కూ ఉన్నాయి. ఆ కారణంగా వీరందరూ ఆర్ధికంగా, సామాజికంగా సాటి భారతీయుల (వీరుకూడా ఒకప్పుడు ఫ్రెంచి పాలితులే అయినప్పటికీ ఫ్రెంచినేషనాలిటీని ఎంచుకోకపోవటం వల్ల భారత పౌరులుగా మిగిలిపోయారు) కంటే మెరుగైన స్థితిలో ఉన్నారు. కొన్ని సందర్భాలలో వారి అసూయకు కూడా పాత్రులవుతున్నారు. అందుకనే పాండిచేరీ ఫ్రెంచి పౌరుల అసోషియేషన్ నాయకుడైన పి. ఆరోగ్యసామి ఒకచోట "ఈనాడు పాండిచేరీలో రిఫరెండం పెడితే ప్రజలందరూ ఫ్రెంచి పౌరసత్వాన్ని స్వీకరించటం తథ్యం" అని వ్యాఖ్యానించాడు. (రి. LES GENS DE NULLE PART Auteur : Author: Banerji Monideepa CIDIF). 1962 లో ఫ్రాన్స్ తన అప్పటి మరో కాలనీ అయిన అల్జీరియాకు స్వాతంత్ర్యం ప్రకటించినపుడు అక్కడి ఫ్రెంచి పౌరులలో పదిలక్షల మందికి పైన ప్రజలు ఫ్రాన్స్‌తో తమ అనుబంధాన్ని తుంచుకోలేదు. వీరందరూ ఫ్రాన్స్ చేరుకోగా, ఫ్రెంచి ప్రభుత్వం పునరావాసం కల్పించింది. వీరందరినీ ఇప్పటికీ Pieds-noirs అని పిలుస్తారు.

**ఫ్రెంచి సంస్కృతి పరిరక్షణ:** ఈ ఒప్పందంలో ఈ కాలనీలలో అంతవరకూ పరిఢవిల్లిన ఫ్రెంచి సంస్కృతి పరిరక్షణ కావించబడుతుందని హామీ ఇవ్వబడింది. దీనిలో భాగంగా, ఫ్రెంచి అధికారిక భాషగా ఉంటుందని (ప్రజానాయకులు మార్చనంతవరకూ), స్కూళ్లలో ఫ్రెంచి భోధన కొనసాగుతుందనీ, ఫ్రెంచి సంస్కృతిని పెంపొందించటానికి సంస్థలు నెలకొల్పాలని వంటి హామీలు ఈ ఒప్పందంలో ఉన్నాయి. అప్పట్లో నెహ్రూ ఈ ప్రాంతాలను Windows Open to France అని వర్ణించాడు కూడా. కానీ ఫ్రెంచివారు వెళ్ళిపోయిన తరువాత ఈ ప్రాంత అధికారులు ఎక్కువగా బ్రిటిష్ ఇండియాలో పనిచేసిన వారు కావటంతో ఫ్రెంచి అధికారిక భాషగా ఎంతో కాలం కొనసాగలేదు. అంతే కాక ఇక్కడి ప్రజలు కూడా క్రమక్రమంగా ఇంగ్లీషుకు అలవాటు పడక తప్పలేదు. అంతవరకూ పనిచేసిన అధికారులు ఫ్రెంచి పౌరసత్వాన్ని తీసుకొని ఫ్రాన్స్ వెళ్ళిపోవటం కూడా మరో కారణం. అందుకనే 1965 లో అసెంబ్లీ తీర్మానం ద్వారా ఈ కాలనీల లో ఇంగ్లీషు, తమిళ్, మళయాలం మరియు తెలుగులను అధికార భాషలుగా చేస్తూ చట్టం చేయటంతో, ఫ్రెంచి అధికార భాషగా కనుమరుగైపోయింది. ఇక ఫ్రెంచి భోధన కొరకు ఒక కాలేజీ, సంస్కృతి పెంపొందించటం కొరకు అలయన్స్ ఫ్రాంకాయిస్ వంటివి నెలకొల్పటం జరిగింది. ఇవి నేటికీ పనిచేస్తూ ఉన్నాయి. యానానికి సంబంధించి జూనియర్ కాలేజీలో తొంభైల మధ్యవరకూ ఫ్రెంచి ద్వితీయ భాషగా బోధించబడేది. ఆ తరువాత శ్రీబొల్లోజు బసవలింగం గారి ఆధ్వర్యంలో యానాంలో కొంతకాలం ఒక ప్రైవేట్ ఫ్రెంచిస్కూలు నడపబడింది.

భారతదేశంలో ఫ్రెంచి రాజ్యస్థాపనకై పాటుపడిన డూప్లే విగ్రహాన్ని పాండిచేరీ నుంచి తొలగించవద్దని, ఒకవేళ తొలగించేటట్టయితే దానిని ఫ్రాన్స్ అప్పగించమనీ ఫ్రెంచి ప్రభుత్వం కోరింది.

ఫ్రెంచి ప్రభుత్వం అంతవరకూ ఇచ్చిన విద్యార్హతలకు సమానమైన భారత విద్యార్హతలను నిర్ణయించటానికి ఇరుదేశాల విద్యావేత్తలతో కూడిన ఒక కమిటీని నియమించాలని నిర్ణయం తీసుకొన్నారు.

**ఫ్రెంచి చట్టాల కొనసాగింపు:** ట్రీటీ ఆఫ్ సిషన్ ఒప్పందంలో 1954 నాటికి ఉన్న కోర్టుకేసులకు ఫ్రెంచి చట్టాలకు అనుగుణంగానే తీర్పులు చెప్పాలనీ, ఈ చట్టాలను నెమ్మది నెమ్మదిగా తొలగించి, ఇండియన్ పీనల్ కోడ్ ను ప్రవేశపెట్టుకోవచ్చని వ్రాసుకోవటం జరిగింది. తదనుగుణంగా భారత ప్రభుత్వం 1963 లో ఫ్రెంచి చట్టాల తొలగింపు మొదలుపెట్టి 1968 నాటికి పూర్తిచేసింది.

**ప్రత్యేక పరిపాలనా హోదా:** చంద్రనాగూర్ అప్పగింత భేషరతుగా జరిగింది కనుక అది సమీప రాష్ట్రమైన బెంగాలులో విలీనం అయి ఒక మున్సిపాలిటీగా మారిపోయింది. కానీ మిగిలిన ఫ్రెంచికాలనీలైన పాండిచేరీ, మాహే, కారైకాల్ మరియు యానాంల విలీనం ట్రీటీ ఆఫ్ సిషన్ ఒప్పందం ద్వారా విలీనం అయ్యాయి. దానిలోని ఆర్టికల్ రెండు ప్రకారం ఈ ప్రాంతాలకు **"ప్రత్యేక పరిపాలనా హోదా"**ను కల్పించాలని/కల్పిస్తాననీ ఇరుదేశాలు అంగీకరించుకొన్నాయి. అంతే కాక ప్రజల సమ్మతి లేకుండా ఈ హోదాను మార్చకూడదని కూడా వ్రాసుకోవడం







జరిగింది. దీనికి అనుగుణంగా 1962 లో భారతప్రభుత్వం 14 వ రాజ్యాంగ సవరణ ద్వారా ఈ ప్రాంతాలను కేంద్రపాలిత ప్రాంతాలుగా ఏర్పాటుచేసింది. ఈ ప్రాంతాలకు ప్రత్యేక ప్రతిపత్తి కల్పించినందుకు మీడియాలో నిరసన రాకపోలేదు. 1962, ఆగస్టు 9 నాటి హిందూ పత్రిక తన ఎడిటోరియల్ లో ఈ చిన్న ప్రాంతాలకు ఈ విధమైన ప్రత్యేకతను కల్పించటం ఒక **"లగ్జరీ"** గా పేర్కొనింది. ది మెయిల్ అనే పత్రిక కూడా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తపరచింది.

ప్రాంతాలు భారతావనిలో విలీనం అయితే వీటికి ప్రత్యేక హోదాను కల్పించి కేంద్రప్రభుత్వ పర్యవేక్షణలో ఉంచుతానని భారత ప్రభుత్వ విదేశాంగ శాఖ, 27 అక్టోబరు, 1949 న వ్రాసిన ఒక లేఖద్వారా తెలుస్తుంది. ఈ ప్రాంతాల విలీనం ఇంకా ఒక కొలిక్కి రాని సమయంలోనే తాను ఫ్రెంచి ప్రభుత్వానికి ఇచ్చిన మాటను భారత ప్రభుత్వం ఈ విధంగా నిలుపుకొంది.

**తుది పలుకులు**

1957 లో ట్రీటీ ఆఫ్ సిషన్ కు ఆమోద ముద్ర కొరకు ఫ్రాన్స్ ఫారిన్ అఫైర్స్ మినిస్ట్రీ కు పంపించినపుడు (Devinat report)– ఈ ఒప్పందం ఫ్రెంచి రాజ్యాంగానికి లోబడి లేదని, ప్రజలు పాల్గొన్న రిఫరెండం జరగలేదనీ వంటి కొరీలు వేసి, దీన్ని ఆమోదించాలంటే ఫ్రెంచి పార్లమెంటు అనుమతి కావాలంటూ తిరస్కరించింది. (అప్పుడు జరిగిన ఓటింగ్‌లో ఈ బిల్లుకు ప్రతికూలంగా 27 ఓట్లు, అనుకూలంగా 15 ఓట్లు పడ్డాయి)

ఈ ప్రాంతాల సార్వభౌమాధికారాల అప్పగింతపై జరుగుతున్న జాప్యం పట్ల అప్పట్లో అనేక మంది నిరసనను తెలియచేసారు. 1958 జూన్, 16 నాటి టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రిక ఎడిటోరియల్ లో " డిజ్యూర్ ట్రాన్స్ఫర్ (సార్వభౌమాధికారాల అప్పగింత) జరపటానికి తొందరగా చర్యలు గైకొనకపోయినట్లయితే ఫ్రెంచివిధేయులకు, భారతవిధేయులకు పాండిచేరీ ఒక రణస్థలిగా మారే ప్రమాదం ఉంది" అని వ్రాసింది. ఎందుకంటే పాండిచేరీలో "Popular Republican Movement of French India" అనే పేరిట ఒక సంస్థ ఏర్పడి ఫ్రెంచిపాలన కొనసాగాలనిఆందోళనలు సాగిస్తున్న సమయమది.

1958 ఆగస్టు, 11న జరిగిన పార్లమెంటు సమావేశాలలో ఈ ప్రాంతాల బదలాయింపు గురించి ఒక ఎంపి అడిగిన ప్రశ్నకు బదులిస్తూ నెహ్రూ "ఈ ప్రాంతాల డిఫాక్టో బదలాయింపు ఎన్నో సంవత్సరాల క్రితమే జరిగిపోయింది. ఈ స్థితినుంచి వెనుకకు మరలే ప్రసక్తే లేదు. కానీ ఈ స్థితికి కొన్ని కొన్ని చట్ట పరమైన చిక్కులు ఉన్న మాట వాస్తవమే. డిజ్యూర్ ట్రాన్స్ఫర్ త్వరలోనే జరుగుతుందని ఆశిస్తున్నాను. చేసిన ఒప్పందాన్ని నెరవేర్చమని ఫ్రాన్స్ పై ఒత్తిడి తీసుకురావటం సబబనిపించుకోదు. అది లేనిపోని అపోహలకు దారితీస్తుంది" అనటాన్ని బట్టి అప్పట్లో భారత ప్రభుత్వం ఎంతటి సహనాన్ని ప్రదర్శించిందో సులువుగానే అర్థమౌతుంది.

ఫ్రాన్స్ అల్జీరియాలో చేస్తున్న యుద్ధంలో తలమునకలైపోయి ఉండటం వల్ల ట్రీటీ ఆఫ్ సిషన్ ను ఫ్రెంచి ప్రభుత్వం దాదాపు పక్కన పెట్టేసిందనే భావించాలి.

ఎట్టకేలకు 1962, జూలై 19 న ట్రీటీ ఆఫ్ సిషన్ బిల్లు ఆమోదం కొరకు ఫ్రెంచి సెనేట్ కు వచ్చింది. ఈ బిల్లును ప్రవేశపెట్టినపుడు, ఫిలిప్పి అర్జిన్ల్యూ అనే సెనేటర్ చేసిన ప్రసంగపు తుదిపలుకులు ఈ ప్రాంతాలపై ఫ్రాన్స్ కు ఉన్న అభిప్రాయాలను పట్టిచూపుతాయి..........."The choice before us left seems strangely small. Or, unable to resist the feelings of deep regret to see a new tear in what was the French Empire, and whose institutions namely Pondicherry, Karaikal, Mahe and Yanam, for three centuries, formed the most beautiful jewels, it is against any acceptance of such an abandonment. Or, more modestly, but certainly a more realistic way, we accept the inevitable. we resign ourselves to a factual situation that allows no alternative, in other words, we agree, regardless of melancholy and sorrow that embrace the heart, the sensible and dull solution of accepting the treaty that gives our citizens a few guarantees and benefits, while formally inviting our diplomacy to resume talks at the earliest promptly to strengthen as far as possible the position of our country in this region and save up the rights of former French nationals. …….. (Ref. Le transfer-Part.3(8)-Part.III--La ratification du traité de cession - Written by Gabriel Piesse, CIDIF letters - Letter No. 26/27)

1962 జూలై 23 న ఈ బిల్లుకు ఆమోదముద్ర పడింది. దరిమిలా 1962 ఆగష్టు, 16 న ఫ్రెంచి ప్రభుత్వం ఈ ప్రాంతాల సార్వభౌమాధికారాలను భారత్ కు బదలాయించటం ద్వారా ఈ ప్రాంతాలపై చట్టపరమైన హక్కులను కల్పించినట్లయింది. ఈ రోజును ఈ ప్రాంతవాసులు "డిజ్యూర్ దినం" గా సెలిబ్రేట్ చేసుకొంటారు. ఆ తరువాత భారతప్రభుత్వం 30 ఆగష్టు 1962 న పార్లమెంటులో బిల్లు ప్రవేశపెట్టి పాండిచేరీ, కారైకాల్ మాహే మరియు యానాంలను కేంద్రపాలిత ప్రాంతాలుగా ప్రకటించటం ద్వారా ఈ ప్రాంతాలకు ఉన్న మూడు శతాబ్దాల "ఫ్రెంచి కనెక్షన్" శాశ్వతంగా తెగిపోయింది.

(ఫ్రెంచికాలనీలు భారతదేశంలో విలీనం అయిన పరిణామ క్రమాన్ని వివరించే సమాచారం ఇంతవరకూ తెలుగులో పెద్దగా లేని కారణంగా ఈ చాప్టరులో ఆ అంశాన్ని ఎక్కువగా వివరించటం జరిగింది. గమనించగలరు)





# యానాం విమోచనోద్యమం

భారత స్వాతంత్ర్యపోరాటం గురించి ప్రతీ భారతీయునికి కొద్దోగొప్పో అవగాహన ఉంటుంది. కానీ 1947 లో బ్రిటిష్ వారు వెళ్ళిపోయిన తరువాత ఈ స్వతంత్ర భారతావనిలోని కొన్ని ప్రాంతాలను ఫ్రెంచి వారు పరిపాలించారన్న విషయం చరిత్ర చదివినవారికి మాత్రమే తెలుస్తుంది. వారిని పాండిచేరీ నుంచి వెళ్ళగొట్టటానికి జరిపిన పోరాటాల వివరాలు, వి.సుబ్బయ్య వ్రాసిన Saga of Freedom of French India, పాంచ్ రామలింగం వ్రాసిన Role of Venkatasubbah Reddiar in French India Liberation Movement, సిరిల్ ఆంటోనీ సంకలనపరచిన Gazetteers of Pondicherry వంటి పుస్తకాలలో లభిస్తాయి.

ఇక యానానికి సంబంధించిన వివరాలు ఆనాడు యానాం విమోచనోద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొన్న ఉద్యమకారులైన, దడాల రఫేల్ రమణయ్య రచించిన My Struggle for Freedom of French India అనే పుస్తకంలోను, 'విలీనోద్యమ విశేషాలు' అనే పేరుతో బొల్లోజు బసవలింగం 1954 అక్టోబరు, 30 నాటి మాతృసేవ పత్రికలో వ్రాసిన వ్యాసం మరియు ఇతర రచనల ద్వారా తెలుస్తాయి.

అప్పటి కాలమాన పరిస్థితుల దృష్ట్యా యానాం విమోచనం భిన్న కోణాలలో దర్శించబడింది.

1. విమోచన ఉద్యమకారుల దృష్టిలో యానాం విమోచనమనేది ఫ్రెంచి పాలనా దాశ్య శృంఖలాల నుండి విముక్తమై స్వతంత్ర భారతావనిలో విలీనం కావటానికి జరిపిన మహోద్యమం.

2. భారత ప్రభుత్వం యానాం విమోచనాన్ని స్వాగతించదగిన దురదృష్టకరమైన సంఘటనగా అభివర్ణించింది.

3.భారతప్రభుత్వం తన దేశభక్తులతో చేయించిన 'ముట్టడి' గా దీన్ని ఫ్రెంచి ప్రభుత్వం భావించింది.

4యానాం నాయకులు ఆంధ్రాప్రజలతో కలసి ఫ్రెంచి వారినుండి అధికారాలు చేజిక్కించుకొని యానాం విమోచనం చెందిందని ప్రకటించారని కొంతమంది స్థానికులు భావించారు.

ఏ వాదన ఎలా సాగినా యానాం ఫ్రెంచి పాలన నుండి విమోచనం చెంది భారతావనిలో విలీనం చెందటం అనేది అప్పటికి ఒక చారిత్రిక అవసరం. ఈ మహత్కార్యాన్ని భుజానవేసుకొని ఉద్యమాన్ని నడిపించిన నాయకుల దేశభక్తిని శంకించలేము. వారు ఈ ఉద్యమాన్ని శాంతియుతంగానూ, ప్రజాస్వామ్యయుతంగానూ నడిపించిన తీరు అనన్యమైనది. భారత్–ఫ్రెంచి కాలనీల చరిత్రలోనే ఒక మైలు రాయిగా నిలచిన యానాం విమోచనాన్ని జరిపించిన ఆనాటి నాయకుల దార్శనికత అత్యంత ఉన్నతమైనది.

ఫ్రెంచి ప్రభుత్వం స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే తన మూడు సూత్రాలకు అనుగుణంగా ఈ కాలనీల పరిపాలన సాగించటం వలన, ఇక్కడి ప్రజలు ఫ్రెంచివారి పట్ల మమకారాన్ని ఏర్పరచుకొన్నారు. తమ పొరుగు ప్రాంతంలో బ్రిటిష్ వారు సాగించిన దుష్టపాలన ఈ కాలనీల వాసులలో ఫ్రెంచివారి పట్ల ప్రేమను బలోపేతం చేసింది. అందుచేత తరతరాలుగా జీర్ణించుకొన్న 'సంస్కృతి' పట్ల తమకున్న విధేయతనుంచి ఉన్నపళంగా బయటకు వచ్చేయటం కొంతమందికి అంత సులువు కాలేదు. కనుక ఆ తరంలోని కొంతమంది తమ ఫ్రెంచి విధేయతకు, మారుతున్న రాజకీయ పరిస్థితులకు మధ్య సంఘర్షణను ఎదుర్కోవలసి వచ్చింది. ఈ ఘర్షణ ఫలితమే యానాంలో జరిగిన విమోచనోద్యమము.

## యానాం విమోచన నేపథ్యం

1948 మరియు 1954 లలో యానాంలో జరిగిన ఎన్నికలలో ఫ్రెంచి పాలనకు అనుకూలంగా ఉండే పార్టీల తరపున పోటీ చేసిన వారే విజయాలు సాధించటంతో ఇక్కడి ప్రజలలో విమోచన భావాలు విస్తృతంగా లేవని ప్రచారం జరిగింది. యానాంలో 1947 నుంచి 1953 వరకూ ఏ రకమైన ఫ్రెంచి పాలనా వ్యతిరేక ఉద్యమాలు కూడా పెద్దగా జరగలేదు. (ఇతర ప్రాంతాలు ఉద్యమసెగలతో అట్టుడికి పోతూఉండేవి). అందుచేతనే ఫ్రెంచి వారు యానాం ను 'తమనిష్టపడే' ప్రాంతంగా అభివర్ణించుకొనే వారు.

## యానాం విమోచనోద్యమానికి అంకురార్పణ

1954 మార్చి మూడున యానాంకు చెందిన జాతీయవాదులు, కామిశెట్టి పరశురాం అధ్యక్షతన ఒక విలీన కూటమిగా ఏర్పడ్డారు. యానాంలో స్థానిక ఫ్రెంచి అధికారులు కొంతమంది స్వార్ధపరులైన ఫ్రెంచి విధేయులతో చేతులుకలిపి, జాతీయభావాలున్న ప్రజలను భయాందోళనలకు, అణచివేతకు గురిచేస్తున్నారని అప్పటి ఫ్రెంచి గవర్నరు అయిన ఆండ్రే మెనార్డ్ కు ఇచ్చిన టెలిగ్రాం లో వీరు ఆరోపించారు. ఈ ఉదంతం ద్వారా యానాంలో ఫ్రెంచి వారి పట్ల అసంతృప్తి మొదలైందని భావించుకోవచ్చు.

1954 ఏప్రిల్, 11 వ తేదీ రాత్రి పాండిచేరీలోని భారత కౌన్సిల్ జనరల్ కేవల్ సింగ్ ఆధ్వర్యంలో పాండిచేరీకి చెందిన జాతీయవాదులంతా సమావేశమయ్యారు. '*ఫ్రెంచి వారినుండి ఫ్రెంచి కాలనీలు విముక్తమవ్వాలంటే ఈ కాలనీలలో (పాండిచేరీ, మాహే కారైకాల్ యానాం లు) దేన్నో ఒకదానిని సంపూర్ణంగా చేజిక్కించుకోవటమే సరైన మార్గం*' అని కేవల్ సింగ్ ఆ





సమావేశంలో అనగా ఆ విధంగా చేయటానికి ఎవరూ ముందుకు రాలేదు. యానానికి చెంది, పాండిచేరీ స్వాతంత్ర్యపోరాటంలో ప్రధానపాత్ర వహిస్తున్న దడాల రఫేల్ రమణయ్య కూడాఈ సమావేశానికి హాజరయ్యారు. కేవల్ సింగ్ మాటలకు ఉత్తేజితుడైన దడాల, యానాన్నికైవశం చేసుకొని ఫ్రెంచిపాలన నుండి విముక్తం చేయటానికై పాండిచేరీనుంచి బయలుదేరాడు. ఆ విధంగా యానాం విమోచనోద్యమానికి 1954 ఏప్రిల్ పదకొండున అంకురార్పణ జరిగిందని చెప్పుకోవచ్చు.

## యానాంలో ఉద్యమభావాలు రగల్చటం

1954 ఏప్రిల్, 6 న ఫ్రెంచి పాలన కొనసాగాలని యానాం మున్సిపల్ కౌన్సిల్ తీర్మానం చేసింది. దీని వెనుక ఫ్రెంచి విధేయులైన సమతం కృష్ణయ్య, కాపగంటి బులిమంగరాజు వంటి పెద్దల హస్తం ఉండవచ్చు.

సరిగ్గా ఇటువంటి ప్రతికూల పరిస్థితులలో దడాల యానాం వచ్చాడు. యానాం చుట్టూ ఉన్న తూర్పుగోదావరి జిల్లా నాయకులను కలుసుకొని, కాకినాడ టౌన్ హాలులో సభ ఏర్పాటుచేసి, గంభీరమైన ఉపన్యాసమిచ్చి అక్కడి పెద్దలు, యువకులలో యానాం విమోచనం పట్ల ఉత్సాహాన్ని కలిగించాడు. ఇలా సంపాదించుకొన్న కార్యకర్తలతో దడాల, లారీలపై యానాం వీధులలో తిరిగి ఫ్రెంచి వ్యతిరేక వాతావరణాన్ని సృష్టించాడు.

యానాంలో క్రమక్రమంగా ఫ్రెంచి వ్యతిరేక వాతావరణం వస్తూండటంతో ప్రభుత్వం కలవరపడసాగింది. ఫ్రెంచి విధేయులు యానాంలో మీటింగులు పెట్టుకొని ఫ్రెంచి వారి పట్ల విధేయత ప్రకటించటమూ, దడాల దిష్టిబొమ్మను తగులపెట్టటము జరిగేది. ఇటువంటి పరిస్థితులలో దడాల యానాం వంతెనకివతలి ఆంధ్రాప్రాంతంలో టెంటు వేసి, తన అనుచరులతో ఉంటూ, లౌడు స్పీకర్ల సహాయంతో విలీనం యొక్క ఆవశ్యకతను తెలుపుతూ ఉండేవాడు.

ఆంధ్రానాయకులైన భయంకరాచారి, డి.ఎస్.ఆర్. సోమయాజులు, కొంపెను సుబ్బారావు, కస్తూరి సుబ్బారావు వంటి వారితో కలసి సభలు, పికెటింగులు, రాలీలు, రాస్తారోకోలు వంటివి జరపటం వల్ల క్రమక్రమంగా యానాం ప్రజలలో కూడా ఉద్యమభావాలు కలగటం మొదలైంది. పాండిచేరీలో ఉన్నత విద్య చదువుకొంటున్న యానాం విద్యార్థి బొల్లోజు బసవలింగం అక్కడ ఉద్యమ నాయకుడైన సెల్లాన్ నాయకర్ ఉపదేశం మేరకు 1954 ఏప్రిల్, 22న పాండిచేరీనుంచి యానాంవచ్చి దడాల, కనకాల తాతయ్యలతో కలసిఉద్యమంలో తనవంతు పాత్రను నిర్వహించారు.

ఈ సమయంలో యానాం ఎడ్మినిస్ట్రేటరు జార్జిసాలా ఫ్రెంచివారికి అనుకూలంగా ఉండే యానాం పౌరులను చేరదీసి వారి సహాయంతో విలీన వ్యతిరేక వాతావరణాన్ని సృష్టించటానికి ప్రయత్నించాడు. వీరిలో సమతం కృష్ణయ్య, బస్సా సుబ్బారావు, కాపగంటి బులిమంగరాజు, బళ్ళా, మహమ్మద్ జిక్రియా తదితరులు ముఖ్యులు.

యానానికి చెందిన ప్రముఖ నాయకులైన మద్దింశెట్టి సత్యానందం (మేయరు), కనకాల

తాతయ్య, కామిశెట్టి పరశురాం, యర్రా సత్యనారాయణ మూర్తి మరియు కోన నరసయ్య లను తన వైపుకు తిప్పుకోవాలని సాలా చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. వీరందరూ కలసి 1954 ఏప్రిల్, 29 న యానాం భారతావనిలో విలీనం చెందాలన్న అవసరాన్ని గుర్తించి ఈ విధంగా తీర్మానం చేసుకొన్నారు

తాతయ్య, కామిశెట్టి పరశురాం, యర్రా సత్యనారాయణ మూర్తి మరియు కోన నరసయ్య లను మేము *'మా మాతృభూమి అయిన భారతావని పట్ల సానుకూల ధోరణితో, దృఢంగా మమేకమై ఉన్న కారణంగా, ఈ ప్రాంతపు (యానాం) ఎన్నుకోబడిన నాయకులమైన మేము, భౌగోళికంగా, ఆర్ధికంగా, సాంస్కృతికంగా మా ప్రాంతం భారతావనితో సారూప్యత కలిగి ఉండటం చేత, ఈ ప్రాంతాన్ని రిఫరెండం లేకుండా భారతావనిలో తక్షణం విలీనం జరపాలని ఏకగ్రీవంగా కోరుచున్నాము. యానాన్ని మా భారత మాతృభూమిలో కలుపటానికి అవసరమైన సత్వర చర్యలు చేపట్టాలని ఫ్రెంచి ప్రభుత్వాన్ని కోరుతున్నాము. వెంటనే స్పందించి మా బలీయమైన ఆశలను నిజం చేసి ఫ్రాన్స్-ఇండియాల స్నేహాన్ని బలోపేతం చేయవలసినదిగా ఫ్రెంచి ప్రభుత్వ అధిపతి యొక్క విజ్ఞతకు, రాజనీతిజ్ఞతకు మేము విజ్ఞప్తి చేస్తున్నాము."* ....... అంటూ యానాం నాయకులు చేసిన పై తీర్మానాన్ని అప్పటి భారతప్రధాని నెహ్రూకు, ఫ్రెంచి దేశ అసెంబ్లీకి పంపించారు. దీని తదనంతరం జరిగిన అన్ని ఉద్యమ కార్యక్రమాలను వీరు దడాలతో కలిసి సాగించారు. మద్దింశెట్టి చర్యలు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉన్నాయన్న కారణం చూపి వారిని యానాం మేయర్ పదవినుంచి ఫ్రెంచి ప్రభుత్వం తొలగించి తమకు అనుకూలంగా ఉండే సమతం కృష్ణయ్య ను ఇంచార్జ్ మేయర్ గా నియమించింది.

1954 మే, 20 న భారతదేశ జండాలను ధరించి 500 మంది కార్యకర్తలు ఫ్రెంచి బ్రిడ్జిమీదుగా కదంతొక్కుతూ యానాం వైపు కదిలారు. వీరందరికీ మద్దింశెట్టి, కనకాల, దడాల, కామిశెట్టి, యర్రా, కస్తూరి సుబ్బారావు, భయంకరాచారి లు నాయకత్వం వహించారు. ఈ పతాక ప్రదర్శనను విమోచన ఉద్యమకారులు చేసిన బలప్రదర్శనగా భావించిన ఉద్యమ



పరిపాలనా నిర్వహణలో తెలుగుభాష: అసెంబ్లీలో ముఖ్యమంత్రి వివరణ 2 వ పేజీ

ఆంధ్రపత్రిక

దేవాదాయ, ధర్మాదాయ చట్టసవరణ బిల్లుకు అసెంబ్లీ ఆమోదం 5 వ పేజీ

THE ANDHRA PATRIKA - MADRAS. సంపుటం 41. సంచిక 53 FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO మంగళవారం 25-5-1954 Reg. No.M. 1118 6 పేజీలు వెల 1 అణా

ఫ్రెంచిపేట యానాంలో సాయుధదుండగుల విశృంఖల దౌర్జన్యం

ప్రభుత్వ నీటిపనరుల కింద సాగయే భూములపై అభివృద్ధిపన్ను బిల్లు

అసెంబ్లీలో రివెన్యూ మంత్రి కోటిరెడ్డిగారి ప్రతిపాదన

పోలీస్ మద్దతుతో ఇళ్లదోపిడి

స్త్రీలపై అత్యాచారాలు: సరిహద్దులు అతిక్రమించి గ్రామాలపై దాడులు

భారత కాన్సల్ తీవ్ర ఆక్షేపణ

ఇండో చైనాలో అమెరికా సేనాని నాయకత్వం

సహాయానికి వాషింగ్టన్ షరతు: ఫ్రెంచి ప్రధానిచే పథకం పరిశీలన

వ్యతిరేకవాదులు ఉక్రోషంపట్టలేక ఉద్యమకారుల ఇళ్ళపై దాడులకు దిగారు. 25-5-1954 నాటి ఆంధ్ర పత్రిక ఈ దాడులను మొదటి పేజీలో - **"ఫ్రెంచి పేట యానాంలో సాయుధ దుండగుల విశృంఖల దౌర్జన్యం - పోలీసుల మద్దతుతో ఇళ్ళదోపిడి - స్త్రీలపై అత్యాచారాలు; సరిహద్దులు అతిక్రమించి గ్రామాలపై దాడులు"** - అంటూ ప్రముఖంగా ప్రస్తావించింది.



ఫ్రెంచి పాలనలో యానాం

ఆ దాడులలో ప్రధానంగా చెప్పుకోవలసినది మద్దింశెట్టి ఇల్లు దోపిడి. 1954 మే, 23 న మద్దింశెట్టి ఇంటిపై విలీన వ్యతిరేక వాదులు దాడిచేసి 17 వేల రూపాయిల విలువచేసే నగలు, కొన్ని విలువైన పత్రాలు లూటీ చేసారు. వీరి తమ్ముడైన మద్దింశెట్టి సత్తిరాజు ఇంటిపై కూడా దాడి చేసి 20 వేల రూపాయిల నగలు, ఇతరవస్తువులు లూటీ చేసారు. దడాల ఇంటిపై దాడికి ప్రయత్నించారు. ఉద్యమకారులైన తోట వెంకటవేణుగోపాలరావు, తోట పకీర్ రావులను చితకబాదారు.

ఈ అఘాయిత్యాలకు సూత్రధారులుగా వ్యవహరించింది, యానాం జడ్జి గిర్మెన్ మరియు ఫ్రెంచి పోలీసు అధికారి బొర్నెట్ అని ఆరోపిస్తూ ఫ్రాన్స్‌కు టెలిగ్రాములు వెళ్ళటంతో మొత్తం ఈ వ్యవహారం అంతర్జాతీయంగా చర్చనీయాంశమైంది.

ఈ సంఘటనల పట్ల విచారణ జరపటానికై ఫ్రెంచి సెక్రటరీ జెనరల్ ఎస్కర్‌గుయిల్ 1954 మే, 25 న యానాంలో పర్యటించి, యానాంలో గూండాల దాడులు జరిగాయని అంగీకరించి, మద్దింశెట్టికి తగిన నష్టపరిహారం ఇప్పిస్తానని హామీ ఇచ్చాడు. ఇలాంటి ఉద్రిక్త పరిస్థితుల నడుమ యానాంలో ఉంటున్న ఫ్రెంచి దేశస్థులైన అధికారులకు రక్షణ ఉండదని భావించి తనతో పాటు వారిని పాండిచేరీ తీసుకుపోయాడు.

**యానాం విమోచనం**

యానాం దాడులు ప్రతిదాడులతో దద్దరిల్లిపోతున్న సమయంలో జార్జి సాలా పాండిచేరీ వెళిపోవటంతో ఆ బాధ్యతలను యానాం జడ్జి శివా స్వీకరించారు. యానాన్ని ఫ్రెంచి పాలననుండి విముక్తి చెందించటానికి ఇదే సరైన సమయమని ఉద్యమనాయకులు భావించారు. ఈ పోరాటనాయకుల రక్షణార్ధం అప్పటి కాకినాడ కలక్టరు ఎస్. సాంబమూర్తి 200 సాయుధబలగాలను రప్పించి వీరికి సహాయంగా ఉంచాడు.

అది ఆదివారం 1954 జూన్, 13. ఆ రోజు ఉదయాన్నే మద్దింశెట్టి సత్యానందం, కనకాలతాతయ్య, దడాల, యర్రా సత్యన్నారాయణమూర్తి, కామిశెట్టి పరశురాం, కోననరసయ్య, భయంకరాచారి మరియు ఓ వేయి మంది అనుచరులు ఒక ప్రవాహంలా యానాంలోకి ప్రవేశించారు. ఫ్రెంచి పోలీసులు కొన్ని చేతిబాంబులను వీరివైపు విసిరారు. విమోచన ఉద్యమ బృందంలో ఉన్న సాయుధపోలీసులు అనేక రౌండ్ల కాల్పులు జరిపి చాలా చాకచక్యంగా వ్యవహరించి ఏ విధమైన పౌరనష్టం జరుగకుండా (ఈ సందర్భంలో) ఫ్రెంచి పోలీసులను నిర్వీర్యం చేసి నిరాయుధులను కావించారు. వీళ్ళరాక తెలుసుకొన్న ఫ్రెంచి విధేయశక్తులు తలో దిక్కుకు పోయి దాక్కున్నారు.

విమోచనోద్యమకారులు అడ్మినిస్ట్రేటరు బంగళాను చేరుకొని ఇంచార్జి అడ్మినిస్ట్రేటరయిన శివా నుండి అధికారాలను స్వాధీనపరచుకొన్నారు. శివా పరిస్థితిని సమీక్షించి ప్రతిఘటించినట్లైతే

బొల్లోజు బాబా

నాం
ంది.

శాంతి భద్రతల సమస్య తలెత్తగలదని ఆలోచించి అధికారాలను బదలాయించాడు. ఆ రోజే శివా పాండిచేరీకి ఈ విధంగా టెలిగ్రాం ఇచ్చాడు

*ప్రజలు యానాం నిర్వహణను ఈనాడు ఉదయం ప్రతిఘటన ఉన్నప్పటికీ స్వాధీనం చేసుకొన్నారు. "అన్ని ప్రభుత్వకార్యలయాలు ఇప్పుడు ప్రజల ఆధీనమై ఉన్నాయి. ఎవరికీ ప్రాణహాని లేదు. కొందరు స్వల్పంగా గాయపడ్డారు. ప్రభుత్వోద్యోగులకు యానాంలో ఉండి పనిచేయటమా లేక పాండిచేరీ వెళ్ళిపోవటమా అనే చాయిస్ (ఎంపిక) ఈయబడింది"*

ఫ్రెంచి పాలనలో యానాం నుండి పాండిచేరీకి పంపబడ్డ ఆఖరు అధికారిక సమాచారం ఇదే.



1954 జూన్, 13 న జరిగిన యానాం విమోచనానంతరం జరిగిన ఊరేగింపు

ఇదే అదునుగా భావించిన కొంతమంది అల్లరిమూకలు ఫ్రెంచి విధేయులైన కాపగంటి, బాజీ, ఉమార్ ల ఆస్తులను, వ్యాపారాలను నాశనం చేయటం జరిగింది. విలీన కార్యకర్తలు మరియు సివిల్ దుస్తులలో ఉన్న కొంతమంది సాయుధపోలీసులు యానాం వీధులలో విజయోత్సాహంతో తిరిగారు. ఈ సమయంలో యానాం ఇంచార్జ్ మేయర్ అయిన సమతం కృష్ణయ్య (78 ఏండ్లు) వద్ద స్వీయరక్షణార్థం ఉన్న పిస్తోలును చూసి, కాల్పులు జరపటానికి ప్రయత్నిస్తున్నారనే అనుమానంతో ఆయనను కాల్చి చంపటం జరిగింది. యానాం విమోచనోద్యమంలో అసువులు బాసింది ఈయనొక్కరే.

తదనంతరం ఉద్యమకారులు జాతిపిత గాంధీజీ మరియు నెహ్రూల చిత్రపటాలను అలంకరించి పట్టణవీధులలో ఊరేగింపు జరిపారు. ఆ తరువాత జరిగిన బహిరంగసభలో మద్దింశెట్టి మాట్లాడుతూ యానాం విమోచనమైందనీ, భారతప్రభుత్వం దీని పాలనను చేపట్టి ఈ ప్రాంతాన్ని భారతావనిలో విలీనం చేసుకోవాలని కోరారు.







అదే రోజు మధ్యాహ్నం దడాల అడ్మినిస్ట్రేటరుగా బాధ్యతలు స్వీకరించారు. మద్దింశెట్టి ప్రెసిడెంటుగా, కనకాల వైస్ ప్రెసిడెంటుగా, కామిశెట్టి, యర్రా మరియు కోన నరసయ్యలు సభ్యులుగా ఒక పాలకమండలి ఏర్పడి యానాం పాలనా భాధ్యతలు చేపట్టారు. చిన్నాభిన్నమైన శాంతిభద్రతలను తిరిగి స్థాపించటంలో ఈ పాలక వర్గం ఎంతో కృషిచేసింది. అలా ఉద్యమకారులచే జరపబడిన యానాం విమోచనం ను ఆలిండియా రేడియో మరియు ప్రముఖ జాతీయ, అంతర్జాతీయ పత్రికలు ప్రకటించాయి.

1954 జూన్, 27న యానాం ప్రజలు విమోచన వేడుకలను అట్టహాసంగా జరుపుకొన్నారు. 21 తుపాకుల కాల్పుల అనంతరం మద్దింశెట్టి సత్యానందం ఫ్రెంచి పతాకాన్ని అవనతం చేసి భారత పతాకాన్ని ఎగురవేసారు. ఈ వేడుకలలో యానాం ప్రజలే కాక పరిసర ప్రాంతాలైన నీలపల్లి, జార్జిపేట, కాపులపాలెంలకు చెందిన పౌరులు కూడా ఉత్సాహంగా పాల్గొన్నారు.

## వివిధ పత్రికలలో యానాం విలీన వార్తలు –ఒక విశ్లేషణ

ఫ్రెంచి పాలననుండి యానాం విముక్తి చెందటం అప్పట్లో జాతీయ స్థాయి కలిగిన సంఘటన. అందుకనే అలనాటి ప్రముఖ పత్రికలన్నీ ఈ వార్తను తమ మొదటి పేజీలలో పతాక శీర్షికలతో ప్రచురించాయి. ఆ వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

### ఆంధ్రపత్రిక

**ఫ్రెంచి స్థావరం యానాం దాస్యవిముక్తి భారత పతాక ప్రతిష్ఠాపన – 15-6-1954**
**మేయర్, డిప్యూటీ మేయర్ ప్రభృతుల నాయకత్వాన పట్టణంలో దాదాపు 1000 మంది విజయ ప్రవేశం – ప్రత్యేక పాలకవర్గం ఏర్పాటు – మాతృదేశంలో చేర్చుకోవలసిందని విజ్ఞప్తి**

ఫ్రెంచి స్థావరం యానాంకు నేడు ఫ్రెంచివారి దాస్యం నుంచి విముక్తి కల్గింది. ప్రజానాయకులు ఈ గ్రామాన్ని ఆక్రమించుకొని, స్వతంత్ర ప్రభుత్వాన్ని నెలకొల్పి, ఈ విషయాన్ని ఫ్రెంచి ప్రభుత్వానికి, భారతప్రభుత్వానికి, ఆంధ్రప్రభుత్వానికి తెలియచేశారు.

యానాం మేయరు శ్రీ సత్యానందం, డిప్యూటీ మేయరు, ఫ్రెంచి ఇండియా ప్రతినిది సభ తాలూకు సభ్యులు, దాదాపు వెయ్యిమంది ఫ్రెంచి ఇండియాకు కాందిశీకులతో పట్టణంలో ప్రవేశించి ప్రభుత్వ భవనాలను, పరిపాలనా యంత్రాంగాన్ని వశపరచుకొన్నట్లు తెలుస్తున్నది.

యానాంకు ఈ విధంగా దాస్య విముక్తిని కల్గించిన అనంతరం వీరు భారతజాతీయ పతాకాన్ని ప్రభుత్వ భవనాలమీద ఎగురవేశారు. ఫ్రెంచిప్రభుత్వ దాస్యంనుంచి యానాంకు విముక్తి కల్గిందని, ఈ ప్రాంతాన్ని భారతప్రభుత్వం ఇక ఇండియాలో చేర్చుకోవచ్చునని విస్పష్టం చేస్తూ వీరు ఒక తీర్మానాన్ని కూడా ఆమోదించారు. //

ఫ్రెంచి ఇండియా మెర్జర్ కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ దడాల రామయ్య, మేయరు ఎం. సత్యానందం, ఫ్రెంచి ఇండియా శాసనసభ సభ్యుడు శ్రీ కె.తాతయ్య, యానాం మాజీ మేయరు శ్రీ కె.వి. గోపాలరావు, శ్రీ కె.పరశురాం, వై సత్యనారాయణమూర్తి, ఆదిగాగల మునిసిపల్

కౌన్సిలర్లు, ఈ యాత్రకు అగ్రపరులై నడిచారు. శ్రీ దడాల రామయ్య ఈ యాత్రకు నాయకత్వం వహించారు.

యానాంకు ఈ విధంగా దాస్య విముక్తి కల్గించి పరిపాలనా యంత్రాంగాన్ని కైవశం చేసుకున్న అనంతరం ఈ ప్రజానాయకులు ఒక బహిరంగ సభజరిపారు. ఈ సభలో శ్రీసత్యానందం యానాం స్వాతంత్ర్యాన్ని ప్రకటించారు. యానాం పరిపాలనా వ్యవహారాన్ని వశం చేసుకోవలసిందని, రిఫరెండంతో నిమిత్తం లేకుండా ఈ ప్రాంతాన్ని భారతదేశంలో విలీనం చేసుకోవలసిందనిగూడా ఈయన ఈ సందర్భంలో భారతప్రభుత్వాన్ని కోరారు.

ఆంధ్రపత్రిక

THE ANDHRA PATRIKA MADRAS ... 15-6-1954

ఫ్రెంచి స్థావరం యానాం దాస్యవిముక్తి; భారత పతాక ప్రతిష్ఠాపన

మేయర్, డిప్యూటీ మేయర్ ప్రభృతుల నాయకత్వాన పట్టణంలో దాడాపు 1000 మంది విజయ ప్రవేశం

ప్రత్యేక పాలకవర్గం ఏర్పాటు

కర్నూలుకు ఈ విషయాన్ని గూర్చి ఇంకా పూర్తి వివరాలు చేరలేదు. //

**పరిపాలక మండలి విజ్ఞప్తి** – కాకినాడ జూన్ 14

యానాం ఫ్రెంచి ఆధిపత్యంనుండి విముక్తమైంది. 'యానాం పరిపాలనను భారతప్రభుత్వం కైవశం చేసుకొని రిఫరెండం ప్రసక్తిలేకుండా, భారత్‌లో విలీనం చేసివేసి జాతీయవాదుల కోరిక సఫలంచేయాలి' అని యానాం పరిపాలకమండలి అధ్యక్షుడు శ్రీ యం. సత్యానందంగారు బహిరంగసభలో విజ్ఞప్తిచేశారు.

యానాం విముక్తమై పరిపాలకమండలి యేర్పాటైన వెనువెంటనే ఈ బహిరంగసభ జరుపబడినది.

యానాం విలీనోద్యమ కాంగ్రెసు కార్యదర్శి ఆర్ దడాల సభలో ప్రసంగిస్తూ, ప్రజలు ప్రశాంతంగా సమైక్యంగా ఉండాలని విజ్ఞప్తిచేసారు. విలీనోద్యమ కార్యాచరణ సంఘ సభ్యులు శ్రీయుతులు పి.వెంకటనారాయణ,ఎం.పి. కస్తూరి సుబ్బారావు, పి.వి.భయంకరాచారి, బి.వి.ఎస్.పాత్రుడు, యం.పళ్ళంరాజు, ఎం.బి.ఎస్.ఆర్.శర్మ, ఎన్. కామరాజు, ప్రభృతులు యానాం పౌరులను అభినందిస్తూ ప్రసంగించారు. యానాం ప్రజలమ సాధించినపని వల్ల, ఒక్క యానాం ప్రజలకే కాక, యావదాంధ్ర ప్రజలకు నూత్న ఆంధ్రకు కీర్తి ప్రతిష్టలు వచ్చాయని ప్రజలు నూతన ప్రభుత్వంపట్ల భక్తి విశ్వాసాలు గలిగి ప్రవర్తించాలని ఆవిధంగా ఇంకా ఫ్రెంచి దాస్యం నుండి విముక్తం కావలసిన ప్రాంతాలకు దారిచూపించాలని ఉద్బోధించారు. యం.సత్యానందం గారు అధ్యక్షులుగను, కనకాల తాతయ్యగారు ఉపాధ్యక్షులుగను, కె.పరశురాం, ఎర్రా సత్యనారాయణమూర్తి, కోనసర్యయ్య, దవులూరి రాజారావు గారలు సభ్యులుగాను పాలకమండలి ఏర్పాటైనది. ఖజానా, పి.డబ్ల్యు.డి, న్యాయశాఖల మంత్రిగా శ్రీ యం. సత్యానందం గారు, విద్యాశాఖామంత్రిగా







కె.తాతయ్యగారు, రెవిన్యూ మంత్రిగా కె.పరశురాం గారు, ప్రజారోగ్య శాఖా మంత్రిగా ఇ. సత్యనారాయణమూర్తిగారు పదవీ ప్రమాణం స్వీకరించారు. //

**యానాం పరిస్థితి**

ఉపముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి ప్రకటన

కర్నూలు, జూన్ 14 ఫ్రెంచి వారి వలస యానాంలో కొద్దికాలంనుంచి పరిస్థితులు అధ్వాన్నంగా పరిణమించి అక్కడినుంచి వచ్చిన వలంటీర్లు, కాందిశీకుల విముక్తి ఉద్యమంగా రూపొందిందని ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ ఉపముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి గారు ఈవేళ అన్నారు. // ఎన్నికయిన ప్రజా ప్రతినిధులూ, నాయకులూ ఈ ఉద్యమంలో పాల్గొంటున్నారన్న వాస్తవాన్ని బట్టి యానాం ఇండియాలో కలవాలనే వైఖరిని ఫ్రెంచి ఇండియా ప్రజలు బలపరుస్తున్నారని స్పష్టమవుతున్నది యానాంకు అంతరవ్యవహారాలు అక్కడి ప్రజలకు సంబంధించినవేనని కూడా సంజీవరెడ్డిగారు అన్నారు. //

**ఆంధ్రప్రభ** – 16-6-1954

**ఫ్రెంచి పరిపాలననుంచి యానాంకు విమోచనం** – భారతపతాక ప్రతిష్ఠ

*లీనీకరణోద్యమ నాయకులచే తాత్కాలిక ప్రభుత్వ సంస్థాపన*

*ఇండియా యూనియన్‌లో తక్షణ లీనీకరణ కోరుతూ ఢిల్లీకి వినతి*

యానాం నేటి ఉదయం ఫ్రెంచిఅధికారం నుంచి విమోచనం పొందింది. స్థానిక ప్రజలు ఇక్కడి ఫ్రెంచి పరిపాలనకు స్వస్తి చెప్పి, భారత పతాకాన్ని ప్రతిష్ఠాపన చేశారు.

తెలుగు కోస్తాలోని ఈ ఫ్రెంచి స్థావరం ప్రభుత్వ కార్యాలయాలు ప్రజల స్వాధీనం కాగానే, దైనందిన పరిపాలనా కార్యక్రమాన్ని నిర్వహించే నిమిత్తం ప్రజా ప్రతినిధులతో ఒక పరిపాలక సంఘం ఏర్పాటు చెయ్యబడింది. ఫ్రెంచి ప్రభుత్వంచే లోగడ సస్పెండు చేయబడ్డ మేయర్ శ్రీ సత్యానందంగారు యానాం ప్రజల కోరికపై డిప్యూటీ మేయర్‌తోను, ఫ్రెంచి ఇండియా అసెంబ్లీ సభ్యులతోను, మరి 200 మంది ఫ్రెంచి ఇండియా శరణార్థులతో నేటి ఉదయం యానాం మీదకు వెళ్ళి, ప్రభుత్వ కార్యాలయాలను, పరిశాంతంగా స్వాధీనం చేసుకొన్నారు. ప్రభుత్వ కార్యాలయాలమీద జాతీయ పతాకం ఎగురవెయ్యబడింది. ఫ్రెంచి దాస్యంనుంచి విమోచన ప్రకటించబడింది.



ఆంధ్రప్రభ

15-6-1954

ఫ్రెంచి పరిపాలనసుంచి యానాంకు విమోచనం- భారత పతాక ప్రతిష్ఠ

లీనీకరణోద్యమ నాయకులచే తాత్కాలిక ప్రభుత్వ సంస్థాపన

ఇండియా యూనియన్‌లో తక్షణ లీనీకరణకు కోరుతూ ఢిల్లీకి వినతి



పూర్తి వివరాలు లభించినతరువాతే ఏమి చేయాలన్న విషయంపై ఆలోచిస్తామని ఆంధ్రప్రభుత్వం యోచిస్తున్నట్లుగా వ్యాఖ్యానించింది.

ఫ్రెంచిపాలననుండి విమోచనం చెందిన స్వతంత్ర యానాంను ఇంక భారత యూనియన్ లో విలీనం చేయాలని ఇండియా ప్రభుత్వాన్ని కోరుతూ ఒక తీర్మానం చేయబడింది. ఫ్రెంచి ఇండియా లీనీకరణ కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ దడాల రమణయ్యగారు అడ్మినిస్ట్రేటరు హోదాను స్వీకరించారు. //

శ్రీ సత్యానందం గారు న్యాయశాఖా మంత్రిగాను, శ్రీ తాతయ్య గారు ఖజానాశాఖా మంత్రిగాను, శ్రీ పరశురాం గారు వర్క్సు, విద్యాశాఖల మంత్రిగాను, శ్రీ సత్యనారాయణమూర్తి గారు రెవిన్యూ, ఆరోగ్యశాఖల మంత్రిగాను ప్రమాణం స్వీకరించారు.

**విమోచనం జరిగిన విధానం**

గతరాత్రి యానాంలో శాంతిభద్రతలు పూర్తిగా తలక్రిందులైపోయాయి. ఫ్రెంచి అధికారులచే నియమించబడ్డ గూండాలు, ఫ్రెంచి పోలీసుల సహాయంతో విచ్చలవిడిగా దుండగాలకు పూనుకొన్నారు.

యానాంలో తమ యిళ్ళు వాకిళ్ళు విడిచిపెట్టి ఇండియా యూనియన్ లో తలదాచుకొంటున్న లీనీకరణ వాదుల ఇండ్లపై – ముఖ్యంగా మేయరీకు, ఆయన బంధుకోటికి చెందిన ఇండ్లపై గూండాలు దాడిచేసి గృహస్థులను హింసించటం ప్రారంభించారు. ఈ విధంగా యానాం పట్టణాన్ని కల్లోలపరుస్తూ, అంతటితో ఆగక, గూండాలు, ఫ్రెంచిపోలీసులు కలిసి ఇండియాభూభాగంలో గల నీలపల్లి లోని శరణార్థుల మకాంపై తుపాకులు కాల్చారు. సుమారు 20 రౌండ్లు అయినా కాల్చబడి ఉంటాయి. ఈ కాల్పుల ఫలితంగా గంగరాజు, వారా ప్రసాద్ అనే ఇద్దరు ఫ్రెంచి ఇండియా శరణార్థులు, ఆ మకాం సమీపంలో గస్తీపనిలో ఉన్న డేవిడ్, సుబ్బయ్య అనే ఇద్దరు ప్రత్యేక సాయుధ పోలీసు జవానులు గాయపడ్డారు. ఆత్మరక్షణకోసం ఇండియా పోలీసులు తిరిగి కాల్పులు జరపవలసివచ్చింది.

రాత్రి అంతా ఈ గూండాల దౌర్జన్య చర్యలకు విసిగిపోయిన యానాం పౌరులు అనేకమంది నేటి ఉదయం శరణార్థుల మకాం దగ్గరకు వచ్చి, పోలీసు అధికారుల మద్దతుతో తమను పీడిస్తున్న గూండాలను ఎదుర్కోవడంలో తమకు సహాయపడవలసిందిగా ఈ శరణార్థుల నాయకులను కోరారు.

ప్రజలకోరికను మన్నించి యానాం శరణార్థుల నాయకులు శ్రీయుతులు సత్యానందం, కనకాల తాతయ్య, కామిసెట్టి వేణుగోపాలరావు, కె.పరశురాం, ప్రభృతులు సుమారు 200 మంది శరణార్థులతో యానాంలో ప్రవేసించి, పరిపాలనను స్వాధీనం చేసుకొన్నారు.

తమనాయకులు తిరిగి యానాంలో ప్రవేశించగానే వారికి ప్రజలు బ్రహ్మాండమైన స్వాగతం ఇచ్చారు. పట్నంలోగల ఫ్రెంచి జండాలన్నీ తీసివెయ్యబడ్డాయి. యానాం అంతటికీ వయోవృద్ధుడైన శ్రీ కామిసెట్టి వేణు గోపాలరావు ఇండియా జాతీయపతాకను ఎగురవేశారు.

## విశాలాంధ్ర

**ఫ్రెంచివలస పాలననుండి యానాం ప్రజల విముక్తి** – కాకినాడ జూన్ 13 దైనందిన పరిపాలనా నిర్వహణకు ఆరుగురితో పాలకసమితి నిర్మాణం –అనే శీర్షికతో జూన్ 15 వ తేదీ విశాలాంధ్ర పత్రిక కూడా ఇదే కథనాన్ని చెప్పింది.







## హిందూ దినపత్రిక

Dated 14, June 1954

యానాం విమోచన ఘట్టాన్ని పై పత్రికలు వర్ణించినట్టుగానే హిందూ పత్రికకూడా Yanam Freed అనే శీర్షితో ప్రధాన వార్తగా ప్రచురించింది.

ఫ్రెంచివలసపాలననుండి యానాంప్రజల విముక్తి

———///———

దైనందిన పరిపాలనా నిర్వహణకు ఆరుగురితో పాలకసమితి నిర్మాణం

కాకినాడ, జూన్ 13

ఫ్రెంచి సామ్రాజ్యవాద వలసపాలననుండి యానాం ప్రజలు నేడు తమ విముక్తిని సాధించుకొన్నారు. జయ జయ ధ్వానాల మధ్య నేటి ఉదయం వారు యానాం స్వతంత్రాన్ని ప్రకటించారు.

కొద్దిరోజులనుంచీ యానాం లో కిరాయిగూండాల అఘాయిత్యాలూ అత్యాచారాలు మితిమీరిపోయాయి.

ఫ్రెంచి స్థావరాలు భారతదేశంలో సంలీనం కావాలని కోరేవారందరి ఇళ్ళ [illegible] కె. పరశురాం, ఎర్రా సత్యనారాయణ మూర్తి, కోనసరసయ్యగారలు సభ్యులు. వీరంతాకూడా ప్రమాణస్వీకారం చేసి యానాం పరిపాలనా బాధ్యతను స్వీకరించారు.

విశాలాంధ్ర జూన్ 15, 1954

## L'Humanité

జూన్ 15, 1954

L'Humanité అనే ఫ్రెంచి పత్రిక యానాం విమోచనాన్ని ఈ విధంగా వర్ణించింది – "యానాం ప్రజలు భారతదేశంతో తమకుగల అంకితభావాన్ని ప్రకటించుకొన్నారు. ఏ ప్రతిఘటనా లేకుండా భారతపతాకం ఎగురవేయబడింది. ప్రజాప్రతినిధులచే పరిపాలనా వ్యవస్థ హస్తగతం చేసుకోబడ్డది. పెద్ద బహిరంగసభనేర్పాటు చేసి ఆ ప్రాంతాన్ని భారతావనిలో విలీనం చేసుకోమని భారతదేశాన్ని కోరుతూ తీర్మానం చేయబడింది. ఫ్రెంచి పౌరసత్వం వారిపై రుద్దబడినప్పటికీ ఆ ప్రాంత వాసుల నిజమైన దేశం ఇండియానే"

## మాతృసేవ పత్రిక

30 అక్టోబరు, 1954 తేదీ మాతృసేవ అనే పత్రికలో శ్రీ బొల్లోజు బసవలింగం "విలీనోద్యమ విశేషాలు" అనే పేరుతోపెద్ద వ్యాసం వ్రాసారు. ఈయన యానాం విమోచనోద్యమంలో పాల్గొన్న ఒక కార్యకర్త. తన అనుభవాలను, ఆనాటి సామాజిక, రాజకీయ, విముక్తి నేపథ్యాలను ఈ వ్యాసంలో వీరు విపులంగా వర్ణించారు.

ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, విశాలాంధ్ర, హిందూ వంటి పత్రికలన్నింటిలో జూన్, 12 వ తేదీ రాత్రి యానాం బ్రిడ్జికవతల భారతభూభాగంలో మకాం వేసిన విమోచన ఉద్యమకారుల కాంపుపై కాల్పులు జరిగాయని దానికి భారతపోలీసులు ఎదురుకాల్పులు జరిపారనీ, దీనిపట్ల యానాం ప్రజలు ఆగ్రహించి ఉద్యమకారులను యానాంలోకి ప్రవేశించి అధికారాలను చేపట్టవలసినదిగా కోరినట్లు తెలుస్తుంది. ఈ సంఘటన పట్ల ఈ క్రింది అభ్యంతరాలు చెప్పుకోవచ్చు.

1. విమోచనోద్యమకారులందరకూ నాయకత్వం వహించిన శ్రీ దడాల, తన ఆత్మకథలో (My struggle for the freedom of French India) ఈ విషయాన్ని ఎక్కడా ప్రస్తావించలేదు. విమోచనోద్యమానికి సంబంధించిన ప్రతి చిన్నవిషయాన్ని అక్షరబద్ధం చేసిన ఆయన, ఉద్యమ కారుల పై 20 రౌండ్ల కాల్పులు (ఆంధ్రప్రభ కథనం) జరగటం, దానికి భారతసాయుధ పోలీసులు ప్రతికాల్పులు జరపటం అందులో ఇరుపక్షాల వారు గాయపడటం వంటి ప్రధాన అంశాలు విస్మరించారనుకోవటం పొరపాటే అవుతుంది.

2. యానాం చివరి ఫ్రెంచి పెద్దొర అయిన జార్జి సాలా యానాం పోలీసులనుండి ఆయుధాలను స్వాధీనంచేసుకొని వారివద్ద లాఠీలు, కొన్ని భాష్పవాయు గోళీలను మాత్రమే ఉంచాడని రికార్డుల ద్వారా తెలుస్తున్నది. మరి అలాంటప్పుడు 20 రౌండ్ల కాల్పులు ఎలా జరిగుంటాయి.

3. విమోచనోద్యమంలో పాల్గొన్న మరోవ్యక్తి అయిన శ్రీ బొల్లోజు బసవలింగం కూడా తాను వ్రాసిన 'విలీనోద్యమ విశేషాలు' అనే వ్యాసంలో ముందురోజు కాల్పులు జరిగినట్లు, యానాం ప్రజలు ఉద్యమకారులను అధికారాలు చేపట్టమని అభ్యర్ధించినట్లు తెలుపలేదు.

4. విమోచనోద్యమ నాయకులలో ఒకరు అయిన శ్రీ కనకాల తాతయ్యను ఒక ఇంటర్వ్యూలో ఈ సంఘటన గురించి ప్రశ్నించగా ఆయన దీనిని ఖండిస్తూ "ఆ ముందురోజు రాత్రి విలీనవాదులకు, విలీన వ్యతిరేక శక్తులకు వాగ్యుద్ధం మాత్రమే జరిగిందనీ, కాల్పులేమీ జరగలేదనీ" అన్నారు. (రి. మెర్జర్ మూవ్‌మెంట్ అండ్ ఆఫ్టర్ – జర్నల్ ఆఫ్ హిస్టారికల్ సొసైటీ, వాల్యూం 20, 2001)

5. యానాన్ని విమోచనం చెందించిన తరువాత శ్రీ మద్దింశెట్టి సత్యానందం యానాం ప్రొవిజనల్ అధ్యక్షుని హోదాలో ప్రధానమంత్రి నెహ్రూకు, ఫ్రాన్స్ ప్రధానమంత్రికి పంపిన టెలిగ్రాం లో కూడా కాల్పులని కాని, ప్రజలు ఆహ్వానించారని కానీ ఎక్కడా ప్రస్తావించలేదు.

6. ఉద్యమకారుల ఊరేగింపులో, సాయుధబలగాల కాల్పులలో చనిపోయిన ఫ్రెంచి విధేయుడు సమతం కృష్ణయ్య గురించి ఈ పత్రికా కథనాలలో ఎక్కడా లేకపోవటాన్ని బట్టి ఈ రాతలు ఏకపక్షంగా ఉన్నాయనిపించక మానదు.

యానాం విమోచనానికి సంబంధించి ముందురోజురాత్రి కాల్పులు మరియు ప్రజల అభ్యర్ధన అనే రెండు అంశాలు ఆ తరువాత కాలంలో వ్రాయబడిన అన్ని పుస్తకాలలో ప్రధాన భూమికలైనాయి. కానీ ఆ రెండు అంశాలు **నాటకీయత** కోసం కల్పించబడిన విషయాలుగా అనిపించక మానదు. ఎందుకంటే యావత్ దేశం జాతీయ భావాలతో రగిలిపోతున్న కాలమది. ఆ దృష్టితోనే ప్రతీ వార్తాకథనం సాగేది. అందుకనే జూన్ 15 వ తేదీ ఆంధ్రప్రభ సంపాదకీయంలో *– జోహారులు – క్షణంలో ఫ్రెంచి సంకెళ్ళను తెంచుకొన్న యానాం పౌరులకు మా జోహారులు. ఆ మహత్కార్యాన్ని దౌర్జన్యరహితంగా సాధించినందుకు వారికి మా ధన్యవాదాలు. దాస్యవిమోచనంలో పుదుచ్చేరి, కారైక్కాల్, మాహే ప్రజలకు మార్గదర్శకులైనందుకు వారికి మా అభినందనలు // ఇంతటనైనా ఫ్రెంచి ప్రభుత్వం వివేకం కలిగి ఫ్రెంచి స్థావరాల విషయమై ఇండియాతో సమాధానపడడం వల్ల తన ప్రతిష్ఠను దక్కించుకోడానికి వీలున్నది. అలా కానిపక్షంలో పుదుచ్చేరి వగైరా ఫ్రెంచి స్థావరాలవారు త్వరలోనే యానాం ప్రజల అడుగుజాడల్లో నడిస్తే ఆశ్చర్యపడనవసరం లేదు –* అంటూ నార్ల వెంకటేశ్వరరావు యానాం విమోచనాన్ని వేనోళ్ళ ప్రశంసించారు.

యానాం పాలనకు
పింఛను ఉద్యోగులు

కర్నూలు, జూన్ 15

యానాంలో ప్రైనందిన పరిపాలనను నిర్వహించడానికి పింఛను ఉద్యోగులను నియమించాలని ఆంధ్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఇప్పుడు యానాంలో వున్న ఫ్రెంచి వుద్యోగులు పుదుచ్చేరికి పోవచ్చునని అనుమతించింది. (వి. వి.)

విశాలాంధ్ర - జూన్ 16, 1954

యానాం విముక్తమైన తరువాత ఈ ప్రాంతంపై ఆధిపత్యం కోసం, అప్పటి ఆంధ్రప్రభుత్వం ప్రయత్నించి భంగపడినట్లు ఆనాటి వార్తా కథనాల ద్వారా తెలుసుకొనవచ్చును. జూన్ 16, 1954







ఫ్రెంచి పాలనలో యానాం

విశాలాంధ్ర లో – యానాంలో పరిపాలనను నిర్వహించటానికి రిటైర్ అయిన ఉద్యోగులను (ఆంధ్ర నుంచి) నియమించటానికి ఆంధ్ర ప్రభుత్వం నిర్ణయించినట్లు కర్నూలు నుంచి ఒక వార్తగా ప్రచురింపబడింది. (అప్పట్లో ఆంధ్ర రాజధాని కర్నూలు). కానీ ఆ మరునాటి సంచికలో అబ్బబ్బే ఆంధ్ర ప్రభుత్వం తరపునుంచి అటువంటి నిర్ణయాలేమీ జరగలేదు అంటూ ఖండన ప్రకటన వచ్చింది.

యానాంలో పోలీసులపై
నిర్బంధం

కర్నూలు, జూన్ 16

(వి. వి.)

విశాలాంధ్ర - జూన్ 17, 1954

యానాం పట్ల ఆంధ్రప్రభుత్వం ప్రదర్శిస్తున్న అత్యుత్సాహం గురించి నెహ్రూ కి తెలిసి కాబోలు, అప్పటి ఆంధ్ర ముఖ్యమంత్రికి, 18 జూన్,1954న ఈ విధంగా లేఖ వ్రాసారు ..... *'యానాం గురించి వ్రాస్తున్నాను. మన సాయుధ పోలీసులు కొంతమంది యానాం నాయకులతో కలిసి అక్కడి ఫ్రెంచి పోలీసులను, ఉద్యోగులను బలప్రయోగం జరిపితొలగించారని నాకు తెలిసింది. అంతేకాక మనపోలీసులలో కొంతమంది అక్కడ అధికారికంగా పదవులు చేపట్టారని కూడా తెలిసింది. ఇది మంచి పద్ధతి కాదు మరియు నవ్వుల పాలయ్యే విషయం. ఫ్రెంచి ప్రభుత్వం దీన్ని గోరంతలు కొండంతలు చేసింది.... ఇప్పటికి ఇంకా జరిగి ఉండక పోతే, వెంటనే మనపోలీసులు యానాం నుండి వెనుకకు రావాలి అని నేను భావిస్తున్నాను. పౌరులవలె ఉంటానన్నా సరిపోదు. వారు ఏవిధమైన ప్రచారము లేకుండా గోప్యంగా యానాం వదిలిరావాలి.'....* జవహర్‌లాల్ నెహ్రూ.

యానాం అనేది భౌగోళికంగా ఆంధ్రలో ఉన్నప్పటికీ, రాజకీయంగా అది రెండు దేశాల నడుమ వ్యవహారమని ఆంధ్రప్రభుత్వానికి నెహ్రూ ఉత్తరంవల్ల జ్ఞానోదయమై, ఆ తరువాత యానాం గురించి ఆలోచనలు చేయటం మానివేసింది.

యానాం విమోచనం అనేది ఉద్యమకారులకు నల్లేరుమీద నడకలా సాగలేదు. కొంతమంది ఫ్రెంచి విధేయులు తమ సర్వశక్తులు ఒడ్డి ప్రతిఘటించటానికి ప్రయత్నించారు. ఒక దేశప్రజల దేశభక్తి మరొక దేశానికి దేశద్రోహంగా కనిపించటం సహజమే కదా! అందుకనే వారు గూండాలుగా, రౌడీలుగా, అల్లరిమూకలుగా వర్ణింపబడ్డారు. కానీ వారు మాత్రం అట్టి ప్రతిఘటనను (ఫ్రెంచి) దేశభక్తిగా భావించుకొన్నారు. అందుకనే....

తల్లి ఇచ్చిన పాలు తనివి తీరగ తాగి
తల్లిరొమ్మే గుద్దుతావా పలుగాకి
పాపభీతి ఇసుమంతయు లేదా
నిన్నమొన్నటి దాకా నీవనుభవించినది

ఫ్రెంఛివారల సొమ్ముకాదా (రచయిత: కాళ్ళ వెంకటరత్నం) వంటి పాటలు కట్టుకొనిపాడుకొంటూ, ఉత్తేజ పరచుకొంటూ తమను రెండు శతాబ్దాలపాటు పరిపాలించిన ఫ్రెంచిరాజ్యం పట్ల తమకున్న భక్తిని ప్రకటించుకొన్నారు.

# యానాన్ని ఆంధ్రాలో ఎందుకు కలపలేదు?

యానాం అనేది 30 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణం కలిగి భౌగోళికంగా ఆంధ్రప్రదేశ్ లోని తూర్పుగోదావరి జిల్లాచే ఆవరింపబడిన ఒక చిన్న ప్రాంతం. ఇక్కడి ప్రజల మాతృభాష తెలుగు. వీరి సంస్కృతి సాంప్రదాయాల మూలాలు పొరుగునున్న తెలుగువారితో ముడిపడి ఉన్నాయి. అలాంటప్పుడు యానాం భారతావనిలో విలీనమైనపుడు సమీప ఆంధ్రా లో ఎందుకు కలిపేయలేదన్న ప్రశ్న సహజంగా ప్రతిఒక్కరికీ కలుగుతుంది.

1953 లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడే సమయానికి యానాం ఫ్రెంచివారి పాలనలో ఉంది. ఆ తరువాత 1956 లో భాషాప్రాతిపదికన ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన సమయానికి ఫ్రెంచి వారు ఇక్కడ నుంచి భౌతికంగా నిష్క్రమించినా, యానాంపై భారతదేశానికి చట్టపరమైన హక్కు ఇంకా రాలేదు. కనుక ఆ సమయాలలో యానాన్ని సమీప తూర్పుగోదావరిజిల్లాలో అంతర్భాగం చేయాలన్న ఆలోచనే ఎవరికీ ఉండకపోవచ్చు. ఎందుకంటే అప్పటికింకా యానాం అనేది ఫ్రాన్స్ అంతర్భాగం. భారతదేశంలో విలీనం కాలేదు. యానాం ఫ్రెంచిపాలననుంచి విమోచనం చెంది భారతావనిలో విలీనమైన తరువాత కూడా దీనిని సమీప ఆంధ్రప్రదేశ్ లో కలపకుండా ప్రత్యేకంగా ఉంచటానికి ప్రధాన కారణం ఫ్రెంచివారు వెళిపోయేముందు భారత ప్రభుత్వంతో చేసుకొన్న ఒక ఒప్పందం.

ఫ్రెంచివారు తమ కాలనీలైన యానాం, పాండిచేరీ, మాహె, కారైకాల్‌లను స్వతంత్ర్యభారతావనికి అప్పగించి వెళ్ళేప్పుడు, భారత ప్రభుత్వంతో 1956, మే 28 న ట్రీటీ ఆఫ్ సెషన్ (Traite de Cession) ను చేసుకొన్నారు.

ఈ ఒప్పందములో ఆర్టికల్ 2 ఇలా చెపుతుంది.

The Establishments will keep the benefit of the Special Administrative Status in force prior to 1 November 1954. Any consitutional changes in this Status which may be made subsequently shall be made after ascertaining the wishes of the people.







(సారాంశం: ఈ స్థావరాలన్నీ , 1 నవంబరు 1954 కు పూర్వము కలిగి ఉండినటువంటి **ప్రత్యేక పరిపాలనా హోదా** ను నిలుపుకుంటాయి. ఈ ప్రాంత ప్రజల ఆకాంక్షలను తెలుసుకొన్న తరువాతే రాజ్యాంగపరంగా ఈ హోదాను మార్చవలసి ఉంటుంది)

1954 కు పూర్వం ఈ ప్రాంతాలు స్వతంత్ర్య భారతావనిలో కలువకుండా ప్రత్యేకంగా ఫ్రెంచివారి పాలనలో ఉన్నాయి. భారత స్వాతంత్రానికి ముందుకూడా ఇవి బ్రిటిష్ వారి పాలనకు అతీతంగానే ఉన్నాయి. పై క్లాజులో ఆ ప్రత్యేకతను నిలబెట్టమని ఫ్రెంచిప్రభుత్వం కోరింది. అంటే ఈ ప్రాంతాలకు ప్రత్యేక పరిపాలనా హోదా కల్పించమని ఫ్రెంచివారు వెళ్ళిపోయేముందు అడిగిన చివరి కోరిక. ఈ హోదాను మార్చాలంటే ఈ ప్రాంతప్రజల అభిప్రాయాన్ని ఒక రిఫరెండం ద్వారా తెలుసుకోవలసి ఉంటుంది. ఈ ఒప్పందానికి అనుగుణంగా భారతప్రభుత్వం 1 జూలై, 1963 న జరిపిన రాజ్యాంగ సవరణ ద్వారా ఈ ప్రాంతాలను యూనియన్ టెరిటరీ ఆఫ్ పాండిచేరీగా ఏర్పరచింది. అలా వీటిని కేంద్రపాలిత ప్రాంతాలుగా ఏర్పరచి ప్రత్యేక హోదా కల్పించి ఫ్రెంచిప్రభుత్వానికి ఇచ్చిన మాటను భారతప్రభుత్వం నిలబెట్టుకొంది.

ఈ ప్రాంతాలను సమీప రాష్ట్రాలలో విలీనం చెయ్యాలని మొరార్జీ దేశాయ్ ప్రధానిగా ఉన్నపుడు ఒక ప్రయత్నం జరిగింది. అంటే యానాన్ని ఆంధ్రాలోను, పుదుచ్చేరీ, కారైకాల్ లను తమిళనాడులోను, మాహేను కేరళలోను విలీనం చేయటానికి. ఆ ప్రతిపాదనను ఈ ప్రాంతాల ప్రజలు ముక్తకంఠంతో ప్రతిఘటించారు. మురార్జీదేశాయ్ కూడా 1954 నాటి ఒప్పందాన్ని చూసి ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడని అంటారు. ఎందుకంటే ఈ ఒప్పందం లోని 30వ ఆర్టికిల్‌లో – **ఈ ఒప్పంద ఉల్లంఘనకు సంబంధించిన పిర్యాదుల పరిష్కారానికై అంతర్జాతీయ కోర్టును ఆశ్రయించే అవకాశం కల్పించబడింది.**

1990 లో పాండిచేరికి కొత్తగా నియమించబడిన గవర్నరు శ్రీమతి చంద్రావతి పాండిచేరిలో ఇంకా బతికిఉన్న ఫ్రెంచి సంస్కృతి, ఫ్రెంచి నేషనల్స్ అందుకొంటున్న ఫ్రెంచి పించనులు, ఫ్రాన్స్ పర్యవేక్షించే విద్యా సంస్థలు ఉండటాన్ని చూసి, “పోర్చుగీస్, బ్రిటన్‌పాలిత ప్రాంతాలలో ఆయా వలసపాలకుల ఉనికి కనిపించదని పాండిచేరీకి ఇంతటి స్వేచ్ఛ, ప్రత్యేకతను కల్పించటం ద్వారా నెహ్రూ తప్పు చేసాడేమోనని” వ్యాఖ్యానించారు.

ఆ తరువాత ఫ్రెంచి అంబాసిడర్ ఆంద్రూ లెవిన్ ఈమెను కలసి, పాండిచేరీ చారిత్రిక ప్రాముఖ్యతను, ఫ్రాన్స్ ఈ ప్రాంతాలను భారత్‌కు అప్పగించేటపుడు ఇరుదేశాలు చేసుకొన్న ట్రీటీ ఆఫ్ సిషన్ ను వివరించినపుడు ఆమె విస్మయానికి గురయ్యారట. ఇదే విషయాన్ని భారత మినిస్ట్రీఆఫ్ ఫారిన్ అఫైర్స్ శాఖాధికారుల వద్ద లెవిన్ ప్రస్తావించినపుడు, “1956 నాటి ట్రీటీకి వ్యతిరేకంగా ఆలోచనచేసే ఉద్దేశం భారత్ కు లేదని, ఆమెకు చారిత్రిక అవగాహన లేకపోవటం వల్ల అలా వ్యాఖ్యానించి ఉంటారు” అని వారు వివరణ ఇచ్చారట. ఈ అంశంపై అవగాహన కలిగిన విద్యావేత్తలు, చరిత్రకారులు అనేక మంది శ్రీమతి చంద్రావతి వ్యాఖ్యలను ఖండించారు.

వారిలో 1954 లో పాండిచేరీలో భారత కమిషనర్గా పనిచేసిన భారత అధికారి అయిన కేవల్ సింగ్ వ్రాసిన "Pondicherry and Goa - Historical Contrast --Times of India 12 April, 1990" అనే వ్యాసం ప్రముఖమైనది. (Ref. DES ANCIENS COMPTOIRS DE L'INDE?/ Future of French India veterans? by Andrew Lewin published in CIDIF letters Nov 2010)

యానాన్ని ఆంధ్రలో కలపకుండా ప్రత్యేకంగా ఉంచటానికి మరొక ప్రధాన కారణం ఆనాటి స్థానిక నాయకుల దార్శనికత.

భారతావని నుంచి బ్రిటిష్ వారు వైదొలగిన తరువాత అందరి కళ్ళు ఫ్రెంచి వారిమీద పడ్డాయి. ఈ కాలనీలలో కూడా జాతీయవాద భావనలు బలపడి ఫ్రెంచి పాలననుండి విముక్తి పొందాలన్న ఆకాంక్ష ప్రజలలో పెరగసాగింది. అప్పటికే నెహ్రూ "ఫ్రెంచి కాలనీలు భారతదేశ ముఖంపై మొటిమల వలె ఉన్నాయని" వర్ణించాడు. భారతావనిలో తమకాలనీల మనుగడ ఇక అసాధ్యమన్న నిర్ణయానికి ఫ్రాన్స్ వచ్చేసింది. కానీ ఈ కాలనీలను భారత్కు అప్పగించటానికి వారి రాజ్యాంగంలోని ఆర్టికిల్ 27 ప్రకారం రిఫరెండం (ప్రజలందరి అభిప్రాయం తెలుసుకోవటం) తప్పనిసరి అని పట్టు పట్టింది. ( Article 27 of the Constitution of the France Fourth Republic stipulates that "no surrender, no exchange, no addition of territory shall be valid without the consent of the peoples concerned" అని స్పష్టంగా చెపుతుంది.) వదులుకోవటం తప్పనిసరైతే హుందాగా అప్పచెప్పాలే తప్ప అవమానకర పరిస్థితులలో చేజార్చుకోకూడదని ఫ్రాన్స్ భావించింది.

ఈ పరిస్థితులలో 1948 లోనే భారత-ఫ్రెంచి ప్రభుత్వాలు ఒక ఒప్పందం చేసుకొన్నాయి. దీని ప్రకారం ఈ ప్రాంత ప్రజలు తాము భారతదేశంలో కలవాలా ఒద్దా అనే విషయాన్ని రిఫరెండం ద్వారా తేల్చుకోవాలి. ఈ రిఫరెండం తీర్పు అది జరిగిన ప్రాంతానికే పరిమితమై ఉంటుంది. అంటే ఒక ప్రాంతం ఫ్రెంచివారితో ఉండాలనుకొంటే ఉండొచ్చు మరొక ప్రాంతం విడిపోవాలనుకొంటే విడిపోవచ్చు. అప్పటికి మొత్తం అయిదు ఫ్రెంచి కాలనీలుండేవి. అవి పాండిచేరి, మాహె, కారైకాల్, యానాం మరియు బెంగాల్వద్దకల చంద్రనాగూర్ లు. పై ఒప్పందానికి అనుగుణంగా చంద్రనాగూర్ 19, జూన్ 1949 న రిఫరెండం జరుపుకొంది. 7587 ఓట్లు భారతావనిలో విలీనానికి అనుకూలంగానూ, 114 ఓట్లు వ్యతిరేకంగానూ పోల్ అయ్యాయి. అలా **తొందరపడి** రిఫరెండం జరిపేసుకోవటం వల్ల చంద్రనాగూర్ ఈనాడు ఈ అనంత భారతావనిలో ఉండే వేనవేల మునిసిపాలిటీలలో ఒకటిగా కనుమరుగైంది.

చంద్రనాగూర్ లోని స్థానిక నాయకులందరూ పొరుగునున్న బెంగాల్ రాష్ట్ర కమ్యూనిష్టు నాయకుల ప్రభావంలో ఉండి ఆ ప్రాంతాన్ని విదేశీపాలనా చెర నుండి విడిపించి పొరుగునున్న బెంగాల్ లో విలీనం చేయించటంలో కృతకృత్యులయ్యారు. కానీ అప్పటి యానాం నాయకులు పొరుగునున్న ఆంధ్రా నాయకుల ప్రభావంలో కాక పాండిచేరీ నాయకుల నాయకత్వంలో నడిచారు. దీన్ని బట్టి చూస్తే అప్పటి యానాం నాయకులు ఆంధ్రావైపు ఎక్కువగా మొగ్గుచూపి







ఉన్నట్లయితే చంద్రనాగూర్ వలెనే యానాం కూడా ఆంధ్రప్రదేశ్ లో ఏ విశిష్టతా లేని ఒక **పంచాయితీ** గా మిగిలిపోయేది. కాకినాడ మున్సిపల్ కౌన్సిల్ కూడా యానాన్ని భారతావనిలో కలిపేయాలని తీర్మానం చేసింది. కానీ అప్పటి యానాం నాయకులు ముందుచూపు కలిగి పాండిచేరీ తో ఉన్న సంబంధాలను తెంపుకోలేదు. అపుడు మాత్రమే యానాం ప్రజలకు మేలు జరుగుతుందని భావించారు. ఇది వారి దార్శనికతకు, రాజకీయ పరిణతికి నిదర్శనంగా చెప్పవచ్చు. పుదుచ్చేరీ నాయకులు కూడా యానాన్ని పాండిచేరీలో ఒక అంతర్భాగంగా చూసారు తప్ప వేరుగా చూడలేదు.

ఇక మిగిలిన నాలుగు ప్రాంతాల ప్రజలు ఫ్రెంచి వారిని అంత సులభంగా చేజార్చుకోవటానికి ఇష్టపడలేదు. భారతప్రభుత్వం కూడా పరిస్థితులు పక్వానికొచ్చే వరకూ ఎదురుచూసింది. హైదరాబాద్లోలా సైనిక పదఘట్టనలతో బలప్రయోగానికి సాహసించలేదు. అందునా ఇది దేశాల నడుమ వ్యవహారమాయె! 1948 డిసెంబరు, 19 న జైపూరులో జరిగిన కాంగ్రెసు ప్లీనరీసమావేశాలలో "స్వతంత్రభారతావని ఏర్పడినతరువాత, ఈ గడ్డపై విదేశీ పరిపాలన కొనసాగటం అసమంజసమే కాక దేశసమైక్యతకు భంగం కలిగించే విషయం" అని ఫ్రెంచివారినుద్దేశించి కాంగ్రెసు పార్టీ తీర్మానం చేసింది. ఆ తరువాత 1950 సెప్టెంబరు,21న నాసిక్ లో జరిగిన సమావేశాలలో కాంగ్రెసు పార్టీ మరలా " దేశంలోని విదేశీ పాలిత ప్రాంతాలు స్వతంత్ర భారతదేశంలో విలీనం కావాల్సిన అవసరం ఎంతైనా ఉందని" పునరుద్ఘాటించింది. 1952 నాటికి పాండిచేరీలో ప్రజలు ఫ్రెంచి వ్యతిరేక, అనుకూల వర్గాలుగా చీలిపోవటంతో ఒక రకమైన భయానక వాతావరణం నెలకొనిఉంది. చిన్న చిన్న ఘర్షణలు, కొట్లాటలతో అట్టుడికి పోతూండేది. యానాంలో కూడా ఇదే పరిస్థితి ప్రతిబింబించేది. అక్టోబరు 22 న భారతభూభాగం నుంచి కొంతమంది సాయుధులు, పాండిచేరీలోకి ప్రవేశించి అక్కడి ఫ్రెంచి పౌరులపై దాడిచేసి గాయపరిచారు. ఈ ఉదంతాన్ని నెహ్రూ దృష్టికి తీసుకువెళ్ళగా ఆయన "ఫ్రెంచి వారు భేషరతుగా ఈ ప్రాంతాలను భారతదేశానికి స్వాధీనం చేయాలనీ, అలాచేసినట్లయితే ఈ ప్రాంతాల ప్రజల సాంస్కృతిక, భాషా, ఆచార, చట్టపరమైన హక్కులకు రక్షణ కల్పించగలనని" హామీ ఇచ్చాడు. ఫ్రెంచి వారు కోరుతున్నట్లుగా ఈ ప్రాంతాలలో రిఫరెండం జరిపించటానికి భారతప్రభుత్వం అంగీకరించక పోవటానికి కారణం కాశ్మీర్ లో కూడా ప్లెబిసైట్ (రిఫరెండం) జరపాలని పాకిస్తాన్ పట్టు పడుతుందన్న అనుమానం ఉండటం.

## యానాం విమోచనం, డిఫాక్టో ట్రాన్స్ఫర్, ట్రీటీ ఆఫ్ సిషన్, డి జ్యూర్ ట్రాన్స్ఫర్ మరియు విలీనము

పై పదాలన్నీ ఒకే విధంగా అనిపించినప్పటికీ వాటి అర్ధాలలో చాలా వ్యత్యాసముంది. ఇవన్నీ అంతర్జాతీయ స్థాయి ఒప్పందాలు. యానాం ఎందుకు ఆంధ్రాలో విలీనం కాలేదో, యానాం ప్రత్యేకత ఏమిటో పై అంశాల ప్రాముఖ్యతను తెలుసుకొంటే మరింత అర్ధమౌతుంది.

**విమోచనం:** యానాంలో ఫ్రెంచి పాలనకు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమం పతాక స్థాయిని

చేరుకొని 1954, జూన్ 13 న ఉద్యమకారులు అప్పటి యానాం అడ్మినిస్ట్రేటరునుంచి అధికారాలను స్వాధీనపరచుకొని, తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసారు. తదుపరి ఫ్రెంచి జాతీయ జండాను అవనతం చేసి భారతదేశపతాకాన్ని ఎగురవేసి యానాం, ఫ్రెంచి పాలన నుండి "విమోచనం" చెందిందని ప్రకటించారు.


జండా వందనం చేస్తున్న విమోచన నాయకులు

ఈ మొత్తం ఉద్యమంలో పాలుపంచుకొన్న ఆనాటి నాయకులలో, దడాల రఫేల్ రమణయ్య, మద్దింశెట్టి సత్యానందం, కనకాల తాతయ్య, కామిశెట్టి వరప్రసాదరావు నాయుడు, కోన నరసయ్య, యర్రా నత్యానారాయణమూర్తి, భయంకరాచారి వంటివారు ప్రముఖులు. ఫ్రెంచి ప్రభుత్వం మాత్రం ఈ ఉద్యమాన్ని, ప్రభుత్వంపై జరిగిన ఒక "ముట్టడి" గా (Coup de'etat Yanaon) అభివర్ణించింది.

1956 మే, 28 న ఫ్రాన్స్-భారత దేశాల నడుమ జరిగిన ట్రీటీ ఆఫ్ సిషన్ ఒప్పందంలో - యానానికి సంబంధించి 1954, జూన్ 13 తరువాత జరిగిన అన్ని అధికారిక/అనధికారిక వ్యవహారాలకు తనకు ఏ విధమైన సంబంధం లేదని విస్పష్టంగా చెప్పటాన్ని బట్టి యానాంలో ఫ్రెంచి పాలన 1954, జూన్ 13 తో చారిత్రికంగా ముగిసినట్లు భావించాలి.

**డిఫాక్టో ట్రాన్సఫర్:** ఫ్రెంచికాలనీల భవితవ్యం తేల్చటానికి 1954, అక్టోబరు 18న పాండిచేరీ లోని కీళూరు వద్ద ఈ కాలనీల ప్రజాప్రతినిధులతో జరిగిన రిఫరెండం లో - ఫ్రెంచి పాలనను కోరుతూ 7 ఓట్లు, భారతదేశంలో విలీనానికి అనుకూలంగా 164 ఓట్లు రావటంతో ఫ్రెంచి ప్రభుత్వం ఈ కాలనీలను భారతదేశానికి యథాతథంగా అప్పగిస్తూ అక్టోబరు, 26న ఒక ఒప్పందం చేసింది. ఈ ఒప్పందం ద్వారా ఫ్రెంచి ప్రభుత్వం 1954 నవంబరు, 1 న పాండిచేరీ, మాహే, కారైకాల్ మరియు యానాం లను భారత










ప్రభుత్వానికి యథాతథ స్థితిలో అప్పగించింది. కనుక నవంబరు 1 ని డీఫాక్టో ట్రాన్సఫర్ దినంగా పరిగణిస్తారు.

ప్రజలందరూ పాల్గొనే రిఫరెండం జరపాలని మొదట్లో పట్టు పట్టిన ఫ్రెంచి ప్రభుత్వం తన పట్టు సడలించుకొని, ప్రజా ప్రతినిధుల అభిప్రాయాన్ని పరిగణలోకి తీసుకొంటే చాలని సరిపుచ్చుకొంది. ప్రజలు పాల్గొనే రిఫరెండం లో ఫలితం తనకు అనుకూలంగా రాకపోతే **విచిత్రమైన పరిస్థితి** ఏర్పడుతుందన్న అనుమానంతో, భారత్ చేసిన ఒత్తిడి ఫలితమిది. (రి. అవర్ సీక్రెట్స్ ఇన్ అదర్స్ ట్రంక్స్- ఎ.జి. నూరాని, ఫ్రంట్ లైన్ పత్రిక జూలై 2005)

**ట్రీటీ ఆఫ్ సిషన్:** ఫ్రెంచి కాలనీలను భారత్ కు అప్పగించినా, అవి చట్ట పద్దతిలో భారతదేశంలో విలీనం కావటానికి మరో ఒప్పందం 1956 మే 28 న జరిగింది. దీని ద్వారా ఈ ప్రాంత సార్వభౌమాధికారాలను భారతదేశానికి అప్పగించటం జరుగుతుంది. ఈ ఒప్పందం ద్వారా పాండిచేరీలో రెండు భవనాలను ఫ్రాన్స్ తన ఆధీనంలో ఉంచుకొని (అవి Rue de Marine లో ఫ్రెంచి కౌన్సిలేట్ కొరకు ఒక భవనం, Victor Simonel వీధిలో కల French College భవనము) మిగిలిన ప్రాంతాలను భారత్ కు ఇచ్చివేసింది. ఈ ఒప్పందానికి ఫ్రెంచిపార్లమెంటు వేయాల్సిన ఆమోదముద్ర ఫ్రాన్సు-అల్జీరియన్ యుద్ధం జరుగుతున్న కారణంగా ఆలస్యం జరిగింది. (అల్జీరియాకూడా ఒక ఫ్రెంచి కాలనీయే. ఇది స్వాతంత్ర్యం కొరకు ఫ్రాన్స్ తో యుద్ధమే చేయవలసివచ్చింది).

**డి జ్యూర్ ట్రాన్సఫర్:** 1962 లో అల్జీరియా యుద్ధం ముగిసింది. 1962 లో ఫ్రెంచి పార్లమెంటు ట్రీటీ ఆఫ్ సిషనుకు ఆమోద ముద్రవేసింది. దరిమిలా 1962, ఆగష్టు 16 న ఫ్రాన్స్ ప్రభుత్వం ఈ కాలనీల "సార్వభౌమాధికారాల్ని" భారత ప్రభుత్వానికి బదలాయించింది. కనుక ఆగష్టు 16 ను డి జ్యూర్ ట్రాన్సఫర్ దినమని పిలుస్తారు. ఇది పుదుచేరి ప్రభుత్వ అధికారిక స్వాతంత్ర్యదినం. ఆ విధంగా ఈ కాలనీల ప్రజలు రెండు స్వాతంత్ర్య దినోత్సవాలను జరుపుకొంటారు. ఒకటి భారత స్వాతంత్ర్యదినమైన ఆగష్టు 15 రెండవది ఆగష్టు 16 న జరుపుకొనే డి జ్యూర్ ట్రాన్సఫర్ దినం.

**విలీనము:** ఈ ప్రాంతాల ఫ్రెంచి సంస్కృతి, సాంప్రదాయాలను సంరక్షిస్తానని ఫ్రెంచి ప్రభుత్వానికి ఇచ్చిన హామీలకనుగుణంగా భారతప్రభుత్వం రాజ్యాంగ సవరణ చేసి, ఈ నాలుగు ప్రాంతాలను 1963 జూలై, 1న యూనియన్ టెరిటరీ ఆఫ్ పాండిచేరీగా ప్రకటించింది. ఈ ప్రక్రియతో ఈ ఫ్రెంచికాలనీలు భారతావనిలో విలీనం కావటం పూర్తయింది.

**ముగింపు:** పదహారవ శతాబ్దం నుంచీ ఫ్రాన్స్ ప్రపంచవ్యాప్తంగా కాలనీలను నిర్మించటం మొదలెట్టింది. ఇరవయ్యవ శతాబ్దం నాటికి ప్రపంచం మొత్తం మీద 8.5% భూమిని చేజిక్కించుకొంది. స్థానిక ప్రజల ఆకాంక్షల మేరకు అనేక ప్రాంతాలకు స్వాతంత్ర్యం ప్రకటించి తప్పుకొంది. **కానీ కొన్ని కాలనీలు ఈనాటికీ ఫ్రాన్స్ పరిపాలనలోనే కొనసాగుతున్నాయి. ఒకప్పటి**

**ఈ ఫ్రెంచికాలనీలు పారిస్ కు కొన్ని వేల మైళ్ళదూరంలో ఉన్నప్పటికీ, 'ఫ్రెంచ్ ఓవర్‌సీస్ డిపార్ట్‌మెంట్స్' అనే పేరుతో పిలువబడుతూ నేడు యూరోపియన్ యూనియన్‌లో ఫ్రాన్స్ అంతర్భాగాలుగా పరిగణింపబడుతున్నాయి.** ఇవి మార్టినిక్, గాడెలూప్, రీయూనియన్, ఫ్రెంచ్ గయానా లు. ఈ ప్రాంతాల జీవనప్రమాణాలు ఫ్రాన్స్‌లోని ప్రమాణాలకు ఏ మాత్రం తీసిపోవు. ఇక్కడి యువకులు ఉన్నతచదువులకు పారిస్ వెళుతూంటారు. పారిస్‌లో ఆవిష్కరింపబడిన కొత్త 'ఫాషన్‌లు' తెల్లారేసరికల్లా ఇక్కడ ప్రత్యక్ష్యమవుతాయి. ఈ ప్రాంతం నుండి ఫ్రెంచి సెనేట్ కు జనాభా ప్రాతిపదికన ప్రాతినిధ్యం ఉంది.

ఇక భారతదేశంలోని ఫ్రెంచికాలనీల విషయానికి వచ్చేసరికి 1947 లోనే ఫ్రెంచి ప్రభుత్వం వీటిని **ఫ్రెంచి ఓవర్‌సీస్ టెరిటరీస్** లు అని (సముద్రాంతర ఫ్రాన్స్ భూభాగాలు) నామకరణం చేసింది. ఇలా చేయటం ద్వారా ఈ కాలనీలన్నీ ఫ్రాన్స్ అంతర్భాగాలని ప్రపంచానికి చెప్పటానికి ప్రయత్నించింది. కానీ 1954 లో ఈ ప్రాంతాల ప్రజలు ప్రదర్శించిన అచంచలమైన **భారతదేశభక్తి** కి ఫ్రెంచి ప్రభుత్వం తలొగ్గక తప్పలేదు. భారతప్రభుత్వం కూడా సంయమనం పాటించి దౌత్యపరంగానే ఈ ప్రాంతాలను ఫ్రాన్స్ నుంచి పొందింది.

పాండిచేరీ, మాహే, కారైకాల్ మరియు యానాంలలో ప్రథమంగా యానామే "విమోచనం" చెందినట్లు ప్రకటించుకొంది. (ఆ తరువాత మాహే). పాండిచేరీ, కారైకాల్ లలో అలా జరగలేదు. ఈ విషయంలో ఈ ఫ్రెంచి కాలనీలలో "విమోచనం" అనేది ఒక్క యానాం, మాహే లకు మాత్రమే ఉంటుంది. మిగిలిన ప్రాంతవాసులు డిఫాక్టో ట్రాన్‌ఫర్ దినం మాత్రమే జరుపుకొంటారు. ఆ విధంగా యానాం **"క్రాంత దర్శి"** గా చరిత్రకెక్కింది.

యానాం ని ఆంధ్రాలో కలపకపోవటం వెనుక ఇంతటి చరిత్ర దాగి ఉంది.

# బొల్లోజు బాబా

తల్లిదండ్రులు బొల్లోజు బసవలింగం, అమ్మాజి

సహచరి సూర్య పద్మ

పిల్లలు అపరాజిత, బసవ శ్రీధర్

చదువు M.Sc., B.Ed., M.Phil. (Ph.D)

వృత్తి జువాలజీ అధ్యాపకుడు

రచనలు **యానాం విమోచనోద్యమం** (2007)
(1954 లో యానాంలో ఫ్రెంచి వారి పాలనకు
వ్యతిరేకంగా జరిగిన పోరాటం గురించి)

**ఆకుపచ్చని తడిగీతం** (2009) కవితా సంపుటి

ఇ.బుక్స్ విశ్వకవి రవీంద్రుని **'స్ట్రే బర్డ్స్'** తెలుగు అనువాదం
**'ఎడారి అత్తరులు'** ప్రముఖ సూఫీకవుల గీతాల అనువాదాలు
(పై ఇ.బుక్కులను http://www.scribd.com/bollojubaba నందు చదువుకొనవచ్చును)

బ్లాగు http://sahitheeyanam.blogspot.com/

అవార్డులు ఆకుపచ్చని తడిగీతం పుస్తకానికి శిలపరశెట్టి సాహితీ ప్రత్యేక పురస్కారం -2010